శ్రీ అరవింద శతజయంతి సంపుటము
అగస్టు 15, 1972

# శ్రీ అరవిందులు

## అతిమానసిక అవతారమూర్తి





సంపాదకులు :

వి. మన్‌మోహన్‌రెడ్డి

ప్రకాశకులు :
**INSTITUTE OF HUMAN STUDY**
HYDERABAD - 7.

మొదటి కూర్పు : ఆగస్టు 15, 1972

ప్రతులు : 500



వెల : రూ. ~~8-00~~ 12=00



ప్రాప్తిస్థానం :
Manager,
**Institute of Human Study, O. U. B. - 26**
HYDERABAD - 7.

ముద్రాపకులు :
సుదర్శన్ ప్రింటర్స్,
హైదరాబాదు — 27.



శ్రీ అరవింద శతజయంతి జన్మదిన సందర్భమున,
వారి పాదపద్మములకు,
మా భక్తిపూర్వక ప్రణామములు.
15_8_1972



అతిమానసిక అవతారమూర్తి—శ్రీ అరవిందులు



పరాత్పరశక్తి, ఆదిశక్తి, జగద్ధాత్రి—శ్రీ దివ్యమాత

# శ్రీ అరవిందుల
# గురించి
# శ్రీ మాత ప్రవచనములు

# శ్రీ అరవిందుల గురించి శ్రీమాత ప్రవచనములు

దివ్యచేతస్సు, శ్రీ అరవిందుల రూపమున నిశ్చేతస్సునుండి బహిర్గమించుచున్నది.

*       *       *       *       *

ప్రపంచ చరిత్రయందు శ్రీ అరవిందులకుగల స్థానము—ఒకానొక ప్రబోధముకాదు, లేక ఒకానొక దివ్య సత్య సందర్శనముకూడ కాదు; వారు నెరవేర్చవలసిన నిశ్చితకార్యము, పరాత్పర దైవముయొక్క స్వస్థానమునుండి వచ్చుచుండెడిది, యేదియో, అదియే

*       *       *       *       *



అవరోహించు ముక్కోణము సచ్చిదానందమును సూచించును.

ఆరోహించు ముక్కోణము. ప్రాణ ప్రకాశ ప్రేమల రూపమున జడము నుండి, ఆకాంక్ష యొసంగు ప్రత్యుత్తరమును సూచించును.

ఈ రెండింటి కలయికయగు కేంద్ర చతురస్రము, పరాత్పరుని అవతారమగు పద్మమును, దాని కేంద్రమునందు గల పరిపూర్ణ - ఆవిర్భావమును సూచించును.

చతురస్రమునందుగల జలము, నానాత్త్వమును, సృష్టిని సూచించును,

*       *       *       *       *

అగాధ తమ అజ్ఞానములో నూర్లకొలది మానవులు మునిగియున్నను నిస్పృహ చెంద నక్కరలేదు; మేము నిన్నటిరోజున దర్శించిన మహాపురుషుడు పృథ్విపై నున్నాడు; అంధకారము, ప్రకాశముగా రూపాంతరమందు దివసము

అరుదెంచుననుటను, పృథ్విపై నీ దివ్య పరిపాలన నిశ్చయముగనే స్థాపింపబడు ననుటను, నిస్సందేహముగా తెలుపుటకు మా మధ్య వసించుచున్న ఆ మహా పురుషుని సాన్నిధ్యమే చాలును.

*  *  *  *  *

పృథ్వీ చరిత్ర ప్రారంభమైన నాటినుండి పృథ్వీ రూపాంతర కార్యములపై ఏదేని యొక రూపమున, ఏదేని యొక నామమున, శ్రీ అరవిందులు అధిష్ఠించి యున్నారు.

*  *  *  *  *

(విశ్వ చరిత్రయందు శ్రీ అరవిందుల జన్మ "శాశ్వతము" అని మీరు వచించితిరి. "శాశ్వతము" అను పదమునకు స్పష్టార్థమేమి?)

చేతస్సుయొక్క నాలుగు ఆరోహిక భూమికలపై నాలుగు విధములుగ ఈ వాక్యమును అర్థము చేసికొనవచ్చును.

1. భౌతికముగ, వారి జన్మ ప్రపంచమునందు శాశ్వత ప్రాముఖ్యతగల ఫలితములను వహించియుండును.
2. మానసికముగ, వారి జన్మ విశ్వచరిత్రయందు శాశ్వతముగ స్మరింపబడును.
3. చైతన్యముగ, వారి జన్మ పృథ్విపై యుగయుగమునను సంభవమగుచుండును.
4. ఆధ్యాత్మికముగ, వారి జన్మ పృథ్విపై దివ్య శాశ్వతత్వమునే సూచించును.

*  *  *  *  *

సంఘాతి (అగుట) యొక్క శాశ్వతత్వమునందు, పరిపూర్ణతర భవిష్యదనుభవమునకు దూతయే, ప్రతి అవతారము కూడ.

అట్లయ్యును, భవిష్యత్కాల అవతారమునకు ప్రత్యర్థిగ, గత కాలపు అవతారమునే దైవమునకు ప్రతినిధిగా పూజించే అలవాటు మానవులకు సర్వదా నున్నది.

ఇపుడు మరల, శ్రీ అరవిందులు భవిష్య దనుభవమును, ప్రపంచమునకు చూపుటకే యేతెంచిరి; మరల వారి సందేశము, పూర్వావతారముల సందేశములకు వలెనే, అదే ప్రతిరోధమును ఎదుర్కొనుచున్నది. కాని, వారు ఆవిష్కరించిన సత్యమును భవిష్యత్తు ఋజువు పరచును; మరి వారి కార్యము సిద్ధించును.

* * * * *

శ్రీ అరవిందులు మనకిట్లు చెప్పుట కరుదెంచిరి; "దివ్య సత్యమును కనుగొనుటకుగా, ఎవ్వరును పృథ్విని వదలనవసరములేదు; ఆత్మను కనుగొనుటకు జీవితమును వదల నవసరములేదు. దైవముతో సంబంధము నేర్పరచుకొనుటకు ఎవ్వరు కాని పరిమిత విశ్వాసములనే వహించి యుండుట కాని, లేక ప్రపంచమును త్యజించుటకాని, ఆవశ్యకత లేదు. సర్వత్ర, సర్వ వస్తువులయందును దైవము కలదు; మరి యా దైవము దాగియుండుచో, ఆ దాగియున్న దైవమును కనుగొనుటకు మనము ప్రయత్నించుట లేదనుటచే మాత్రమే, దైవము దాగియున్నదనవలెను."

* * * * *

శ్రీ అరవిందులు అతి మానసిక చేతస్సును మానవ శరీరమునందు మూర్తిమంత మొనరించి, గమ్యమును చేరగల మార్గమును, ఆ మార్గము యొక్క స్వభావమును ప్రదర్శించుటయేగాక, వారి స్వీయ వ్యక్తిగతానుభవముచేత గూడ మనకు ప్రత్యక్ష-ఉదాహరణమును ఒసంగిరి; ఈ విషయమా సిద్ధి కాంచగలదను ఋజువుగ, తన్నుదా, ఉదాహరణముగ నొసంగిరి; మరి యిపుడాకార్యమును సాధించుకాల మాసన్నమైనది.

* * * * *

ప్రభూ, ఈ ఉదయమున నీవు పురోగమింపజేయునట్టియు, ప్రకాశింప చేయునట్టియు చేతస్సుగా మాత్రమేగాక, మా కర్మలయందు క్రియాశీల దివ్య సాన్నిధ్యముగా కూడ మా మధ్యమున యుందునని ధృఢపరచితివి. పృథ్వి యంతయు రూపాంతరమందు వరకు పృథ్వీవాతావరణమును విడువక మాతో నుందునని వాగ్దాన మిచ్చితివి. ఈ నీ అద్భుత సాన్నిధ్యమునకు మేము అర్హుల మగునట్లు ప్రసాదించుము; ఇక మీదట మీ యందలి సర్వస్వము నీ పవిత్ర దివ్యకార్య సిద్ధికిగా, అధికాధికముగ ఏకాగ్రీకృత మగుటకు ప్రసాదింపుము.

* * * * *

## శ్రీ అరవిందుల సమాధిపై లిఖింప బడినది

మా ప్రభువుయొక్క భౌతికావరణముగ నున్న నీకు, మా అనంత కృతజ్ఞత. మాకొరకెంతో కాపించినట్టియు, పనిచేసినట్టియు, పోరాడినట్టియు, బాధపడినట్టియు, ఆశించినట్టియు, ఎంతో సహించి నట్టియు నగు నీ యెదుట, మీ కొరకు సర్వము సంకల్పించి నట్టియు, సర్వము ప్రయత్నించి నట్టియు, సర్వము సిద్ధపరచి, సాధించినట్టియు నగు నీ యెదుట, ప్రణమిల్లి మేమెప్పటికిని నిన్ను మరువకుండునట్లు నీకు ఋణపడిన దానినంతటిని, ఒక్క నిమిషము కూడ మరువకుండునట్లు ప్రార్థించుచున్నాము.

* * * * *

మనతోకూడ సచేతనముగా సజీవముగా ఇక్కడ నున్న, శ్రీ అరవిందులను గురించి (వారులేరని) దుఃఖించుట, వారిని అవమాన పరచుటయే యగును.

* * * * *

ప్రాతిభాసిక దృశ్యములచే మనము వంచింపబడ కూడదు. శ్రీ అరవిందులు మనల వదలలేదు. శ్రీ అరవిందులు, ఎల్లప్పటివలె, సజీవముగ ససాన్నిధ్యముగ నిక్కడనే యున్నారు; వారి కార్యమును ఆవశ్యకమైన మనః పూర్వకతతో, ఉత్సాహముతో ఏకాగ్రతతో సిద్ధింప చేయుటకది మనకు వదలబడినది.

* * * * *

ప్రభు, నీ రూపాంతర దివ్యకార్యమును నెరవేర్చుటకే మేము పృథ్విపై నున్నారము. అదియే మా యేకైకకసంకల్పము, మా యేకైక పూర్తినిమగ్నతా కార్యము. అదియె మా యేకైక వర్తమాన కార్యముగా నుండునట్లును, మా కార్యములన్నియు ఆ యేకైక గమ్యమును చేరుటకు సాహాయ్యకములుగ నుండునట్లు ప్రసాదింపుము.

* * * * *

శ్రీ అరవిందులకు మన కృతజ్ఞత తెలుపుటకు, వారి ప్రబోధమునకు సజీవ ఉదాహరణములుగ నుండుటకన్న అధికము మరేదియు లేదు.

* * * * *

వారు లేనిచో, నాకు ఉనికి లేదు;

నేను లేనిచో, వారికి ఆవిర్భావము లేదు.

* * * * *

Sri Aurobindo Ashram,
November, 1970.

The Divine Mother,

Pranams at Thy Lotus Feet. The Birth Centenary of Sri Aurobindo is approaching. To commemorate this occasion in a fitting manner we propose to bring about a Golden Book of Sri Aurobindo, a Centenary Volume in Telugu ... Maximum help and co-operation of all the Telugu writers throughout Andhra Pradesh would be solicited. Pray bless me so that I would be able to publish it on or before August 15, 1972.

Blessings

Thy child,
(sd/–) V. Manmohan Reddy

# పూజ్యాభివందనములు

* * * *

ప్రొ॥ దివాకర్ల వేంకటావధాని
తెలుగుశాఖాధ్యక్షులు.
ఉస్మానియా విశ్వవిద్యాలయము.

శ్రీ అరవిందుల శతవర్ష జయంతికి స్మారకముగా తజ్జీవిత సందేశయోగ పరమార్థమును ప్రకటించు వ్యాసములతో కూడిన సంచిక వెలువరింపఁ బడుచున్నదని ఎరింగి అమందమైన ఆనందము నొందితిని.

శ్రీ అరవిందులు భారతమాత అనుంగు పుత్రులు. బాహ్యములైన దాస్య శృంఖలలను ఛేదించి ఆమెకు రాజకీయ స్వాతంత్ర్యమును చేకూర్చుట యేకాక అంతరములైన అజ్ఞానాందుపుల శకలీకరించి ఆధ్యాత్మికతాపునరుజ్జీవనము కూడా కల్పింపవలెనని తలంచి తమ ఉత్తర జీవితమునంతను తత్సిద్ధికై వినియోగించిన సిద్ధసంకల్పులాయన. వారు పాండిచ్చేరిలో ఆశ్రమము స్థాపించుట యందలి పరమప్రయోజనమిదియే. వారి సంకల్పవల్లి మొలకెత్తి క్రమవికాసముగాంచి, దిగంతముల వ్యాపించి, కుసుమశోభితయై ఫలించు కాలము సమీపించు చున్నది.

శ్రీ అరవిందులు బాల్యమున పాశ్చాత్యదేశము లందు విద్యాభ్యాసము కావించి తత్రత్య భాషా సంస్కృతులందు మునిగి తేలిన వారైనను భారతీయ సంస్కృతి దివ్య వికాసమును గుర్తింపకుండిన వారుకారు. భారతదేశమున కరుదెంచి, సంస్కృత మాతృ భాషలందధికారము సంపాదించి వాంఛ్చమైన భారతీయులైనారు. భారతీయ సంస్కృతికి విధానములైన వేద మంత్రములు పఠించి తదంతరార్థమును గ్రహించి ఋషితుల్యులు కాజాలినారు. యోగాభ్యాస పాటవముచే అతీత విజ్ఞానము నవగము చేసికొని దానిని దేశీయులకేకాక ప్రపంచ వాసులందరికి పంచియీదలంచిన యుదారమూర్తి ఆయన, ఆయన పండితుడు, రాజకీయవేత్త. మహాకవి, యోగిపుంగవుడు, భారత జగతుద్ధారకుడు.

ఇతర దర్శనము లారోహణమే ముఖ్యాశయముగా గలవి. శ్రీ అరవిందుల పూర్ణయోగ దర్శనము వానిని ఖండింపక ఆరోహణముతో పాటవరోహణమును కూడ సాధింపవలసియున్నదనియు, పృథ్వియందలి మనస్సున కతీతమైన విజ్ఞాన చేతనావతరణము సృష్టివిధానమునందే అంతర్గతమై యున్నదనియు బోధించును. అల్పమానవులను మహనీయులైన దివ్యులుగా పరివర్తింపజేయుట దాని ఆదర్శము.

శ్రీ మాత దర్శకత్వమున పూర్ణయోగ ప్రచారము జరిగి మేధావుల నాకర్షించు చున్నది. ఆ యోగమచిరకాలముననే మర్త్యమును దివ్యము కావించి శ్రీ అరవిందుల సంకల్పమును సార్థక మొనరించుగాక.

---

# నూత్న యుగానికి స్వాగతం

— డా॥ సి. నారాయణరెడ్డి

అరవిందుడు ఋషి.
కేవల ఋషికాడు; రసఋషి.
'నానృషిః కురుతే కావ్యం',
అరవిందుని 'సావిత్రి' ఇందుకు సాక్ష్యం.
మానవుడు అతిమానవుడు కావడానికి చేసే
అనంతప్రస్థానమే 'సావిత్రి' కృతిలోని మూలసూత్రం.
ఆత్మతేజో దర్శనానికి
మృత్యుం జయత్వానికీ
మూలప్రతీక 'సావిత్రి'.
అది అరవిందుని దృష్టిలో కేవల కావ్యంకాదు.
'భవిష్యత్కవిత'కు సమగ్ర కాంతిబింబం.
ఆ రసఋషి దర్శనం ఫలిస్తే
ఆ కర్మయోగి ఆశయం సిద్ధిస్తే
"పొరలు కమ్మని విజ్ఞానం
అరవిందంలా విరిసే"
నూత్నయుగం ఉద్భవిస్తుంది.
ఆ యుగానికి నా స్వాగతం.
అందుకు నాందిపాడిన
అరవిందుని శతదళ విస్ఫారశక్తికి
నా అభివందనం.

20–7–72

———

సంపాదకులు,

శ్రీ అరవింద శతవార్షిక స్మారక సంచిక,

మహాశయా.

శ్రీ అరవింద శతవార్షికోత్సవాల సందర్భంలో మీరు ఒక స్మారక సంచికను ప్రకటిస్తున్నందుకు సంతోషం.

శ్రీ అరవిందులు కవిగా, సమీక్షకులుగా, భాషావేత్తగా, నిబంధకర్తగా, క్రాంతిపథ నిర్మాతగా, ఊర్ధ్వచేతనా సంచాలకులుగా, మహా మనీషిగా తమ జీవితాన్ని గడిపి, అశేష జిజ్ఞాసువులకు విశేష కాంతి నందించారు.

అటువంటి మహా మనీషుల ప్రతిభావిశేషాలను, కార్య సాధనలను, ఆలోచనా ప్రపంచాన్ని వెల్లడించే రచనలలో ఈ స్మారక సంచిక వెలువడటం ముదావహం,

పార్థివ జీవితానికీ అపార్థివ జీవితానికీ మధ్య ఒక బలీయమైన చైతన్య సేతువును నిర్మించి ఈ తీరాల మధ్య వున్న యుగయుగాల తారతమ్యాన్ని తుడిచి వేసిన శ్రీ అరవిందుల దృక్కోణం విలక్షణమైంది. ఈ చైతన్య సేతువు మూలంగా మృణ్మయ చిన్మయ జీవితాలకున్న భేదం నశించి సమైక్యత స్థాపింపబడింది. శ్రీ అరవిందుల అపార ప్రజ్ఞ ఈ స్మారక సంచికలో వివిధ పాహాల్లో అభివ్యక్తం కావటం ఆనందకర విషయం.

ఇటువంటి స్మారక సంచికను వెలువరించినందుకు అభినందనలు.

15-8-72

భవదీయ,

సంజీవదేవ్

శ్రీఅరవింద శత జయంతి సందర్భమున అమూల్య రచనలతో కూడిన ఒక ప్రత్యేక సంపుటమును ప్రచురించుటకు మీరు చేయుచున్న కృషి ఎంతయు అభినందనీయము.

మహాకవిగా, ఉత్కృష్ట సాధకునిగా, పూర్ణ యోగిగా, ఉత్తమ తత్వవేత్తగా స్వర్ణయుగమునకు సోపానపాళి సమర్చిన అవతార పురుషుడు శ్రీఅరవిందుడు.

డార్విన్ నిర్వచించిన భౌతిక సిద్ధాంత పరిమితుల నధిగమించి, భవిష్యత్తున కానున్న మానవాధ్యాత్మిక పరిణతి యొక్క స్వభావ స్వరూపములను ఆవిష్కృత మొనర్పజాలిన శ్రీఅరవింద ప్రతిభ అనన్యసాధ్యము.

ఈ సందర్భమున శ్రీమాతారవిందులకు నా హృదయ పూర్వక పూజ్యాభివందనములను సమర్పించుకుంటున్నాను.

11-7-1972
హైదరాబాదు.

భవదీయుడు,
మల్లవరపు విశ్వేశ్వరరావు

# తొలిపలుకు

హైద్రాబాదులోని మానవ తత్త్వపరిశీలన సంస్థ (Institute of Human Study) వారు తెలుగులో శ్రీఅరవిందుల శతజయంతి స్మారక సంచికను వెలువరించుచున్నందులకు నేను మిగుల సంతసించుచున్నాను. శ్రీ అరవిందులు భారతీయులకేకాక యావత్ప్రపంచమునకును చిరస్మరణీయులు. ఆయనరచనలుహైందవ ధర్మమునకు వినూత్న వివరణలుగా వెలుగొందినవి. వేదములకు, భగవద్గీతకు ఆ మహనీయుడు గావించిన వ్యాఖ్యానములు మత, తత్త్వ శాస్త్రములయందు తులనాత్మక పరిశీలన మొనరించు జిజ్ఞాసువులకు పెన్నిధులు.

ఆయన యభిప్రాయములు మౌలికములు. ఆయన యాచరణలు సాహస క్రియా శీలములు. సత్ఫల వంతములు. ఇందుల కాయన జీవిత చరిత్ర మందలి తొలిపుటలే సమ్యక్ నిదర్శనములు. మనదేశమున ఆంగ్లేయ పరిపాలనమును తుద ముట్టించిన మూలకారణములలో ముఖ్యమైన విప్లవోద్యమము, ఆ విప్లవయోగి ప్రబోధించినదే. ఈ ఉద్యమము ఆయనను స్వాతంత్ర్య వీరునిగా నొనర్చి అశేష ప్రజానీకమున ఆయనకు ఎనలేని పేరు ప్రతిష్ఠలను గడించి పెట్టినది.

ఆయన నెలకొల్పిన "శ్రీ అరవిందాశ్రమ" మనెడు చిన్న సంస్థ నేడు ప్రపంచ మానవాళి పరస్పరావగాహనకు సద్భావ ప్రచారమునకు అంకితమైన అంతర్జాతీయ వ్యవస్థగా రూపము దాల్చి యుండుట ముదావహము. ఈ సంస్థ ఇపుడు "ఆరోవిల్" అను అంతర్జాతీయ నగరమును నిర్మింప బూనుట మెచ్చదగి యున్నది ఈ ఉత్తమ నిర్ణయము విశ్వమున సార్వజనీన శాంతి, సౌభాగ్య సదావగాహనలు అచిరకాలమున నెలకొనగలవనుటకు సూచకమై తదనుగుణముగా వానిని పెంపొందించు చున్నది.

ఈ సంస్థ యొక్క యీ నిశ్చయము ఇతర దేశములకును అనుకరణీయమగు ఉత్తమాదర్శముగా అలరగలదని ఆశించు చున్నాను.

శ్రీఅరవిందుని శతజయంత్యుత్సవముల శుభసమయమున ఇట్లు ప్రత్యేక సంచికను ప్రకటింప దలంచిన ఈ పత్రికా సంపాదకుల సంకల్పమును మిగుల అభినందించుచున్నాను.

దువ్వూరు జగన్నాథరెడ్డి

ఉపాధ్యక్షులు

శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయము

తిరుపతి,

17-7-1972

# ఉపోద్ఘాతము

## శ్రీ అరవిందులు - అతిమానసిక అవతారమూర్తి

## 1-వ భాగము

### అవతారమంటే ఏమి ?

పరాత్పరుని రెండు అవస్థలు_ ఒకటి నిరాకారము, రెండవది సాకారము. ఏకకాలములోనే ఈ రెండు అవస్థలకు అతీతంగాకూడా ఉండే సామర్థ్యం గలవాడు. ఈ బ్రహ్మాండము పరాత్పరునియొక్క లీలారంగము. ఈ బ్రహ్మాండంలో అనంత కోటి సౌరకుటుంబాలున్నాయి. కనబడే ప్రతి నక్షత్రము ఒక సూర్యుడే. ఆకాశము (space) అనంతము. కాలం (time) కూడ అనంతమే. ఈ బ్రహ్మాండము రెండురకాలుగా ఉన్నది._స్థూలము, అగోచరము. ఈ బ్రహ్మాండముకు ఆకాశం, కాలం రెండుపరిధులు (limits). ఇటువంటి బ్రహ్మాండాన్ని భగవంతుడు తన లీల కొరకు సృష్టించుతాడు. తనను తాను మరచి అధః పాతాళలోకాలకు యాత్ర చేస్తాడు. తననుతాను అజ్ఞానావరణతోకప్పుకొని ఈ ప్రపంచాన్ని ప్రకటితం చేస్తాడు. మళ్ళీ తనను తాను తెలుసుకుంటాడు. దాగుడుమూతలాటకు మరో పేరు లీల. తనకు తాను మరచిపోయే ప్రక్రియను వ్యావర్తనము (involution _సంకులీకరణము) అంటారు. తనను తిరిగి తెలుసుకునే ప్రక్రియను పరిణామము (evolution-విస్తరించుట) అంటారు.

ఈ అజ్ఞానాంధకార ప్రపంచములో ఎవరు అధినేతలు? మళ్ళీ భగవంతుడే అప్పుడప్పుడు అవతరించి ఈ అనంత పరిణామక్రమమును నడిపే బాధ్యత వహించుతాడు. కొన్నియుగాలక్రితం ప్రపంచంలో కేవలం జంతువులే ఉండెను. అప్పుడు పరాత్పరుడు మత్స్య అవతారము దాల్చి పరిణామ సరణికి త్వరితగతిని ప్రసాదించినాడు. ఈ అవతారాన్ని మత్స్యఅవతారమంటాము. తర్వాత కొన్నాండ్లకు కూర్మ అవతారమూర్తి అవతరించి పరిణామాన్ని ముందుకు తోసుక పోయెను. పదార్థంనుంచి మానవకోటివరకు పది అవతారాలని మన పూర్వులు

నిర్దిష్టించిరి. అదేప్రకారం అవతారమూర్తులొచ్చి పరిణామానికి గతిని, స్ఫూర్తిని ప్రసాదిస్తున్నారు. పరిణామక్రమములో మనకు స్పష్టంగా మూడు మజిలీలు లేక మైలురాళ్లు గోచరిస్తవి_ పదార్థము, ప్రాణికోటి, మనుష్యుడు. ఈ మూడు మజిలీలును పరిణామక్రమములో ప్రస్ఫుటించేందుకు పరాత్పరుడు ఇదివరకు పదిసార్లు అవతరించి ప్రపంచాన్ని ఈ దశకు తెచ్చినాడు. అవతారమూర్తి అనగా ఆ పరాత్పరుడు మనుష్యరూపం దాల్చి నూటికి నూరువంతులు ఆ వ్యక్తిలో మూర్తీభవిస్తాడు, ఇదిగాక అప్పుడప్పుడు విభూతులనుకూడ పంపుతాడు. వివేకానందుడు, శంకరులు ఈకోవకు చెందిన విభూతులే.విభూతులేకాక ఇంకా ఎందరో మహాపురుషులుదైవాంశాలతో పుట్టి ఈ పరిణామగతిని తీవ్రతరం చేస్తారు. పరిణామమంటేతన ఆవరింపబడిన కాంతిని, శక్తిని విస్తరించుకొనుట. క్లుప్తంగా ఇట్టి పరాత్పరుడు ఎప్పుడైతే మనిషిరూపంగాఅవతరించి పరిణామక్రమమునుముందుకు తీసుకుపోతాడో అట్టివాణ్ణి మనము అవతారమూర్తి అంటాము. ఇదివరకు వచ్చిన అవతారాలలో ప్రాణికోటి మజిలీకి చెందిన అవతారాలు_ మత్స్య, కూర్మ, వరాహ అవతారాలు, మనుష్యమజిలీకి చెందినవి. వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ అవతారాలు. నరసింహ అవతారం సంధికాలము (transition) లో వచ్చినది, పదవ అవతారం అతి మానసిక అవతారము.

## శ్రీ అరవిందులు

ఆ పరాత్పరుడే, ఆ అనంతుడే, ఆ పరిణామ అధినేతయే_మన శ్రీ అరవిందులు. ఆయన ఆధ్యాత్మికస్థాయిలో పూర్వయోగులుచేసిన యోగఫలితాలను పొందినారు. బుద్ధుని నిర్వాణస్థితిని మూడురోజుల్లో పొందగలిగినారు. 40 సంవత్సరాలు ఏకస్థలములో ఉండి కొత్తయుగానికి, సత్యయుగానికి నాంది పలికినారు. ఇక మేధాశక్తిలో అభినవ వ్యాసుడంటే అతిశయోక్తి కాదు. వేదవ్యాసుడు వేదసాహిత్యాన్ని 4 వేదములలో వర్గీకరించారు. ఇతిహాసములను రచించినారు. శ్రీ అరవిందులుకూడ 30 సంపుటములు వ్రాసినారు. కొత్తప్రపంచానికి ఎన్ని శాస్త్రాలు, సంహితులు కావలెనో అన్నింటిని రాశారు. 'దివ్యజీవనము' (The Life Divine) వేదతుల్యము. వేదోపనిషత్తులమీద, తత్త్వంమీద, కళ, చిత్రలేఖనము, సాహిత్యం, రాజనీతి, సాంఘికశాస్త్రం, మానవ ఐక్యతాదర్శం_ అన్నింటిమీద రాశారు. ఈ 30 సంపుటములు 30 వేదోపనిషత్తులే. శ్రీ అర

విందులు బహుముఖ ప్రజ్ఞావంతులు. ఈ పదవ అవతారమూర్తి, శ్రీఅరవిందులు, పరిణామములో ఒక గొప్ప మార్పును తెచ్చేందుకు అవతరించినారు. దశావతార క్రమములో ఆఖరు అవతారపురుషుడు, అతి మానసిక అవతార క్రమములో ప్రథమ అవతారపురుషుడు.

## అతిమానసిక యుగాల్లో అవతారాలు

పది అవతారాలే ఎందుకు? ఇకముందు లేవా? ఎందుకు 10 వరకే లెక్కింపబడ్డవి? పరాత్పరుడు అనంతుడు. వారి ఆధ్యాత్మిక సంపదఎన్నటికి తరగదు. అందుకొరకు అనంతకాలము వరకు ఆధ్యాత్మిక పరిధులు విస్తృతమవుతూనే ఉంటవి. అతిమానసికయుగము తర్వాతకూడ భగవానుడు అవతారాలు దాల్చగలడు. కాని గత అవతారాలకు, అతి మానసిక అవతారాలకు చాలా వ్యత్యాసముండును. దశావతారాలు అజ్ఞానయుగాల్లో వచ్చినవి. అనగా ఇదివరకు పరిణామము అజ్ఞానకాలాల్లో (Evolution in Ignorance) జరిగింది. అందుకొరకు ఒక వరుస. క్రమము. ఏర్పడింది. ఇకముందు అనంతకోటి యుగాల్లో అవతారాలు జ్ఞానయుగాల్లో (Evolution in Knowledge) వచ్చును, అతిమానసిక యుగంలో అజ్ఞానముయొక్క మాత్ర చాలా క్షీణించును. ప్రపంచంలో జ్ఞాన సంపద అధికముగా ఉండును.

వేదకాలము నుంచి ఇప్పటివరకు మోక్షంయొక్క భావన (concept) మారలేదు. విజ్ఞానం (Science) లో దినదినానికి మార్పులు వస్తున్నాయి. కాని ఆధ్యాత్మికరంగాల్లో వేదోపనిషత్తుల కాల భావనలే ఇప్పటివరకు మార్పుజెందక ఉన్నాయి. పరిణామమనే (Evolution) కాలతబద్ధ అన్నిరంగాలకు సమానంగా వర్తిస్తుంది. శ్రీ అరవిందులు మోక్షంయొక్క భావనలో విప్లవాత్మకమైన మార్పు తెచ్చినారు.

## సృష్టి ఎందుకు? – మానవుని ధ్యేయము

సృష్టిపుట్టింది భగవానుని లీల కొరకు. మనమందరము ఆ పరాత్పరుని సహచరులమే. సృష్టి కొరకు పరాత్పరుడు అజ్ఞానావరణమును తనమీద కప్పుకున్నాడు. తనను తాను మరచిపోయినాడు. ఇప్పుడు తననుతాను తెలుసుకొంటున్నాడు. ఈ అన్వేషణములో కొన్ని మజిలీలున్నాయి. మను

ష్యుడు ఆఖరు మజిలీకాదు. ముందున్న మజిలీలు ఎన్నో ఉన్నవి. అతి మనుష్యుని మజిలీ రాబోతుంది. పరాత్పరుడు అనంతకాలము వరకు తన దివ్య తేజస్సును, ఆధ్యాత్మిక మాత్రను విస్తృతము చేయుచుండును. మానవుడు ఇప్పటికి వరకు సాధించిన సంపద చెప్పుకోదగ్గదికాదు. అసలు ధ్యేయం ముందే ఉన్నది. సువర్ణయుగాలు రానున్నవి. పరాత్పరునిలో లీనమగుట, ఏదో స్వర్గంలో స్థిర నివాసం ఏర్పరచుకొనుట, శూన్య నిర్వాణంలో మునకలు వేయుట మనుష్యుని ధ్యేయంకాదు. ఈ పై మోక్షం యొక్క మజిలీలను అతిక్రమించి, ఆ పరాత్పరునితో సక్రియ సాహచర్యాన్ని సంపాదించవలెను. ఈ అనంతకోటి బ్రహ్మాండముల ఐశ్వర్యములో మానవుడు భాగస్వామిగా పరిణమించవలెను. ఇకముందు మానవుని పరమ గమ్యము, ధ్యేయము మోక్షముకాదు. మోక్షము పరిణామ క్రమములో ఒక మజిలీయే. అతి మానసిక ఆధ్యాత్మిక పథికుని మోక్షం సహజంగా సంక్రమించును. శ్రీఅరవిందులు అవతరించి ఈ అనంత కాల గర్భములో ఎన్నో మజిలీలున్నాయని చెప్పినారు. ఇక ముందు మానవుని పరమధ్యేయం మోక్షంకాదు, రూపాంతరము (transformation).

## శ్రీ అరవిందుల దర్శనం వేద ప్రతిపాదితమే

వారి దర్శనంలో వేదోపనిషత్తులకు విరుద్ధంగా లేశ మాత్రము లేదు. సనాతన ధర్మానికి వేదోపనిషత్తులు, గీత ధర్మగ్రంథాలు. బుద్ధునికాలం నాటికి వేదము కేవలం యజ్ఞయాగాదుల సహాయ నిమిత్తం ఉండిపోయింది. కర్మ కాండీయ వేదార్థాన్ని నిర్మూలన చేసేందుకు బుద్ధుడు అవతరించాడు. ఆయన ఒక గొప్ప సంస్కర్త. ఆయన వేదాలకు ప్రాముఖ్యత ఇవ్వలేదు. భారత దేశంలో బుద్ధయుగం ప్రారంభమైంది. శంకరుల హైందవ ధర్మమును ఉద్ధరించే నిమిత్తము అవతరించి బుద్ధుని ప్రభావము తగ్గించినారు. శంకరులు ప్రస్థానత్రయి (ఉపనిషత్తులు, గీత, బ్రహ్మ సూత్రం) మీదనే వ్యాఖ్యానించినారు. అప్పటనుంచి నిగూఢ వేదార్థం భారతదేశములో లుప్తప్రాయమయింది. శ్రీఅరవిందులు వేదాల యొక్క గూఢార్థాన్ని చెప్పి మళ్లీ వేదాలను మన ప్రథమ ధర్మగ్రంథముగా నిలబెట్టినారు.

శ్రీఅరవిందులు తన దర్శనములో ముఖ్య భావనలు (concepts), పునాదులు-ప్రాతిపదికలు (bases) అన్నీ కూడ వేదాల నుంచి తీసుకున్నారు.

వేదాలలో "సమస్త విషయాలు ఉన్నవ"ను సూక్తి నిజమే. కాని బీజరూపంగా ఉన్నవి. ఉదాహరణకు, అతిమానసిక తత్త్వాన్ని తీసుకుందాము: దీన్ని వేదములో "ఋత–చిత్తు" అని, ఉపనిషత్తుల్లో "విజ్ఞాన"మని పేర్కొనబడినది. వేద ఋషులు మనస్సు (mind) కన్న అతీతంగా ఇంకొక ఉన్నత స్థాయి ఉన్నతిని తెలుసుకున్నారు. కొందరికి అంశికంగా అనుభవం కావచ్చు. కాని పూర్ణ రూపేణ ఈ అతిమానసిక తత్త్వాన్ని అనుభవించక పోయిరి. రెండవది పరాత్పరునికి 7 స్థాయిలున్నవనేది **(7 Levels of the Supreme Being)** కూడా వేద ప్రతి పాదితమే. శ్రీఅరవిందులు ఈ భావనను **(concepts)** తన దర్శనములో తరుచుగా ఉపయోగిస్తారు. **"దివ్యజీవనము" (The Life Divine)** శ్రీఅరవిందుల గ్రంథరాజము. ఈ గ్రంథము యొక్క 1000 పేజీలలో ప్రతి పేజీ వేద సత్యాలను, భావములను గురించి నిర్వచనము చేస్తుంది. దీనిని పంచమ వేదము లేక అతిమానసిక వేదము అనవచ్చు. వేదాల తర్వాత ఉపనిషత్తులు, గీత, శంకర అద్వైతం, రామానుజుల విశిష్ట అద్వైతం, వల్లభ ద్వైతం– ఇవిముఖ్యమైన తత్త్వగ్రంథాలు. అతిమానసికతత్త్వం ఉపనిషత్తుల్లో తప్పఎందులోలేదు. శంకర దర్శనంలోలేనంత మాత్రాన శ్రీఅరవింద దర్శనం వేదవిరుద్ధముకాదు **అ**వతార పురుషులు మానవాళికి వేదాలు ప్రసాదించుతారు. ఆచార్యులు వీటి మీద సృజనాత్మకమైన వ్యాఖ్యానాలు చేస్తారు. శ్రీఅరవిందులు ఈ యుగానికి "దివ్య జీవనము" అనే వేదాన్ని ప్రసాదించినారు.

## పరిణామ క్రమములో మజిలీలు

**పరి**ణామ సిద్ధాంతం ప్రాచ్యదేశాల కన్నా పాశ్చాత్యదేశాల ప్రదానము (gif ). శ్రీ అరవిందులు ఈ సిద్ధాంతాన్ని తన దర్శనంలో ఒక ముఖ్య భాగంగా పరిగణించినారు. పరాత్పరుడు కేవలం ఒక స్థిరమైన, స్తబ్ధమైన, పేరుకొన్న తత్త్వంకాదు. ఎల్లప్పుడు పరిణమిస్తూనే ఉంటాడు. ఏకం( one ) మరియు బహు **(many)**—ఈ రెండును వాని అవస్థలు ( poises) పాశ్చాత్యతత్త్వం 'బహు'కు ప్రాచ్యతత్త్వం 'ఏకం'కు ప్రాధాన్యత ఇస్తవి. శ్రీ అరవిందులు ఈ రెండు అంశాలను మేళవించినారు. అందుకొరకు **change** లేక **becoming** లేక **evolution** (మార్పులేక పరిణామము) ఎంత ముఖ్యమో **being** (సత్త) కూడ అంతముఖ్యమే. ఈ రెండిటి కలయికయే, సమన్వ

యమే సమగ్ర దృక్కోణానికి నాంది. పరాత్పరునికి అనంతస్థాయిలున్నవి. అందులోని 7 స్థాయిలు చెప్పుకోదగ్గవి. అవి : సత్తు, చిత్తు, అతి మనస్సు, మనస్సు, ప్రాణము, శరీరము.

అనంతుడు సంకులీకరణ( involution) ప్రక్రియతో ఈ పై 7 మజిలీల గుండా ప్రయాణము చేసి తుది మజిలీలో (పదార్థము_matter) ఉండిపోయి నాడు. ఇది అవరోహణ (descending) లేక 'దాచు' (hide) ప్రక్రియ. తర్వాత బహిర్గత ప్రక్రియ (evolution) ప్రారంభించును. దీనిని ఆరోహణ (ascending) ప్రక్రియ అందురు. పరాత్పరుడు తన్ను దాను కనుక్కొనే యాత్రలో పదార్థం మొదటి మైలురాలు. ప్రాణికోటి 2 వది. మనుష్యుడు 3వది. పరాత్పరుని అగాధ సంపద కేవలం మూడు మజిలీలకే అంతమొందదు. పరాత్ప రుడు అనంతుడు; ఆనంతకాలం వరకు వాని సంపద తరగదు. అక్షయుడు.

శ్రీ అరవిందులు భారతీయ దర్శనంలో ఒక గొప్ప సంచలనాన్ని తెచ్చి నారు. స్తంభించిన దృక్పథాన్ని మార్చినారు. వేద ఋషుల తర్వాత శ్రీ అర విందులు మన మొత్తం ధర్మ గ్రంథాలను వ్యాఖ్యానించి వాటిని సజీవంగా చేశారు. భవిష్యత్తులో 'అతిమానసిక జాతి' ఒకటి ఆవిర్భవించును. దాని తర్వాత 'ఆనందజాతి', 'చిత్తు-జాతి', 'సత్తు-జాతి' క్రమముగా ప్రకటితము కాగలవు.

## అతిమానసిక తత్త్వం — పరమ సామరస్యశక్తి

ఇది శ్రీ అరవింద దర్శన వైశిష్ట్యము. పరిణామక్రమములో ఇది నాల్గవ మజిలీరాయి. వేదఋషులు ఈ తత్త్వము యొక్క ఉచ్చస్థాయిని కనుగొన్నారు. ఆంశికానుభవము కూడా చేశారు, కాని దాన్ని ఈ భువికి తెచ్చి, ప్రపంచాన్ని రూపాంతరము చేసేందుకు ప్రయత్నించలేదు. అతిమానసిక శక్తి అమోఘమైనది. తిరుగులేనిది. ఒక అద్భుత ఆధ్యాత్మిక విద్యుత్కేంద్రము (Thermal Station) లాంటిది. ఇది శ్రీరామ బాణము, శ్రీకృష్ణుని చక్రము.

పరాత్పరుడు ఈ లోకాలను ఒక ప్రణాళికా బద్ధంగా సృష్టిస్తాడు. అనంతుని వద్ద అనంతకోటి ప్రణాళికలున్నాయి. మన ప్రస్తుత సృష్టిని ఒక

నిర్దిష్ట ప్రణాళికానుసారం, క్రమబద్ధంగా సృష్టించినాడు. ఈ దివ్యమైన ఇంజినీరే (engineer) అతి మానసిక తత్త్వం. అనంతకోటి ప్రణాళికల ముసాయిదాలనుంచి ఒక ప్రణాళికను ఏరుకునే శక్తిని అతిమానసిక తత్త్వం అంటారు. ఇక రెండవ వైశిష్ట్యం ఏమంటే, ఈ తత్త్వం అటు 'ఏకం'ను ఇటు 'బహు'ను మిళితం చేసి పరమసామరస్యాన్ని చేకూర్చుతుంది. ఊర్ధ్వలోకాలను, అధోలోకాలను—ఈ రెంటిని కలిపే గొలుసు 'link'. ప్రస్తుత ప్రపంచంలో ఐక్యం, సామరస్యం లేవు. కేవలం, 'బహు' ఉన్నది. ఊర్ధ్వలోకాల్లో కేవలం 'ఏకం' ఉన్నది. ఈ 'ఏకం' మరియు 'బహు'కు పరమసామరస్యం స్థాపించే తత్త్వం. ఈ అతిమానసిక తత్త్వం, సచ్చిదానందుని యొక్క ప్రత్యేక స్థితి 'poise'. ఇప్పుడు శ్రీ మాతారవిందులు ఈ పరమ సామరస్య శక్తిని మన ప్రపంచానికి తెచ్చినారు. యావత్తు మానవాళిని ఐక్యం చేసేవరకు ఈ శక్తి ఊరుకోదు. 'బహు'ను సృష్టించినది శ్రీ మాతారవిందులే. పరమ సామరస్య తత్త్వంతో 'ఏకం-బహు'లలో సామరస్యం చేకూర్చే బాధ్యత వారిదే. ఈ పరమ సామరస్యాన్ని సాధించేకృషి మానవాళి యొక్క పరమ ధ్యేయం. ఇదియే దివ్యమైన భవితవ్యం.

## రూపాంతర యోగము

శ్రీ అరవిందులు 'యోగసమన్వయము' (The Synthesis of Yoga) అనే గ్రంథాన్ని వ్రాశారు. "దివ్యజీవనము" (Tne Life Divine) తర్వాత ఈ గ్రంథము ముఖ్యమైనది. శ్రీఅరవిందులు తన దర్శనము యొక్క బౌద్ధిక స్థాయి మీద "దివ్యజీవనము"లో చర్చించినారు (Theortical exposition). 'యోగసమన్వయము'లో సమగ్ర యోగాన్ని సాధించే బృహత్ ప్రక్రియను నిరూపించినారు. "దివ్యజీవనము", "యోగసమన్వయము"—ఈ రెండు గ్రంథములలోని విషయములు పరస్పర పూరకములు. మొదటి గ్రంథములో సిద్ధాంతము (theory), రెండవ గ్రంథములో అనుష్ఠాన ప్రక్రియ (practice) భగవద్గీతలో నిరూపింప బడ్డవి మూడు యోగములున్నవి. అవి భక్తి, కర్మ, జ్ఞాన, యోగములు. మనపూర్వులు—ఆచార్యులు—గీతను జ్ఞాన ప్రధాన గ్రంథమని సిద్ధాంతీకరించినారు. కాని గీత అటువంటి గ్రంథముకాదు. అన్నియోగాలు సమాన సామర్థ్యముగలవి. అన్నీ కూడా మోక్షాన్ని ప్రసాదించేవే. పరస్పర పూర

కాలేగాని; పరస్పర భిన్నమైనవికావు. శ్రీఅరవిందులు గీత మీద వ్యాఖ్యానించినారు. అన్ని యోగాలు సమానంగా మోక్షానికి దారితీస్తాయి అని అన్నారు శ్రీఅరవిందులు. అందు కొరకు శ్రీఅరవిందాశ్రమములో ఏ ఒక్క ప్రత్యేక యోగాన్నీ అవలంబించరు.

అతి మానసిక రూపాంతరం కొరకు పాతయోగాలు కొంత వరకు అత్యవసరము. ఈ పాత యోగాలతో మనము మనలో ఉండే చైత్యపురుషుని అధీనంలోకి పోవచ్చును. సమగ్ర యోగం ఇంతటితో ఆగదు. మన బృహత్ ధ్యేయమునకు తగ్గట్టు మన సాధనా ప్రణాళిక కూడ పరిణామము చెందవలెను. పరాత్పరునికి మూడు అవస్థలున్నవి—వ్యక్తి (Individual), విశ్వము (Universal), పరాత్పరుడు (Transcendental). ఈ గోచర, అగోచర బ్రహ్మాండము యావత్తు ఈస్థాయిలలో (levels) విభజింపబడ్డది మూడు శ్రేణులుగల బ్రహ్మాండము (Three tiered Universe). ఇప్పుడు మనుష్యుని ధ్యేయం కేవలం మోక్షం [భగవంతునిలో లీనమగుట] కాదు—రూపాంతరము. అందు కొరకే మన పరమ ఉచ్ఛ ధ్యేయం ప్రకారము మన యోగము యొక్క ప్రక్రియలలో గొప్ప మార్పు కలుగవలెను. సమగ్ర యోగంలో మూడు సోపానాలున్నవి. మొదటి మజిలీలో సాధకుడు చైత్య పురుషుని అధీనంలోనికి వస్తాడు. దీనినే చైత్య పురుషీకరణము (Phychicisation) అంటారు. దీనినే మనము అంతరంగీకరణ (Interiorisation) అనగా: మనలో అంతరంగికంగా అన్ని ప్రదేశాలతో ఏకీకరణ చెందుట. రెండవ మజిలీలో మన సత్తను బ్రహ్మాండము మేరకు విస్తృతము గావించుట. దీనినే మనం విశ్వీకరణము (Universalisation) అంటాము. 3వ మజిలీలో మన సత్త ఈ రెండు అవస్థలకు అతీతంగా ఉంటుంది. దీనిని యోగ పరిభాషలో అతి మానసీకరణము (Supramentalisation) లేక పరాత్పరీకరణము (Transcendentalisation) అంటారు.

| వ్యక్తి | విశ్వము | పరాత్పరుడు |
|---|---|---|
| చైత్య పురుషీకరణము | విశ్వీకరణము | అతిమానసీకరణము |

మన ప్రయత్నంతో మొదటి మెట్టువరకు పోగలుగుతాము. ఇది గత ఆధ్యాత్మిక పరిభాషలో మోక్షమంటారు. శ్రీమాత కృపవలన రెండవ

మజిలీకి పోగలము. కొందరు మొదటి మజిలీ తర్వాత ఆకాంక్షను విరమించు కోవచ్చు, మరికొందరు రెండవ మజిలీ తర్వాత. కేవలం శ్రీతల్లి గారి కృప వల్లనే మూడవ మజిలీకి పోగలము. దేహ-ప్రాణ-మానసిక (Physical-Vital-mental) మనే మనదేహం మొత్తం అమృత మయమవుతుంది. శారీరకంగా అమరత్వాన్ని పొందగలము.

## శ్రీ మాతారవిందులు-వారి అన్యోన్య సంబంధము

భారతీయ దర్శనములో శ్రీమాత ప్రసక్తి ఎంత ఉన్నదో అంత ఇంకే ప్రపంచ దర్శనములలోనూలేదు. వేదోపనిషత్తులలో అదితి అనీ, దైవజనని అనీ, గీతలో వరా ప్రకృతి అనీ, ఇతిహాసాలలో దేవి అనీ అనబడును. తంత్రాలలో ఇక చెప్పనక్కరలేదు. తంత్రాలు శక్తి ప్రధాన శాస్త్రాలు. దేవీభాగవతము, లలితా సహస్రనామము ఇంకెన్నో గ్రంథాలు శ్రీమాతమీద రచించినారు. మహాసరస్వతి, మహాకాళీ, మహాలక్ష్మి, మహేశ్వరి, అనునవి శ్రీమాత రూపములని భారత దేశములో ప్రతి సామాన్య మానవునికి తెలుసును. పల్లె ప్రాంతాలలో పోశమ్మ అనీ, ఈదమ్మ అనీ, పోలేరమ్మ అనీ, డక్కలమ్మ అనీ, మారెమ్మ అనీ, కట్టమైసమ్మ అనీ శ్రీమాతకు పేళ్ళు. భారతదేశము లోని ప్రతి మండలములోను మాత భిన్నభిన్నమగు పేర్లతో పిలువబడును. ఇదే కాక భారత దేశమే శ్రీమాత యొక్క భౌతిక రూపం. నిజానికి మనదేశము అదృష్టవంతమైన భూభాగము.

పరాత్పరుడు అప్రకటిత అనంతుడు. సృష్టికిముందున్న పరమ సత్తు. ఎప్పుడైతే పరాత్పరునిలో సృష్టి నిర్మాణం నిమిత్తం భావాలు ఉద్భవిస్తాయో అప్పుడు పరాత్పర శక్తి ఒకటి ఆయనలో నుంచి పుడుతుంది. ఆ పరాత్పరుడే రెండుగా-పరాత్పర పురుషుడు, పరాత్పర శక్తి-విభజింపబడుతాడు. ఈ స్థితి సృష్టికి అతీతంగా ఉన్న అవస్థ. ఈ సందర్భములో శ్రీమాత నుడివిన వాక్యము జ్ఞాపకముంచుకోదగినది :

"వారులేనిచో, నాకు ఉనికిలేదు;
నేనులేనిచో, వారికి ఆవిర్భావములేదు."

యావత్తు సృష్టి ప్రక్రియ శ్రీతల్లి గారి పరమే, ఆమే విభాగమే (Department)

గతయుగాల్లో భగవంతుణ్ణి ప్రధానంగా పురుషునిగా పూజించినారు. తర్వాత రెండవ స్థానం శ్రీమాతకు సంక్రమించింది. ఇకముందు అతి మానసిక యుగాల్లో శ్రీమాత తత్త్వం ముందుకు రాగలదు. అతిమానసీకరణ కేవలం శ్రీమాత కృషియే. ఆమెయే దీనిని సాధించగలదు. అందుకొరకే ప్రప్రథమముగా ఆ జనని నూటికి నూరు వంతులుగా దివ్య తేజస్సుతో ఈ లోకంలో మూర్తీభవించింది. శ్రీమాత శ్రీఅరవిందుల ఏకైక శక్తి. శ్రీఅరవిందులు పరాత్పరుని యొక్క ప్రకాశ అంశము, శ్రీమాత శక్తి అంశము. ప్రకాశములేనిది శక్తి ఉండదు; శక్తిలేనిది ప్రకాశముండదు. ఇకముందు ఏక భగవానుని స్థానే ఉభయ భగవానులుందురు.

## 2వ భాగము

## ప్రస్తుత ప్రపంచస్థితి - గరిష్ట అసామరస్యము

ప్రస్తుత ప్రపంచ కల్లోలమయ క్షోభమయ ప్రపంచము. అక్షరాస్యులసంఖ్య దినదినానికి అభివృద్ధి అవుతున్నది. విజ్ఞానపరిధులు విస్తరిస్తున్నవి. కాని సామరస్యము ఎక్కడను కనబడుటలేదు. విజ్ఞానము, విద్య పెరుగుతున్నది. కాని మనుష్యులు మారలేదు. దీనిని ఒక మూలకారణమున్నది. పరిణామ సరణిలో మానసిక దశ ఒక పరాకాష్ఠస్థాయికి వచ్చింది. బుద్ధి (Reason) యొక్క ప్రధాన (gift) మే విజ్ఞానం. బుద్ధిలో ఒక విషయాన్ని క్షుణ్ణంగా విశ్లేషించే గుణముంది. తన పరిశీలన (obsertions) ను క్రమ బద్ధంగా వ్రాసే సామర్థ్యముంది, బుద్ధిగత విద్య యావత్తు విషయాలను వర్గీకరించి, ఒక సూత్రాన్ని కనిపెట్ట గలదు. విజ్ఞానం బుద్ధిగత విద్యయే, అణు, పరమానవులను కనిపెట్టింది. విజ్ఞానం. సూక్ష్మాతి సూక్ష్మవస్తువు యొక్క ధర్మాలను కనుగొన్నది. కాని అది సమన్వయం చేయలేదు. సామరస్యం చేకూర్చలేదు. విజ్ఞానానంలో ఎన్నో విభాగాలున్నాయి. అవన్నియు సత్యాలే. ప్రపంచలో ఇంకెన్నో జ్ఞానము యొక్క వివిధ శాఖలున్నాయి. వీటిలో కూడ సత్యముంది. ఈ అన్ని సత్యాల మధ్య సామరస్యం కల్పించి, ఇవన్నీ పరస్పర పూరకములే అని

చెప్పేది. ఒక్క పరమసత్యమే (supermind). పరమసత్యమే పరమ సామరస్య తత్త్వం. శాశ్వతశాంతి ధూర్త రాజకీయ వేత్తల ఒడంబడికల, ఒప్పందాల మీద ఆధారపడదు. బుద్ధిగత మనుష్యుడు ఈ పరమ సత్యాన్ని సాధించలేడు. శ్రీ మాతారవిందులు ఈ లోప భూయిష్టమైన ప్రపంచాన్ని మార్చేందుకు ఈ అతిమానసిక శక్తిని భువిమీదికి తెచ్చినారు.

## సంఘము యొక్క పునర్నిర్మాణము

శ్రీ అరవిందులు కేవలం తత్త్వాన్ని ప్రబోధించేందుకు అవతరించినలేదు. వారీ ప్రపంచాన్ని మార్చేందుకు వచ్చినారు. అందుకొరకే తన గ్రంథరాజం పేరు 'దివ్యజీవనము' (The Life Divine) అని అన్నారు. జీవితమునే మార్చవలెను. ఎన్ని తత్త్వాలు, సిద్ధాంతాలు, దర్శనాలు పుట్టినా అన్నీకూడా మనుష్యుని జీవితమును మార్చేందుకే. ఈ మార్పు అన్ని సిద్ధాంతాల సారమే అతిమానసిక గంగను శ్రీ మాతారవిందులు భగీరథ ప్రయత్నము చేసిన తర్వాత ఈ భువికి తెచ్చినారు. ఈ ఊర్ధ్వ ప్రపంచాన్ని సస్యశ్యామలంగా చేయవలెను వ్యక్తిలోపల మార్చే ప్రధానము. అందు కొరకు అన్ని మార్పులకు వ్యక్తిలో మార్పే అతి ముఖ్యమైనదని శ్రీ మాతారవిందులు నుడివినారు. ఇదివరకు బుద్ధ శంకరుల 'పలాయనవాద' సిద్ధాంతాల పర్యవసానంగా అందరు మంచి వాండ్లు ఏ ఆశ్రమములలోనో, లేక ఏ ఏ కాంతస్థలాలలోనో ఉండిపోయినారు. ప్రపంచాన్ని మిథ్య అని త్యజించినారు. ఇప్పుడట్లుకాదు. ఊర్ధ్వలోకం మనలోకాన్నిదాడి చేసింది. ఆకాశగంగ పృథ్వీమీదికి వచ్చింది. మన భువి ఊర్ధ్వలోకాల ఆధ్యాత్మిక సంపదలో ఒక భాగస్వామిగా పరిణమించింది. ఇక భువియొక్క దివ్య భవితవ్యం ఫలించింది మనము పైకి పోనక్కరలేదు. ఇక్కడనే ఉంది, అందరి మధ్యఉంది మన దైనందిన జీవితమును మార్చవలెను.

ఈ ప్రస్తుత సంఘాన్ని బాగుచేయాలంటే వ్యక్తి-సంఘముయొక్క అన్యోన్య సంబంధాన్ని నిర్వచించాలి. ప్రపంచములో ఎన్ని రాజకీయ కల్లోలాలున్నవో అవన్నీ ఈ సంబంధం మీద ఆధారపడుతవి. సామ్యవాదదేశాలలో సమష్టికీ, ప్రజాస్వామ్యదేశాలలో వ్యక్తికి ప్రాముఖ్యత ఉంది. అసలువ్యక్తిలేనిదీ సమాజముండదు, సమాజంలేనిది వ్యక్తి ఉండడు. ఈ రెండును అవసరమే.

ఈ రెంటిలో వ్యక్తి ముందైనప్పటికి సమాజమును త్యజించరాదు. శ్రీ అరవిందులు ఈ రెంటిని మేళవించి చక్కగా ఒక సామరస్య సిద్ధాంతాన్ని నిరూపించినారు. అందుకొరకే అతిమానసిక యుగములో పరపీడన ఉండదు.

## ఆధ్యాత్మిక సామ్యవాదము

సామ్యవాదము నిరీశ్వర సిద్ధాంతము. ఆధ్యాత్మికవాదానికీ, సామ్యవాదానికీ ఏ పొత్తూ కుదరదు. అవి పరస్పరభిన్నమైనవి. కలయిక అసంభవము. కాని ఈ ప్రపంచములో మానవుడు సాధించలేనిది ఏదియూలేదు. ఇది రాబోయే సువర్ణ యుగములో సాధ్యమవుతుంది. శ్రీ అరవిందులు తన దర్శనంలో ఒక సూత్రాన్ని కనిపెట్టినారు. దాన్నే "అనంతుని యుక్తి"(Logic of the Infinite) అంటారు. ఉదాహరణానికి భగవంతుడు నిరాకారుడు, ఆకారుడు కూడ. ఈ రెండవస్థలలో ఏకకాలంలో ఉంటాడు. ఈ సూత్రం మానుషప్రపంచానికి వర్తించదు. అనగా, మనము సాధించని విషయము మనకు అద్భుతమైన విషయము, అనంతునికి అది ఒక సామాన్య విషయము. అందుకొరకే దైవయుగంలో ఆధ్యాత్మిక సామ్యవాదం సిద్ధించి తీరుతుంది. శ్రీ అరవిందులు యావత్తు మానవాళికొరకు వచ్చినారు. దరిద్ర, పరపీడన వాతావరణములో శ్రీ మాతారవిందుల దర్శనం సరిగ్గా ఫలించదు. లక్ష్మి అందరి అందుబాటులో ఉండవలెను. అప్పుడే మహాలక్ష్మి అనే శ్రీమాత పేరు సార్థకమౌతుంది. సామ్యవాద సిద్ధాంతము భగవానుని మినహాయించి ఒక ఆదర్శమైన సమాజాన్ని నిర్మించ ప్రయత్నం చేసింది. ఇది సాహసోపేతమైన ముందంజే, కాని ఒక ఆదర్శమైన సమాజాన్ని, దానిలో నుంచి "ఆధ్యాత్మిక నియమావళి"ని తీసివేసి, నిర్మించలేము. మనిషికి తిండి, ఇల్లు, ప్రేమ, దైవము——అన్నీ కావలెను. డబ్బు శ్రీ మాత సంపద. అందుకొరకే అందరూ కలిసి ఈ దైవసంపదను అనుభవించాలి. వ్యక్తియొక్క స్వైరస్వేచ్ఛ ప్రజాస్వామ్య దేశాలలో దుర్వినియోగమౌతున్నది. ఈ స్వేచ్ఛ పరపీడనగా మారింది. ప్రస్తుతం ఈ రెండు సాంఘిక విధానాలలోనూ తమ తమ లోపాలున్నవి. ఈ లోపాలను దిద్దుకొని ఒక వినూతన సాంఘిక విధానాన్ని అమలులోకి తేవలెను. దానికొరకు మన దృక్కోణాన్నే పూర్తిగా మార్చవలెను.

మన మందరము శ్రీ మాత బిడ్డలమే. ప్రతియొక్కరము దివ్యసూత్రముతో పరస్పరము బంధింపబడ్డాము. ఒకే కుటుంబానికి చెందినవారలము. అది దైవకుటుంబము, సౌభ్రాతృత్వము ( brotherhood) ప్రేమ మూలకము. ఈ సోదరభావము మనలో రావలెను. అప్పుడే ఒక శాశ్వతమైన సాంఘిక సిద్ధాంతాన్ని నిరూపించుకోగలము.

## ప్రపంచ ఐక్యత

ప్రపంచానికి మూలం అనంతుడు. అనంతునియొక్క 'బహు'రూపమే ఈ ప్రపంచము. మొదటిలో పరాత్పరుడు 'ఏకం' స్థితిలో ఉండెను· తర్వాత 'బహు' అయినాడు. ఇకముందు 'ఏకం-బహు' సామరస్యస్థితిలో ఉండగలడు. ఎప్పుడైతే అధిమానసికతత్త్వం ఈ ప్రపంచంలో సహజ అవస్థలో ఉంటుందో అప్పుడు 'ఏకం-బహు'లో గరిష్ఠ సామరస్యం కల్గును, మానవాళి మొత్తం ఒకటి. మనుష్యులు, దేశాలు, ఇవన్నియు 'బహురూపాలే'. ప్రస్తుత ప్రపంచంలో సంఘర్షణ ఉన్నది. ఒకేమతానికి చెందిన వాండ్లలో (నల్ల-తెల్ల విచక్షణ) నూ, ఒకే రాజకీయ సిద్ధాంతాన్ని అనుసరించే వాళ్ళలోనూ (రష్యన్-చైనీసు సామ్యవాదులు) ఒకే తెల్లజాతి రెండు తెగల మధ్యనూ (క్యాథోలిక్-ప్రోటెస్టెంటు) సంఘర్షణ జరుగుతున్నది. మనుష్యులవలె దేశాలుకూడ దివ్య వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవలెను. ఎప్పుడైతే ఈ దివ్యసంపదను పెంచుకుంటామో అప్పుడే ప్రపంచం యావత్తు దేశాలమధ్య సామరస్యం కుదురును. కేవలం బౌద్ధికస్థాయిని పెంచుకున్నంతమాత్రాన సామరస్యం కుదరదు.

శ్రీ అరవిందులు 'మానవ ఐక్యతాదర్శము'లో ప్రపంచ ఐక్యం సాధించే బృహత్ప్రణాళికను నిరూపించినారు. ఒకే ప్రపంచ సమాఖ్యలో ఇప్పుడున్న దేశాలన్నీ చేరవలెను. అప్పుడే ఈ కలహగత ప్రపంచం ఒక సామరస్య ప్రపంచంగా పరిణమించగలదు. ఇది అంత సులభమైన పనికాదు. ఎంతవరకు ప్రతిదేశంలోను ప్రతివ్యక్తి మారడో అంతవరకు ఈపని నెరవేరదు. మన మందరము ఆ అనంతుని సంతానమనే ఐక్యభావం మనలోరావలెను. శ్రీ మాతారవిందులు పరమసామరస్యతత్త్వాన్ని పృథ్వీచేతస్సులోనికి దించినారు. ఎప్పటివరకు ఈ తత్త్వం కనీసం కొందరిలోనైనా మూర్తీభవించదో అప్పటివరకు అన్ని దేశాలమధ్య సామరస్యం కుదరదు. తప్పక మానవాళి ఐక్యం సాధించగలదు. ఒక సమాఖ్య ప్రపంచస్థాయిలో ఏర్పడగలదు.

# భారతదేశ పునర్నిర్మాణము

భారతదేశం అనంతుని ఆధ్యాత్మిక ప్రయోగశాల. సనాతన ధర్మమును అనంతుడు భారతదేశానికే కాపాడమని మొదటిలో అప్పగించినాడు. భవిష్యత్తులో సనాతన ధర్మమే మానవాళిని ఐక్యం చేయును. భారతదేశం ఒక లఘు ప్రపంచం. ఇందులో అన్నిరకార మతాలున్నవి. ఈ యుగంలో శ్రీ మాతారవిందులు అవతరించి, మనుష్యునినుంచి అతిమనుష్యుని తయారుచేసే నిమిత్తం భారతదేశంలో ప్రయోగం జరుపుతున్నారు. యావత్తు మానవాళి ఉనికికే భారతదేశం అవసరం. భారతదేశం ప్రపంచము కొరకు జీవించవలెను. అందుకొరకు ప్రతి భారతీయునిమీద చాలా బాధ్యత ఉంది.

మన దేశములోనే ఆధ్యాత్మిక సామ్యవాదం వచ్చి తీరగలదు. ఆర్థిక-సాంఘిక-రాజకీయ స్థాయిలలో ఆదర్శప్రాయమైన సమాజం మనము నిర్మించుకోవాలి. విజ్ఞానంయొక్క అతి వినియోగం, దుర్వినియోగం 'అవుతున్నది. దీన్ని చక్కపెట్టవలెను. భారతదేశమే అన్నిదేశాలను ఒకే సమాఖ్యలో చేర్చగలదు. అందుకొరకు మన భారత ఉపఖండము, బాంగ్లదేశ్, పాకిస్తాను, బ్రహ్మదేశము (బర్మా), శ్రీలంక,—ఇవన్నియు ఒకే సమాఖ్యలో చేరగలవు. ప్రపంచ సమాఖ్యా నిర్మాణమునకు ఇది నిదర్శనంగా ఉండును. సౌభ్రాతృత్వం మనదేశంలో అమలుకు రావలెను. ప్రతి గ్రామములోను సమిష్టివాడలు నిర్మింపవలెను. శ్రీ మాతారవిందుల భక్తులు ఒకేచోట సమిష్టిగా ఉండవలెను.

# సువర్ణ యుగము

శ్రీ మాతారవింద యుగం సువర్ణయుగమే. సువర్ణము అతిమానసిక తత్త్వానికి ప్రతీకము. అన్ని రంగాలలోను సామరస్యము కుదురును. మత సామరస్యం, ఆర్థికసామరస్యం కుదురును, హైందవులకు రామరాజ్యమనీ, క్రైస్తవులకు ద్వితీయ క్రైస్తు ఆగమనమనీ, మహమ్మదీయులకు మెహిదీ ఇమాము ఆగమనమనీ మనము వినియున్నాము. అతి మానసిక సువర్ణయుగమే భిన్న భిన్నమతాలలో భిన్నభిన్న నామములతో వర్ణింపబడ్డది. ఒక సాధకుడు శ్రీ మాతను ఒక మాసిక పత్రికకు పేరు పెట్టమని ప్రార్థించగా శ్రీ మాత 'సువర్ణయుగము' (The Golden Age) అని నామకరణం చేశారు. సామ్యవాద

సువర్ణయుగం ఒక ఆంశికయుగమే. ఏ సువర్ణయుగానికైనా ఆధ్యాత్మిక అభివృద్ధి తప్పక అవసరము. శ్రీ మాతారవిందులు ఒక సువర్ణయుగానికి లేక సత్యయుగానికి నాంది పలికినారు.

*　　*　　*

## కృతజ్ఞతలు

ఈ సంపుటమునకు 'తొలిపలుకు' వ్రాసిన డా॥ దువ్వూరు జగన్నాథరెడ్డి (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపకులపతి) గారికి మా కృతజ్ఞతలు.—

ఇందులోని రచనలు చదివి, సవరించడంద్వారా సహృదయంతో సహకరించిన సంజీవరావుగారికీ, ముద్రణాలయానికి సంబంధించిన పనులలో చాలా సహాయపడిన కె. జితేందర్ రెడ్డిగారికీ నా కృతజ్ఞతాభినందనలు.

—వి. మన్‌మోహన్ రెడ్డి

# విషయ సూచిక



1వ భాగము

## శ్రీ మాతారవిందుల అమృతవాణి



2వ భాగము

## శిష్యుల రచనలు

# భారతీయ సంస్కృతి-దాని పురావైభవం భవితవ్య నిర్దేశకములు

మూలం : శ్రీ అరవిందులు  అనువాదం : ఎ. రమాపతిరావు

## నాగరికత - సంస్కృతి : వాటి ఆదర్శము

ఈ ప్రపంచంలో మానవుని ఇహపరమార్థం నిజమైన సంతోషాన్ని అనుభవించడమే. అటువంటి ఆనందం దేహ, మనోబుద్ధుల ద్వారా జీవితంలో సాక్షాత్కరింప జేసుకొనే పరిపూర్ణతపై ఆధారపడి ఉంటుంది. ఎ నాగరికత యొక్క విలువైనా, అది ఇటువంటి ఆనంద పరిపూర్ణ జీవిత సాధనకారి ఎంతవరకు కాగలిగింది. బాహిరంగా ఏం ప్రవచిస్తున్నది. ఎట్లా గమిస్తున్నదీ అన్నవాటిపైనే నిర్ధారణ చేయగలుగుతాము. అంతేకాక ఏ యే సూత్రాలు, ఆదర్శాలు, రూపావిష్కృతులు జీవన పథాలు, ఆ పరిపూర్ణతను ఏట్లా సాధిస్తున్నాయి. ఆ పరిశ్రమలో ఎట్లా దోహదకారు లవుతున్నాయి అన్న విషయాలపైనే అ నాగరికత పరిశీలించ బడుతుంది. ఈ లక్ష్యాన్ని చేరుకొనేందుకుగాను, ఆ నాగరికత ఆధునిక ఐరోపీయ నాగరికతలాగా, భౌతికం కావచ్చు. విశేషించి గ్రీకు-రోమను నాగరికతలాగా, మానసికము, బౌద్ధికము కావచ్చు. లేదా నేడు కూడా కాలూని నిలువదొక్కుకున్న ఆధ్యాత్మిక పరిపూర్ణమైన భారతీయ నాగరికత కావచ్చు. భారతీయుని ప్రధాన భావన ఎప్పుడూ అనంతమైన వస్తువే. చైతన్యం పదార్థంలో నిక్షిప్తంగా ఉండి, వికసనం పొందుతూ మానసిక మానవుణ్ణి అధిగమించి ఆదర్శ ప్రపంచంలో అడుగిడి అంతశ్శుద్ధి నిరూపించే నీతిగా, అంటే ధర్మంగా పరిగణన పొందుతున్నది. అచేతన పదార్థంపై సాధించిన యీ ఉత్కర్ష. విజయం, క్రమక్రమంగా విస్తరిస్తూ, మానవుణ్ణి మనోధర్మాన్ని మించిన శుద్ధ చైతన్య స్వరూప సాక్షాత్కారానికి సంసిద్ధుణ్ణి చేసింది.

భారతీయ సాంఘిక వ్యవస్థ. ఈ భావనపైననే నిర్మించబడింది. భారతీయ వేదాంతం రూపించేది ఇదే. మతం ఆశించేది ఆధ్యాత్మిక చైతన్యాన్ని. అది అందజేసే ఫలితాలను; భారతీయమైన కళలు; సాహిత్యం కూడా ఆ అగ్రేసర

మైన దృష్టినే కలిగివుంటాయి. భారతీయమైన సర్వధర్మాలు, చివరకు అస్థిత్వం కూడా దీనిపైనే నిర్మితమైనాయి.

అభ్యుదయాన్ని భారతదేశం కూడా ఆకాంక్షిస్తుంది. అయితే ఆధ్యాత్మికాభ్యున్నతినే. అంతేకాని బాహిరమైన కేవలం భౌతిక అభ్యున్నతితో కూడిన నాగరికతను కాదు. ఉన్నతమైన ఆదర్శంమీద భారతీయ జీవనవిధానం రూపొందింది. అదే ఈ దేశపు నాగరికత ప్రత్యేకత. మానవీయమైన లోపాలెన్ని ఉన్నప్పటికీ, ఆ ఆదర్శంపై ఉన్న విశ్వాసమే ప్రపంచంలో భారతీయాత్మను ప్రత్యేక సంస్కృతిగా, నాగరికతగా, భారతజాతిని విశిష్ట జాతిగా దిద్ది తీర్చింది.

## మూడు విధాలుగా వ్యక్తీకరణ

త్రివిధాలుగా వ్యక్తమయ్యే జీవన చైతన్యంయొక్క వ్యక్తీకరణగా ఒక జాతి నాగరికతను స్థూలంగా వర్ణించవచ్చు. ఒక భాగంగా ఆలోచన, ఆదర్శం, పురోగామిత, ఆత్మదిదృక్ష, ఇంకొక భాగంగా సృజనాత్మకమైన స్వయంవ్యక్తీకరణము, శ్లాఘ్యమైన సౌందర్య వివేచనం, శేముషి, భావుకతగాను, ఇంకొక భాగం సాచరణీయమైన బాహిర ప్రవృత్తిగాను ఉంటాయి. ఒక జాతి తాత్త్విక చింతన, విశాల దృక్పథాలు, దాని విశుద్ధ ఆత్మను, జీవిత చైతన్యపు రూపురేఖలను, అస్థిత్వపు చైతన్యాన్ని నిరూపిస్తాయి. ఆ జాతి మతం అది సాధించుకున్న ఉన్నతాదర్శాలను, చేరవలసిన ఉన్నత లక్ష్యాలను, ఆత్మకాంక్షలను వెల్లడిస్తుంది. దాని కళలు, కవిత్వం, సాహిత్యం, సృజనాత్మకమైన దాని భావుకతను, వ్యక్తీకరణను, శేముషిని వ్యక్తపరుస్తాయి. దాని సంఘము, రాజకీయాలు, బాహిరమైన ప్రవత్తులను, అది సాధించదలచుకొన్న ఉన్నత లక్ష్యాలను, ఏ విధమైన కష్టనిష్ఠూరాలమధ్య, చిక్కులమధ్య, కొనసాగిస్తున్నదో రూపొందిస్తాయి. జడ జీవనం నుంచి, సాధ్యమైనంతమటుకు, అంతర్ముఖత్వం వేపు ఏ విధంగా పయనిస్తున్నదీ తెలుసుకోవచ్చు. సంఘంకాని, రాజకీయాలుకాని, మరే ఇతర విషయాలుగాని వాటంతట అవి అంతసూత్రాన్ని వ్యక్తీకరించలేవు కాని, దాని మంచే అవి తమ సంస్కృతీ లక్షణాన్ని పంతరించుకుంటాయి. సమాహారంగా అవి దేహ మనః ప్రాణాలుగా రూపొందుతాయి. భారతీయ నాగరికతలో మతమూ, వేదాంతము పరస్పర పోషకాలుగా పరిఢవిల్లాయి. మతంవల్ల తత్త్వ

చింతన చైతన్యవంతమైంది. తాత్త్విక చింతనవల్ల మతం ప్రకాశించింది. శక్తి నవాటి కన్నిటికీ ఈ రెండూ మార్గదర్శకత్వం వహించాయి. అవి స్వశక్త్యానుసారంగా వీటిని అనుసరించాయి.

ఆసియా ఖండ జనులలో భారతీయజాతి విశిష్టత నాపాదించిన ప్రధాన లక్షణం ఇదే. అభ్యున్నతి సాధించిన ఆసియా జాతీయజీవనంతో భాగస్వామ్యం వహించిన యీ విశిష్టత, అయితే అతివ్యాప్తిని పొందింది క్రమంగా దానిని వైదిక నాగరికతగా భావిస్తే అది సార్థకమే. అయితే బ్రాహ్మణాధిక్యతను నిరూపించేదిగా చెప్పకూడదు. పురోహితుల ప్రాబల్యం, సంస్కృతి తక్కువ స్థాయిల్లో కొంత ప్రాబల్యం వహించక పోలేదు కాని, సంస్కృతి పారమ్యాన్ని వాళ్ళు కాదు రూపించింది. అయితే తత్త్వదర్శనులైన, మతావిష్టులైన మహాను భావులచే యీ సంస్కృతి రూపొందింది వాళ్ళంతా కూడా బ్రాహ్మణజన్మ ఎత్తిన వాళ్ళేమీ కాదు. బ్రాహ్మణవర్ణమనేది, న్యాయంగా, యీ సంస్కృతీ పరి రక్షణకు, ఆత్మ సముద్ధరణ ప్రయత్న ప్రచారాలకు, ధర్మ ప్రాచుర్యానికీ మాత్రమే ఉద్దేశింపబడింది. కాని కర్మాచరణను కొనసాగించే పౌరోహిత్య వ్యాపకానికి కాదు. దాన్ని వ్యాపారంగా ఎంత మాత్రమూ ఉద్దేశించలేదు. అయితే వేల సంవత్సరాలుగా జాతీయమైన సమస్తాన్నీ పరిరక్షించుకొంటూ, అంతేకాని సంపూర్ణాధిపత్యం వాళ్ళకు మాత్రమే లేదు, రావడమనేది, ఒక వైలక్షణ్య సూచకంగా మాత్రమే గ్రహించాలి. దీనిలోని అంతరార్థం ఏమి టంటే. భారతీయ నాగరికత, ఆదినుంచీ కూడా ఆధ్యాత్మికమై, అంతర్ముఖత్వం గల మత తాత్త్విక సంస్కృతిగానే ఉంటూ వచ్చింది అన్న విషయం.

## భారతీయ వేదాంతం కేవలం పారలౌకికమా?

భారతీయవేదాంతం ప్రకృతిని విస్మరించి దనడం పూర్తిగా సత్యదూరమే కాక, ఉజ్జ్వలమైన భారతీయ నాగరికతను అర్థం చేసుకోకపోవడమే. ప్రకృతి అంటే భౌతిక ప్రకృతిగా అర్థంచేసుకొంటే, ఆధునిక యుగారంభానికి పూర్వం శాస్త్రీయమైన పరిశోధనలు భారతదేశంలోవలె విజయవంతంగాను, ఏకైకంగాను జరిగిన దేశమే లేదు. చరిత్రలో ఇది పూర్తిగా నిరూపణమైన అంశం. భార తీయ చారిత్రకులు, శాస్త్రవేత్తలు మిక్కిలి కృషిచేసి యీ సత్యాన్ని స్థాపించారు.

యూరోప్ మనీషులు తులనాత్మక అధ్యయనం ద్వారా ఇదే విషయాన్ని అంగీకరించారు. భారతదేశం గణితశాస్త్రంలో మాత్రమేకాక, ఖగోళశాస్త్రం, రసాయన శాస్త్రం, వైద్యం, శస్త్రచికిత్స, భౌతిక శాస్త్రపు వివిధ శాఖలలోను అగ్రేసర స్థానం వహించింది. అంతేకాకుండా గ్రీకులతో సరిసమానంగా అరబ్బులకు అధ్యాపకత్వం వహించింది. అరబ్బులనుంచే యూరోపు శాస్త్రీయ పరిశోధనల పట్ల అసక్తిని నేర్చుకొని, అధునిక శాస్త్రీయ విజ్ఞానానికి ప్రాతిపదిక నేర్పరుచుకొంది. అనేక మార్గాలలో భారతదేశం ఆచార్యత్వం వహించింది. అనేక అన్వేషణలలో ముందంజ వేసింది. కొట్టవచ్చినట్లుగా కన్పించే రెండు ఉదాహరణలను పరిశీలిద్దాము. ఇటువంటివి బహుసంఖ్యాకంగా ఉన్నాయి. ఒకటి గణితశాస్త్రంలో దశాంశ పద్ధతిని ప్రవేశపెట్టడం. రెండోది ఖగోళశాస్త్రంలో భూమి చలిస్తున్నదన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం. 'చలపృథ్వీ స్థిరభాతి' — భూమి చలిస్తూకూడా స్థిరంగా కనపడుతున్నదని, భారతీయ శాస్త్రవేత్త గెలీలియో కన్నా శతాబ్దుల పూర్వమే ప్రతిపాదించాడు. కేవలం ఆదిభౌతికమైన ఆలోచనలతోనే కొట్టుమిట్టాడుతూ ఉన్నట్లయితే, ఇటువంటి మహత్తర విషయాలను భారతీయ శాస్త్రవేత్తలు, పండితులు, మేధావులు ఎప్పటికీ ప్రతిపాదించ గలిగివుండేవారు కారు. ప్రకృతిని చక్కగా అధ్యయనం చేయగలిగినందువల్లనే వారిటువంటి మహత్తర విషయాలను కనుక్కోగలిగారు. భారతీయ మేధాసంబంధి అయిన ప్రత్యేకాంశం ఏమిటంటే, జీవితంపట్ల సన్నిహితమైన దృక్పథం, సూక్ష్మాంశ విషయకంగా కూడా శ్రద్ధాసక్తులు, ప్రతి జీవితశాఖను శాస్త్రీయంగా, క్రమబద్ధంగా, నియమానుసారంగా దిద్ది తీర్చడం. అందువల్ల శాస్త్రీయప్రవృత్తి పట్లనే అధికమైన శ్రద్ధ చూపుతున్నట్లవుతున్నదే కాని, అగమ్యము, అగోచరము అయిన ఆదిభౌతిక ప్రవృత్తిపట్ల సమ్మోహితం భారతీయ ప్రవృత్తి అనటం పొసగదు. భారతీయ సంస్కృతి, ఆధిభౌతిక విషయాలపట్ల మాత్రమే సమర్థమనటం చెల్లదు.

## వైరాగ్య లక్షణం

అంతో ఇంతో నివృత్తి దృక్పథం లేకుండా ఏ సంస్కృతీ పరిపూర్ణతను సాధించలేదు. నివృత్తి అంటే వైరాగ్యం. నిస్వార్థమేకాక, స్వార్థాన్ని జయించటం కూడా అవుతుంది. వీటివల్ల తక్కువ స్థాయి వికారాలను, కామనలను

అదుపులో పెట్టి మానవుడు స్వతఃసిద్ధమైన ఉన్నతికి చేరుకుంటాడు భారతీయుల విరాగం సంతాపకరమైన, దుఃఖోపశమన సంబంధి అయిన సందేశం కాదు. శరీరాన్ని కృశింపచేసుకొనే శుష్క తపస్సు కాదు. ఆత్మానందోపలబ్ధికై చేసే మహత్తర ప్రయత్నం. తనను తాను జయించే గొప్ప ఆనందము, అంతకన్నా ఎక్కువైన అఖండమైన అంతశ్శాంతి, పరమమైన ఆత్మోజ్జీవనము, దాని అనుభూతిలో సంలీనమై ఉన్నాయి. ఇంద్రియ సౌఖ్యాలపట్ల, ప్రాపంచిక వ్యవహారాలపట్ల మిక్కిలి ఆసక్తి చూపుతూ, అంతూ పొంతూలేని ప్రయత్నాలతో అస్థిర సౌఖ్యాలపట్ల వ్యామోహితులయ్యే వాళ్ళు తప్ప, ఎవ్వరూ వైరాగ్యానుభూతిని, దాని పరమాదర్శాన్ని, పరమ ప్రాప్యస్థితిని తృణీకరించరు. అయితే అన్ని ఉత్తమాదర్శాలలోను కొన్ని వైపరీత్యాలు, పథభ్రష్టతలు తప్పవు. అటువంటి దుస్సాధాలైన ఆదర్శాలను చేరుకొందామని కొందరు బాధలకు గురికావచ్చు. అప్పుడు సన్యసించడమనేది అర్థం పర్థంలేని శరీర శోషణంగాను, స్వాభావిక ప్రవృత్తులను క్రూరంగా అణచివేయడంగాను, దౌర్బల్యంతో యథార్థస్థితినుండి పలాయనం సాగించడంగాను, అసహనంతో జీవిత సమస్యల నుంచి తప్పుకోవడంగాను, విధ్యుక్తమైన మానవత్వ బాధ్యతలనుంచి పెడ మోహంతో వెనక్కుపోవడంగానూ కొన్ని సందర్భాలలో పరిణమించవచ్చు. ఉత్తమాధికారులైన ఏ కొద్దిమందో కాక, అందరికీ దాన్ని బోధించడం, అందరూ దానిని ఆచరించే ప్రయత్నం చేయడం, దాని విలువలను కొంతవరకు దిగజార్చి ఉండవచ్చు. అందువల్ల కపటుల సంఖ్య ఎక్కువై జాతి జీవచైతన్యం కలుషితమై అభివృద్ధి కుంటుపడటం జరుగుతుంది. భారతదేశంలో అటువంటి అవాంఛనీయ ఫలితాలు, లోపాలు లేవనుకోనే యత్నం నిష్ప్రయోజనం.

వైరాగ్యమే పరమార్థ సాధనోపకరణమని నే నంగీకరించను. మానవ అస్తిత్వ సంబంధి అయిన సమస్య లన్నిటికీ అది మాత్రమే పరిష్కారాన్ని చూపగలదనీ చెప్పలేము. అయితే దీనికి పూర్తిగా వ్యతిరేకమైన పాశ్చాత్య నాగరికతలోని విపరీత ధోరణులకంటె, భారతీయ నాగరికతలోని వైపరీత్యాలే మెరుగు. ఎందుకంటే, వైరాగ్యంలో ఈ అతివ్యాప్తిదోషం వెనుక కూడా, ఉన్నతమైన భావాలే చోటు చేసుకున్నాయి.

# ఆత్మప్రాధాన్య జీవితదృష్టి

భారతీయ నాగరికత జీవితపు విసువలను చిన్న చూపు చూస్తుందనుకోవటం పొరపాటు ఇహ సంబంధమైన ఆసక్తులపట్ల దృష్టి నిలపదనుకోవడం కూడా తప్పు. తాత్కాలికము, క్షణికము, అప్రధానము అని బోధిస్తుందనడం కూడా అవిచారమే. ఇటువంటి ఐరోపేయ వ్యాఖ్యానాలు చదువుతుంటే, ఎవరైనా భారతీయ చింతనలో బౌద్ధ దర్శనాలు ప్రతిపాదించిన నిస్పృహవాదమో, శంకరులు ప్రతిపాదించిన మాయావరణ అద్వైతవాదమో తప్ప వేరేమీ లేదని, కళ, సాహిత్యము, సామాజిక దృక్పథాలు అన్నీ, పై తత్వాల ప్రతిస్పందనలేనని, ప్రాపంచిక నశ్వరత్వాన్ని బోధించేవి మాత్రమేనవీ అనుకొంటారు. యూరోపులో సామాన్యంగా ఇటువంటి అభిప్రాయాలే ప్రాచుర్యం పొందాయి. కాని భారతీయ తత్త్వచింతన ఇదికాదు. ప్రాచీన భారతీయ నాగరికత ప్రధానంగా నాలుగు విషయాలపై రూపొందింది. ఆ నాలుగు మానవీయ ఆసక్తులపై ఆధారపడినవే. మొదటిది కాంక్ష, ఆనందము, రెండు భౌతిక, ఆర్థికాది దేహ మనోనుకూల వ్యాపారాలు. మూడోది నీతిప్రవర్తన, వైయక్తిక, సామాజిక నియమ సూత్రాలు, నాలుగోది ఆత్మముక్తి. ఇవే కామ, అర్థ, ధర్మ, మోక్షాలు. నాగరికత, సాంఘిక వ్యవస్థ యీ విషయాలను మానవుడు సాధించేందుకు మార్గదర్శకాలై, సహాయపడి, పరిపూర్ణతను రూపొందించాలి. ప్రాపంచికమైన మూడు పురుషార్థాలుగా ముందుగా సాధించమనే చెపుతున్నారు. ఎక్కడో అపవాదంగా తప్ప, యీ మూడు పురుషార్థాల సాధనతో, సంతృప్తిని పొందిన తరువాతనే, నాలుగవదాన్ని గూర్చి ఆలోచించాలి. కుటుంబంపట్ల, దైవంపట్ల, సమాజంపట్ల, తమ ఋణాన్ని తీర్చుకోవాలి ప్రతి వ్యక్తీ అనే ధర్మశాస్త్రాలు చెపుతున్నాయి. స్వర్గసుఖాలు, పరబ్రహ్మ సాక్షాత్కారము, కోరుకో దగ్గవే అయినా ఇహ జీవితం ఏమంటవలెనని అనలేదు. ఆశ్రమ వాటికలకు, గుహలకు, ప్రతివాడూ పరిగెత్తిపోవాలని ఎక్కడా చెప్పబడలేదు.

సర్వాంగ శోభితమైన ప్రాచీన భారతీయ జీవితాన్ని, అత్యంత వైవిధ్య భరితమైన సాహిత్యాన్ని చూసినప్పుడు, పారలౌకిక దృక్పథమే ప్రధానమనటం పొసగదు. సంస్కృత సాహిత్య బాహుళ్యత అంతా మానవజీవితంతో పెనవైచుకొని ఉన్నది. అయితే, ఏవోకొన్ని మత, దార్శనిక గ్రంథాలు ప్రాపంచిక

అనభిముఖతను బోధించేవి లేకపోలేదు. ఇవైనా ప్రాపంచిక సత్యాలను నిరసించ లేదు. భారతీయ చింతన ఆధ్యాత్మిక విముక్తికి అత్యంత ప్రాధాన్యం ఇచ్చిం దంటే, నిశ్చయ హేతువాదు లేమన్నప్పటికీ, ఆత్మవిముక్తి పరమప్రాప్యమే అయినప్పటికీ, కేవలం దాని యందు మాత్రమే శ్రద్ధవహించలేదు. దీనితోపాటు సమానంగా నీతిశాస్త్రం, న్యాయ, రాజకీయ, సామాజిక శాస్త్రాలపట్ల, వివిధ శాస్త్రీయ విషయాలపట్ల, కళలు, శిల్పంపట్ల, మానవజీవితంతో సంబంధం ఉన్న సర్వవిషయాలపట్ల దృష్టిబరపింది. చాలాలోతుగానూ, సూక్ష్మంగాను ఈ విషయా లను పరిశీలించింది. వాటిని గురించి అధికారికంగానూ, విజ్ఞానంలోనూ గ్రంథాలు సృష్టించింది. రాజకీయ పరిపాలనా దౌరంధర్యానికి ఎంత గొప్ప ఉదాహరణ శుక్రనీతి. గొప్ప సువ్యవస్థితమైన, సాచరణీయమైన నాగరికతకు దర్పణ ప్రాయంగా ఉన్నదది. భారతీయ కళ కేవలం మత సంప్రదాయ సంబంధ మైనదే కాదు. అట్లా అనుకోవలసి రావడం ఎందుకంటే, ఆలయాలలోను, గుహారామాలలోనూ మాత్రమే, అత్యంత దీప్తిని పొందిన ఆ కళ నిలిచి ఉండడంవల్ల. ప్రాచీన సాహిత్యంలోని దాఖలాలవల్లా, రాజపుత్ర, మొగల్ చిత్రకళను బట్టి, దేవతాలయాలు, మఠాలు, తత్సంబంధమైన ప్రేరణలు ఎటు వెంటి స్థానాన్ని పొందాయో, అట్లానే రాజాస్థానాలు, పట్నాలు, సాంస్కృతి కాదర్శాలూ కూడా చోటు చేసుకొన్నట్లుగా తెలుసుకోవచ్చు. ఆధునిక కాలంలో ప్రాచుర్యం పొందిన ఏ విద్యా విధానానికన్నా కూడా, ప్రాచీన భారతీయ విద్యా విధానం, ముఖ్యంగా స్త్రీ విద్యకూడా, పురుషుల విద్యతో పాటు సమస్థాయిగా, సంపూర్ణంగా, బహుముఖంగా, సుసంపన్నంగా ఉండేది. ఈ విషయాలు తెలుసు కోవాలన్న నిజమైన జిజ్ఞాస ఎవరికైనా ఉంటే, తెలిపే నిదర్శన పత్రాలు ఇప్పుడు లభ్యమవుతున్నాయి. అందువల్ల, ఆచరణ యోగ్యంకానిదనీ, ఆది భౌతిక దృష్టిమాత్రమే ప్రధానమని, చలన రహితమని, నిర్వీర్యమని మొదలైన లక్షణాలను అంటగట్టే చిలుక పలుకులకు స్వస్తిచెప్పి, సత్యమైన అర్థం చేసు కొని ప్రయత్నంతో కూడిన అంచనాకు రావాలి. అయితే భారతీయ సంస్కృతి, ఐహికమై అన్ని విషయాలకు అతీతంగానే మానవుడి పరమాదర్శాన్ని నిలిపిం దనటం సత్యమే. మానవ ప్రయత్నానికి పరమలక్ష్యంగా బహుకష్టతరమైన స్వార్థత్యాగాన్ని నిలిపింది. దీని దృష్టిలో బాహ్యమైన అధికారాలు, సుఖ సంతోషాల కంటే, ఆధ్యాత్మిక జీవితమే శ్రేష్ఠమైనది. కర్మాచరణశీలి కన్నా, చింతనశీలి గొప్పవాడు. చింతనశీలికన్నా ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నుడు శ్రేష్ఠుడు.

ప్రాపంచికమైన, భౌతికమైన సుఖసంతోషాలపట్ల ఆసక్తికన్నా భగవంతుని యందు స్వాత్మార్పణం చేసుకొన్నవాడు పరిపూర్ణుడు. ఇక్కడే విలక్షణమైన పాశ్చాత్య ప్రవృత్తికి, భారతీయ ప్రవృత్తికి గల ప్రధాన భేదం గోచరిస్తుంది. పాశ్చాత్యులు మతదృష్టిని సముపార్జించుకొన్నారే కాని స్వాభావికంగా స్వాయత్తం చేసుకొన్నవారు కారు. ఈ తెచ్చిపెట్టుకొన్న దాంట్లో ఎప్పుడూ ఏదో శిథిల బంధం ఉంటూనే ఉంటుంది. భారతదేశం ఎప్పుడూ మన కళ్ళముందు కనపడే యీ ప్రపంచంకన్నా, ప్రాప్యమైన లోకమేదో ఉన్నదన్న విశ్వాసంతోనే ఉంది. ఈ ప్రపంచం దాని దృష్టిలో అప్రధానమైనదే. మనోబుద్ధ్యహంకారాల కన్నా పరమమైన ఆత్మపదార్థాన్ని మానవుడిలో దర్శించగలుగుతూనే ఉన్నది. సమీప స్వర్గంగానే ఉన్న అనంతత్వం ముందు మోకరిల్లుతూనే ఉన్నది. సమాధ్యవస్థలోనే దివ్య సాక్షాత్కారం కొరకు ప్రయత్నిస్తూనూ ఉన్నది. అద్భుతమైన గాయకుడు. శ్రీమాత భిక్షుడు అను వంగకవి ఏమన్నాడు.

ఎంతసారవంతమైన యీ భూమిని
బీడుగా వుంచాడు మానవుడు
దీన్ని కృషియోగ్యం చేసినట్లయితే
బంగారు పంటలే పండించేవాడు.

ఈ వాక్యాలు సరియైన భారతీయ భావనను ఆవిష్కరిస్తాయి. ఈ భూమిమీద మానవుడు మాత్రమే పొందగల దివ్యమైన ఆధ్యాత్మిక అనుభవాలపట్లనే అది ఆకర్షితమైంది. ప్రాచీనార్య సంస్కృతి ఇటువంటి సంభవాలను గుర్తించింది. అయితే తాత్కాలికంగా చాతుర్వర్ణ్య వ్యవస్థను రూపించి, ఈ ఆధ్యాత్మిక శక్తులను దాని కలితమైన స్థితిలోనే నిలిపింది. బౌద్ధమతం తొట్టతొలుతగా వైరాగ్యానికి, చైత్యాలలో జీవితానికి, అతి ధోరణి కల్పించి, వర్ణ వ్యవస్థ ద్వారా ఆశించిన ఫలితాలకు, ఆ సంధియుగంలోనే భంగం వాటిల్లజేసింది. బౌద్ధ మత ప్రాభవంవల్ల, రెండు వర్గాలు మాత్రమె మిగలడం జరిగింది. గృహస్థు, సన్యాసి. ఆచార్య పురుషుడు, సామాన్యుడు. ఈ బౌద్ధమత ప్రభావం నేటికి కూడా భారతదేశంలో కనపడుతూనే ఉన్నది. అకర్మణ్యతను బోధించి, శక్తిని సంకరించేసి, జాతిని నిర్వీర్యం చేసిన బౌద్ధమతం, అందువల్లనే కాబోలు విష్ణుపురాణంలో తీవ్రనిరసనకు గురిఅయింది. అయితే బౌద్ధమతంవల్ల కూడా కొంతమేలు జరగకపోలేదు. ఒక కొత్త వెలుగును, ఒక కొత్తఅర్థాన్ని,

నీతిని, ఆదర్శమైనశక్తిని, జీవితంపట్ల, కర్మణ్యత్వంపట్ల, ప్రసాదించకపోలేదు. అటు తరువాత శంకరుల మాయావాదం వచ్చింది. అప్పటికే హిందూ సంస్కృతిలో రెండు మహర్దశలు సమాప్తి నొందాయి. శంకరుని మాయావాదం వచ్చిన తరువాత, జీవితం వికృతి అని, బుద్బుద ప్రాయమని, భ్రమ అనీ, కోరుకో దగ్గది కాదనీ ప్రచారం వచ్చింది. అయితే ఈ వాదం, సర్వజనాంగీకారం పొందకపోవడమేకాక, శంకరుడు ప్రచ్ఛన్న బౌద్ధుడుగా కూడా ఆయన ప్రతిపక్షులచే నిరసించబడ్డాడు. అనంతర కాలంలో మాయావాదానికి బలం వచ్చిందికాని, సామాన్యాభిప్రాయము, బహు జనాంగీకారము, దానిచేత ప్రభావితం కాలేదు. అటు తరువాత భక్తిమార్గాలు ప్రాచుర్యానికి వచ్చాయి. మాయావాదాన్ని పూర్తిగా తొలగ ద్రోయలేకపోయినా, భక్తిమార్గాలు దివ్యాదర్శాలను, మానవుని చేరువకు తెచ్చాయి. ఇటీవలనే శంకరుని మాయావాదాన్ని గూర్చిన సరి అయిన అవగాహన కలుగుతూ వచ్చింది. ఇప్పుడిప్పుడే సమన్వయ దృక్పథంతో, మనస్సు, చైతన్యము, పదార్థము, వాటి పరస్పర సంబంధము గూర్చిన అవగాహన కలుగుతున్నది. అయినప్పటికీ ఒకప్పుడు ఏదైతే ఉత్తమోత్తమ ఆదర్శంగా వెలుగొందిందో, ఆ వైరాగ్యదర్శము, క్రమక్రమంగా మోయలేని బరువైన గోపురం, తక్కిన భవనాన్ని కృంగదీస్తున్నట్లుగా పరిణమించిందని చెప్పవచ్చు.

## భారతీయ వాస్తుకళ

ప్రాచీన భారతదేశపు దివ్యసౌధాలు, సభాభవనాలు, సత్రాలు, కాలగర్భంలో కలసిపోయినాయి. కొన్ని కొన్ని మహాపర్వతాలలోను, గుహలలోను దేవాలయాలు మిగినాయి. జనపదాలలోని కొన్ని ప్రాచీన దేవాలయాలూ మిగిలాయి. ఇక మగిలినవి అనంతరకాలంలో నిర్మాణమైన దేవాలయాలు, మఠాలు, ఆరామాలు మొదలైనవి. ఇవి యాత్రాస్థలాలు, దేవాలయ నగరాలు అయిన శ్రీరంగం, రామేశ్వరం మొదలైన చోట్లనూ, మహావైభవాన్ననుభవించిన మధుర వంటి పట్నాల్లోనూ దర్శనమిస్తాయి. దేవాలయం జీవితానికి కేంద్రంగా ఉండే రోజుల్లో ఇవన్నీ నిర్మాణమై ఉంటాయి. పౌరాణికమైన, మత సంబంధమైన నిర్మాణాలే అవన్నీ. ఈ పవిత్రమైన కట్టడాలన్నీ వాస్తుశిల్పాభిరామాలుగా, సనాతన ఆధ్యాత్మిక, మత సంస్కృతులకు చిహ్నాలుగా నిలిచినవే.

మత సంబంధమైన, ఆధ్యాత్మిక సంబంధమైన లక్షణాలను విడిచిపెట్టి, ఆగమ సంబంధమైన సాంకేతిక విషయాలను మరచిపోయి, హేతుబద్ధంగాను, మత ప్రమేయం లేకుండాను, సౌందర్యదృష్టితోను, మాత్రమే వీటిని దర్శిస్తే, వివేచనాత్మకమైన, సత్యసుందరమైన అవగాహన మనకు కలుగుతుం దనుకోవడం అసంభవం. మతప్రాబల్యం అనగానే, ఐరోపా మతాలదృష్టి, మధ్యకాలపు క్రైస్తవ మతదృష్టికాదని గుర్తుంచుకోవాలి. మధ్యకాలపు క్రైస్తవ మతం కూడా ఇటీవల కాలంలో పునరుజ్జీవనం పొందినా, మత ప్రాబల్యంనుంచి తప్పుకొని సంస్కరించబడ్డకూడా, ఆ మతాలతో పోల్చి మన మతదృష్టిని పరిశీలించకూడదు. కళాత్మకమైన దృష్టితో భారతీయ వాస్తుశిల్పాలను సందర్శించేటప్పుడు, గ్రీకుల కట్టడాలనో, ఇటలీ దేశపు చర్చిలనో, గోపురాలనో, ఫ్రాన్సు దేశంలోని మధ్యకాలపు బురుజులు, దేవతాలయాలనో, మనసులోకి తెచ్చుకోవడం, న్యాయంగా భారతీయ ప్రవృత్తికి సన్నిహితంగా కొంతవరకు రాగలిగినా, విదేశకమైన, అపస్వరంతో కూడిన, ఒకానొక ప్రమాణాన్ని మనసులోకి రానీయడమే అవుతుంది. తెలిసో తెలియకో పాశ్చాత్యుల దృష్టి అంతా యీ క్రమానే అనుసరిస్తుంది. అందువల్ల అపరిమేయమైన దానిని పరిమిత దృష్టితో చూచే ప్రయత్నమన్న చెరుపు సంభవించింది.

భారతదేశపు పవిత్రమైన వాస్తుకళ, ఏ కాలానికి సంబంధించిందైనా, అత్యంత ప్రాచీనమైనది. భారతదేశంలో తప్ప ఇతర దేశాలలో ఒకప్పుడు వెలిగొన్నది యిప్పుడు పూర్తిగా లుప్తమైంది. హేతువాదు లొప్పరుకాని, అది నిరాబాధితంగా సాక్షాత్కరిస్తూనే ఉంటుంది. భవితవ్య స్వరూపం యిప్పటికే దర్శనమిస్తూ ఉన్నది. భారతీయ దేవాలయం, అది ఏ దేవుడికి ఉద్దేశించబడ్డా, అంతరాన్ని పరికిస్తే, దివ్యాత్మకోసం నిర్మించబడ్డ ఒక గద్దె. విశ్వాంతరాత్మ కోసం ఉద్దిష్టమైన భవనం, అనంతాత్మ కల్పన చేసుకొన్న నివాసం.

## భారతీయ శిల్పకళ, చిత్రకళ

ప్రాచీనమైన దేశాలలోనే శిల్పకళ మిక్కిలిగా వికసించింది. ఆ యా దేశాల్లో దానికి తగిన వాతావరణం, ప్రోత్సాహము ఉండేవి. ఈజిప్టు, గ్రీస్ మొదలైన దేశాలతో భారతదేశం యీ శిల్పకళలో అగ్రేసరస్థానం వహించింది.

ఇటీవల కనుక్కొనిన అతి పురాతన కళాఖండం క్రీ. పూ. 5వ శతాబ్దికి చెందినదని విశదమైంది. అంతకు పూర్వమే శిల్పవిద్య అత్యంతము ఉచ్ఛ దశను పొంది ఉండాలని దీనివల్లనే నిరూపణ మవుతున్నది. ఇటీవల కొన్ని శతాబ్దుల క్రితంవరకూ మహోన్నత దశలోనే ఉండేదని తెలుస్తున్నది. యుగ యుగాలుగా దివ్యమైన, భవ్యమైన శిల్పకళ ఇక్కడ విస్తరించింది. ఈ వికాసం జాతి జీవనంలోనే సార్థకత నాపాదించుకొన్నది. ఈ శిల్పకళ ఎన్నో మార్పు లకు లోనైంది. వేద, ఉపనిషత్తుల కాలంనాటి ద్రష్టల గంభీర భావాలను, పురాణాల యుగంలోని లాలిత్య, సౌందర్య భావాలను, మధుర గీతికల పార వశ్యాన్ని అనుసందిస్తూ వచ్చి వచ్చి క్షీణదశ నొందింది. క్షీణదశ నొందుతున్న యుగంలోకూడా పూర్తిగా నశించి, ఖిలమై, శూన్యమై పోకుండా, ఏదో కొంత మిగిలే ఉండేది. గ్రీకుశిల్పంలో భౌతిక సౌందర్యం పరిపూర్ణంగా కనపడు తుంది. అయితే అందులో ఆధ్యాత్మికమైన వాసనలు, లోతులు, మానసమేధ వాంఛించే పూర్ణవికాసము కనపడవు. ఈ అంశం చోటుచేసుకొని ఉండటమే భారతీయ శిల్పకళా పరమార్థాన్ని చాటి చెప్తున్నది. ఒలింపియా దేవత లందరూ ఒడ్డూ పొడుగూ, చక్కని అంగ సౌష్ఠవంకల బృహత్పరిమాణ మానవమూర్తులుగా కనపడతారు. కాని కొంత ప్రశాంతత, వర్చస్సు, దివ్య త్వము కనపడకపోవు. ఇక ఇతర శిల్పాలలో శూరులు, క్రీడాకారులు, సౌందర్య పరమావధులైన స్త్రీలు, శాంతి, సంయమన లక్షణాలు, భావోద్రేకాలు, మానవీయ ఆదర్శ సౌందర్యమంతా సాక్షాత్కరిస్తాయి. భారతీయ శిల్పకళలో మూర్తిమత్వం పొందిన దేవతలు విశ్వమూర్తులు, ఆధ్యాత్మిక శక్తి సమర్థ్య స్వరూపాలు. అంతఃస్వరూప ప్రతీకలు, శిల్పాకృతిలోని ప్రత్యంశం, ముఖం, చేతులు, భంగిమలు, అంగ నిర్మాణము, తీరు, ప్రతి అల్ప అల్పాంశంకూడా, అంతర్నిగూఢార్థ స్ఫోరకాలుగా ఉండి, తద్వ్యతిరేక్తములై నవన్నీ పరిహరించ బడి ఉంటాయి. అంతేకాని, బాహిరమైనకాని, సూచనాప్రాయంగాకాని, రూపు రేఖల్లోకాని, మానవమూర్తికి దూరంగా ఉంటాయి. అంతర్నిగూఢంగా మాన వునిలోని దివ్యత్వ స్వరూపా సాక్షాత్కారమే ఉద్దేశించి ఉంటుందికాని, భౌతిక మైన, మానసికోద్రేక పూరితమైన భావాలకు అందులో తావులేదు.

పురాతన కాలంనాటి మన చిత్రాలు బౌద్ధ చిత్రకారులు లిఖించినవి. అయితే చిత్రకళ మాత్రం బౌద్ధ పూర్వయుగానికి చెందిందే. చిత్రకళ వస్తువు

మత సంబంధమైన, ఆధ్యాత్మిక సంబంధమైన లక్షణాలను విడిచిపెట్టి, ఆగమ సంబంధమైన సాంకేతిక విషయాలను మరచిపోయి, హేతుబద్ధంగాను, మతప్రమేయం లేకుండాను, సౌందర్యదృష్టితోను, మాత్రమే వీటిని దర్శిస్తే, వివేచనాత్మకమైన, సత్యసుందరమైన అవగాహన మనకు కలుగుతుం దనుకోవడం అసంభవం. మతప్రాబల్యం అనగానే, యిరోపా మతాలదృష్టి, మధ్యకాలపు క్రైస్తవ మతదృష్టికాదని గుర్తుంచుకోవాలి. మధ్యకాలపు క్రైస్తవ మతం కూడా ఇటీవల కాలంలో పునరుజ్జీవనం పొందినా, మత ప్రాబల్యంనుంచి తప్పుకొని సంస్కరించబడ్డకూడా, ఆ మతాలతో పోల్చి మన మతదృష్టిని పరిశీలించకూడదు. కళాత్మకమైన దృష్టితో భారతీయ వాస్తుశిల్పాలను సందర్శించేటప్పుడు, గ్రీకుల కట్టడాలనో, ఇటలీ దేశపు చర్చీలనో, గోపురాలనో, ఫ్రాన్సు దేశంలోని మధ్యకాలపు బురుజులు, దేవతాలయాలనో, మనసులోకి తెచ్చుకోవడం, న్యాయంగా భారతీయ ప్రవృత్తికి సన్నిహితంగా కొంతవరకు రాగలిగినా, వైదేశికమైన, అపస్వరంతో కూడిన, ఒకానొక ప్రమాణాన్ని మనసులోకి రానీయడమే అవుతుంది. తెలిసో తెలియకో పాశ్చాత్యుల దృష్టి అంతా యీ క్రమాన్నే అనుసరిస్తుంది. అందువల్ల అపరిమేయమైన దానిని పరిమేయ దృష్టితో చూచే ప్రయత్నమన్న చెరుపు సంభవించింది.

భారతదేశపు పవిత్రమైన వాస్తుకళ, ఏ కాలానికి సంబంధించిందైనా, అత్యంత ప్రాచీనమైనది. భారతదేశంలో తప్ప ఇతర దేశాలలో ఒకప్పుడు నెలకొన్నది యిప్పుడు పూర్తిగా లుప్తమైంది. హేతువాదు లొప్పరుకాని, అది త్రికాలా బాధితంగా సాక్షాత్కరిస్తూనే ఉంటుంది. భవితవ్య స్వరూపం యిప్పుడిప్పుడే దర్శనమిస్తూ ఉన్నది. భారతీయ దేవాలయం, అది ఏ దేవుడికి ఉద్దేశించబడ్డా, ఆంతర్యాన్ని పరికిస్తే, దివ్యాత్మకోసం నిర్మించబడ్డ ఒక గద్దె. విశ్వాంతరాత్మ కోసం ఉద్దిష్టమైన భవనం, అనంతాత్మ కర్పణ చేసుకొన్న విజ్ఞాపన.

## భారతీయ శిల్పకళ, చిత్రకళ

ప్రాచీనమైన దేశాలలోనే శిల్పకళ మిక్కిలిగా వికసించింది. ఆ యా దేశాల్లో దానికి తగిన వాతావరణం, ప్రోత్సాహము ఉండేవి. ఈజిప్ట్, గ్రీస్ మొదలైన దేశాలతో భారతదేశం యీ శిల్పకళలో అగ్రేసరస్థానం వహించింది.

ఇటీవల కనుక్కొనిన అతి పురాతన కళాఖండం క్రీ.పూ. 5వ శతాబ్దికి చెందినదని విశదమైంది. అంతకు పూర్వమే శిల్పవిద్య అత్యంతము ఉచ్ఛ దశను పొంది ఉండాలని దీనివల్లనే నిరూపణ మవుతున్నది. ఇటీవల కొన్ని శతాబ్దుల క్రితంవరకూ మహోన్నత దశలోనే ఉండేదని తెలుస్తున్నది. యుగ యుగాలుగా దివ్యమైన, భవ్యమైన శిల్పకళ ఇక్కడ విస్తరించింది. ఈ వికాసం జాతి జీవనంలోనే సార్థకత నాపాదించుకొన్నది. ఈ శిల్పకళ ఎన్నో మార్పు లకు లోనైంది. వేద, ఉపనిషత్తుల కాలంనాటి ద్రష్టల గంభీర భావాలను, పురాణాల యుగంలోని లాలిత్య, సౌందర్య భావాలను, మధుర గీతికల పార వశ్యాన్ని అనుసంధిస్తూ వచ్చి వచ్చి క్షీణదశ నొందింది. క్షీణదశ నొందుతున్న యుగంలోకూడా పూర్తిగా నశించి, ఖిలమై, శూన్యమై పోకుండా, ఏదో కొంత మిగిలే ఉండేది. గ్రీకుశిల్పంలో భౌతిక సౌంధర్యం పరిపూర్ణంగా కనపడు తుంది. అయితే అందులో ఆధ్యాత్మికమైన వాసనలు, లోతులు, మానసమేధ వాంఛించే పూర్ణవికాసము కనపడవు. ఈ అంశం చోటుచేసుకొని ఉండటమే భారతీయ శిల్పకళా పరమార్థాన్ని చాటి చెపుతున్నది. ఒలింపియా దేవత లందరూ ఒడ్డూ పొడుగూ, చక్కని అంగ సౌష్ఠవంకల బృహత్పరిమాణ మానవమూర్తులుగా కనపడతారు. కాని కొంత ప్రశాంతత, వర్చస్సు, దివ్య త్వము కనపడకపోవు. ఇక ఇతర శిల్పాలలో శూరులు, క్రీడాకారులు, సౌందర్య పరమావధులైన స్త్రీలు, శాంతి, సంయమన లక్షణాలు, భావోద్రేకాలు, మానవీయ ఆదర్శ సౌందర్యమంతా సాక్షాత్కరిస్తాయి. భారతీయ శిల్పకళలో మూర్తిమత్వం పొందిన దేవతలు విశ్వమూర్తులు, ఆధ్యాత్మిక శక్తి సమర్థ స్వరూపాలు, అంతఃస్వరూప ప్రతీకలు, శిల్పాకృతిలోని ప్రత్యంశం, ముఖం, చేతులు, భంగిమలు, అంగ నిర్మాణము, తీరు, ప్రతి అల్ప అల్పాంశంకూడా, అంతర్నిగూఢార్థ స్ఫోరకాలుగా ఉండి, తద్వ్యతిరేక్తములై నవన్నీ పరిహరించ బడి ఉంటాయి. అంతేకాని, బాహిరమైనకాని, సూచనాప్రాయంగాకాని, రూపు రేఖల్లోకాని, మానవమూర్తికి దూరంగా ఉంటాయి. అంతర్నిగూఢంగా మాన వునిలోని దివ్యత్వ స్వరూపా సాక్షాత్కారమే ఉద్దేశించి ఉంటుందికాని, భౌతిక మైన, మానసికోద్రేక పూరితమైన భావాలకు అందులో తావులేదు.

పురాతన కాలంనాటి మన చిత్రాలు బౌద్ధ చిత్రకారులు లిఖించినవి. అయితే చిత్రకళ మాత్రం బౌద్ధ పూర్వయుగానికి చెందిందే. చిత్రకళ వస్తువు

కూడా భారతీయ శిల్పకళ లోతుల తూగేదే. ఆధ్యాత్మిక ప్రవృత్తి, దివ్య దర్శనము రెండింటా సమానమే. మానవ రూపావిష్కృతి విషయంలో మాత్రం, శరీరానికి సంబంధించిన అంగ నిర్మాణం, కండరాలు, మాంశపేశలత్వం మొదలైన అంశాలన్నీ వీలైనంత సంక్షేపం పొందుతాయి. లేదా వదలి వేయబడతాయి. రేఖలతోను, విస్పష్టమైన అకృతులలోను, సజీవలక్షణం ఉట్టిపడేటట్లు, తీర్చి దిద్దబడతాయి. మానవునిలో ఉన్న అంతస్సహజ లక్షణమైన దైవత్వమే ఆవిష్కరింప బడుతుందికాని, అవాంఛనీయము, అసహజము అయిన శారీరక తత్త్వం కాదు. ఇదే ధర్మం జంతువులు, భవనాలు, వృక్షాలు, వివిధ వస్తుజాతం మొదలైనవాటి చిత్రీకరణలో కూడా అనుసరించబడుతుంది. రంగు కూడా ఆధ్యాత్మికము, మానసికము అయిన పరమార్థాన్నే దృష్టిలో పెట్టుకొని ఉపయోగించబడుతుంది. ఈ విషయం బౌద్ధ ప్రతిమలలో ఉపయోగించిన వర్ణచ్ఛాయలను బట్టి తెలుసుకోవచ్చు.

## భారతీయ సాహిత్యం

ప్రపంచ ప్రసిద్ధి పొందిన సర్వసాహిత్యాలలోను, ఏ ప్రమాణాన్ని బట్టి చూసినా సంస్కృతభాషా, సాహిత్యాలకు విశిష్టమైన స్థానమున్నది. రాశినిబట్టి చూసినా, గుణాన్నిబట్టి చూచినా ప్రాచీనమైన సంస్కృత సాహిత్య సృష్టి అపూర్వము, అద్భుతము అయినది. సమర్థులైన వాళ్ళచే గుర్తించబడినట్లుగా, ఆ భాషయే సర్వాంగ పరిపుష్టమైనట్టిది. సమీచనమైనట్టిది. మహా గాంభీర్యంతో ప్రకాశిస్తున్నటువంటిది. ఏ జాతి సంస్కృతికి, నాగరికతకు, అది ప్రాతినిధ్యం వహిస్తున్నదో, ప్రకటన వాహికగా ఉపకరిస్తున్నదో, ఆ సంస్కృతి, ఆ నాగరికతల ఔజ్జ్వల్యానికి తగినట్టుగా ఉన్నది. దానికి తగ్గట్టుగానే మహాకవులు, తత్త్వవేత్తలు, దాని ప్రౌఢిని, పరిపూర్ణతను బాగా వినియోగించుకున్నారు. ఒక్క సంస్కృత సాహిత్యంలోనే కాదు. భారతీయ చింతన, సమగ్ర సుందరా విష్కృతులను రూపొందించింది. ఎక్కువగా సంస్కృత సాహిత్యంలోనే సమగ్ర సౌందర్యమూర్తులు ఆవిర్భవించినా, పాలీ భాషలోని బౌద్ధ సాహిత్యాన్ని, కావ్యాలను, ఇంకా ప్రాకృతాలను, ద్రావిడభాషలను గూడా పూర్తి అంచనాకు పరిగణనలోకి తీసుకోవాలి. ప్రాచీన, మధ్యకాలపు, ఆధునిక యూరోపులో వెలసిన అత్యున్నత కళాఖండాలకే మాత్రమూ ఇవి తీసిపోవు. జాతి, సంస్కృతికూడా విలువైన సంపదగా భావించే వాటిలో

వేదాలు, ఉపనిషత్తులు. మహోత్కృష్ట నిర్మాణాలైన మహాభారత, రామాయణాలు చేరి ఉన్నాయి. కాళిదాస, భవభూతులు. భర్తృహరి, జయదేవాదులు, సుసంపన్నాలైన ప్రాచీన నాటకాలు, కవిత్వం, ప్రయణగాథలు, ధమ్మపదం, జాతక కథలు, పంచతంత్రం, తులసీదాసు, విద్యాపతి, చండీదాసు, రామప్రసాద్, రామదాసు, తుకారామ్, తిరువళ్ళువర్, కంబన్, నానక్, కబీర్, మీరాబాయిల గీతాలు, దక్షిణ దేశపు శైవభక్తులు, ఆళ్వార్లు ప్రసిద్ధి పొందడం, వీళ్లకాక, వీళ్ళ రచనలుకాక, అశేష సంఖ్యలో ఎందరెందరో మహానుభావులు ఎన్నెన్నో ఉత్తమ సాహిత్యరూపాలు, భారతీయ వివిధ భాషల్లో దర్శించవచ్చు. దీన్నిబట్టి ఈ దేశం, ఈ జాతి ఉన్నతోన్నత నాగరికతను అనుభవించడం జరిగిందని చెప్పవచ్చు. ఈ జాతి జనులు మహోన్నత నాగరికతలమధ్య, అత్యంత పురోగామిత్వాన్ని ప్రదర్శించారని పరిగణించవచ్చు. మూడువేల సంవత్సరాల పూర్వమే ప్రారంభమైన యీ మహోచ్ఛదశ నేటికిన్ని మిణుకు మిణుకుమంటూ ఉండడం, అంతర్లీనంగా వున్న, జాతిలో జీర్ణించుకొని పోయిన ఒకమహాశక్తి ఈ సంస్కృతిలో ఉన్నదనడాన్ని నిదర్శనంగా చూడవచ్చు.

## సాంఘిక రాజకియ వికాసం

భారతీయ సంస్కృతి సాంఘిక రాజకీయ వికాసాన్ని, మనకు లభిస్తున్న ఆధారాలనుబట్టి, నాలుగు చారిత్రక దశలలో దర్శించవచ్చు. మొదటి దశ ఆర్యసంబంధి. అటు తర్వాత చాలాకాలం సంధికాలంగా ఉండిపోయింది. ఈ కాలంలో జాతిజీవనం అనేక ప్రయోగాత్మక రాజకీయ నిర్మాణాలకు గురి అయింది. చెప్పుకోదగ్గ మార్పులకు గురికావలసి వచ్చింది. అందులోనే సంశ్లేషణం కూడా జరిగింది. మూడోదశ రాజరికం ఎర్పడ్డ దశ. నిశ్చయమైన ఈ రాజరికం దశలో సంక్లిష్టమైన అన్ని విషయాలూ జాతిజీవన పరంగా క్రోడీకరింపబడి, ప్రాంతీయమైన రాజ్యవిభాగాలుగా రూపొందాయి. చివరిదశలో క్షీణదశ ఆరంభమై. ఎదుగుబొదుగులేక, పతనోన్ముఖం కాజొచ్చింది. అంతేకాక ఈ సమయంలోనే పశ్చిమాశియా, యూరోపుల సంస్కృతులు, వ్యవస్థలు, గాఢంగా ప్రభావితంకూడా చేశాయి.

భారతీయ సంస్కృతి మహోచ్ఛదశలో ఉండగా, శ్లాఘ్యమైన రాజకీయ వ్యవస్థ కుదురుకొని ఉండేది. ఉన్నత ప్రమాణాలతో జాతీయమైన స్వపరి

పాలన, సుస్థిరమైనదిగా సక్రమమైనదిగా కొనసాగేది. ప్రభుత్వం, పరిపాలన, న్యాయ, ఆర్థిక, రక్షణ వ్యవహారాలను, పౌరులహక్కులకు గాని, స్వాతంత్ర్యానికి గాని ఏ మాత్రమూ భంగం కలగకుండా నిర్వర్తించేది. అంతేకాక, రాజ్యాంగంలోని వివిధ శాఖల్లోనూ సంపూర్ణమైన సమైక్యత ఉండేది.

రాజ్యాధికారాన్ని పొందిన వ్యక్తి ఉన్నతుడుగాను, సర్వసమర్థుడుగా మా ఉండేవాడు. ఏకపక్ష నిరంకుశాధికారంకాని, పరిపాలనా యంత్రాంగపు నిరంకుశత్వంకానీ లేకుండా, ప్రజలను అణచివేయకుండా, కష్టాలపాలు చేయకుండా, సుస్థిరమైన నాగరికతకు, స్వేచ్ఛాప్రియులైన జనులకూ నిలయంగా ఉండేది.

రాజ్యాధీకారంకన్నా ఉత్కృష్టమైన అధికారంగా ధర్మం భాసించేది. మత, నైతిక, సాంఘిక, రాజకీయ, న్యాయ, ఆచార, రీతులు సక్రమ వ్యవస్థగా ప్రజల జీవిత విధానంలో రూపొంది ఉండేవి. రాజు ధర్మ సంరక్షకుడుగాను, నిర్వహణాధికారిగాను, సేవకుడుగాను ఉండి, ధర్మపాలనంలో ఏ దోషాలు, తీవ్రమైన అక్రమాలు, వ్యతిక్రమణలు జరుగకుండా చూసేవాడు. అంతేకాకుండా తాను కూడా సర్వాత్మనా ధర్మబద్ధుడై, వ్యక్తిగతజీవితంలోను, కార్యాచరణంలో రాజ్యవ్యవహారంలోను, బాధ్యతలలోను ధర్మాధికారానికి లోబడి ఉండేవాడు.

## భారతీయ రాజ్యవ్యవస్థలోని లోపాలు

రాజకీయ వ్యవస్థను గురించి చెప్పదలిస్తే, భారతదేశంలోని రాజనీతి విఫలమైందనే ఇంకో వాదనకూడా లేకపోలేదు. ఆ వ్యవస్థలో సుస్థిరత, చక్కని పరిపాలనా, జాతీయ శిక్షణ, స్వాతంత్ర్యం అన్నీ ఉండవచ్చుగాక, కాని బహు ప్రాంతాలలో బహు ప్రభుత్వాలు ఉండటంవల్ల, ఆ ప్రభుత్వాలు, సుపరిపాలనయే సాగించినప్పటికి, దేశం సుసంపన్నతను సాధించినప్పటికీ, నాగరికత ఉచ్ఛదశను చేరినప్పటికీ, జాతీయమైన, రాజకీయమైన ఏకీకరణం సాధించలేక పోయినందువల్ల ఆ వ్యవస్థ విఫలమైందనే చెప్పాలి. అందువల్ల చివరకు విదేశీ దండయాత్రలకు గురిఅయి, దాని వ్యవస్థలన్నీ నాశనమై, చిరకాలం బానిసత్వం వహించవలసి వచ్చింది.

## భవిష్యత్కార్య నిర్వహణం

జీవితాన్ని సంస్కృతిని, సాంఘికాదర్శాలను, పరిపాలించిన ప్రధానాదర్శం నిజమైన ఆధ్యాత్మికోన్నతిని సాధించడమే. దానికొరకే జీవితాన్ని వినియోగించడం. ఈ క్రమంలో భౌతిక, శారీరక, మానసిక వికాసం సాధించడం. జీవితాన్ని ఒక ఉపకరణంగా చేసుకొని అజ్ఞాన సహజత్వంనుంచి, ఆధ్యాత్మిక అస్తిత్వాన్ని అన్వేషించడం, అధిరోహించడం. ఈ ప్రధానాదర్శాన్ని విపత్కర, విషమ పరిస్థితులలో కూడా భారతదేశం ఏమరలేదు. త్యజించలేదు. ప్రాపంచిక కల్లోలాలు, రాజకీయ అవ్యవస్థలు, సాంఘిక నిర్మాణాలుకూడా ఈ లక్ష్యాన్నుంచి భారతీయ చింతనను తప్పించలేక పోయినాయి. అయితే సాంఘిక జీవితంలో ఆధ్యాత్మిక పరిపూర్ణత్వ దృష్టి కలిగించడం చాల కష్టం. ఈ అభివ్యక్తీకరణను, మతము, ఆలోచన, మనస్సు, సాహిత్యం. కళల ద్వారా సాధించవచ్చు. భారతీయులు ఈ రంగాలలో మహోన్నతదశకే వీటిని తీసుకొని పోయినారు. అయితే బాహ్య విధానంలో భారతదేశం పరిపూర్ణతను సాధించలేక పోయింది. ఆధ్యాత్మిక సిద్ధిలో అనేక రకాలైన లోటుపాట్లు అధిగమించవలసి వచ్చింది. ఒక వర్ణానికి ఆధిక్యత, పరమాశయ సిద్ధికై జరిపే ప్రయత్నాలలో కొన్ని అవాంతరాలు వచ్చాయి. రాజకీయాలు, సంఘం, ఆర్థిక విషయాలు మానవాదర్శంలో ప్రధాన విషయాలు. భారతీయ వ్యవస్థ వీటికి సముచితమైన స్థానాన్ని ఇచ్చింది. ధర్మము, ప్రాపంచిక ఆసక్తులకు సుఖపరమావధి అయిన జీవితానికి దూరమే రాటకీయాలలోనూ, బాహ్య ప్రవృత్తులలోనూ, ధర్మం అతీతంగా ఉంటూ వచ్చింది. రాజకీయ వ్యవహారాలలో నైతిక ధర్మప్రవేశం కుదరదు. మానవజీవిత చరిత్రలోనే సామూహిక బాహ్యజీవనం మోక్షప్రాప్తికై అంటే మాయావరణంనుంచి విడుదల పొందిన ఆధ్యాత్మికాస్తిత్వంకై ప్రయత్నించిన సన్నివేశాలు లేనేలేవు. ఇదివరలో ఇది ఊహకు కూడా అందలేదు. ఆ ప్రయత్నాలు కొంతవరకైనా ఫలించాయేమోనన్న ప్రసక్తి లేనేలేదు. అయితే భారతదేశంలో కొన్ని కొన్ని అంటే సాంఘి కార్థికాది రంగాలలో, ధర్మాధికారం కొంత వైఫల్యం పొందినా, వ్యక్తిగతమైన ఆధ్యాత్మిక సాధన కొనసాగుతూనే వచ్చింది. అయితే యీ పరమప్రాప్త్యమైన ఆధ్యాత్మిక జీవితం మహోన్నతాదర్శంగా, వైయక్తిక ప్రయత్నానికే వదలివేయబడింది. అతి ప్రాచీనకాలం నుంచీ కూడా యీ ఆదర్శాన్ని దృష్టిలోపెట్టుకొని, స్వశక్త్యానుసారంగా భారత

దేశం పురోగమిస్తూనే ఉన్నది. సాంఘిక వ్యవస్థలో అపూర్వమైన లక్షణం ఈ దేశంలో.

బహుశా భవిష్య ద్భారత దేశంలో, యీ పూనికను ఫలప్రదం చేసే మహత్తర ప్రయత్నాలు కొనసాగుతా యనుకోవచ్చు. బాహ్య జీవితానికి, ఆధ్యాత్మిక జీవితానికి సమన్వయం సాధించే కృషి, జ్ఞానం ఇక్కడ విస్తరిస్తాయనే ఆశించవచ్చు. నిజమైన ఆధ్యాత్మిక సత్య స్వరూప సాక్షాత్కారం, అతి ప్రాచీనకాలం నుంచీ భారతదేశ ఆదర్శమై, లక్ష్యమై. నిగూఢంగా ఉన్న ఆధ్యాత్మిక శక్తులన్నీ ఆవిష్కరింపబడి, విరాట్పురుషుని లీలా విలసనానికి ఆయత్తపరచడానికి భవిష్య ద్భారత దేశం పూనుకొంటుందని అనుకోవచ్చు.

———

# నూతన సామాజిక వ్యవస్థ

మూలం : శ్రీ అరవిందులు          అనువాదం : చుండి జగన్నాథం

తన మనుష్యులచేతగాక
సంస్థలతో నడిచే సమాజం ఒక యంత్రం.

"మనుష్యులుగాక సంస్థలునడిపే సమాజం సమిష్టి ఆత్మగా రూపొందదు. అదొక యంత్రం అవుతుంది. దాని జీవనం ఒక యాంత్రిక వస్తువు. సజీవంగా ఎదిగే వస్తువుగాదు. అందువలన సాధారణ మానవజీవనంతో తృప్తిజెందని ద్రష్టలు కొందరు సమాజంలో మున్ముందు ప్రత్యక్షం కావలెను. వారికి మామూలు బౌద్ధికశక్తి—ఉత్సాహశక్తి—భౌతిక అస్తిత్వం—వీటిలో తృప్తి కలగదు. ఇంతకంటె గొప్పదైన పరిణామం రావలసియున్నదని వారు గ్రహిస్తారు. తమలో ముందు దానిని పొందే ప్రయత్నం చేస్తారు. ఇతరులను అక్కడకు తీసుక పోతారు. మానవకోటి గమ్యంగా దీనిని గుర్తింపజేస్తారు. ఇందులో వారు కృత కృత్యులు కాగలిగినంతవరకు, ఈ పరిణామాన్ని సాధించగలిగి నంతవరకు జయమవుతుంది. ఆ పిమ్మట మిగిలివున్నది భవిష్యత్తులో సాధ్యమవుతుంది."

నిజమైన, పూర్ణమైన ఆధ్యాత్మిక ధ్యేయం
సమాజంలో మనిషిని ఆత్మగా పరిగణిస్తుంది.
భువిపై దైవాంశ సిద్ధించడానికై అది అవతరించి
నట్లనిపిస్తుంది.

"ఈ భువిపై భౌతికంగా, క్రియాత్మకంగా, మానసిక ప్రకృతి పూర్వ కంగా దైవాంశ రావలసివున్నది. అందువలన దీనిని విడిచి వెళ్ళరాదు. ఆకలి స్వర్గధామాలలో మాత్రమేగాక ఈ భూమండలంపై దైవశక్తి ప్రభావం పడ వలసియున్నది. అందువలన భువిపై దైవాంశ పరిపూర్తికొరకై వచ్చిన ఆత్మ మానవుడు. అంతేగాని కేవలం ఒక మానసం, జీవనం, శరీరంగల ప్రాణి మాత్రం కాడు. నిజంగా, పూర్ణంగా సమాజంలో ఆధ్యాత్మిక ధ్యేయం రావలె నంటే ఆ విధంగానే వుండవలెను. అందువలన జీవనం, మానసం, శరీరం గమ్యములు కావు ; తమకై తాము తృప్తిజెందే వస్తువులుకావు ; తత్వాన్ని

పరిశుద్ధ ప్రాంతాలకు ఎగిరిపోవడానికి విడిచిపెట్టే సాధనాలు కావు; ఆత్మకు ఇవి ప్రథమ సాధనాలు; ఇంకా చేతికి చిక్కని దైవాంశగల ప్రయోజనానికి సాధనాలు; వీటిలో కొన్ని దోషములున్నప్పటికీ, ఇవి కార్యారంభాన్ని చేస్తున్నవి."

*  *  *  *

"అందువలన మానవ జీవితంలోని భాగాలన్నీ పరమ పవిత్రములు. భౌతిక, క్రియాత్మక, ఉత్సాహశక్తియుక్త, ఉద్వేగపూరిత, నాజూకైన భావ సంపద గలిగిన, నీతిపూర్వకమైన, బౌద్ధిక శక్తిగల, ఉత్తమమైన మానసిక పరిణామంగల అంశములు. ఇంకా అధికమైన దైవాంశతోకూడిన జీవనానికి ఇవి సాధనములు. ఈ భావన కలగడం సహజం అది కలిగితే, ప్రతి మానవ సముదాయం, జాతి, ప్రజ, ఇతరమైన అంగయుక్తమైన ఒక ప్రజాసమూహం ఈ దృష్టిలో స్వల్పమైన ఆత్మలుగానే కన్పిస్తవి. దైవాంశగల నిజతత్వంగా, భువిపై గల మానవుని అనంతమైన చైతన్యరాశిగా, తత్వం అనేక విధాల ప్రత్యక్షమై స్వయంసిద్ధితి పొందుతుంది"

ఆధ్యాత్మిక ధ్యేయం సైన్స్‌మీదా,
తాత్విక చింతనమీద కాడి మోపదు.

"ఆ విధంగా జరిగితే, నిజమైన ఆధ్యాత్మికమార్గం సైన్స్‌మీద, ఫిలాసఫీ (తత్వచింతన) మీదా కాడి మోపదు. పాత మతములు కొన్ని తమ దంబాచారాన్నీ, అజ్ఞానాన్నీ, అన్యాధ్యాత్మ మూఢత్వాన్నీ, పొగురుబోతుతనాన్నీ వెల్లడిస్తూ వితండ వాదాలను లేవదీసి, తమకు తెలిసిందే నిర్ధారణయైన ఆధ్యాత్మిక సత్యమనే పట్టుబట్టి, తమ నిశ్చయాలకు అనుగుణంగా సైన్స్, ఫిలాసఫీ ప్రవర్తించవలెనని పల్కినవి. అటువంటి బలవంతం ఇందులో వుండదు."

*  *  *  *

"నాస్తికత్వం వ్యక్తిలోనూ సమాజంలోనూ పలుమారు ప్రత్యక్షమవుతూ వుంటుంది. ఐతే అది అవసరమైన ఒక రాదారి. ఆ బాటన వెళ్ళి లోతైన ధార్మిక, ఆధ్యాత్మిక సత్యాన్ని గ్రహించవచ్చును. దైవాన్ని ముందు కాదంటే గాని ఆ తర్వాత దైవం కన్పించదు. చిత్తశుద్ధిగా దైవాన్నిగూర్చిన సంశయాన్ని వెలిబుచ్చి దైవంలేదని భావించిన తదుపరి చివరకు దైవం కన్పిస్తాడు."

ఆధ్యాత్మిక ధ్యేయం సుఖాన్ని విసర్జించే మార్గాన్ని
అంగీకరించదు. పూర్తిగా జీవితాన్ని అనుభవించి
ఆనందిస్తుంది. జీవితంలో పరివర్తన వస్తుంది.

"నిండుగావున్న జీవనంలో ఆధ్యాత్మిక ధ్యేయం ఫలప్రదమవుతుంది. వ్యక్తి, జాతి — రెంటిలో గల ప్రాణి తాత్విక శిఖరాల నందుకునే పథకానికి ఇది ఆధారం. చివరకు ఆధారం ఆ శిఖరాలు ఏకమైపోతవి. శరీరాన్ని హేయంగా చూచి ఆధ్యాత్మిక ధ్యేయం సాగిపోదు. క్రియాత్మకమైన శక్తిని వైరాగ్యం పేరిట వమ్ముచేయదు. ఏమీ సౌఖ్యంలేకుండా, అతిదీనమైన అవస్థలో జీవించడం ఆధ్యాత్మికానికి అవసరమని చెప్పదు. కళ, సౌందర్యం, ఆనందాన్ని కలిగించే విధానం వద్దని అనదు. సైన్స్, ఫిలాసఫీ వంటివి నిరర్థకమైన, లెక్కకురాని బౌద్ధిక సంచారాలని అనదు. అటువంటి అతిశయోక్తులకు సైతం తత్కాలంగా ప్రయోజనం వుండవచ్చు ననుకోండి—ఎందుకంటే వాటికిభిన్నమైన అతిశయాలు కొన్ని వున్నవి, వాటిని ఎదిరించడానికి ఈ అతిశయోక్తులు పనికి రాగలవు. ఆధ్యాత్మిక ధ్యేయం అందరికీ అన్ని రూపాలుగా వుంటుంది. వారి అత్యున్నతమైన ఆశయాలను అందుకోడానికీ, సంపూర్ణంగా వారి స్వశక్తులు ప్రకాశించి వారు కోరే మహత్వపూర్ణమైన అంశాలు సిద్ధిస్తవి. సమాజంలో నిజమైన ఆంతరంగిక ధార్మికత్వం ప్రతిష్ఠాపన అవుతుంది. ఒక మతం లేక పురోహిత వర్గం ఆధిక్యం వహించిన అనృతమయమైన ధార్మికత్వం వుండదు. అంతరంగమందున్న పురోహితుడు, ప్రవక్త, నృపాలుడు — వారిదే ఆధిక్యం. తనలోని దైవాంశను మానవునికి ఈ మార్గం చూపిస్తుంది. వెలుగు, బలం, అందం, మంచితనం, ఆనందం, అమరత్వం సంప్రాప్తం కాగలవు. అమరత్వంలో వెలుగు. అది బాహ్యంగావుండే జీవితాన్ని దిద్దుతుంది. అందులో దైవరాజ్యాన్ని నిర్మిస్తుంది. అది మొదట మనలో కనిపిస్తుంది. సర్వభావేనా దైవాంశను పొందడానికి మార్గాన్ని ఆ విధానం సూచిస్తుంది. దానిని కన్గొని, అందులో నివసించవచ్చును. దైవాంశలో, ఆ మహత్‌తత్వంలో, అనంతమైన వాస్తవికతలో కాపురం చేయవచ్చును."

ఆధ్యాత్మిక సమాజంలో
సైన్స్, నడవడి, కళాసృష్టి

"జ్ఞానమంతా దానిలో చేరిపోతుంది. ఐతే ప్రపంచంలో సాధారణంగా సమర్థవంతంగా నెట్టుకపోవడానికై అది పాటుబడదు. స్వయం అభివృద్ధికీ,

స్వయం లోవెలుగును తెలుసుకోడానికీ అది తోడ్పడుతుంది. భౌతిక, జ్ఞాన మయ సైన్స్‌ను వినియోగించి కృషిజేస్తుంది. ప్రపంచ, ప్రకృతులయొక్క పద్ధతులను తెలుసుకొని, భౌతికమైన మానవ ప్రయోజనాలకోసం వాటిని వ్యయ పరచదు ప్రపంచంలో సర్వత్రా దైవాంశ ఎక్కడ వున్నదీ, ఎన్ని ముసుగుల వెనక దైవాంశ దాగివున్నదీ తెలుసుకుంటుంది. దాని ప్రభావంద్వారా నడవడి యొక్క రూపే మారిపోతుంది. సంఘ నిబంధనావళికి సవరింపుగా లేక దానికి తోడుగా మాత్రమే సంచరించే నడవడి వుండదు. సాధారణంగా అమలుజరిగే సంఘ నిబంధనావళి అంత శుభ్రంగా వుండదు; అజ్ఞానంతో కూడా కూడి వుంటుంది. ద్విపాద జంతు శముదాయానికి వర్తించేదిగా వుంటుంది; లేదా జనం గుంపులుగా వుండి వ్యవహరించేటట్లుగా వుంటుంది. మానవునిలోవున్న దైవిక స్వభావాన్ని అభివృద్ధి చేసేదిగా నడవడి వుంటుంది. కళ ఏ విధంగా వుంటుందీ అంటే కళాకారుడికి తోచిన విషయం, అతడికి కన్పించిన అంశాలు మాత్రమే అందులో వుండవు. ఆ విషయాలను అతి ముఖ్యమైన సృజనాత్మక మైన దృక్పథంతో కళాకారుడు పరిశీలిస్తాడు. పైకి మనకు కనిపించే వస్తువుల వెనకవున్న అంశాన్ని అతడు అన్వేషిస్తాడు. సత్యమును, సౌందర్యాన్ని మనకు తెలియజేస్తాడు. మనకు కనిపించేవీ, కనిహించనివీ — అన్ని దృశ్యములు ఆ సత్య, సౌందర్యముల రూపములే. వాటి ముసుగులై, సంకేతములై, ముఖ్య మైన గుర్తులై అనేకమైన అంశములున్నవి."

ఆధ్యాత్మిక సమాజంలో
సమాజశాస్త్రము, ఆర్థిక శాస్త్రము,
రాజకీయ శాస్త్రము.

"మహర్షి మొదలుకొని అపరాధివరకు వ్యక్తులను ప్రత్యేక సంఘ సమస్యగా ఆధ్యాత్మిక సమాజం చూడదు. ఆ సంఘానికి కావలసిన నమూనా ప్రకారం నేర్పుతో సమకూర్చిన యంత్రాంగంలో వ్యక్తిని దూర్చడం లేదా ఆ సంఘపు ధోరణికి సరిగా పనికి వచ్చేటట్లు వ్యక్తిని ఎక్కువ తక్కువలు లేకుండా చేయడం, లేదా అందులోకి సరిపడకపోతే వ్యక్తిని నలిపివేసి అవలకు నెట్టివేయడం — ఇటువంటి పనులుచేయదు. బాధపడుతూ, ఒక వలలో చిక్కుకు పోయిన ఆత్మలనుగా వ్యక్తులను పరిగణిస్తుంది. వాటిని బయటపడవేయడానికి

పాటుబడుతుంది. కొందరు వ్యక్తులు ఎదిగిన ఆత్మలను కలిగివుంటే వాటికింకా ప్రోత్సహమిస్తుంది. ఇంకా ఎదుగుతూ, సాయం అర్థించే ఆత్మలకు ఎదిగిన ఆత్మల సాయం అందిస్తుంది. ఆధ్యాత్మిక సమాజంలో అర్థికశాస్త్రం ఒక పెద్ద ఉత్పత్తి యంత్రాన్ని సృష్టించదు. పోటీ లేక సహకారం — విధానమేదే కానీ అంతటి భారీ యంత్రాన్ని సృష్టించదు. మనుష్యులకు — కొందరికి గాక అందరికీ — ఒక్కొక్కరికి అత్యున్నతమైన స్థాయివరకు కృషిలో ఆనందానిస్తుంది. ఆ కృషి వారి స్వభాలకు అనుగుణంగా వుంటుంది. స్వేచ్ఛగా లభ్యమయ్యే తీరిక వుంటుంది. అందులో వ్యక్తి తన అంతరంగమందు ఎదిగిపోతాడు. అందరికీ హాయిగావుండే సంపన్న జీవనం, అందమైన జీవనం లభ్యమవుతుంది. దేశములంటే బ్రహ్మాండమైన సర్కారీ యంత్రాలుకావు ఆధ్యాత్మిక సమాజ నిర్మాణంలో! ఈ యంత్రాలు మనిషిని తమకోసం బ్రతికేట్లు చేసి, తమ్ము దైవంగా అత డారాధించేట్లు చేస్తున్నవి. ఆ యంత్రం పిల్చిన మొదటి పిలుపుకే వ్యక్తి దాని బలివేదికపై ఇతరులను చంపుతాడు తాను సైతం రుధిరస్రవంతిని కారుస్తాడు — ఆ యంత్రం పదిలంగా వుండడం కోసం! ఇంకా అది శక్తివంతమై, మరింత క్లిష్టమై, మరింత కఠినమై, మరింత యాంత్రిక సామర్థ్యాన్ని సంపూర్తిగా సంపాదించుకుంటుంది. అందుకీవ్యక్తి తోడ్పడతాడు. ఈ తతంగాన్ని ఆధ్యాత్మిక సమాజం ఎంతమాత్రం ఆదరించదు. అంతేగాక ఈ దేశాలు ఒకదానితో ఒకటి నేడు సంఘర్షించే విధానాలను ఆ సమాజం అంగీకరించదు. శాంతి సమయంలో విషవాయువులను ఇవి ప్రయోగిస్తున్నవి, ఘర్షణలో సాయుధులైన గుంపులు, ఆయుధాలులేని జనసమూహాలు మహామారణ సాధనా లుపయోగించి చంపుకుంటవి. ఆధునిక యుద్ధక్షేత్రంలో టాంకులు ఒకదానిపైనొకటి పడి హత్యకై ఉరికినట్లే జనంకూడా ఒకన్నొకరు ఖూనీ చేసుకోవడానికి ఉద్యుక్తులవుతున్నారు. ఇట్టి పైశాచికపద్ధతిని ఆధ్యాత్మిక సమాజం సహించదు. ప్రజలు బృందరూపమైన ఆత్మసంచయములని ఆ సమాజం భావిస్తుంది. దైవాంశ దాగివుంటుంది. కలియగలుపు చర్యలలో దీనిని తిరిగి ప్రజలు పొందుతారు. వ్యక్తులవలెనే ఈ బృందాలు తమ స్వభావానుసారంగా ఎదుగుతవి. పరస్పర సాయంతో మానవాళికై కావలసిన కార్యక్రమం కొనసాగిపోతుంది. వ్యక్తిలోనూ, సముదాయంలోనూ ఇందుకై ఆధ్యాత్మికంగానూ, మానసికంగానూ, ఉత్సాహశక్తితోనూ, భౌతికంగానూ మానవులందరి అంత

రంగ జీవనంలో సిద్ధి చేకూరవలెను. వారి బహిరంగ ప్రకృతి, ఆంతరంగిక స్వభావాలు ఈ పరివర్తనను పొందగలవు."

ఆధ్యాత్మిక సమాజానికీ
మతమునకు పొత్తుకుదరదు.

"ప్రత్యేకమైన మతమునకు సంబంధించిన విశ్వాసాల దురభిమానం ఆధ్యాత్మిక సమాజానికి గిట్టదు. ఆ మతమే అందరికీ యోగ్యమవి ప్రచారం చేసి దానిని ప్రజలపై రుద్దడం మానవ స్వభావంలోని వైవిధ్యానికి సరిపోదు. అంతేగాక తత్వంయొక్క ఒక ముఖ్యలక్షణానికి సరిపోదు. తత్వం కోరేది విశాలమైన అంతరంగిక స్వేచ్ఛ. అదికోరేది ఎటువంటి ఏకత్వమంటే దానిలో ఎవరి స్వభావానుసారం వారు ఎరగవచ్చును. ఇంకొక అంశం వున్నదీమతాలలో పరలోక ప్రాప్తమీద ధ్యానం. ఇది తప్పక విఫలమయ్యేదే ననుకోండి. కాని మతాల ప్రచారం ప్రకారం భువిని ఉద్ధరించడం అప్రధానమైన అంశం అవుతుంది; పరలోకప్రాప్తి ముఖ్యం. ఇక్కడ ఈ భూమండలంలో మానవోద్ధరణ అవకాశాలు సన్నగిల్లినకొద్దీ పరలోకధ్యానం ఎక్కువైపోతుంది. అందువలన, ఆధ్యాత్మికభావాలుగల ఎన్నిధోరణులు పెరిగినా, అవన్నీ ఒకదానికొకటితోడై వుండవలసినవేగాని మరొకవిధంగా వుండరాదనీ, ఇవన్నీ గమ్యానికిచేరే సాధనలేనని గుర్తించడం అవసరం. ఒక్కటి ముఖ్యం. మానవుని జీవనమంతా తత్వంవైపుకు తిరిగిపోవలెను. స్వర్గారోహణ ముఖ్యం కాదు, వ్యక్తి తన తత్వంలోకి ఎదగడం ముఖ్యం. తత్వం ఇతడి సామాన్య జీవనంలోకి దిగిరావడంకూడా ముఖ్యం. అంతట భువిస్వభావం పరివర్తన జెందగలదు. అదీ కావలసినది. అంతేగాని మరణానంతరం వచ్చే మోక్షం కాదు కోరేది. మానవాళి బాధ ననుభవించి, మరుగునపడివుండి, ఇప్పుడిక నిజమైన పునర్జన్మను పొందబోతుంది. అదీ ఆధ్యాత్మిక సమాజం కోరేది.

ఆధ్యాత్మిక సమాజం, స్వేచ్ఛ

"మనిషిని యంత్రంద్వారా ఆధ్యాత్మిక సమాజం చక్కబరపదు. అతడి అవయవము లన్నిటినీ బంధించి అతణ్ణి సంస్కరించదు. ఉన్నతమైన తన స్వకీయ తత్వాన్ని మనిషి గుర్తెరగడం కోసం, దానిని రక్షకభటుని రూపంలో

ప్రత్యక్షం గావించదు లేక ఉన్నతాధిరిగా లేక శిక్షించే అధికారిగా చిత్రించదు. సోషలిస్టిక్ అధికారవర్గంగా, లేక లేబర్ సోవియట్ మార్గంగా దానిని చూపించదు. వెలపలినుంచి మానవజీవితాన్ని బలవంతపరచే పద్ధతిని ఆధ్యాత్మిక సమాజం వీలైనంతవరకు తగ్గిస్తుంది. లోపలి తత్వంలో ఇమిడివున్న దైవాంశ ప్రేరణను మేల్కొల్పుతుంది. ప్రాథమికంగా అది ఏ ప్రయత్నం చేసినా ఈ లక్ష్యంతోనే చేస్తుంది. ఆఖరున ఆధ్యాత్మిక ప్రేరణను అది వినియోగిస్తుంది. ఈ ప్రేరణగల వ్యక్తి తన చుట్టూరాగల పరిస్థితిపై ప్రభావాన్ని కలిగివుంటాడు. అటువంటప్పుడు ఈ ప్రేరణగల సమాజం ఇంకా ఎక్కువ ప్రభావాన్ని కలిగివుంటుంది. లోపలినుంచి అడ్డంకి, వెలుపల కాదనడం వున్నప్పటికీ మనలో ఆ ప్రేరణ రానేవస్తుంది. వెలుగు యొక్క మహత్యం అటువంటిది. తన స్వభావం ద్వారానే తన లోపలి దివ్యత్వాన్ని పొందడానికి వ్యక్తి వాంఛిస్తాడు. అట్టి శక్తికై తపిస్తాడు. ఆధ్యాత్మిక అనార్కిస్ట్‌యొక్కస్వప్నం నిజమవుతుంది — పరిపూర్ణమైన ఆధ్యాత్మిక సమాజంలో. అందరూ కావలసినంత స్వేచ్ఛను కలిగివుంటారు. దానికి ఆవసరమైన ప్రాథమిక చర్య జరిగింది గనక అది సాధ్యమైనది. ఆ సమాజంలో ప్రతి ఒక్కడు తనకు తానే శాసనంగా వుండడు. శాసనమే తానుగా వుంటాడు. దివ్య శాసనమది। స్వప్రయోజనంకోసం జీవించే అహంకారమార్గం కాదు. దివ్యత్వంలో నివసించే ఆత్మగా వ్యక్తి ప్రకాశిస్తాడు. అహంకార విముక్తుడై తన ప్రకృతిని దివ్యం చేసుకుని, ఆ శాసనాన్ని అవలంబించి, దాని ద్వారా జీవనాన్ని గడుపుతాడు."

వ్యక్తి తనకోసం, తన రాజ్యం కోసం,
తన సమాజం కోసం జీవించడు —
తనలోని దైవంకోసం, విశ్వంలోని
దివ్యశక్తి కోసం జీవిస్తాడు.

"అతీగతీలేని ఐక్యభావపు పుష్పం కాదు ఆధ్యాత్మిక జీవనమంటే — చైతన్యంతో, వైవిధ్యంతో అది వికసిస్తుంది."

* * * *

"అందరిలో దైవాన్ని చూడగలవాడు ప్రేమ పూర్వకమైన సేవతో హాయిగా దైవాన్ని సేవిస్తాడు. అనగా అతడు తన స్వేచ్ఛనే గాక అందరి

స్వేచ్ఛను వాంఛిస్తాడు. తన పూర్ణత్వాన్నేగాక అందరి నిండుతనాన్ని వాంఛిస్తాడు. వికాసం అత్యధికంగా సార్వజనీనం అయితేనే తన వ్యక్తిత్వం ఫలించిందని భావిస్తాడు. సార్వజనీనంగా జీవనం నిండుగా ఉంటేనే తన జీవనం అమిత హాయిగా ఉంటుందని అనుకుంటాడు. తనకోసం, తనరాజ్యంకోసం, తన సమాజం కోసం, తన అహంకారం కోసం, సమిష్టి అహంకారం కోసం ఆ వ్యక్తి జీవించడు. అంతకంటే చాలగొప్పదైన అంశం కోనం జీవిస్తాడు. ఆ అంశమే తనలోని దైవం. అదే విశ్వంలోని దివ్యశక్తి.''

"దైవం, స్వేచ్ఛ, సమైక్యభావం — ఈ అంశత్రయం మీగిలిన "తత్వం" యొక్క ప్రేరణతో సామాన్య మానవుల మానసం కదిలిననాడు ఆధ్యాత్మిక యుగం ఆరంభమైన దనుకోండి."

మానవాళి భవిష్యత్తుకు అత్యధికంగా
తోడ్పడే వ్యక్తులు

"ఆధ్యాత్మిక వికాసం గమ్యం, అందువలన అదే మానవునికి గొప్ప అవసరం - అవి గుర్తించినవారే నూత్నయుగంలో మానవాళి భవిష్యత్తుకై చాల ఎక్కువగా తోడ్పడగలరు."

*    *    *    *

"ప్రత్యేక ధార్మికవిశ్వాసం, ఆకారం అట్టి వ్యక్తులు పట్టించుకోరు. ఎవరి విశ్వాసాలు వారికి వుండనీయండి అనేదే వారి ధోరణిగా వుంటుంది. వారు ముఖ్యంగా పరిగణించేది ఒక నమ్మకం. అదేమిటంటే ఆధ్యాత్మిక పరివర్తన ప్రకారం జీవించడం. అది ఏరూపంలో, ఎట్టి అభిప్రాయంద్వారా వ్యక్తమైనా దాఫరేమి. దానిని ఆధ్యాత్మిక జీవనంలోకి మలుపుకోవచ్చును. యంత్రంవల్ల, బాహ్యమైన సంస్థలవల్ల ఈ మార్పు వస్తుందని వారు ఎన్నటికీ భావించరు. ప్రతి ఒక్కడు తనలోన ఈ విధానాన్ని జీవించకతప్పదు — లేకుంటే ఇదెన్నటికీ వాస్తవంగా అమలు జరగదు — ఈ విషయాలను వారెరుగుదురు, వారెన్నడు ఏనవి మరువరు. ప్రాచ్యదిశన వెల్గొందిన "లోపలిబుద్ధి" యొక్క సారాంశాన్ని వారు గ్రహిస్తారు. తన గమ్యమర్మాన్ని మనిషి తెలుసుకొని, తనలోపలనే విమోచనాన్ని పొందుతాడు — ఈ సంగతిని వారు తెలుసుకుంటారు పాశ్చా

త్యసీమలలో జీవితావికిచ్చే ప్రాముఖ్యపు సారాంశాన్నికూడా వారు అవగాహన చేసుకుంటారు. లేదా దానిని వారు ఇంకొకవిధంగా మలుచుకుంటారు. ఆధ్యాత్మిక ప్రకాశంగల కొందరికి నీడవలె సమాజాన్ని వారు తయారుజేయరు. సౌఖ్యాన్ని విసర్జించే విపరీతమైన, అపురూపమైన మార్గాన్ని వారు కోరరు. ఆ మార్గం ఇరుకుగా కంచె వేస్తుంది ; భూమికి అంటించి పెట్టి జీవనాన్ని కుంచింపజేస్తుంది. ఆ మార్గాన్ని ఆధ్యాత్మిక సమాజం ఒప్పుకోదు. చాలమంది క్రిందనే వుండి కొందరే ఆధ్యాత్మిక శిఖరాల నందుకోగలరని ఆధ్యాత్మిక సమాజవాదులు భావించరు. హాయిగా జీవించే సౌకర్యం, వెలుగు అందరికీ కావలెనని అంటారు. గొప్ప భావుకులు భువిని పూర్తిగా పునరుద్ధరించవలెనని సంకల్పించారు; ఎన్ని అడ్డంకు లొచ్చినా ఆ విశ్వాసాన్ని వారు విసర్జించలేదు. ఆధ్యాత్మిక సమాజవాదులు కూడా అటువంటివారే!"

* * * *

"ఈ వైతాళికులు తమకు సంబంధంలేదని దేనినీ త్రోసెయ్యరు. తమ పరిధికి ఆవలవున్నట్లు దేనినీ వారు పరిగణించరు. మానవ జీవితంలోని ప్రతి భాగాన్నీ ఆధ్యాత్మికభావం చేబట్టవలెను. బౌద్ధిక, క్రియాశీల, భౌతిక భాగములను ఆధ్యాత్మిక ధోరణి ఆవరిస్తుంది. సౌందర్యం, నడవడి, ఉత్సాహం — వీటితో కూడిన అంశాలను అది ఆవరిస్తుంది. అందువలన ఆ అంశములకు సంబంధించిన కార్యక్రమాలపై ఆధ్యాత్మికులకు ఏవగింపు వుండదు. కార్యక్రమాల నడకలో, ఆకారంలో మార్పును వారు కాంక్షిస్తారు. మన స్వభావంలోని ఒక్కొక్క భాగంలో దైవాంశ దాగివున్నది. దానిని మేల్కొల్పి మనం మనలను గుర్తెరిగేటట్లు ఆధ్యాత్మికులు చేస్తారు. సాధారణమైన మానసం తాత్వికమవుతుంది ; అది అంతకంటె పైకి పోతుంది ; పోయి, పోయి, కడకు సమగ్ర ఆధ్యాత్మిక సంచలనం వస్తుంది."

* * * *

"ఆధ్యాత్మికమైన పురోగమనం చేసేవారు ఇంతవరకు ఈ దిశలో సమకూర్చబడిన జ్ఞానాన్ని చక్కగా ఉపయోగించుకుని పనిజేస్తారు. కాని అ పరిధులనే దాటకుండా వుండరు. ప్రకృతిలో, స్వభావంలో "తత్వం" చేయవలసిన పనిని గుర్తించి దానికై కృషిజేస్తారు. ఎప్పటికప్పుడు కొత్త విషయాలు కని

పెడుతూ వుంటారు నూతనంగా కొన్ని నిర్వచనాలు చేస్తారు. మానసంలో మరింత సమగ్రమైన చింతనను ప్రవేశపెడతారు. మానసంలోని అంతరాంతరాలలోకి ప్రవేశించి వాటిని పునః పై స్థాయిలోకి మలచే ప్రయత్నం చేస్తారు. ఇదివరకు తెలియని విధంగా "సత్యమును" విశాలవ్యాప్తం చేస్తారు. భవిష్యత్తులో ఉజ్జ్వలంగా వుండే పరిస్థితికి "తత్వం" మన పూర్వానుభవాలను తీసుకపోతుంది."

నూతన వ్యవస్థ పరిణామ ఆకారంలో

ప్రథమ దశ.

"పాత పద్ధతిలో జీవనం గడిపి నూతన పంథాలో నడిచే వారనేకులు వుండవచ్చును. అయితే సాధారణంగా ప్రకృతి చర్య అందు కనుకూలంగా వుండదు. క్రింది స్థాయిలో ప్రకృతిలో వుండి మార్పును పూర్తిగా పొందడం ఎవరికీ సాధ్యం కాదు. ఒక దశలో ఈ సాధకులు ప్రత్యేకంగా వుంటూ అత్యున్నత స్థాయికి పరివర్తనకు దోహదంచేసే వాతావరణాన్ని కల్పించుకుని కృషి జేస్తారు. ఆ తత్వం చుట్టూరా వున్న పరిస్థితులలో పరివర్తన తెచ్చే పని ప్రారంభమవుతుంది. ఐతే ఇందులో ఒక చిక్కు వస్తుంది. పూర్వానుభవాలతో వచ్చేవారు అందులోవి జ్ఞానంతో పాటు కొన్ని క్లిష్టమైన అంశాలను తీసుక వస్తారు. కాని, ప్రకృతి సిద్ధమై, "తత్వం" పైనుంచి క్రిందికి దిగివచ్చే పరిస్థితులలో, దిగి వచ్చినపుడు దాని బలం ఎక్కువగా వుంటే, ఆ చిక్కు విడిపోతుంది."

*  *  *  *

"ఒక నిజమైన ప్రారంభం కావలెను. మిగిలింది ఆకస్మికంగా కాలం చేసివేస్తుంది. ఘటనలు ఆ విధంగా వుంటవి. లేకుంటే దీర్ఘకాలం ఓపికగా శ్రమించక తప్పదు."

# భారతావని

## ఆధ్యాత్మికత, తత్త్వజ్ఞానము, మతము, నైతికము

మూలం : శ్రీ అరవిందులు                                        అనువాదం : రాజు

భారతదేశము మహత్తర జీవిత సూత్రములకు, మానవజాతి మహోన్నత క్రమ వికాస విధులకు, ఆధ్యాత్మికజ్ఞాన సమ్మేళనమునకు, తదానుభవములకునూ సర్వదా రక్షణగను, మార్గదర్శకముగను, ఆచార్యులుగను యుండెను. అదియే సనాతన ధర్మము, శాశ్వతమైన ధర్మము. పరుల ఒత్తిడివలన, సజీవమైన ఆ ధర్మముయొక్క వాస్తవికతపై అధికముగ పట్టు సడలియున్నదే గాని, దాని యొక్క మూల స్వరూపము నందెట్టి భిన్నత్వము కలుగలేదు. ఆ సనాతన ధర్మము సజీవమైనది గానిచో హిందూమత మనునదియే యుండునది కాదేమో! జీవితమునకు మాత్రమేగాక, జీవిత సరస్వమునకు ఆ ధర్మమును ప్రయోగించుట చాల అవసరము. ఆ ధర్మముయొక్క శక్తి మనలో ప్రవేశించి మన సంఘమును, రాజకీయమును, సాహిత్యమును, శాస్త్రములను, వ్యక్తిగత ప్రవర్తనలను, అనురాగ ఆకాంక్షలను సరిదిద్దవలయును. మేము కర్మయోగము ద్వారా నేర్చుకొనిన దేమనగా: ఈ ధర్మముయొక్క మూలము నెఱుంగుట, దానిని సత్యమైనదిగ అనుభవములతో తెలిసికొనుట, ఉన్నత ఆవేశములను ఆరోహించుచున్న వాని స్పందనల ననుభవించుట, స్పృశించుట, దానినెల్ల వ్యక్తపఱచుట, దానినే జీవితమందు అనుష్టించుటయును నేర్చుకొని యున్నాము. మానవజీవితాదర్శమైన యీ యోగమును నాచరించుటకే భారతదేశ మీనాడు పునః జాగృతి నొందుచున్నదని మేము నమ్ముచున్నాము. ఈ కర్మయోగము వలననే ఆమె యొక్క స్వాతంత్ర్యమును, ఐక్యతను, శ్రేష్ఠత్వమును, సాధించుశక్తిని బడయగలదు. ఈ యోగమువలననే వానిని భద్రపఱచుకొనెడి శక్తిని పోషించుకొనగలుగును. మేము యోగదృష్టి వలన చూచునది ఆధ్యాత్మిక పరివర్తనమునే. ఈ భౌతికము, దానియొక్క ఛాయ, అసంకల్పిత చేష్టనము మాత్రమే.

X          X          X          X

భారతదేశముయొక్క కేంద్ర విభావన (Central conception) ఆ శాశ్వతత్వముయొక్క విభావనయే యైయున్నది. ఇచ్చట ఆత్మ జడప్రకృతిచే

ఆవరింపబడి, దానియందే అంతర్హితమై, అంతఃస్థితమై యున్నది. మఱియు, జడాత్మక భూమికలయందు వ్యక్తిగతములైన ఆత్మయొక్క పరిమాణముల ననుసరించి, పునర్జన్మల మూలమున మనోమయ పురుషుని వఱకు వికసితమై, ధారణ జగత్తునందును, సచేతనతో కూడిన నైతిక ధర్మరాజ్యమందును ప్రవేశించును. ఈ సాహసోపేతమైన కృత్యము, అజ్ఞాత మనో వ్యాపార జడ ప్రకృతిపై విజయము, దాని ఆశయములు, అభివృద్ధికర సాత్వికావిష్కృతియగు వఱకు విస్తరించుకొనును లేదా, మానసిక సాధనయొక్క అధ్యాత్మిక గతి, మానవుని యందుగల వ్యక్తిగత సత్తా; తనకు తానై మానసాతీతమైన పవిత్రమైన అధ్యాత్మిక సచేతనతో తాదాత్మ్యము కాగల శక్తివంతమైన దగువఱకు, దాని స్థితులను ఔన్నత్యత పరచుచు అభివృద్ధి జెందుచునే యుండును. ఈ విభావనను ఆధారముగ గొని నిర్మింపబడినదే మన భారతీయ సాంఘిక విధానము. భారతమాతయొక్క ఆత్మవిద్యకు యీ విభావనయే మూలసూత్రము అధ్యాత్మిక సచేతన, దానియొక్క ఫలముల నాకాంక్షించుటయే ఆమె మతము. ఆ రీతిగనే ఆమెయొక్క కళలు, సాహిత్యము కూడ ఊర్ధ్వముఖముగనే జూచుచున్నవి. ఆమెయొక్క ఉనికి, స్వధర్మ నియమములు అద్దానియందే నాధారపడి యున్నవి. ఆమె అధ్యాత్మిక అభిగమనమును మాత్రమే అంగీకరించును. కాని, అధికముగ యీ జాత్యభివృద్ధి పొందవలయుననెడి, సమర్థనీయములగు జడాత్మక నాగరికతలచే స్వతః విస్తృతములగు బాహ్యగతులను మాత్రము కాదు. ఇట్టి ఉన్నత భావములతోనే ఆమె తన జీవితమును నిర్మించుకొనినది. భారతమాతయొక్క ప్రేరణ ఆ శాశ్వతత్వమునకును, అధ్యాత్మికోన్ముఖముగ నుండుటచే ఆమె నాగరికత కొక ప్రత్యేకమైన విలువ యేర్పడినది. ఈ మహోన్నతాదర్శము లందామెకు గల భక్తి ప్రపత్తుల వలననే — మానవాపరాధములెన్ని యున్నను — యీ సర్వమానవ ప్రపంచమందు భారత ప్రజలొక ప్రత్యేక జాతీయులుగ యేర్పడి యున్నారు.

X X X X

భారతప్రజలకు తమ జీవిత సర్వస్వమొక ధర్మనిష్ఠ యనుటయు, వారి జీవితాశయములందు కొంత సత్యమున్నదనుటయు నిశ్చయము. ఒక విధముగ వారి వాస్తవికత యందును, అభ్యాసములందును కూడ యదార్థ మున్నదనుట

నిస్సందేహము. భారతీయులు, ఆధ్యాత్మిక, ఆంతరంగిక జీవితములందు యే కార్య మాచరించుచున్ననూ ఆ తత్వశాస్త్రస్థితులు వారి గమనమునకు వచ్చుచునే యుండును. సహజ జీవితమునకన్న అతీతమైనదియు, కాలాతీతమైనదియు, వ్యక్తిగత అహంభావముల కతీతమైనదియు; ప్రాణాత్మక స్థూలప్రకృతుల అవసరములకు అభిరుచులకు అతీతమైనదియునైన వొకానొక గొప్పశక్తియో, లేక అద్దాని చిహ్నమో ప్రతిచోటను, ప్రతి వస్తువునకును సమీపముగ నున్న టుల భారతీయులు భావించుచున్నారు. ఆ విశ్వాసమే దానియొక్క పద్ధతుల ద్వారా భారతీయుల భావ, క్రియా, స్పర్శల రూపములనే మార్చుచున్నది. అయ్యదియే నిపుణతగల ఆధ్యాత్మిక వాంఛలకు సూక్ష్మవేదిత్వము (Sensitive-ness) ను వుత్పత్తిజేయు చున్నది. పారమార్థిక చింతన, విశేషించి అందులకు తగు ప్రయత్నము, భారతీయుల స్వభావములం దీనాటికిని ప్రత్యేకముగ గోచరించుచునే యున్నది. మనము మాటలాడు, భారతీయులకు స్వాభావికమైన ఆధ్యాత్మికతను సత్యమైనదిగ నిరూపించుటకు ఆ సూక్ష్మవేదిత్వమూ, ఆ సంసిద్ధతయే ప్రత్యక్ష నిదర్శనములు.

X X X X

భారతప్రజలు — "అజ్ఞాని, నిరక్షర కుక్షియే యైనను" — శతాబ్దముల నుండి, పరంపరగా వచ్చు శిక్షణలద్వారా; తాము ఆంతరంగిక వాస్తవికతలకు బహుసమీపముగ నున్నామనియు, విశ్వజనీన ఆ విద్యయొక్క సున్నితమైన ప్రఛ్ఛన్నతవలన, ఆ వాస్తవికతలనుండి వేరుపరచబడి యున్నామనియు, అంతియేగాక, తదితర ప్రాంత మానవ సముదాయముల కన్నను, నాగరికత శ్రేష్టులకన్నను చాల సులభముగ ఆ శాశ్వతత్వముయొక్కయు, ఆత్మశక్తి, దైవత్వములయొక్కయు, ప్రాణాత్మక క్షణిక దర్శనములకు మఱల క్రమ క్రమముగ గొనిపోబడుదు మనెడి నొక ప్రత్యేక భావమును, విశ్వాసమును గలిగియున్నారు.

దృఢమైన యీ చొరవ, ఆధ్యాత్మిక స్థితులకు బహు సన్నిహితత్వము, మహోన్నత సత్యమార్గము ననుసరింప యావద్భారతీయ మనస్తత్వము సన్నద్ధముగ నుండుట; యియ్యవి యదార్థమైన, యింకనూ సజీవమైన, బహు సనాతనమైన, సర్వోత్కృష్టమైన ఆధ్యాత్మిక నాగరికతకు చిహ్నములు గావా!

X X X X

మన మతము పాశ్చాత్యుల బుద్ధికి అందగల యెట్టి నిర్వచనము కాజాలదు. దానియొక్క పూర్ణత్వమునందు సర్వవిధములైన ఆధ్యాత్మికారాధనలకు; అనుభవములకు; పూర్ణస్వాతంత్ర్యమును ద్వేషరహితమైన సమానత్వమును గలదు. మఱియు, సర్వతోన్ముఖముల నయ్యది యేకైకసత్యమునే అనుష్ఠించుచున్నది. మన మతమునందు యేదియు నిషేధముగాదు. మఱియు, ప్రత్యేకమైన యెట్టి నామమును తనకొఱకై తెలుపుకొనుటలేదు, మితభేదములచే బంధింపబడుటయునులేదు. దాని నియమిత సన్మానములకు, విభజనలకు వివిధ నామముల నంగీకరించినను; తనకు తాను నామరహితమై, రూపరహితమై, సర్వజనీనమై, అపరిచ్ఛిన్నమై, చిరకాలముగ వెతకుచున్న శాశ్వతానందమూర్తియైన ఆ పరబ్రహ్మమువలె నున్నది. దాని సాంప్రదాయములందు, వేదములందు, గౌరవములందు, సంకేతములందును కూడ, తదితరమతములకన్న నొక ప్రత్యేకత స్పష్టముగ గోచరించుచున్నను, ప్రధానధర్మమందు కేవలము నమ్మకముతో కూడిన మతము యెంతమాత్రము కానేరదు. మఱియు, మన మతము బహుముఖములైనదియు, సువిశాలమైనదియు, సర్వదా సర్వమును ఐక్యతపరచునట్టిదియు, దినదినాభివృద్ధి జెందునట్టిదియు, ఆధ్యాత్మిక నాగరికతలందు ఆత్మవిస్తృత జెందునట్టిదియు నైయున్నది.

* * * *

మన మతము, మానవ జీవితమునకు ప్రధానావసరములైన సోపానముల నాల్గింటిని యేర్పరచినది. ప్రథమత: యెద్దాని ( యేపరబ్రహ్మము ) నుండి యీ సర్వస్వము వెలువడుచున్నదో, యెద్దానియందు యీ సకలము వసించుచు, సంచరించుచు, అద్దానినే యెరుంగజాలక మసలుచున్నవో, ప్రతిజీవియు యేదో నొకదినమున యెద్దానిని (ఆ పరబ్రహ్మమునే) విధిగా నెఱుంగవలసియున్నదో, యీ సమస్త విశ్వము యే దిశను జనుచున్నదో అట్టి మహోన్నత సచేతన, విశ్వముయొక్క పరాత్పరత, విశ్వముయొక్క ఉనికి, దానియొక్క స్థితులందును; ఆ అనంతస్వరూపము, శాశ్వతత్వము, పవిత్రతలందును దృఢమైన నమ్మకము అనెడి స్థిరమైన బీజమును భారతప్రజల హృదయములందు నాటినది. తదుపరి బ్రహ్మాండమైన యీ సృష్టియొక్క సత్యమును స్వతః సచేతనలో నెఱుంగుటకు సిద్ధమగువరకు; వ్యక్తిగతముగ మానవుని జీవితమందు అనుభవముల ద్వారా అభివృద్ధిజెందుటకు ప్రయత్నించవలసిన ఆవశ్యకతను వ్యక్తపరచినది

ద్వితీయస్థితి. తృతీయమందు, ఉత్తమ స్థాపనములతోను, ఉత్తమ పరిశోధనల తోను, వివిధములైన శాఖలయందును, సర్వదా అభివృద్ధికరమైన జ్ఞానవిస్తరణ మార్గములతోను ; ఆధ్యాత్మిక, మతశిక్షణముల నేర్పఱచినది. చతుర్థమందు, యిట్టి ఉన్నతస్థితుల నందుకొన సిద్ధముగ లేనివారలకు, వ్యక్తిగతమైన సమష్టి జీవితమును, స్వకీయమైన సాంఘిక శిక్షణమును ; మానసికప్రవర్తన, నైతిక బుద్ధి, ప్రాణాత్మకాభివృద్ధి యనెడి రూపముల నేర్పఱచుటవలన, ప్రతివ్యక్తియు తన ప్రకృతి ననుసరించి, వ్యక్తిగత నియమములందు మెలగుచు, క్రమక్రమ ముగ బ్రహ్మాండమైన యీ ఉనికి నెఱింగెడిస్థితికి సిద్ధపడునట్టి నియమముల నేర్పఱచినది.

X X X X

మానవుల స్వభావములకు, మానసికత్వములకు, బుద్ధికుశలతలకు సంబం ధించినంతవఱకు వానివాని విశేషతలయందు హద్దుయనునదియే లేదనియు, ఆ అనంతస్వరూపమును జేరుటకు ప్రతి మానవుని భావనయందు, ఆరాధనల యందును సంపూర్ణ స్వాతంత్ర్యముండవలయుననియే మన మతము సర్వదా విశ్వసించుచున్నది.

* * * *

కనీసము మతమునందు ముఖ్యమైనది, దానియొక్క సిద్ధాంతము, ఆస్థికత్వముయొక్క ఆత్మ. చైత్యవిషయములేగాని ; కేవలము ధర్మ జ్ఞాన బోధలు మాత్రమేగాదని భారతీయుని భావము. ఇచ్చట, బుద్ధికుశలతలతో కూడిన దృఢమైన నమ్మకమే సన్మార్గమునందు అత్యంత ముఖ్యమైన అంశమను విషయము పాశ్చాత్యుల మనస్తత్వములకు భిన్నమైనది. దాని (నమ్మకము) యొక్క అంతర్భావము అయ్యదియే' తదితర మతములనుండి మన మతమును ప్రత్యేకపరచెడి అంశమూ నయ్యదియే.

* * * *

ఉన్నతమైన ఆధ్యాత్మికతయందును, ఆధ్యాత్మిక సాంస్కృతియందును ప్రథమస్థానమలంకరింప భారత నాగరికప్రజల పోరాటమునుగురించి వారియం దభిమానముతో విశేషించి విశదీకరింపగలుగునదేమియు లేదందువా ! చూడుము,

మహోన్నతమైన, సువిశాలమైన ఆధ్యాత్మిక సత్యమును సాహసోపేతమైన ఔదార్యముతో యీ భారతావని అనుష్ఠించుటమాత్రమేగాదు; ఆ సత్యమును అద్వితీయమైన శక్తి సామర్థ్యములతో అనుభవించినది, విశదీకరించినది, ఆ సత్యమును సాధ్యమైనంతవరకు నలుదిశలనుండియు సమీపించినది, ఉన్నతమైన జీవితాశయములను సచేతనతో వుద్ధరించినది; మఱియు ప్రతివస్తువు యొక్క అంతర్భావమును, సర్వమతస్థాపనమును, దానియొక్క మూలరహస్యమును, మానవుని ఉనికియొక్క అంతిమలక్ష్యమును ప్రకటించగలిగిన యదార్థత మాత్రమే చాలు ఆ పోరాటము ఆధారభూతమైనదని అంగీకరించుటకు. ఈ ప్రకటించిన సత్యము భారతీయ మనస్తత్వమునకు వింతయైనదియో లేక అసాధారణమైనదియో గాదు. బుదికుశాగ్రతగల ప్రతివొక్కరిచేతను—వారెచ్చట యున్నను—పరిశీలింపబడి ఆచరింపబడినదియే. తదితరదేశములందు, అగాధమైన దీర్ఘయోచనాపరులు యే కొలదిమందికో, అతిస్వల్పసంఖ్యాకులైన యే అపూర్వమర్మజ్ఞులకో, లేదా భగవంతునిచే ప్రసాదింపబడిన అసాధారణ ఆధ్యాత్మిక స్వభావులకు మాత్రమే ఆ మహోన్నతసత్యము జీవిత మార్గదర్శకముగ నున్నది. ఆ మహోన్నతసత్యమును తెలిసికొనజాలినశక్తి అచ్చటి సామాన్యప్రజానీకమునం దెంతమాత్రములేదు. అందులకు తగిన గ్రహణశక్తియైనను వారియందు కానరాదు. లేదా, కనీసము యీ అతీతసత్యము యొక్క ప్రతిబింబముల క్షణికదర్శనములనైనను పొందగలశక్తి వారియందు గోచరించదు. అందుచే వారు మతముయెడల — బాహ్యములైన జీవిత ఐహిక విభూతులతోను, వానియందు నిమ్నతరస్థితులతోను, దేవతలయందు బహు సామాన్యభావములతోను మాత్రమే జీవించుచున్నారు. కాని, మానసిక ధర్మమందును, విశ్వజనీనతచే ఆ అతీతశక్తిని సమీపించుటయందును, తదితర యే పరిజ్ఞానమూ పొందజాలని మహోన్నత శక్తిని సాధించుటయందును భారతీయ పరిజ్ఞానము పూర్ణపట్టుదలతో కృతార్థత జెందినది. మఱియు, అతి ముఖ్యములైన ఆధ్యాత్మికభావములతో మతమునకు యదార్థమైన రూపముల నేర్పఱచుటయందును, మతభూమికలయందలి ప్రతి భాగమునందునను సజీవమైన గొప్ప ఆధ్యాత్మికసత్యముల ప్రతిబింబములను, వానియందు ప్రాణశక్తిని పొందుపఱచుటయందు కూడ భారతీయ పరిజ్ఞానము కృతార్థత జెందినది.

హిందూమత సాంప్రదాయులైన భారతీయులు తమ మతముయొక్క ఉన్నత ఆధ్యాత్మిక, దార్శనీక సత్యముల నేమాత్రమైనను యింకనూ గ్రహింపలేదనెడి కళంకభావములను వెలిబుచ్చుటకన్న సత్యదూరము మరొకటి యుండనేరదు. అదియునుగాక, కేవలము బాహ్యములైన మత ఆచారములందును, ప్రత్యేక సాంకేతములందును మాత్రమే భారతీయులు జీవించుచున్నారనుట పూర్తి అనృతము, బుద్ధిపూర్వకమైన సంకుచితభావమే యగును. ఈ నిమ్నతర భావములకు ప్రత్యామ్నాయముగ, మన మతము ఆధ్యాత్మికతయొక్క ముఖ్యమైన దార్శనీకసత్యములను, వాని విశాల భావ, విభూతులను ; క్రియాపూర్వక వర్ణనలతోను, మహాకావ్యములద్వారా, సర్వప్రజానీక మనోవీధులందు స్థిరమైన రూపముల నేర్పఱచినది. అంతియేగాదు ; మాయ, లీల, అంతఃస్థితదైవము అనెడి భావములు ఋష్యాశ్రమములందలి మహాపురుషులకు, పర్ణశాలలయందలి మునులకు, యేకాంతవాసులైన ఆధ్యాత్మికులకు, ఆలయమందలి ఆరాధనాచార్యులకు మాత్రమే గాక వీధులయందలి భిక్షువునకు సహితము అత్యంత సుపరిచితములైన విషయములే. వారు ప్రతిధ్వనింపజేయుచున్న ఆధ్యాత్మిక సత్యములను, వారు చూపు గంభీరములైన అనుభవములను వారి మతమునందునను, సాహిత్యమందునను, కళలయందునను, సమస్త ప్రజానీకముయొక్క జానపద గీతములందునను, మఱియు, గాన, గేయములందునను కూడ స్పష్టముగ చొప్పించియున్నారు.

*　　*　　*　　*

మతము — ఆధ్యాత్మికత భారతీయమతమునకు యీ రెండును ఆత్మవంటివి, అవినాభాజ్యములైనవి, వొకదానితో నొకటి గట్టిగ పెనవైచుకొనియున్నవి. భారతీయ తత్వశాస్త్రముయొక్క పూర్ణసంకల్పము, దానియొక్క అఖండ హేతువు, ఆత్మజ్ఞానము. అనుభవములు కూడ ఆధ్యాత్మిక ఉనికికి చక్కనిమార్గము. దాని యేకైకలక్ష్యము ; అత్యున్నతమైన మతార్థ సూచనలతో యేకీభవించుచున్నది. భారతీయమతము ఆధ్యాత్మిక ధర్మశాస్త్రమునుండి పరమతమ అభికాంక్షలను ప్రకాశింపజేయు స్వాభావికములైన విలువలనన్నిటిని పొందుపఱచుచున్నది. మఱియు, మతానుభూతుల నిమ్నతరస్థితులనుండి పొందినవానియందు అధికభాగములకు సహితము రూపముల నిచ్చుచున్నది.

*　　*　　*　　*

భారతీయ మతమునకు — తత్వశాస్త్రమునకు, జీవిత విలువలను సరియైన మార్గమున నెఱుంగుటచే. ఆ రెండింటికిని అన్యోన్యమైన సంబంధమేర్పడి యున్నది. మతము — తత్వశాస్త్రము ; యీ రెంటను భారతీయ పరిజ్ఞానమందు ఆంతరంగికమైన యేకత్వము గలిగియుండుటచే, వొకదానినుండి మరొకదానిని విడదీయుట అసాధ్యమైన కార్యము. భారతీయ ధర్మశాస్త్రమనగా నిరాధారములైన తర్కశాస్త్ర చింతనలయొక్క కేవల కారణభూతమైన కసరత్తువంటిది గాదుసుమా ! మఱియు, ఐరోపాదేశమందలి. అధికభాగములందుగల తత్వశాస్త్రమువలె, అతి సూక్ష్మరీతిని మాటలల్లగల నైపుణ్యత గలిగినదియో, అట్టి మనోభావములల్లగల చాతుర్యముగలదియో గాదు. అయ్యది (భారతీయుల మతము — ధర్మశాస్త్రము) బుద్ధికుశాగ్రులచే శ్లేషింపబడిన సిద్ధాంతము, సహజ జ్ఞానము గలవారందరి శ్రమ ఫలముగ క్రమక్రమముగ బహిర్గతమైనది. మన మతమునకుగల అద్భుతశక్తి యేమన : ఆత్మ, భావము, క్రియాపూర్వక సత్యము, హృదయానుభవము మొదలగునవి. మన మతము క్రియలద్వారా, అనుభవములద్వారా గడించిన భారతీయ ఆధ్యాత్మికత, తత్వశాస్త్రము యియ్యదియే.

* * * *

భారతీయ తత్వశాస్త్రము ; ప్రకృతి విజ్ఞానమునుండి తొలగి ప్రక్క మార్గమున బోవుచున్నదనుట అసత్యము, కేవలము సిగ్గుచేటు బ్రహ్మాండమైన మన నాగరిక చరిత్రను నిర్లక్ష్యపరచుటయేగాని తదన్యముగాదు. ప్రకృతి యనగా కేవలము యీ స్థూలప్రకృతియే యైనచో, అందలి యదార్థమైన సత్య మేమనగా : యింతవరకు యీ ఆధునికయుగమందు, యే దేశమందేగాని యెవ్వరేగాని చేయజాలనంతటి శాస్త్రపరిశోధనను ప్రాచీన భారతీయులు గావించి విజయస్థూపమును నిలిపియున్నారు. భారత చరిత్రయందు గోచరించుచున్న సత్యమును ప్రతివారు నెఱుంగవచ్చును. శ్రేష్ఠులైన భారతీయ విద్యాధికుల చేతను, శాస్త్రవేత్తలచేతను ; ప్రతి శాఖనుండియు, ప్రతి ఉపశాఖనుండియును కూడ సమున్నదమైన శక్తితో ఆ సత్యము మిందుకు గొనిరాబడినది. ఇందలి భేదాభేదములను గుర్తించెడి సంకల్పముతో ఐరోపా పాండిత్యులచే యీ మహత్తరసత్యమీ వరకే తెలిసికొనబడి, అంగీకరింపబడినది. భారతదేశము గణితశాస్త్రమందును, జ్యోతిషశాస్త్రమందును, రసాయనికశాస్త్రమందును వైద్య శాస్త్రమందును, శస్త్రచికిత్సలయందును మాత్రమేగాదు [illegible]

రించుట ; స్థూలజ్ఞానమందలి సర్వశాఖలనుకూడ ప్రాచీనకాలముననే తీవ్రముగ నభ్యసించియున్నది. ఐరోపాదేశీయులు యీ నవీన శాస్త్రపరిశోధనలకు ప్రాతిపదికయైన శాస్త్రపరిజ్ఞానమును, అరబ్బులనుండి నేర్చుకొనిరి. ఇయ్యది వారి అలవాలలో నొకటి. అట్టి అరబ్బులకు బోధించినవారు గ్రీకులు. అట్టి గ్రీకులతో సన్నిహితసంబంధమున్నదే మన ప్రాచీన భారతదేశము. సర్వతోన్ముఖముల, బహుళములగు విషయములను కనిపెట్టగలిగిన ఆధిక్యత మన భారతదేశముననే లభించినది. ఈ బహుళములైన విషయములలో అతి ప్రాముఖ్యమైన రెండు ఉదాహరణలను గమనింపుము. గణితశాస్త్రమందు దశాంశపద్ధతి ప్రప్రథమమున గుర్తించినవాడు భారతీయుడు. రెండవది, యీ భూమి తిరిగెడు గోళమనియు. భూమి తిరుగుచున్నను, తిరుగనట్లు గోచరించుచున్నదని "గెలీలియో"కు కొన్ని వందల సంవత్సరములకు పూర్వమే భారతీయ జ్యోతిషశాస్త్రజ్ఞుడు స్పష్టపఱచియున్నాడు. ఇట్టి మహోన్నతాభివృద్ధి జెందినదియు, ఆధ్యాత్మికపురుషుల మార్గదర్శకత్వమున నడచు విజ్ఞానులు, విద్యాధికులు గల యీ దేశము ప్రకృతి పరిశోధనలనుండి మరలుట అసంభవము. భారతీయునియందుగల అపూర్వ లక్షణమేమనగా : అతడు తన జీవితావసరములందు అతి జాగ్రత్తతో మెలగుట, ప్రధానవిషయములనెల్ల సూక్ష్మజ్ఞానముచే నెఱుంగవలయుననెడి సంకల్పము, దానియొక్క ప్రతిభాగమునందునను శాస్త్రమును, ధర్మమును చక్కగా స్థాపించుకొని క్రమానుసారముగ అనుష్టించుటయే వాని స్వభావము. ఇయ్యది శాస్త్రీయ భావములకు కనీసము పుత్తమమార్గమగునే గాని : నిరూపింపజాలని తత్వ విచారణకు మాత్రమే తగిన పరిజ్ఞాన చిహ్నమెంతమాత్రము గానేరదు.

*　　　*　　　*　　　*

భారతీయ నీతిశస్త్ర (Ethics) ల విధులందు ప్రాచీన మనస్తత్వమును గొప్ప ఔదార్యముతో సర్వజన సమ్మతముగ జేసికొనిరి. వైరాగ్య భావము లెంత పెరుగుచున్నను, అత్యున్నత స్థితులయందు కొంత కాఠిన్యత లేర్పడుచున్ననూ రసజ్ఞ (Aesthetic) లను, సుఖవాదు (Hedonistic) లను సహితము నిషేధించలేదు, వారినంతగ నిరుత్సాహ పరచనూలేదు. ఈ పరిజ్ఞానము యొక్క ముఖ్యభావము, అన్ని తరగతులయందును, అన్ని స్థితులయందు ననుగల రసాత్మక సంతృప్తి నొందుటయే కవిత్వము, నాటకములు గనము,

నృత్యము, సంగీతము మొదలగు కళలన్నియు ఋషుల అనుగ్రహముచే పొందబడి, ఆధ్యాత్మిక పరిజ్ఞానమునకు తగిన పరికరములుగ వినియోగించు కొనబడినవి.

భారతీయుల చిత్ర. శిల్పకళలు ; వాస్తు శాస్త్రము ; యివ్వావి రసాత్మక మందును, సాంఘిక, నాగరికతలందును, మానవుని వ్యక్తిగత జీవితమును వివరించుటయందును సంతృప్తి కరమైన సేవజేసియున్నవి. ఈ సృష్టియందు కారణభూతమైన తమ పాత్రలను చక్కగా పోషించినవి. అయినను యీ పరి జ్ఞానముయొక్క మహోన్నత ఆధ్యాత్మిక భాగములందు, యింకనూ వీనియొక్క ఉన్నత కార్యములను భవిష్యదుపయోగమునకై భద్రపఱచబడియే యున్నవి. భారతీయుని మానసిక చింతనల వత్తిడిచే ఆత్మ, ఈశ్వరాంశము, ఆధ్యాత్మి కము, అనంతములనెడి భావములు పూర్తిగ మేఘావృతమైయున్నరీతి సువిదిత మైనదేగదా! రసాత్మకమును, సుఖవాదములను పొందుపఱచుటయు, యథేశ్చగ వానిని వినియోగించుటయు కేవలము మతమునకు, ఆధాత్మికతకు తోడ్పడు ననియేగాక, మానవుడు ఆత్మనుజేరుట కయ్యావియే సింహద్వారములుగ విని యోగించు కొనిరనెడి సత్యమును కూడ మనము గమనించ వలయును.

*   *   *   *

తాపసీకాంశము యే కొంచమైనను లేనిదే, విశేషించి యేదియు పూర్ణ పరిజ్ఞానము కానేరదు. తాపసత్యమనగా : మానవుడు స్వార్థరహితుడై, తనను తాను జయించుకొని, నిమ్నతర చిత్త స్పందనములను అణచివైచి, తన స్వభావమందుగల ఉన్నతస్థితుల నందుకొనుటయే. భారతీయ తాపసత్వము దుఃఖకరమైనదియో, బాధాకరమైనదియో, శుష్కింపజేయునదియో, వ్యాధి గ్రస్తమైన ప్రాయశ్చిత్తమో, అత్యంత విచారకరమైనదియో గానికాదు. అయ్యది సచ్చిదానందమును జేర, ఆత్మను పరిపూర్ణముగ స్వాధీన పఱచు కొనుటకై చేయు గంభీరమైన ప్రయత్నము మాత్రమే. ఆ అనుభవ ఆంతర్య మునందు ; ఆత్మ విజయముయొక్క ఆనందము ఆంతరంగికశాంతి, ఆనం దము, పరమ తమ స్వాతిక్రమణయొక్క మహదానందములును గలవు. కంద రములతో మత్తెక్కినటుల జేయుటకును, బాహ్యజీవితమునందు వ్యామో హము నధికపరచుటకును, కేవలము యీ మనస్సే కారణము. ఈ మనస్సు అస్థిరములైన వాంఛలతో సంతృప్తిజెందుటకై నిర్విరామముగ ప్రయత్నించు

చున్నది. ఇయ్యది తాపనత్య ప్రయత్నముయొక్క ఆదర్శము, ఔన్నత్యము లను, తద్గంభీరతను నిరాకరించు చున్నది.

*　　　*　　　*　　　*

వైరాగ్యము — మాయావాదము : అంతప్రాముఖ్యములైన విషయ ములుగావు. కాని, భారతీయ ఆధ్యాత్మికత ; దానియొక్క మహోన్నత దశ లందునను, అత్యంత ఆంతరంగిక సాంకేతము లందుననుకూడ శ్రమను కలుగజేయు అచలత్వమో, సాంప్రదాయకమైన సన్యాసత్వమోగాని కాదను నదియే ముఖ్యమైన విషయము. కాని, మానవసత్తా ; వాంఛలతో కూడిన జీవి తమునకును, ప్రాణమయ జీవిత సంతృప్తికిని అతీతమైన, ఆధ్యాత్మిక నిశ్చ లత్వముయొక్క ఉత్కృష్టస్థితికిని ; గొప్పతనము, శక్తి, వెలుగునకును ; భగ వత్సాక్షాత్కార, నిరంతరశాంతి, బ్రహ్మానందములకును జేరుటకై తీవ్రమైన ప్రయత్నము చేసినది భారతీయ పరిజ్ఞానమునకును, చలనత్వముతోకూడిన నవీన భావలములందుగల గొప్ప లౌకికమునకును మధ్యగల ప్రశ్న : మాన వుని ఔన్నత్యమునకు, పూర్ణత్వమునకు బ్రహ్మాండమైన యీ ప్రయత్నము అంత ముఖ్యమైనదా, కాదా? యనునది, ఈ పయత్నము అవసరమేయైనచో, అపూర్వులైనదేహులు యే కొలదిమందికి మాత్రమే ఆ ప్రత్యేకశక్తి యుండ వలయునా? లేక అద్దానిని శ్రేష్టమైన యీ సమస్త మానవ సాంస్కృతి కంతటి కిని అనుప్రేరణతో కూడిన కారణశక్తిగ జేయుటయా? యను మరొకప్రశ్న వుత్పన్నమగుచున్నది.

*　　　*　　　*　　　*

భారతీయ పరిజ్ఞానము, మానవునియందుగల భౌతికపూర్వక్రమణమున కన్ననూ అతీతమైన దానికే అత్యంత ప్రాధాన్యత నొసంగు చున్నది. పరాత్ప రునే తన లక్ష్యముగను, మానవప్రయత్నమునకు ప్రయాసతోకూడిన ఆత్మ విస్తృతయే శిఖరముగ నెంచుకొనినది. ఆధ్యాత్మిక జీవతస్థితులయందు ; బాహ్యసంపద, జీవిత భోగభాగ్యములకన్న ఉన్నతమైనది ; క్రియాపరునకన్న ఆలోచనాపరుడు (జ్ఞాని) ఉత్తముడు ; ఆధ్యాత్మిక పురుషుడు ఆలోచనా పరున కన్న అత్యంతశ్రేష్ఠుడు ; అట్లే, బాహ్యమైన మనస్సుచే భోగవాంఛలనే నాడుచు, తలంచుచు, జీవిత పదార్థములందేయుండు ఆత్మకన్ననూ, భగవంతుని

యందే వశించు ఆత్మ అత్యంత పరిపూర్ణమైనదియు, శ్రేష్ఠమైనదియునూ గదా!

*　　　*　　　*　　　*

ఈ సనాతన జ్ఞానమునకు — ఆంతరంగిక పరిశోధన. మనో విజ్ఞానము. అత్యంత గూఢమైన చైత్యశాస్త్రములకన్నను; భారతదేశ ప్రత్యేక శక్తియగు భౌతిక జ్ఞానమునకన్నను మిన్నగ మానసిక పరిశీలన యందును, ఆంతరంగిక శక్తుల పరిశీలనయందును మహోన్నత విజయమును సాధించ గలిగినందున అయ్యవి యదార్థమైన ప్రకృతి పరిశీలనకు ప్రాతిపదికగ నున్నవి. ఆమె వెదకు చున్న ఆధ్యాత్మిక సత్యమియ్యదియే యగుటచే, నద్దానిని అనుష్ఠింపనిచో నయ్యది యదార్థమైన, సహిష్ణువైన తత్వశాస్త్రి మెట్లగును! మఱియు, యీ మూలమునగాక తదితరములచే నయ్యది సాధ్యమగునా! భారతీయ పరిజ్ఞానము; తత్వశాస్త్రములకును, మత, మనోవిజ్ఞాన సత్యములకును మధ్య సమానత్వ మును స్థాపించినదనుట యదార్థమేగాని, స్థూలప్రకృతియొక్క సత్యములను తదైక పరిమాణమున విస్తరింప జేయలేదు యేలనన, ఆ తరుణమున యీ భౌతికశాస్త్రము విశేషించి విశ్వవ్యాప్తియై యున్నదికాదు. అందుచే అట్టి సమ న్వయమును (ఆధ్యాత్మికమును — భౌతికమును) పూర్తిగ సాధ్యమగునటుల జేయ యీ నాడు ప్రయత్నించు చున్నవి. ప్రారంభమునుండియు, అనగా! వేదభావములుత్పత్తియైనప్పటినుండియు ఆధ్యాత్మికతయందును, మనోవిజ్ఞాన మందును, ప్రకృతి ఉనికి యందునుకూడ సహజనిబంధనలు, వానిశక్తులు వొకే రీతియైనవిగ భారతీయులు గుర్తించియుండిరి. జీవితము సర్వవ్యాప్తమైనదిగ కూడ నెఱింగియుండిరి. మఱియు, ప్రకృతినుండి వృక్షాదులు, పశువు మొదలు మానవాకారము వరకునూ ఆత్మక్రమ వికాసము నొందుచున్నదని రూఢిపరచిరి. దానినే తత్వశాస్త్రి సంశోధన, ఆధ్యాత్మికత, మనోవిజ్ఞానానుభవములచే స్థిర పఱచిరి. అట్టివి అనేకములైన సత్యములను యీ నవీన శాస్త్రి పరిశోధన మిప్పుడు తన స్వవిధానముల తిరుగవానినే బలపఱచుచున్నది. ఈ విషయములు ఫలరహితమైన. శూన్యమైన, దార్శనీకశాస్త్రి ఫలములో, లేక పశుతుల్య భావములందే కాగ్రకతంబున నిమ్నతర స్వప్నములు గాంచెడి వారల నూతన కల్పయోగాదు.

———

# ద్వీపాదిత్యుడు

మూలం : శ్రీ అరవిందులు                                   అనువాదం : సునీతి

సువర్ణ సముద్రమున పయనించి
రజితాటంకమును దాటితిని నేను;
భువికి జెందెడి నిశీధ తారయగు
జ్ఞానభాస్కరుని జేరితి నేను.

అందు ప్రజ్వలించు స్వప్నదృశ్య పొలాలు,
అందు పర్వతములు అతి శక్తివంతమ్ములు
అందు శిఖరాలు జ్వాలాతీత పరవశమ్ములు,
అందుండు ద్వీపములు పరమానందభరితమ్ములు.

దైవప్రశాంతతతో ఏకాంతమ్మున
అనంతముగ కాలమున వసించునది;
జీవితమే ఆతని గానానుసరణమ్ము
చింతనయే సత్య తీవ్ర చరణమ్ము.

భువికి నేను జేరినప్పటికిన్
ఆ అనంత జ్ఞానమ్మును
మానవుని జన్మాంతరంగమందు దెచ్చుచున్
ఆ తేజస్సింకను నన్నావరించియుండెన్.

## సర్వాంతర్యామి

నాలో నున్నాడతను, అన్నిదిక్కుల నన్నావరించి
ఆతని దర్శనమ్మును ధిక్కరించుటకై అహం అడ్డుబడి
నిలబడెద నేను దాని తీరాల, అనంత
గగనాల పొలిమేరలన్ దృష్టి సారించెదను.

నేను గాంచెడి ప్రతి యొక్క సూక్ష్మవస్తువు ఒక ముఖము
అనంతము గాంచు నన్ను తనదు కవాటములనుండి,
నా యీ కళేబర నిర్బంధన వ్యర్ధముగా నిర్మించబడి,
నాలోని ప్రతి అణువున వెల్గు నాతని నిగూఢ ఉనికి.

నా శ్వాసానత్తయే ఆయె నాతను,
ఆతనే నా పరితాపము, నా పరమానందమ్మును.
నా జన్మమే ఆతని అనంత చిహ్నము, నా
మరణంబే ఆతని శాశ్వత మార్గమ్ము.

మూగవోయిన నాదు అగాధమ్ములు తెరగాంచిన ఆతని నివాసమ్ము
నా హృదయాంతరమ్మున వసియించియున్నాడు పూజింపబడని దైవమ్ము.

---

# అతీంద్రియ పరివర్తన

మూలం : శ్రీ అరవిందులు  అనువాదం : మల్లవరపు విశ్వేశ్వరరావు

నా యూపిరి సూక్ష్మలయాన్విత నిస్రుతిగా ప్రవహించును ;
అది నా అవయవమ్ములందొక దివ్యశక్తి నించును.
పెనుచషకమ్మున ద్రాక్షాసవమటు వే ననంతతనుద్రావితి
కాలము నాదగు నాటకమ్ము, దృశ్యస్వప్నము.

ఈ క్షణాన దీప్తమ్మగు నా జీవకణము లొక
హర్షజ్వాలా చిత్రమ్మై.
నా పులకీకృత శాఖాయుత నాడీజాలిక
నజ్ఞేయమ్మచ్చతమమ్మగు ఐశ్వర్యావ తరణమునకై
అమలపుష్యరాగాచ్ఛ స్ఫాటిక పారవశ్యకుల్యలుగా
పరివర్తిత మొనర్చె.

అస్తిమాంస పంజర మీ దేహమునకు నే దాసుడగానిక,
ప్రకృతికి తచ్ఛాసనమ్మునకు నే బానిసగానిక,
సంకుచి తేంద్రియ వాగుర నే నా బద్ధుడగానిక.
దిగ్వలయమ్ముల నెరుగని అస్మదాత్మ అనంత దూరదర్శనముకై
విస్తరిల్లు.
పరమేశ్వరు పరితోషిత జీవత్సాధనమైనా దేహము పరిధవిల్లు,
అమృతకాంతి చిప్పిలు విరాట్సూర్యబింబమగును నా అంతరాత్మ.

## నిర్వాణము

సర్వము ప్రక్షాళితమ్ము. పలుకని ఏకాంతమ్మొక్కటె.
భావనా విముక్తమైన నామది, దుఃఖముక్తమగు నా హృది
ఊహాతీతమ్మగు శూన్యమ్మున మున్గెను.
వేదహమిక, వేదిక ప్రకృతియు, జ్ఞాతాజ్ఞాతమ్మైనను.

నగరవాటి ఒక వివర్ణ ఛాయాచిత్రమ్మై తేలెడి, అవాస్తవమ్మై కదలాడెడి
అతి లఘురూపమ్ములు తెరపై చలనపటపు రిత్త చిత్రపుట
దోవెనదయాడెడి

అపార పారావారాఘాతమ్ముల మున్గిపోవు
అతల నగాగ్రమ్మట్టులాయె నీ యైహికలోకము.

నిరవధికము నిత్యమొక్కటేయిట, ఒక అఖండమగు
ప్రకాండశాంతి, నీ రూపమ్మును నిశ్చలమ్ము, నిఖిల వ్యాప్తమ్మగు
ఒకప్పుడే ననబడు దాననిపుడు నిండుకున్న పేరులేని నీరవశూన్యత
తృప్తమ్ముగ స్వీకరించు నజ్ఞేయమ్మున విలీనమై అంతరించుటో
అనంతకాంతి సంద్రముల దేలుచు పుల్కరించుటో.

## పిల్చు మనల మన అధిదైవము

పిల్చుమనల మన అధి దైవము అసిద్ధమగు వస్తుజాలమున
విస్తృతమగు అదృష్టవాటుల ప్రసుప్తమగు నాయా వస్తుల
సూక్ష్మమ్మగు నసాధ్యతకు దా నెల వొసగును రక్షణయొసగును
నిశ్శబ్దపు చలద్గరుత్తులు కాపుండెడు ఒక ప్రపంచము.

తల్లోక వినీల కవాటము విడినంతనె కదలినయంతనె
కనియెరుగని విచిత్ర విభవము కాన్పించును స్వప్ననేత్రముల
ఉదాత్తమగు దివ్యులమూర్తులు ఉజ్వల భవిష్య దైవములు ;
స్వర్లోకపు ముఖములు బాహులు చేరువయై దర్శన మొసగును.

అ దూరోర్ధ్వమ్మున మెరసిన అవి మనలోలోనను గలవిట
సిద్ధింపని ఆనందము మన భవిష్యమున జన్మహక్కగును ;
అస్ఫుటమగు మన ఆత్మకునై సౌందర్యము కామోద్రిక్తము ;
అనంత విశ్వావకాశముల కగుదుము మనమే వారసులము.

కావలసిన ఘటనల భవిష్యసూచనయే అసాధ్యమన్నది,
మర్త్యుడైన వాడేతుగు తా నమర్త్యతకు ద్వారాప్రాయము

# దైవపద్మము

ఓ దైవపద్మమా, మరకతాకాశముఖ సిందూర తిలకమా
ఆనందపద్మమా, అగ్నిమాధుర్యమా, సప్తవర్ణిత సప్తపారవశ్యాన్వితా,
మా మానవిక హృదయమందు జ్వలియింపుమీ,
అద్భుతప్రక్రియా, అనలారుణజ్వాల,
నామరహితుని ప్రణయరాగ ప్రసూనమా, పరమాత్మ
నామధేయుని పుష్పముకుళమా!

ఓ దైవపద్మమా, చైతన్య శిఖరసీమలవెల్గు ఉచ్చతమ విజ్ఞానసూనమా,
ఆలోకపద్మమా, ఉత్కృష్ట దివ్యదర్శన గర్భితమైన పరిశుద్ధ కేంద్రమా,
మా భౌమిక మనస్సులో అధివసింపుమీ, ఓ సువర్ణ రహస్యమా,
పుల్లపుష్పమా,
కాలరహితుని దివ్యఫాలార్క బింబమా, ధ్యానపరమాద్భుత ముహూర్త
దివ్యాతిథీ!

ఓ దైవపద్మమా, ఓ అనంతత్వదీప్తారుణ మహత్వమా,
ఓ ప్రబలరక్తవర్ణిత శక్తిరూపమా,
దివ్యమాహాత్మ్య పద్మమ, భవన్ముఖ వజ్రకాంతివలయమ్మంధకార
హృదయము జీల్చె,
మర్త్యమానవ చిత్తమందు ప్రజ్వలితమై త్వదపూర్వ పంకల్పవిధి
సంఘటింపుమీ,
అమృతత్వమూర్తి, అవిష్కృతమ్మొనరింపు మానవాత్మాంతరమ్మున
దివ్యచేతనత,

ఓ దైవపద్మమా, దివ్యేచ్ఛత్వన్మూర్తి దీప్తమై రక్తరాగ ప్రఫుల్లతగూర్చె
ఓ ప్రాణపద్మమా, పుల్లదళసాహస్ర వర్ణమయ వల్లకీ,

మర్త్యదేహమున పరివర్తనమ్మొనగూర్చు మధురేంద్ర జాలగీతీ
ప్రవాదనమట్లు,
మా భౌమ్య ప్రకృతికిని స్వర్లోక దివ్యతకు సేతువమరించి గావింపుమీ
కాలసంతానమ్ము నమృతులుగ.

ఓ దైవపద్మమా, శాశ్వతుని ముఖబింబ శశ్వదానంద రక్తిమ రాగ
రంజితా,
ఓ ప్రేమపద్మమా, చైతన్య సత్యగర్భిత పద్మరాగరక్తీ, దివ్యకారుణ్య
రస సముజ్వలమూర్తి.
అతల ప్రాకృతగర్భగత పిపాసాక్రోశ హృదయాంతరమునుండి
వికసితమై లెమ్ము
దివ్యాద్భుత ప్రక్రియాగేహముగ జేయుమీ భూప్రంచమును ఒనరింపుమీ
ప్రాణచేతనను సచ్చిదానంద చుంబితముగా,

———

# మహాలక్ష్మి

మూలం : అనువాదం :

శ్రీ అరవిందులు కీ॥ శే॥ రూపనగుటి నారాయణరావు

చిన్మయరూపిణీ! చిరమహాదేవి!
కమలకుంజములందు భ్రమరించు లక్ష్మి ;
నీకు శుభాసనము నేనెందుఁ గనుఁగొందు ?
భవదీయ రమణీయ పాటలారుణసదృశ
చరణములకెందు సంచరణంబుఁ గలిగింతు ?
నా హృత్కవాటంబు నలువొప్ప వివృతంబు
గావించి నా యెదఁద గద్దియను నిన్నుంతు.
తత్పురమందుఁ జేతఃప్రీతి విహరించు :
సౌరుతొఱఁగిన వస్తుజాతంబులవియెల్ల
నీకు నెంతయు జిగుప్సాకరంబయియుండు.
నేనో మహాలక్ష్మి! నిష్కళంకంబైన
చిరపూర్ణసదనమై పరఁగుచుండెదఁగాక!
ఆనందదాయినీ? యఖిలసౌందర్యముల
కాలవాలమగు నో మహాలక్ష్మి! భవదను
గ్రహము నాపై నెప్డుఁ బ్రవహింపఁజేయుమా!
దేవీ మహాలక్ష్మి నీవెప్పు డమరమౌ
ప్రేమబంధములనే కామించి ధరియింతు
గాని, శుష్కహృదయతఁ గాంచవు నీవెందు.
ఓ మాధుర్యమయీ! నీ మహితైంద్రజా
లంబుచే నను శాశ్వతంబ త్రణయంపు
సింధువుగఁ బ్రీతిమైఁ జేయుమా దేవి!

## ఇతర లోకములు

పలువన్నెలీను కొండలు,
జలధులు, పచ్చికబయళ్ళ జాల్వారు స్రవం
తులు, జాడలు దెలియని తా
రల పొంపుపలుకులఁ దేలు రంగంగు నింగిన్.

ఒలయు చీకటిలోన ఖద్యోతనిచయ
నర్తనము, పాండురనిశీథివర్తిలు హిమ
కరుని రజతకాంతులు, పాటల రుచిరా రు
ణాగ్ని దీప్తులు, స్వర్ణంపుటాకసమున
జ్వలితపక్ష హఠాత్కృతశబ్దములును,
ఐహికముకాని కానల వ్యాప్తిగొనెడి
సాంద్రనీరదమున వెదచల్లఁబడిన
స్మరణములబోలె మృగపక్షి సంచయముల
వింతయాకృతు, లావెన్క విపులతలము,
లందనంతత్వముల విస్మయావహమగు
దేవతల శాంతముఖముల దీధితులును,
అద్భుతానందదోజ్జ్వల యవనికలను
సంప్రబుద్ధంబయిన దృష్టి సంపతిల్ల
లోకములమీఁద లోకముల్ జోకపడెడు.

## వికసనపరిణామము

నాదు శ్వాసంబు సూక్ష్మలయాద్రుత ప్ర
వాహమునఁబాటి యవయవవ్రాతములను
దివ్యశక్తితోఁ బూరింపఁ దివిజుపగిది
నే ననంతత్వవారుణి నానినాను.

కాలమే నాటకము, చమత్కారపూర్ణ
మైన దృశ్యంబు నా స్వప్నమగుచుఁ బరఁగు;
నా ప్రకాశిత జీవకణప్రణాళి
సంప్రమోద దీపశిఖయై సంపతిల్లు.

జీవకళరాశినాడులన్ జృంభితగతిఁ
జిత్రతరదీప్తిఁ జిందుచు జీవుఁడించి
శాఖలయిపాఱెఁ బరముఁ దీశ్వరుఁడు నందు
జొరఁబడంగ స్రోతస్సులు దెఱచియుండు.

నేనిపుడు దేహమునకుగాని ప్రకృతికిని
గాని దానిని కృష్ణాధికారమునకుఁ
గాని గర్భదాసుఁడగాను; కరణజాల
ములఁ దగుల్కొని నేనింకఁ బొలియనోప.

నేననెడు నాత్మ విరివియై నేత్రములకుఁ
గొలది వెట్టఁగరాని దిక్పరిధి దాఁటు!
నా శరీరమన్ననో పరమేశునకు స
జీవరుచిరోపకరణమై చెలఁగుచుండు;
నాదు చిత్పురుషుండు వినాశరహిత
సంప్రభలనీను మహిత భాస్కరుఁడె యగును.

## ప్రకృతిమాత

దినము సాంతముగాఁగ జనని బిడ్డలఁజేరి
యాటవస్తులతోడి యాటలుడిపి
వారి తీవ్రాతిసక్తి పటివోనకుంటచే
నూఱటగల్గఁ బ్రియోక్తులాడి,

బలవంతముగను గేల్పట్టి వారినిదెచ్చి
మృదుశయ్యపైఁ బవ్వళింపఁజేసి,
రుచిరమౌ నాటవస్తుచయ మిచ్చెదనంచు
జోకొట్టి చిత్తసంక్షోభముడిపి
రమణ నిద్రపుచ్చెడిరీతిఁ బ్రకృతిమాత
యస్మదీయ క్రీనడక వాస్త్వాళియైన
యాలుబిడ్డలఁ జెలికాండ్రఁదూలఁజేసి
దీర్ఘనిద్రను మముఁ బుచ్చుఁ డియ్యముగను.

ఆ దీర్ఘనిద్ర కడచన
మేదు నూత్నానుభూతి మెయికొల్పెడి యా
హ్లాదకనవ పరిసర వ
స్త్వాదుల మధ్యముననుంటి హర్షమెలర్పన్.

———

# అంతఃకరణకు చెందిన అయిదు పరిపూర్ణతలు

మూలం : శ్రీమాత                                        భావానువాదం : వేణు

చంపక పుష్పము "అంతఃకరణమునకు చెందిన ఏ పరిపూర్ణతాసిద్ధి"కి చిహ్నమని నన్ను (శ్రీమాత) ఒకరు ప్రశ్నించిరి. ఇందులో ఒక పరిపూర్ణత మాత్రమేకాదు. ఆ పుష్పములోని రేకులవలె అయిదు పరిపూర్ణతలు కలవు. అవి : సత్యహృదయత, శ్రద్ధ, భక్తి, ఆకాంక్ష, సర్వసమర్పణతలు. నేను ఈ పుష్పము నిచ్చు ప్రతితూరి అవే పరిపక్వతలను భావించి ఇచ్చుచున్నానని అర్థముకాదు. పరిస్థితులనుబట్టి, వ్యక్తుల అవసరములనుబట్టి ఇవి మారుచుండును.

ఈ అయిదింటిలో మొదటిది : సత్యహృదయత. ఏలననగా సత్యహృదయత లేనిదే అభివృద్ధి అసాధ్యము ఒక అర్ధ అడుగుకూడ ముందుకు పోలేము.

'సత్యహృదయత' అనుదానిని "పారదర్శకత" (స్వచ్ఛత) అని కూడ అనవచ్చును. నే నొక వ్యక్తికి ఎదురుగా నున్నప్పుడు, అతని కన్నులలోనికి చూచెదను. ఆ వ్యక్తి సత్యహృదయుడుగా గాని పారదర్శకత కలవాడుగా గాని యున్నచో నే నతని కన్నులద్వారా అతని లోనికిపోయి అతని చేతనను (ఆత్మను) చూచెదను. కాని ఒక్కొక్కప్పుడు, నే నటుల చూచుచున్నప్పుడు, నాకు ఒక చిన్న మేఘము కనబడును. నే నింకను చూడగా తెఱ యగపడును. మఱింతగా చూడగా ఒక గోడను, ఆ తరువాత దట్టమైన చీకటిని చూచెదను. వాటినిగూడ దాటిపోవుటకు వానిలో రంధ్రములను చేసుకొని చొచ్చుకొని పోయినను, చివఱ క్షణములోకూడ నీవు చూడవలసిన దానిని చూచెదవను నమ్మకములేదు. అచట ఆత్మను కప్పిపుచ్చియున్న దట్టమైన ఇత్తడి తలుపు ఆగపడవచ్చును. ఈ విధముగా కనబడినప్పుడు ఆ వ్యక్తి సత్యహృదయుడు కాదని నేను చెప్పగలను. అనగా అతనిలో పారదర్శకత (స్వచ్ఛత) లేదని యర్థము, కాన సాధనకు సత్యహృదయత యనునది మొదటి అవసరము.

సాధనలో ముందుకు పోవలెనన్న తప్పనిసరిగ కావలసిన మరియొక పరిపక్వత – శ్రద్ధ. దీనికి గాఢ విశ్వాసము (నమ్మిక) యని మరియొక పద

మును వాడవచ్చును. ఈ పదము మీకు పరిమితార్థము గలదానిగా గోచరింపవచ్చును. కాని నాకు చాల ముఖ్యము. నీకు దైవముపై గాఢ విశ్వాసము లేనిచో, నీలో శ్రద్ధ యున్నదను కొనుము. క్రమముగా దైవముపట్ల విశ్వాసమును (దైవకృప శక్తులపట్ల) నీలో దైవముంచిన దైవిక విశ్వాసముపట్ల నీ విశ్వాసమును తగ్గిపోవునట్లు చేసుకొనుము. ఈ విషయములో మూడు విధములగు తప్పుడు అభిప్రాయములు కలిగి యుండుటకు వీలున్నది.

మొదటగా చెప్పదగిన వ్యక్తులు : తమకు దైవముపట్ల అచంచలమైన శ్రద్ధ యున్నదనియు "దైవమే అన్నియు చేయుచున్నది. చేయగలదు. నాలోను, ఇతరులలోను, సర్వత్ర జరుగుచున్న సంభవములన్నియు ఆ దైవ కార్యములే. ఆ దైవముని మాత్రమే," అనియు చెప్పుదురు. వారు ఇదేభావనను తర్క సహితముగా ఆలోచింపగా కొంత కాలమునకు ప్రపంచమున జరుగుచున్న తప్పుడు పనులకు, చెడుగులకు దైవమే కారణమని దైవమును నిందింతురు. వారిలో దైవముపట్ల నిజమైన విశ్వాసము లేనప్పుడు వారు దైవమును భయంకరమైన, క్రూరమైన దయ్యముగా రూపొందింతురు.

రెండవరకపు మనుష్యులు : వారికి దైవముపట్ల శ్రద్ధయున్నది. కాని, "నాకు దైవముపట్ల శ్రద్ధ కలదు, నిజమే. కాని ఈ ప్రపంచమో! దీని సంగతి నాకు బాగుగా తెలియును. ముఖ్యముగా నేను చాల బాధపడుచున్నాను. నేను అధిక దుఃఖములోనున్నాను. నా ఇరుగు పొరుగు వారికంటె మిక్కుటమైన దుఃఖములో నున్నాను. (మానవు డెల్లప్పుడు తాను ఇతరులకంటె ఎక్కువ కష్టములలో, దుఃఖములో నున్నానని చెప్పుచునే యుండును.) నిజముగా జీవితము నా పట్ల క్రూరముగా నున్నది. కాని, దైవత్వము, మంచితనము, దయా దాక్షిణ్యములు, సానురస్యత మొదలైన సమస్త గుణభూయిష్ఠుడైన ఆ దైవముండగా, నే నిట్లేల దుఃఖమయుడనై యున్నాను? దైవముచేతగానిదై యుండవలెను. లేకున్నచో అంతమంచి దైవము నన్నిట్లేల బాధల నొందించును." అని వీరు పలుకుచుందురు.

ఇక మూడవ రకమువారు : తప్పుకు వినయము లేక అతి వినయము గల వారినిగూర్చి ఇచట చెప్పుచున్నాము. వారు. "నిజముగా దైవము నన్ను పరిత్యజించెను. నేను దేనికీ పనికి రాని వానిని. నేను దైవమునకు ఏ విధముగను ఉప

యోగపడను. నేను ఆయనకు తగిన వాడనుగాను కావున నా యీ ప్రయత్నము వదలివేయవలెను," అని చెప్పుదురు. ఈ విధమైన ఆలోచనలు, సంకోచములు లేక, మన శ్రద్ధకు దైవకృపపట్ల గాఢ విశ్వాసమును జతచేయనిచో కష్ట పరంపరలు తప్పవు.

తరువాతి పరిపూర్ణత్వము — భక్తి. అంతఃకరణకు చెందిన పరిపక్వతలలో ఇది మూడవది. భక్తి చాలమంచిది కాని ఇతర సుగుణములతో కూడక యున్న భక్తి తప్పుడు మార్గమున పడవచ్చును. కష్టముల నెదుర్కొనవలసి వచ్చును.

భక్తియున్నప్పుడు, అహంభావముండరాదు. రెండు కలసియున్నచో, అహంభావపూరిత భక్తివలన అనేక పనులు గావింతువు. అనగా నీవు నిన్ను గూర్చి మాత్రమే ఆలోచింతువు ఇతరులగూర్చిగాని, ప్రపంచమును గూర్చిగాని, నీ చేయుపనిని గూర్చిగాని, చేయవలసిన దానిని గుఱించిగాని తలంపక నీ భక్తిని గుఱించి మాత్రమే నీవు ఆలోచింతువు. తత్ఫలితముగా నీవు మఱింత ప్రబలమైన అహంభావ పూరితుడవగుదువు. అప్పుడు, నీవు ఆశించినంత అభిమానముతో దైవము నీ భక్తికి బదులివ్వనిచో నిరుత్సాహపడి, నిరాశతో పై చెప్పిన మూడు విధములైన తప్పుడు భావములతో పడిపోవుదువు. అనగా దైవము క్రూరుడనియో — దైవము ముందువలె తమపట్ల సన్నిహితముగనో లేక దయాపూర్ణుడుగనో లేడని దైవమును దూషించు భక్తుల కథలను మనమెన్ని వినలేదు?- లేక దైవము నీ పట్ల విముఖుడుగ నున్నాడనియె తలంచి "నీవు నన్నేల వదలితివి? నన్ను పతనావస్థకు తెచ్చితివి. నీవు అతి క్రూరుడవు" అని నిందింతువు. ఆ విధముగా బయటకు పల్కుటకు సాహసింపక పోయినను ఆ విధముగా ఆలోచింతువు. లేదా అట్టివారు, "నే నెంత ఘోరతప్పిదమును చేసితినో ఆ దైవము నన్ను వదలివేసె"నని నిరాశ విస్పృహలతో పలుకుదురు.

కాబట్టి భక్తికి కృతజ్ఞత తోడుకావలయును. దైవమున్నాడనెడు కృతజ్ఞతాభావము, నీ హృదయము నంతటిని ఉత్కృష్టమైన వెలుగును నింపు నిట్టి కృతజ్ఞతాభావము, దైవమున్నాడు, ఈ విశ్వమున దైవపదార్థమున్నది. కాబట్టి మనకు కనిపించెడి క్రూరత్వమేగాక ఈ విశ్వమున దైవికమైనవికూడ కలవు- ఇట్టి కృతజ్ఞత భక్తికి జతకావలయును. అప్పుడు దైవిక అస్తిత్వమును తెలియ

జేసెడి ఏ చిన్న సంఘటన మైనను నీ హృదయమును గాఢమైన ఆశ్చర్య యుతమైన ఆనందముతో నింపివేయును. ఆ విధమైన కృతజ్ఞత చాలా రుచికర మైనది. దానితో సమానముగా నీకు ఆనంద మిచ్చునది మరియొకటిలేదు. ఒక పక్షి పాట వింటున్నప్పుడు, ఒక పుష్పమును చూచుచున్నప్పుడు ఒక ముద్దులు గారే పసిపాపను చూచుచున్నప్పుడు, ఉదారత్వపు పనిని ఒక దానిని గమనించి నపుడు, ఒకమంచి సూక్తిని చదివినపుడు లేదా సూర్యాస్తమయమును తిలకించు చున్నప్పుడు — వస్తువేదియని కాదు ప్రశ్న - దేనినైనను గమనించుచున్నపుడు- నీలో తక్షణమే భగవంతుడున్నాడు. భగవత్ప్రాదుర్భావము ఈ విశ్వములో నున్నది కాబట్టే ఇట్టివి సంభవములు అనెడి ఉద్వేగముతో కూడిన భావన లోతుగా, గాఢముగా నీలో కలుగును, అదే కృతజ్ఞత.

అందువలన కృతజ్ఞతలేని భక్తి అసంపూర్ణమని నా సిద్ధాంతము. దానితో పాటు కృతజ్ఞత యుండి తీరవలెను.

అంతఃకరణకు చెందిన నాల్గవ పరిపక్వత ఆకాంక్ష, దీనినే నిర్భయత (ధీరత్వము) అనికూడ అనవచ్చును. అత్యంత సాహసక్రియ చేయగల ధీర త్వము అది. ఇట్టి నిర్భయత (ధీరత్వము) — అదే ఆకాంక్ష — నిన్ను పూర్తిగా ఆవరించి, దైవమును కనుగొనుట యనెడి గొప్ప సాహసము వైపునకు, దైవ మును కలియుటయనెడి గొప్ప సాహసము వైపునకు, దైవమును సాక్షాత్క రింప చేసుకొనుట యనెడి సాహసతర కార్యము వైపునకు, లెక్కలేక, మిగులులేక, వెనుకకు మరలుటకు వీలులేని విధముగా నిన్ను విసరివేయును. వెనుకకు చూడక, "ఏమిజరుగనున్నది?" అని ఒక క్షణమైనను తటపటా యింపక నీవు ఆ సాహస కార్యములో పడిపోవుదువు ఏలనన ఏమిజరుగునో యని ఆలోచింప మొదలిడినచో ముందుకు సాగలేవు. నీ వున్న స్థలములోనే నీ పాదములు స్థిరముగా పాదుకొని పోవును, తటపటాయించినచో, ఏదో పోగొట్టు కొనెదను అను భయము వలననో, లేదా నీ సమస్థితి తప్పి పోవునను భయము వలననో నీవు ముందుకు కదలుటకు సాహసింపవు.

అందువలననే ధీరత్వము (నిర్భయత) అత్యంత అవసరము. నిజముగా ఆనిర్భయతే ఆకాంక్ష, ధీరత్వముతో పూర్తిగా నిండియున్నప్పుడే అది ఆకాంక్ష యగును.

ఐదవ పరిపక్వత : సర్వ సమర్పణము యోగమాచరించుటకు ఇది మెదటగా, అత్యంత ముఖ్యముగా కావలసిన నియమమని శ్రీ అరవిందులు తెలిపియున్నారు. కాన దీనిని అంతఃకరణకు చెందిన అనేక గుణములలో ఒకటిగాగాక యోగసాధనకు ముఖ్యమైన, అపరిత్యాజ్యమైన అంశముగా భావించ వలసియున్నది సంపూర్ణ సమర్పణమునకు నీవు నిశ్చయింపని యెడల యోగమును ప్రారంభింపనే లేవు. నీ సమర్పణ పరిపూర్తి యగుటకు పై చెప్పిన యితర మానసిక పరిపూర్ణతలు (పరిపక్వతలు) కూడ అవసరము.

నేను (శ్రీమాత) సహనము (ఓర్పు) అను మరియొక గుణమును (పరిపక్వతను) పేర్కొనుచున్నాను. ఏలనన: అధైర్య పడక కష్టముల నెదుర్కొనుటకు, కార్యము కష్టమైనదని వదలి వేయకుండుటకు, ఎదురు దెబ్బలు తలుగుచున్నను వానిని లెక్కచేయక తొట్రుపాటులేక కార్యమును సాధించుటకు సహనము అవసరము, ఇది లేకున్నచో నీ కార్యమార్గములో చాల దూరము పోలేవు. మొదటి మలుపులోనే, నీకు అలవాటుపడిన పరిసరములు మరుగు కాగానే, నీవు నిరాశచెంది నీ కార్యమును వదలి వేయుదువు.

ఈ సహనము యొక్క అత్యంత స్థూలరూపమే పట్టుదల (నిలకడ). ఒకే పనికి మరల మరల, అవసరమైనచో వేయిమార్లయినను సరియే, మరల మొదలు పెట్టగలననెడి స్థిరనిశ్చయములేనిచో ఏమియు సాధించలేవు. "నేచేయు పని అయినదనియే తలంచితిని కాని మరల ప్రారంభిప వలసి వచ్చినది." అని కొందఱు నన్నడిగెదరు. "అందులో విశేషమేమియునులేదు. బహుశ నీవు వంద మార్లు లేదా రెండువందలమార్లు, లేక వెయ్యిమార్లయినను మరల మరల ప్రారంభింప వలసియుండును," అని నేను (శ్రీమాత) బదులివ్వగనే వారు పూర్తిగా ధైర్యము కోల్పోదురు. నీవు ఒక అడుగు ముందుకువేసి అది స్థిరముగా నున్నదని భావింతువు. కాని నీ మార్గములో కష్టపరంపరలు తప్పవు. వానిని నీవు పరిష్కరించు కొనవలెను. కాని అవే సమస్యలు కొలదిగా రూపము మార్చుకొని మరల ఎదురగు చుండును కాన నిలకడ అవసరము.

కొందరు తమకు మంచి అనుభూతి కలిగినప్పుడు "ఇప్పటికి అయినది!" అని సంతృప్తి వ్యక్త పఱతురు. అప్పుడు పరిస్థితులు స్థిరపడినట్లే ఆగపడి, తేలిపోవుటకు, తెఱమరుగగుటకు ప్రారంభించును. ఉన్నట్లుండి, అనుకోని ఏదో ఒకటి, పూర్తిగా సాధారణమైనదే, ఏ మాత్రము ఆసక్తి కలిగింపనిది, వారిదారికి

అడ్డమునిలచి ఆ మార్గమును మూసివేయును. అప్పుడు, "నేను మరల దీనిని ప్రారంభింప వలసివచ్చునో, నే నింతవఱకు చేసినకృషికి ఫలమేమి? ఇదెందుల కిట్లు జరిగినది? నేను కొంత ప్రయత్నించితిని, కొంత సాధించితిని, కొంత దారివఱకు వచ్చితిని, కాని ఇప్పుడు నేను సాధించినది ఏమియులేదని తేలిపోయి నది. ఇది చాలా నిరాశాజనకము." అని మీరు దుఃఖింతురు. దీనికి కారణ మేమన: మీలో ఇంకను "నేను" అనునది యున్నది. ఆ 'నేను' యను దానికి నిలకడ (సహనము) లేదు.

నీకు నిజముగా నిలకడయున్నచో, "కానిమ్ము నేను అవసరమైనన్ని మార్లు, పదే పదే. వేయిమార్లయినను, పదివేలమార్లయినను, పదిలక్షల మార్లయినను సరియే ప్రారంభింతును. ఏమైననుసరియే, దీని అంతుచూచి తీఱవలెను. నన్నేదియు ఈ పనినుండి మరల్పజాలదు!" అని నీవు చెప్పుదువు.

కాన నిలకడ (సహనము) అత్యంత అవసరము.

పైన చెప్పిన అంతఃకరణ పరిపక్వతలలో సర్వసమర్పణమును మొదట నుంచెదము. అనగా పూర్ణయోగములు సాధించదలచినవారు దైవమునకు తమ్ము తాము సంపూర్ణ సమర్పణమును గావించు కొనవలెననెడి అంశమును మనము అంగీకరించితిమని యర్థము. ఈ యోగ సాధనకు వేఱు మార్గములేదు. అదొక్కటే సరియైనదారి. తరువాత క్రమముగా ఈ క్రింద కనబఱచిన పరిపూర్ణ తాసిద్ధుల (పరిపక్వతలు) వచ్చును.

| | | |
|---|---|---|
| సత్యహృదయత | లేక | పారదర్శకత (స్వచ్ఛత) |
| శ్రద్ధ | లేక | గాఢ నమ్మకము |
| భక్తి | లేక | కృతజ్ఞత |
| ఆకాంక్ష | లేక | ధీరత్వము |
| ఓర్పు | లేక | పట్టుదల (నిలకడ) |

సహనముయొక్క మరియొక రూపము విశ్వాసపాత్రత. నీవొక నిర్ణయము తీసికొనిన తర్వాత దానికి విశ్వాసముతో కట్టుబడి యుండవలెను. ఇదే పట్టుదల. నీవు మొండి పట్టుదలతో నీ కార్యమును కొనసాగించినచో, నీకు విజయము కల్గించు క్షణము తప్పక వచ్చును.

పట్టుదలగలవారికి విజయము తథ్యము

# శ్రీ అరవిందులు - సంగ్రహ జీవితచరిత్ర

— వై. పాండురంగారావు

శ్రీ అరవిందులు కలకత్తానగరమున 1872 వ సంవత్సరము ఆగస్టు 15 వ తేదీన జన్మించిరి. 1879 లో అనగా ఏడేళ్ల ప్రాయమున, అతడును అతని అన్న లిరువురును విద్యాభ్యాసమునకై ఇంగ్లండుదేశమునకు పంపబడిరి. అచట పదునాలుగు సంవత్సరము లుండిరి. తొల్దొలుత మాంచెస్టరులో ఒక ఆంగ్లేయ కుటుంబమున పోషింపబడి, అరవిందులు 1885 లో లండను నగరము నందలి సెంట్ పాల్ పాఠశాలలో చేరిరి. తరువాత 1890 లో అచటినుండి ఒక ఉన్నతమైన యోగ్యతావేతనము (Scholarship) సంపాదించి కేంబ్రిడ్జిలోని కింగ్స్ కళాశాలయందుచేరి అచట రెండు సంవత్సరములు విద్యాభ్యాసముచేసిరి. ఈ విధముగా వారి విద్యాభ్యాసమంతయు ఇంగ్లండులో జరుగుటతో శ్రీ అరవిందులకు యూరపుదేశపు ప్రాచీన, మధ్యయుగ ఆధునిక సంస్కృతితో సన్నిహిత పరిచయము ఏర్పడుటకు అవకాశమేర్పడినది. వారు గ్రీకు, లాటిన్ భాషలలో అశేష పాండిత్యము నార్జించిరి. అంతేగాక మాంచెస్టరులో తమ శైశవదశనుండియే ఫ్రెంచిభాషను అధ్యయనము చేసిరి. పైగా తానే స్వీయముగా జర్మను, ఇటాలియను భాషలను నేర్చుకొని అందు గేడె (Goethe), డాంటె (Dante) ల రచనలపై వ్యాఖ్యానించగల పాండితి నార్జించిరి. కేంబ్రిడ్జిలో ట్రైపాస్ పరీక్షను ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైరి, మరియు ఐ.సి.యస్. పరీక్షలో గ్రీకు, లాటిన్ భాషలందు అగ్రశ్రేణి మార్కులు గడించిరి.

1890 లో ఐ. సి. యస్. పరీక్షయందు త్తీర్ణులైరి గాని రెండు సంవత్సరముల గడువులో ఉత్తీర్ణత నొందవలసిన గుఱ్ఱపుస్వారి పరీక్షకు హాజరుకాకుండ, ఆ కారణమువలన ఇండియన్ సివిల్‌సర్వీసుకు అనర్హుడుగానైరి. ఆ సమయమున లండను నగరమునకు వచ్చియుండిన బరోడా గైక్వాడును సందర్శించుట వలన బరోడా సర్వీసులో నొకపదవికి నియమితుడై, 1893 సం॥ ఫిబ్రవరిలో ఇంగ్లండు వదలి భారతదేశమునకు ప్రయాణమైరి.

1893 సం॥ నుండి 1906 సం॥ వరకు అనగా పదమూడు సంవత్సరములు బరోడా సర్వీసునందు ఉద్యోగిగా గడిపిరి, మొదట రివెన్యూశాఖయందు,

తరువాత మహారాజావారి సచివాలయమునందు, ఆ తరువాత ఆంగ్లభాషధ్యా దాచార్యుడుగను, ఆ పిదప బరోడా కళాశాల వైస్‌ప్రిన్సిపల్‌గను పనిచేసిరి. ఈ ఉద్యోగనిర్వహణ కాలమంతయు, వారి జీవితమున ఆత్మసంస్కృతికిని, సాహిత్య వ్యవసాయమునకు, భవిష్యత్కార్యక్రమమునకు ప్రవేశభూమికగను రూపొందినది. ఆ తరువాతికాలములో పాండిచేరినుండి ప్రచురించబడిన కవితా సామగ్రియందు ఎక్కువభాగము ఈ కాలమున వ్రాయబడియుండినదే. శ్రీ అరవిందు లాంగ్లదేశమున నున్నంతకాలము వారి తండ్రిగారి అభీష్టాదేశానుసారము వారికి పూర్తిగా పాశ్చాత్యవిద్యయందే శిక్షణ యొసంగబడుటవలన వారికి ప్రాచ్యసంస్కృతి, భారతీయ నాగరికతలతో ఎటువంటి పరిచయముగాని యేర్పడలేదు. ఈ లోపమును గూడ వారు బరోడాలోనున్నకాలమున సరిదిద్దుకొనగల్గిరి. అచట వారు సంస్కృతమును అధ్యయనము చేసిరి. పెక్కు ఇతర భారతీయ భాషలను గూడ నేర్చిరి. ప్రాచీన వర్తమాన భారతీయ సంస్కృతీ నాగరికతలను కూలంకషముగ అవగాహనము గావించుకొనిరి. బరోడాలో నున్న చివరిరోజులలో ఎక్కువభాగము, సెలవు తీసికొని, రాజకీయ కార్యకలాపమున గడపిరి. అయితే ఈ కార్యకలాపమంతయు పరోక్షముగా జరుపుచుండిరి. ఏలనన తాము నిర్వహించుచున్న పదవికి సంబంధించిన క్రమశిక్షణా నిబంధనావళిదృష్ట్యా తాము బాహాటముగా రాజకీయరంగమున పాల్గొన వీలు లేకుండినది. కాని 1905 సం॥లో బెంగాలు రాష్ట్ర విభజనకు వ్యతిరేకముగా ప్రజ్వలించిన ఉద్యమము శ్రీ అరవిందులకు రాజకీయరంగములోనికి ప్రత్యక్షముగా ప్రవేశించుటకు తరుణము నేర్పఱచినది. వారు 1906 లో తమ పదవిని విరమించుకొని, కలకత్తాలో క్రొత్తగా స్థాపించబడిన బెంగాల్ జాతీయ కళాశాలకు ప్రిన్సిపల్‌గా వెళ్లిరి.

ఈ విధముగా ప్రారంభమయిన రాజకీయజీవితము 1902 నుండి 1910 వరకు అనగా ఎనిమిది సంవత్సరములు కొనసాగినది. ఇందు మొదటి నాల్గు సంవత్సరములు అజ్ఞాతరూపమున అనగా తెరవెనుక కార్యక్రమముగా సాగినది. ఈ కాలము వారికి తామును, తమ సహకార్యకర్తలును స్వదేశీ ఉద్యమ ప్రారంభమునకు ఆయత్తమగుటకు వినియోగపడినది. ఆ తరువాత బెంగాలులో ఏర్పడిన ఉద్యమము వారు ప్రత్యక్షముగా మరింత ప్రగతిపూర్వకమైన రాజకీయ క్రమమున కుపక్రమించుటకు అవకాశము నొసంగినది. అంతవరకు

భారత జాతీయ కాంగ్రెస్ మితవాద వైఖరినే తన ఆశయముగా నుంచుకొని యుండినది. 1906 సం॥లో శ్రీ అరవిందులు బెంగాలుకు అప్పుడపుడె ఏర్పడి యుండిన "క్రొత్త పార్టి" (New Party) యందు చేరు ఉద్దేశ్యముతో వచ్చిరి. ఈ New Party అనునది కాంగ్రెసులో నుంటూ వచ్చిన కొందరు ప్రగతి వాదులు _ కొద్దిమంది మాత్రము – ఎర్పాటుచేసుకొన్న పార్టి. అయితే వారికి ఇంకను సంఖ్యాబలముగాని సామర్థ్య విశేషముగాని పలుకుబడిగాని ఒనగూడ లేదు. ఈ పార్టీయొక్క రాజకీయ ప్రణాళిక కేవలము అసమగ్రరూపమున నున్న ఒక సహాయనిరాకరణ సిద్ధాంతము మాత్రమే. ఇక కార్యాచరణయందు వారు కాంగ్రెను వార్షిక సమావేశములో మిదవాద నాయకులతో తలపడుటను మించిపోజాలరైరి. శ్రీ అరవిందులు ఆ పార్టీ నాయకులను ఉత్తేజపరచి వారు బహిరంగముగ ఒక అఖిలభారత పార్టీగా రూపొంది, ఒక ప్రస్ఫుటమును సాహసోపేతమును అయిన ప్రణాళికను రూపొందించుకొనునట్లును చేసి, మహారాష్ట్ర నాయకుడైన 'తిలక్' ను ఆ పార్టీ అధినేతగా నిల్పి, అంతవరకు అధికసంఖ్యాకులుగా గల మితవాదుల నెదిరించి వారినుండి కాంగ్రెసును, దేశమంతు పార్టీ ప్రాబల్యమును చేజిక్కించుకొన కృతనిశ్చయులగునట్లును చేసిరి. ఇది చరిత్రాత్మకమైన మితవాద, జాతీయ వర్గసంఘర్షణకు నాందిగా ఏర్పడి రెండు సంవత్సరములలోనే భారతదేశ రాజకీయ స్వరూపమును పూర్తిగా మార్చివేసినది.

ఈ విధముగా క్రొత్తగా ఏర్పడిన జాతీయపార్టీ "స్వరాజ్య"మే తన ధ్యేయముగా నిర్వచించినది. ఇది ఆవరకు మితవాదులచే ప్రతిపాదింపబడుచూ వచ్చిన పాక్షిక స్వపరిపాలనాధికార సాధనోద్దేశ్యమునకు భిన్నమైనది ఈ ధ్యేయమును సాధించుటకు ఉపయోగించదలచిన విధానము ఐర్లండులో విజయ వంతముగా అవలంబించబడిన "సిన్‌ఫిన్" విధానమును పోలినది. ఈ క్రొత్త విధానముయొక్క ముఖ్యసూత్రము "స్వయంసహాయకత్వము". ఒకవైపు జాతీయశక్తులను సమీకరించుట. మరొకవైపు ప్రభుత్వముయెడ సహాయ నిరాకరణ గావించుట. తదనుగుణముగా బ్రిటిషువారి మరి ఇతరదేశ వస్తువుల బహిష్కరించుట స్వదేశి పరిశ్రమల పెంపొందించుట, బ్రిటిషువారి న్యాయ స్థానములను బహిష్కరించి వాటికి బదులుగా సొంతముగా న్యాయవిచారణ కేంద్రముల నేర్పాటు చేసికొనుట. ప్రభుత్వ విశ్వవిద్యాలయములను, కళాశాల

లను బహిష్కరించి. వాటి స్థానమున జాతీయ కళాశాలలను, పాఠశాలలను స్థాపించుట మరియు పోలీసు, రక్షణ విధులను నిర్వహించుటకు యువజన సంఘములను ఏర్పఱచుట, సాధ్యమైనంత మేర అహింసాయుతమైన ప్రతిఘటన (Passive Resistance) కు పూనుకొనుట — ఇవి ఈ పార్టీయొక్క సత్వరాశయము లయ్యెను. శ్రీ అరవిందులు, కాంగ్రెసును స్వాధీనము చేసికొని, దానిని జాతీయ కార్యక్రమ సారథ్య కేంద్రముగా రూపొందించి .తద్వారా స్వాతంత్ర్యప్రాప్తి వరకు పోరాటము సాగించవచ్చునని ఆశించిరి. తాము సంపాదకీయము వహించుచున్న 'వందేమాతరం' అను పత్రికను పార్టీ పత్రికగా నిర్వహించుటకు పార్టీ సభ్యులచే ఒప్పించిరి. ఈ 'వందేమాతరం' పత్రిక అది ప్రారంభింపబడినది మొదలు అనగా 1907 నుండి, 1908 లో శ్రీ అరవిందులు జైలుకు వెళ్లుటతో హఠాత్తుగా నిలిపివేయబడినంతవరకు, శ్రీ అరవిందులచేతనే స్వయముగా నిర్వహించబడినది. ప్రచురణ ప్రారంభమైన తరువాత అచిరకాలముననే అది దేశమందెల్లెడల బహుళవ్యాప్తిని విశేష ప్రచారమును పొందగల్గెను. ఆ పత్రిక నిర్వహింపబడిన కాల మతి స్వల్ప కాలమే అయినను అది భారతీయుల ఆలోచనా విధానమునే పూర్తిగా మార్చివేయగల్గినది. ఆ తరువాత కాలమున రాజకీయ యుగములో ఎన్ని మార్పులు వచ్చినను, మొట్టమొదట ఈ పత్రిక రాజకీయ విలువల గురించి దేశ ప్రజల భావనపై వేసిన ముద్ర చెఱుపరానిదైనది. ఈ విధముగా ప్రారంభించబడిన పోరాటము, విశేష సంఘటనలతో కూడినదియు, భవిష్యత్కార్యక్రమమునకు ముఖ్యమై, అద్భుతప్రాయమై ఒప్పినను దాని మనుగడ మాత్రము చాలా కాలము సాగలేదు. దీనికి కారణము ఆనాడు దేశప్రజలు అంతటి సాహసోపేతమైన కార్యక్రమమునకు ఉద్యుక్తులు కాలేక పోవుటయే.

1907వ సం॥లో ప్రభుత్వము శ్రీ అరవిందులపై దేశద్రోహనేరము మోపెను. కాని వారు నిర్దోషులుగా నిరూపితులైరి. అంతవరకు కార్యకర్తగను, రచయితగను యుండిన శ్రీ అరవిందులు, ఈ సంఘటన కారణముగను, మరియు ఇతర నాయకులు కారాగారమునకు వెళ్ళవలసి వచ్చుట చేతనూ, తానే బెంగాలులో పార్టీయొక్క ఏకైక అధినేతగా బాధ్యత స్వీకరించవలసి వచ్చినది. ఈసమయములోనే వారు ఉపన్యాసవేదిక పైతము అధిరోహించవలసి వచ్చినది. ఆ సంవత్సరమే సూరత్‌లో జరిగిన జాతీయ మహాసభకు అధ్యక్షత

వహించిరి. అందు కాంగ్రెసులోని రెండు వర్గముల మధ్య సంఘర్షణను అంత మొందించగల్గిరి. 1908 సం॥ మే నెలలో ఆలీపూరు కుట్రకేసు సందర్భముగా శ్రీ అరవిందులు మరొకసారి బంధితులైరి. వారి సోదరుడును, విప్లవవర్గ నాయకుడును అయిన బరీంద్రుని విప్లవ చర్యలలో శ్రీఅరవిందులకునుగూడ జోక్యమున్నదని ప్రభుత్వము ఆరోపించెను. కాని తరువాత న్యాయ విచారణలో అరవిందులపై నేరమునకు సంబంధించిన ఏలాటి సాక్ష్యము లభించలేదు. వారు నిర్దోషులుగా విముక్తులైరి. కాని విచారణ జరుగుచుండిన సంవత్సరకాలము కారాగారమున యుండి 1909 మేలో విడుదలై వచ్చు నప్పటికి వారి పార్టీ అతి క్లిష్టస్థితిలోనికి పడిపోయినది. పార్టీ వ్యవస్థ ఛిన్నాభిన్నమై, పార్టీ నాయకులు కారాగార బంధనము వలననూ, దేశబహిష్కరణ వలననూ, తామే విధించుకునిన అజ్ఞాతవాసము కారణముగనూ, అందరు చెల్లాచెదరై పోవుటలో పార్టీ నిర్జీవమును, నిర్వీర్యమును, ఆయి నామమాత్రముగా నిలిచియుండినది. దీనిని గమనించిన శ్రీ అరవిందులు సుమారు ఒక సంవత్సరమంతయు నిస్పృహాయుడయ్యు, నిర్విరామముగ కృషిసల్పి, పార్టీని పునరుజ్జీవింప ప్రయత్నించిరి. ఈ సమయమున వారు తమ కృషికి సహాయకారిగా నుండుటకు "కర్మయోగి" అను ఆంగ్ల వారపత్రికను, "ధర్మ" అను బెంగాలీ వార పత్రికను ప్రచురించిరి. కాని చివరకు విప్లవాత్మకమైన తమ రాజకీయ విధానమును, కార్యక్రమమును భరించి నిర్వహించగల సామర్థ్యము ప్రజలలో లోపించియుండుట వారు గుర్తించక తప్పలేదు. అందుచే వారు మొదట దేశప్రజలకు పరిమిత స్వయం పరిపాలనా కార్యసాధ నోద్యమమునందు శిక్షణ యొసగుటయో లేక దక్షిణాఫ్రికాలో మహాత్మాగాంధి ప్రవేశపెట్టిన అహింసాయుత ప్రతిఘటన (Passive resistance) వంటి కార్యక్రమమును ప్రారంభించుటయో అవసరమని తలంచిరి. కాని ఇటువంటి ఉద్యమములకు నేతము తగిన సమయము ఆసన్నము కాలేదనియు, ప్రజలందులకు సంసిద్ధముగా లేదనియు, పైగా ఈ సంభద్ధమైన కార్యక్రమమునకు నిర్దేశింపబడిన నాయకుడు తాము కామనియు, వారికి అవగాహనమయ్యెను. అంతేగాక ఆలీపూరు జైలులో గడచిన 12మాసముల నిర్బంధ జీవితము పూర్తిగా యోగాభ్యాసముననే వినియోగ మగుటచే వారిలో ఆధ్యాత్మిక చింతనము వృద్ధియే. ఈ ఆధ్యాత్మిక కృషికే వారి సంపూర్ణ గమనము, ఏకాగ్రత వినియోగింప వలసి యున్నదని వారి అంతరంగమున ఒత్తిడి ప్రారంభమయ్యెను. అందుచే వారు రాజకీయరంగమునుండి కొంతకాలమైనా నిష్క్రమించుటకు నిశ్చయించుకొనిరి.

1910 సం॥ ఫిబ్రవరి మాసమున శ్రీ అరవిందులు చందర్ నాగూర్‌కు రహస్యముగా నిర్గమించిరి. తరువాత ఏప్రిల్ నెలారంభమున ఫ్రెంచి స్థావరమైన 'పాండిచేరి'కి విచ్చేసిరి వారు 'కర్మయోగి' పత్రికలో తమ పేర ప్రచురించియుండిన ఒక వ్యాసము కారణముగా వారిపై మరియొకసారి - అనగా మూడవ పర్యాయము – నేరారోపణ చేయబడెను. కాని వారప్పటికే బ్రిటిషు భూభాగమునుండి వదలి వచ్చియుండినందువలన, ఆ నేరమును ఆ పత్రిక సంపాదకునిపై మోపి అతనిని నేరస్థునిగా నిర్ణయించి శిక్షవిధించిరి. కాని తరువాత కలకత్తా ప్రధాన న్యాయస్థానములో అపీలుచేయగా అందు శిక్ష రద్దు చేయబడెను. ఈ విధముగా శ్రీ అరవిందులను నేరస్థునిగా నిరూపించు యత్నము మూడవ మారుగూడ విఫలమైనది. బెంగాలు వదలి వచ్చునపుడు, అరవిందులు కొంత కాలం తరువాత అనువైన పరిస్థితు లేర్పడిన పిదప మరల రాజకీయ రంగమును ప్రవేశించు ఉద్దేశ్యము కల్గియుండిరి కాని అనతి కాలముననే వారికి తాము చేపట్టిన ఆధ్యాత్మ సాధనయొక్క బృహత్స్వరూపము అవగాహనమై అందు తమ సర్వశక్తుల కేంద్రీకరణము, వినియోగము అవసరమని విశదమైనది. క్రమముగా వారు రాజకీయములతో తమ సంబంధమునకు స్వస్తిచెప్పిరి. తరువాత కాలములో జాతీయ కాంగ్రెస్ అధినేతృత్వమును స్వీకరించ వలసినదిగా చేయబడిన పలు అభ్యర్థనలను ఆహ్వానములయెడ విముఖులై, రాజకీయ రంగమునుండి శాశ్వతముగా నిష్క్రమించిరి.

శ్రీ అరవిందుల యోగసాధన ప్రారంభమయినది 1904లో. కాని అంతకు మునుపుగూడ, అనగా వారికి యోగమును గూర్చిగాని. యోగభ్యాసమును గూర్చిగాని ప్రత్యక్ష జ్ఞానమేమియు లేని రోజులలోకూడ, వారి జీవితమున కొన్ని విశిష్టమైన ఆధ్యాత్మికానుభవము లేర్పడు చుండెడిది. ఉదాహరణకు, వారు ఇంగ్లండునుండి స్వదేశమునకు మరలివచ్చిన సందర్భములో బొంబాయిలో 'అపోలో బందర్' తీరమున ఓడనుండి భూమిపై అడుగిడిన క్షణమున వారి కొక విశిష్టానుభవము కలిగెను. ఒక విస్తృతమైన శాంతి తమపైకి అవతరించి నట్లును. తన్నావరించి యున్నట్లును వారనుభూతి నొందిరి ఈ ప్రశాంతత క్షణికమైనదిగాక, కొన్ని మాసముల పర్యంతము వారిని పరివేష్టించి యుండిన తరువాత కాశ్మీరులో తక్తె సులేమాన్ అంచున నడచుచున్నపుడు వారికి అనంత శూన్యత్వాను భవము కల్గినది. అటులనే నర్మదా నదీతీరమునగల ఒక ఆలయ

మున వారికి కాళికాదేవి ప్రసన్నమైనది. బరోడాలో నున్నపుడు ఒకసారి బండి ప్రమాదమున చిక్కుకున్నపుడు వారికి తమలోనుండి భగవచ్ఛక్తి వెల్లుబికి వచ్చుచున్నట్లు దివ్యదర్శన మేర్పడినది. ఈ సంఘటన లన్నియు అప్రయత్న ముగా, అనూహితముగను ఏర్పడుచుండిన అనుభవములు మాత్రమేకాని. అవి నిజముగా ఒక క్రమబద్ధమైన సాధనలో భాగముకాదు. శ్రీ అరవిందులు తమ యోగాభ్యాసమును మొట్టమొదట తమకు తామే స్వతంత్రముగా ఏ గురువు యొక్క సాన్నిధ్యము లేకయే ప్రారంభించిరి. తొలుత వారు, గంగామఠము బ్రహ్మానందస్వామి శిష్యుడైన ఒకానొక తన మిత్రుని సూచన ననుసరించి యోగాభ్యాసము ప్రారంభించిరి. ప్రారంభమున వారి సాధన ప్రాణయామము నభ్యసించుటకు మాత్రమే పరిమితమై యుండినది. అయితే వారీ అభ్యాసమును అతినిష్ఠతో చేయుచుండిరి. ఒక్కొక్కమారు వారు దినమున ఆరుగంటలకు పైగా ప్రాణాయామ మభ్యసించు చుండిరి. ఈ విధముగా సాధన చేయుచున్న పుడు వారికి తమ జీవితములో యోగమునకు, రాజకీయములకు మధ్య ఎటు వంటి వైరుధ్యము కన్పించలేదు. అంతియేగాక, మనస్సు కొంతకాలము రాజ కీయములకు కొంతకాలము యోగమునకు ప్రత్యేకించబడుచూ వాటిమధ్య ఊగిస లాడుటకు బదులుగా వారు ఈ రెండు వ్యాపకములను ఏకకాలముననే ఎటువంటి వైరుధ్యపు తలంపుకాని లేకుండగ నిర్వహించగల్గిరి. సాధనలో త్వరితగతిని పురోగమించగల్గియు వారు ఒక గురువును పొంద నాకాంక్షించిరి. ఈఅన్వేషణలో వారికి ఒక నాగసన్యాసి తటస్థమయ్యెను. ఆ సన్యాసిని వారు తమ గురువుగా స్వీకరించరైరి కాని అతనిపరిచయము శ్రీ అరవిందులకు యోగశక్తి ప్రభావముపై గల విశ్వాసమును మరింత దృఢపరచినది. దీనికి కారణము ఆ నాగసన్యాసి ప్రద ర్శించిన ఒక చిత్రప్రక్రియ అరవిందుల సోదరుడు బరీన్ కొండజ్వరముచే తీవ్రముగా బాధపడుచుండిరి. నాగసన్యాసి ఒక గిన్నెలో నీరు తీసుకొని ఆ నీటిని ఒక కత్తితో నిలువుగను అడ్డముగను కోసి ఏదో మంత్రము నుచ్చ రించిన తక్షణమే బరీంద్రుని విషజ్వరము అదృశ్యమయ్యెను. ఈ సంఘటనను శ్రీ అరవిందులును అచటనుండిన ఇతరులు ప్రత్యక్షముగాచూచిరి కొంతకాలము నకు అరవిందులు బ్రహ్మానందస్వామినిగూడ దర్శించిరి. వారు గొప్పయోగులని గుర్తించిరి. కాని వారినిగూడ తమ గురువుగా స్వీకరింపరైరి.... అటులనే గురువు లేకుండగనే తమ సాధన కొనసాగించుకొనిరి. బరోడాలో విష్ణుభాస్కర్ లీలెను

సందర్శించునంతవరకు వారికి సాధనగురువు లేకనే సాగుచుండినది. లీలె తోడి సాన్నిధ్యము సైతము అతిస్వల్పకాలమే. లీలెతో కలసి వారు మూడురోజులు మాత్రము ధ్యానసాధనచేసిరి. సాధారణముగా సుదీర్ఘమైన సాధనానంతరం లభించు అనుభవములను శ్రీ అరవిందులు సునాయాసముగా మూడురోజులలోనే పొందగల్గిరి. మనస్సుపై నిరంతరము జరుగు భావపరంపరయొక్క ఒత్తిడి నుండి, మనసును వేరుపఱచి ఎటువంటి మనోవృత్తులు పొడసూపకుండ శూన్య నిశ్చలతను ఏర్పఱచుటను వారు స్వల్ప యత్నముతోనే సాధించిరి. ఈ అనుభవమువలన వారు, సంపూర్ణము కేవలము అయిన మనఃప్రశాంత నిశ్చల స్థితిని పొందిరి. అంతట వారికి ఆ ప్రశాంతతలో అనిర్వచనీయమైన బ్రహ్మ సాక్షాత్కారము "తత్" సాక్షాత్కారము అయ్యెను. ఈ సాక్షాత్కారములో వారికి కేవలమీ 'తత్' పదార్థమే సత్యముగను ఈ ప్రపంచ సర్వస్వము ఆ బ్రహ్మానుభవము ముందు మిథ్యా మాత్రముగ ద్యోతకమయ్యెను. ఈ ప్రశాంతత వారిని కొన్ని మాసముల పర్యంతము ఆవరించినది. ఈ సమయమున వారి బాహ్య క్రియాకలాపమంతయు కేవలము ఉపరితలమున మాత్రమే జరుగుచు అంతస్థితియందు సర్వము ప్రశాంతతతో, నిశ్చలతతో ఒప్పారెను. అంతే గాదు బాహ్యోపరితలమున సైతము ఎటువంటి క్రియాచలనము లేకుండ, కేవలము స్థిరమైన ఆధ్యాత్మికాలోకనము మాత్రమే మిగిలెను. కాని లీలె మహాశయుడు ఆశించినది కాదు, వారు ఈ నిశ్చల ప్రశాంతతను సాధించగోరినది. కేవలమా అనుభవమే యే లక్ష్యముగా గాదు, ఆ అనుభమునుపయోగించుకొని ఆ ప్రశాంతత నెలకొల్పుటద్వారా, హృదయాంతర్గతగానున్న 'అంతర్యామి'ని సూటిగా, ఎటువంటి మానసిక భావవిక్షేపముల చొరవలేకుండా, వినగల్గుట అనునది వారాశించిన లక్ష్యము. అందుచేత వారు, శ్రీ అరవిందులు తమకుపలబ్ధమైన అద్వైతానందానుభవ స్థితిలోనే నిమగ్నమై యుండిపోకుండ, ఆ స్థితినుండి వారిని బహిర్గతమొనర్చుటకు కృషి సల్పిరి. బొంబాయి నగరములో ఒకానొక బహిరంగసభలో శ్రీ అరవిందులుపన్యసించవలసి యుండిరి. వారు 'లీలె' తో తనతో ఎటువంటి భావలేశముగాని ఉత్పన్నమగుట లేదనియు, తానెట్లు ఉపన్యాసము నివ్వగల్గుదుననియు ప్రశ్నించిరి. అంత లీలె' శ్రీ అరవిందులకొక సూచన చేసెను. ఆ సూచనానుసారము అరవిందులు ఉపన్యాసమున కుపక్రమించుటకు పూర్వము సభాభివందనము చేసి ఒక నిమిషము మౌనముగా యుండవలెను. అంత తానివ్వవలసిన ఉపన్యాసమంతయు తన మనస్సు

నుండిగాక వేరొక అంతర్భూమిక నుండి వెలువడును. ఆనాడు సభలో శ్రీ అరవిందులు ఆ విధముగానే చేసిరి. ఉపన్యాసము ధారావాహికముగ వెలువడినది. ఈ సంఘటనలవలన మనము శ్రీ అరవిందులేదో సమాధి స్థితిలో నుండిపోయి బాహ్య కార్యకలాపము యెడ నిర్లిప్తతతో నిశ్చేతనముగా ఉండిపోయినాడని అనుకొనరాదు నిజమునకు వారావిధముగ యుండనెలేదు. ఈ బ్రహ్మానుభూతి అనంతరము వారివ్యక్తిగత ప్రయత్నముగాని, మానసికాలోచనా, ప్రక్రియతో నిమిత్తముగానీ అవసరము లేకుండా, ఏదో అతీతమైనశక్తి ఆయా సందర్భానుసారము, సమయానుగుణముగా చేయవలసిన చేతను, చేయించుట కావలసిన మాటను పలికించుట ప్రారంభమైనది. అప్పటినుండి వారి భౌతిక చర్యలు, అనగా–మాటాడుట, వ్రాయుట, ఆలోచించుట మొదలగు మనోసంబధమైన ప్రక్రియయంతయు మెదడు అను మనోభూమిక కంటె ఉన్నతమైన వేరొక భూమిక నుండి ఉత్పన్నము కాజొచ్చినవి, అనగా వారు సాధారణ 'మనస్సు' యొక్క పరిధిని అతిక్రమించి 'ఆధ్యాత్మికమనసు'ను ప్రవేశించి యుండిరి. దీనినే వారు తరువాత 'అధిశిరః చైతన్యము' (overhead consciousness) అని పేర్కొనిరి. ఇదియే వారి యోగములో మొట్ట మొదటిదియు. ముఖ్యాధారభూతము అయిన యోగానుభవము, వారి యోగవిధానమునకు ఇది నాంది మరియు పునాది అయినది.

శ్రీ అరవిందులే తమ యోగభ్యాసన విధానమును గూర్చి ఒక లేఖలో ఈ విధముగా వ్రాసినారు; "నేను 1904లో నా యోగమును ఏ గురువు యొక్క ఆశ్రయము లేకనే ప్రారంభించితిని. 1908లో ఒక మహారాష్ట్ర యోగినుండి కొంత విలువైన సహాయము లభించినది. దానివలన నా యోగభ్యాసమునకు తగిన పునాది లభించినది. నాటినుండి "శ్రీమాత" భారత దేశమునకు వచ్చువరకు నేనితరులనుండి ఆధ్యాత్మిక సహాయము పొందలేదు. అంతకు పూర్వముగాని, ఆ తరువాతగాని నా సాధన ఏనాడూ పుస్తకములపైన, రచనలమీద ఆధారపడినదికాదు. అది పూర్తిగా నాలో నుండి మిక్కుటముగా వెలువడుచుండిన ఎన్నో స్వీయ అనుభూతులమీదనే ఆధారపడియున్నది. కాని నేను జైలులో నున్నపుడు నా వద్ద 'భగవద్గీత'. 'ఉపనిషత్తులు' ప్రతులుండినవి. 'గీత'లో సూచింపబడిన యోగమును అభ్యసించుచూ, ఉపనిష

త్తుల సహాయముతో ధ్యాన మార్గమును సాధన చేసితిని. ఈ పుస్తకములే నాకు మార్గదర్శకములుగా నుండినవి. ఆ పిదప పాండిచేరి చేరిన తర్వాతనే నేను 'వేదము'ల చదివితిని. వేదములు చదువుటలో నాకు, నాలో అప్పటికే కల్గిన ఆధ్యాత్మానుభవముల సరియైనవేనని దృఢపడినది. అంతేగాక 'వేదములు' నాకు అపరిచిత విషయములను బోధించలేదు. ఎపుడైనా,ఏదేని సంశయమో, క్లిష్టస్థితియో ఉత్పన్నమైనపుడు నేను "భగవద్గీత" నుండి వెలుగును కోరుకొను చుంటిని. నాకు కావలసిన సహాయము, సమాధానము గీతనుండి లభించెడిది. నేను జైలులో నున్నకాలములో సుమారు పదహైదు రోజులు నా ఏకాంత ధ్యాన సమయములలోనాకు 'వివేకానంద' వాణి విన్పించెడిది. వివేకానందుడు సాక్షాత్కరించెడివాడు గూడ. వారివాని ఆధ్యాత్మిక అనుభవములో అతి ముఖ్య మైన ఒకానొక రంగమునుగూర్చి మాత్రమే ప్రసంగించుచూ తెలుప వలసిన దంతయు తెలిపి అగిపోయినది."

శ్రీ అరవిందులు పాండిచేరి రాకపూర్వమే వారి యోగము, ఆధ్యాత్మిక తత్త్వమునకు ప్రాతిపదిక లైన నాలుగు ఆధ్యాత్మికానుభవములలో రెండింటిని సమగ్రముగా సాధించియుండిరి. అందు మొదటిది 1908 జనవరి బరోడాలో మహారాష్ట్ర యోగి శ్రీ విష్ణుభాస్కర్ లిలెతో కలిసి ధ్యానసాధన చేసినపుడు లభించిన అనుభూతి అది సాధారణ మనోచేతనను స్తబ్ధపరచినందువలన కలి గిన ప్రశాంతత లేక మౌనబ్రహ్మానుభూతి. ఈ అనుభూతి పొందినపుడే బ్రహ్మమే సత్యమనియు ఇతర ప్రాపంచిక దృష్టియంతము కేవలము 'మాయ' అనియు గోచరించినది. కాని రెండవ అనుభూతిలో ఈ 'మాయవాది' భావము మారిపోయినది. రెండవ ఆధ్యాత్మికానుభవములో వారికి విశ్వచైతన్యము (comie consciousness సాక్షాత్కారమై, సర్వము—అనగా ఈ ప్రపంచము అందలి వస్తురూపములుకూడ—దైవాంశ సంభూతమే అని విశదమైనది. ఈ రెండవ ఆధ్యాత్మిక సాక్షాత్కారము వారికి అలీపూరు జైలుతో కల్గినది. ఆ సమయమున వారికి తానున్న కారాగారము, గోడలు, ఇనుపఊచలు, కాపలా కాయు వ్యక్తి, న్యాయాధికారి ప్రతిదియు శ్రీకృష్ణునిగా దృశ్యమైనది. అనగా సర్వము భగవన్మయము. ఇక మిగిలిన రెండు సాక్షాత్కారము—ఒకటి నిశ్చల నివృత్త్యాత్మక బ్రహ్మము, ప్రవృత్త్యాత్మక బ్రహ్మము (state and dynamic Brahman) అను రెండు రూపములలో వెలయు 'పరమసత్త' (Supreme-

Reality) యొక్క సాక్షాత్కారము. రెండవది అతిమానసము (Super mind)నకు చేరుటకు ముందు వివిధ అంతస్తులలో గల ఇతర చైతన్య భూమికలు (Higher planes of consciousness leading up to the Super mind) లో కలుగు అనుభూతులు—ఈ రెండింటి సాధనకు మార్గము అరవిందులకు అలీపూరు జైలులో గడచిన ధ్యానయోగకాలములోనే ప్రసన్నము కాజొచ్చినది. వారీ సాధనా క్రమములో, లీలె సూచన మేరకు పూర్తిగా దైవము మీదనే ఆధారపడి. అచటనుండి లభించు ఉపదేశానుసారమే నడచుటకు నిశ్చయించుకొని ఆ విధముగనే తమ సాధనలో పురోగమించిరి.

పై విధముగా సాగిన యోగసాధనలో శ్రీ అరవిందులు అంతవరకు భారతదేశమున అనుసరించబడుచున్న యోగ విధానము ననుసరించి దివ్యానుభూతిని, ఆత్మ సాక్షాత్కారమును పొంది ఈ సాక్షికానుభవముతో ఆగక ఇంకను పురోగమించి ఈ సృష్టిలోని ఆత్మ (Spirit) వస్తు (Matter) తత్త్వ సమన్వయము గా వి ం చు పరిపూర్ణానుభూతి కొరకై అన్వేషణ కొనసాగించిరి. సాధారణముగ యోగ విధానములలో ఎక్కువ భాగము "పర" (Beyond) అనుభూతికిని తద్వారా ఆత్మ సాక్షాత్కారమునకు మార్గములై చరమదశలో సాధకుని ప్రాపంచిక జీవితము యెడ విముఖునిగాచేయు నివృత్తి మార్గ ప్రతిపాదకములై యున్నవి. శ్రీ అరవిందులు తమ యోగమున "ఆత్మానుభూతి"కి ఆరోహించుటతో ఆగిపోక ఆ ఊర్ధ్వభూమికనుండి సాధించిన శక్తిలో వెనుదిరిగి క్రింది భూమికలలోనికి అవరోహించి తెచ్చిన తేజశ్శక్త్యానందములతో అధోభూమికయందు గూడ దివ్యపరిణామమును సాధింప యత్నింతురు. వారి సమ్యక్‌దృష్టికి—ఈ భౌతిక ప్రపంచములో ఇపుడు మానవుడు 'అచిత్' పై ఆధారపడి అజ్ఞానమయమైన జీవిత దశలో నున్నాడు. కాని ఈ అజ్ఞానకోశమునందే 'దివ్యత్వ'ము సైతము నిగూఢముగా యున్నది. ఆ దివ్యత్వము ఈ అజ్ఞానమునుండి వికసింపగల అవకాశము సైతమున్నది. వారి దృష్టికి, ఈ ప్రపంచము అసత్యము, మిథ్యాభూతము అయి మోక్ష ప్రాప్తి వలననో, నిర్వాణసాధనలోనో పరిత్యజించబడవలసిన ఒక అవరోధ విశేషము కానేకాదు. ఇది 'ఆత్మ' యొక్క పరిణామము. (Evolution of the spirit) నకుగా నిర్దేశించబడిన సాధనక్షేత్రము. క్రమేపి ఇచటనే దివ్యచైతన్యమును వికసింప చేయవలసియున్నది. దీనిని సాధించుటకు ఇపుడున్న మనస్సు(mind)

అనుసాధనము చాలదు. క్రమమైన మానసిక శిక్షణ (Psychological discipline) ద్వారాను, పరిపూర్ణమైన, దృఢమైన ఆకాంక్ష ద్వారాను, సాధకుడు, తన నిజస్వరూపము (Psyche) ను గుర్తించి, ఆధ్యాత్మిక సాధన ద్వారా 'మనసు'ను అధిగమించి క్రమేణా 'అతీతమానసము' ను సాక్షాత్కరించుకొనిన ఆ 'అతీతమానసశక్తిని' అవతరింపచేసి ఈ అన్నమయి, మనోమయి, మనోమయి భూమికలను పరిణామము సాధించవచ్చును. ఇదియే శ్రీ అరవిందుల యోగ లక్ష్యము.

1910 సం॥నుండి శ్రీ అరవిందులు పాండిచేరిలో నివసించిన కాలము నంతయు వారు ఆధ్యాత్మిక సాధనయందే వినియోగించిరి. నాలుగు సంవత్సరముల మౌనయోగానంతరము వారు 1914లో 'ఆర్య' అను ఆధ్యాత్మిక విషయ మాసపత్రికను ప్రచురింప ప్రారంభించిరి. వారి రచనలలో ప్రముఖమైనవి, తరువాత పుస్తకరూపమున వెలువడినవియు నైన పెక్కు రచనలు ఈ మాస పత్రికయందు ధారావాహికముగా వెలువడినవే వాటిలో ఈశోపనిషత్తు, గీతా వ్యాసములు, దివ్యజీవనము, యోగసమన్వయము వంటి కృతులు శ్రీ అరవిందుల యోగసాధనలో సాక్షాత్కరించిన జ్ఞానభాండాగారములై యొప్పుచున్నవి. ఇతర రచనలు భారత సంస్కృతి విశిష్టతకు సంబంధించినవి వేదముల నిగూఢార్థమున ప్రవచించునవి. మానవ సమాజముయొక్క ప్రగతిని గూర్చినవి, మానవైక్యతాదర్శమును విపులీకరించునవి అగు రచనలై యున్నవి. ఈ కాలముననే వారు తమ పద్య రచనలను గూడ ప్రచురించిరి. వీరి పద్యకావ్యములలో మిక్కిలి విశిష్టమైనది 23813 పంక్తులతో విరాజిల్లు 'సావిత్రి' యను ఉద్గ్రంథము దీనినిగూర్చి ఒక అమెరికన్ విమర్శకుడు "ఇది బహుశః ఆంగ్ల సాహిత్యములోనే సాటిలేని ఇతిహాసము....అత్యుత్తమమైన విశ్వకావ్యము" అని నుడివినారు....ఆరున్నర సంవత్సరముల నిరాటంకమైన ప్రచురణ తరువాత 1921లో 'ఆర్య" ప్రచురణ ఆగిపోయినది.

పాండిచేరిలో తొలుత శ్రీ అరవిందులు ఏకాంతముగా నల్గురైదుగురు శిష్యులతో మాత్రము నివసించుచుండిరి. క్రమేణా శిష్యవర్గము వృద్ధియగుచూ వారిసంఖ్య ఎక్కువ కాసాగినది. తమ సర్వసంపదలను విడనాడి ఉన్నత జీవిత సాధనకొరకై విచ్చేసిన సాధకుల సమిష్టి జీవనమువకై వారినందరిని ఒక వ్యవస్థగా ఏర్పఱచవలసి వచ్చినది అదియే శ్రీ అరవిందాశ్రమస్థాపనకు ప్రారం

భము ఈ ఆశ్రమము శ్రీ అరవిందులు కేంద్రముగా ప్రారంభమై వృద్ధియగు చున్న ఒక సామూహిక జీవిత విధానము ఇందు దీనికి అధినేత "శ్రీమాత" ఆశ్రమవాసుల జీవితము. సాధన 'శ్రీమాత' నిర్వహించు చున్నారు.

## శ్రీ అరవిందుల తత్త్వవిచారము:-

శ్రీ అరవిందుల తత్త్వము, భారతదేశ ప్రాచీన ఋషులు నిర్వచించిన తత్త్వవిచారమునుండియే ఉత్పన్నమగుచున్నది. ఈ దృశ్యమాన ప్రపంచము వెనుక "అంతఃపురుష చైతన్యము" అను 'ఆత్మసత్త' యొకటియున్నది. అది శాశ్వతము, అద్వితీయము అయియున్నది. సృష్టియందలి సకల పదార్థములు ఈ ఏకాత్మలో ఐక్యముగా నున్నవియే కాని ఒకానొక చేతనా విభజన ప్రక్రియ కారణంగా అవి వేరువేరుగా నున్నట్లు తోచుచున్నవి. ఈ అజ్ఞానమువలన మానవుడు తమ నిజస్వరూప తత్త్వముల నెఱుగ లేకున్నారు. ఒక మానసిక శిక్షణ ద్వారా ఈ అజ్ఞానమును భేదించి, నిజస్వరూప తత్త్వమును, గ్రహించుటకును, సకల ప్రాణులలోను ఉన్న దివ్యత్వమును గుర్తించుటకును వీలున్నది.

శ్రీ అరవిందుల తత్వానుసారము ఈ ఏకరూప అంతఃపురుష చైతన్యము, ఇచట ఈ భౌతిక పదార్థమునందు (Matter) విలీనమై యున్నది. "పరిణామము" ((evolution) అనునది ఈ భౌతిక పదార్థములో సంలీనమై యున్న 'ఆత్మతత్త్వము' వికసిస్తూ తన్ను తావిముక్తము చేసికొనుటకు చేయు ప్రయత్నమే. మొట్టమొదట అచేతనములో అనగా జడ పదార్థములో చైతన్యముద్భవించినది. ఆ విధంగా ఉద్భవించినది అంతటితో ఆగక ఉన్నతములైన స్థితులలోనికి పెరుగ ప్రయత్నిస్తున్నది. ఈ ప్రయత్నములో రాను రాను ఉచ్ఛతరములైన స్థితులలో వికసిస్తుంది. ఇట్టి ఒత్తిడి ఫలితమే మనకు సృష్టిలో కన్పించు వివిధ పరిణామదశలు — (రాయి, మొక్క, జంతువు, మానవుడు.) జడమునుండి చైతన్యమావిష్కరించు తొలి ప్రయత్న ఫలితమే "ప్రాణి" ఆవిర్భావము. 'ప్రాణి' దశనున్న చైతన్య వికాస ప్రయత్న ఫలితమే "ప్రాణిలో" "మనస్సు" ఉద్భవించుట. ఈ విధముగా జరిగిన పరిణామక్రియ 'మనోభూమిక'ను చేరినది. ఇంతటితో నిలిచిపోదు 'మనసు' కంటె ఉన్నతమైన విశిష్టమైన చైతన్యశక్తి వికసింపవలసియున్నది. అదియే ఆధ్యాత్మిక అతిమానసచైతన్యము. కనుక సృష్టి పరిణామ క్రమములో తరువాతి దశయైన 'అధిమానస' ఆవిష్కర

ణము జరుగవలసియున్నది. ఇపుడు మన జీవితవిధానములో 'మనసు'కు ఎటువంటి ప్రాముఖ్యముంటున్నదో, ఆ విధముగా 'అతి మానస' అవతరణలో 'అతి మానసము'నకు ఆ ప్రాధాన్యత ఏర్పడును. ఈ విధముగా పరిణామము జరిగిననే ఈ వస్తురూప ప్రపంచములో సంలీనమైయున్న "దివ్యత్వము" పూర్తిగా వికసించి, మానవజీవిత విధానములో పరిపక్వత, పరిణతి సాధ్యమౌతుంది.

అయితే ఇంతవరకు ఈ పరిణామగతిలో ప్రధానపాత్ర 'ప్రకృతి'ది (Nature.) ప్రాణిదశలో వృక్ష జంతుజాలములో పరిణామమునకై స్వప్రయత్నములేదు. అంతయు ప్రకృతియే సాధించినది. కాని ఇపుడు మానవుని స్థితి యట్లుకాదు. ఇపుడు ప్రకృతి' పరిణామక్రియలో తన సాధనమైన 'మానవుని' యొక్క బుద్ధి పూర్వకమైన సహకారముతోనే తరువాతి దశను సాదించగలదు. అనగా మానవుని ప్రత్యక్ష సహకారము అవసరము కాని. ఇది కేవలము మానవుని 'మానసిక' శక్తితో మాత్రమే సాధ్యమయ్యేదికాదు. ఏలనన 'మనసు' అనునది పరిమితమైన స్వల్పపరిధిలో మాత్రమే సంచరించగలదు. ఊర్ధ్వముగ నది కొంతవరకుమాత్రమే పోగలదు. ఆపైన అధిగమించలేక అచటనే పరిభ్రమిస్తూ ఉంటుంది కనుక ఈ దశలో కావలసినది మానవుని చైతన్యములోనే యొక విశిష్టమైన మార్పు: (Change of Consciousness) ఒక నూత్నదృష్టి ఏర్పడవలసి యున్నది. ఇది ప్రాచీనయోగ అభ్యసన విధానములో విశదీకరించబడిన మానసిక శిక్షణద్వారా సాధ్యమౌతుంది.

ప్రాచీన కాలములో ఇందులకై యుపయోగించిన విధానము మనసును ప్రాపంచిక విషయములనుండి మరల్చి అనగా నివృత్తి మార్గముననుసరించి తుదకు 'ఆత్మ'ను సందర్శించగల్గుట. శ్రీ అరవిందుల ప్రతిపాదించిన నూతన విధాన మేమనిన, ఉన్నతస్థితిలోనున్న ఆత్మశక్తినే క్రిందికి అవతరింపచేయుట. ఈ విధముగా చేయుటవలన అతీత మానసశక్తి తనకుగల విశిష్టమైన శక్తిలో క్రింది భూమికమైన 'మనసు'ను పునీతముచేసి, అజ్ఞానమును పరిమిత జ్ఞానమును భేదించి పరిణామక్రియలో పురోగమిస్తుంది. ఈ క్రొత్త సాధనము - అతీత మానస అవతరణము — ఏర్పడిన యెడల ప్రతి మానవుడు తన నిజతత్త్వమును గుర్తించగల్గి, పాశవిక మానవతనుండి (animal humanity)

దివ్యమానవజాతిగా రూపొందగల్గును. ప్రాచీన యోగవిధానముల సాధకుడు ఈ అతీత మానస చైతన్యమువైపు ఉన్ముకుడగుటకు తోడ్పడుతుంది.

కాని ఇది ఉన్నట్టుండి, అతిస్వల్ప కాలములో సులభముగా సాధ్యమయ్యేడి విషయము కాదు అచంచలమైన దీక్ష, ఆకాంక్షలో సాధన అవసరము. అతిమానస అవతరణము సాధ్యమగుటకు సాధకుడెన్నియో దశలు దాటవలసియున్నది. సాధారణముగా మానవుడు తన మనసు యొక్క ఉపరితల భాగమునందే జీవించుచుండును. మనసులో సైతము లోతులకు వెళ్ళి అంతర్ముఖుడైనచో ఇంకను ఉత్తమమైన అవకాశములనెన్నింటినో గుర్తించగలడు, కనుక మొదట అతడు చేయవలసినది తాను తన మనసనెడి పొరయందే నివసించుటమాని, ఏకాగ్రత ధ్యానములవలన అంతర్ముఖుడై తాను తన మనసులో ఏకమైపోక విడిగా సాక్షి మాత్రుడుగా నిల్చి తన మానసిక చర్యలను ఒక ద్రష్టగా తిలకించుట కలవడెనేని కొంతకాలమునకు తన నిజ రూప (Psycho) దర్శనము ఆపైన ఉన్నతశక్తి యొక్క అవిర్భావము ఏర్పడును. కాని ఈ ఉన్నత శక్తియే 'అతీతమానసము' కాదు. అతీత మానసమునకు సాధారణ మనసుకు మధ్య ఎన్నియో అంతరములు గలవు. క్రమేణ వాటినన్నిటిని వికసింపబడి దాటవలసి యుండును. ఈ సాధన మార్గము జటిలమైనది, సుదీర్ఘమైనదియును. కాని ఈ మార్గమున సాధించిన ఏ స్వల్ప ప్రగతియైనను మిక్కిలి విలువ కలిగినదై సాధకుని ముందుకు గొంపోవును.

ఇది శ్రీ అరవిందుల యోగ సంక్షిప్త స్వరూపము. ఒక క్రొత్త మతమును స్థాపించుటగాని, ఉన్న మతముల సమ్మేళనము నేర్పఱచుట గాని శ్రీ అరవిందుల లక్ష్యముకాదు. వారి యోగము యొక్క ఏకైక లక్ష్యము అంతరాత్మ వికాసము. ఈ ఆత్మ వికాసము ద్వారా సాధకుడు అన్నింటియందు ఏకమును అద్వితీయమునైన 'ఆత్మ'ను గుర్తించగలిగి మానసికచైతన్యము కంటె మిన్నయైన ఉన్నత చైతన్యావిర్భావము—అదియే అతీతమానస చైతన్యము—నొంది దానిద్వారా మానవ ప్రకృతిలో దివ్యత్వము వికసింపచేయుట.

---

# శ్రీ అరవిందులు

— కె. యస్. భాస్కరరావు

బాహ్యదృష్టికి గోచరింపక, సామాన్యమానవ మేధస్సుకు అంతుపట్టనిది శ్రీ అరవిందుల జ్ఞాన తపో పూర్ణయోగ మహోజ్వల ఆంతరిక దివ్యజీవనము. మానవులందరు చూచునట్లు. ఒక ప్రదర్శనములోవలె కాక. తన జీవితము ఉపరితలమున బాహ్యముగ కానుపింపదనియు, అందుచే తన జీవిత చరిత్ర వ్రాయుట ఏ మానవునికి సాధ్యము గాదనియు శ్రీ అరవిందులే తెలియజేసిరి. భగవదవతారమూర్తిగాని ఒక మహా పురుషుడుగాని యే దేశమున, ఎక్కడ, ఎప్పుడు, ఏ భూభాగమున జన్మించెనో అది ప్రపంచ చరిత్ర గతిలో, మానవాళి ప్రగతిలో, ముఖ్యము అవసరముగాదు. అఖిల జగదారాధ్యమూర్తులైన ఆ మహానీయుల ఆదర్శపూర్ణ దివ్యజీవనమే సత్యజ్ఞానానంద జ్యోతిర్మయ భగవత్సన్నిధికి సన్మార్గదర్శకము. ఆత్మసాక్షాత్కార సందర్శన అనుభవ జనితములైన వారి ఉపదేశ ప్రబోధములు, సర్వదేశముల, సర్వకాలముల, సర్వమానవులకు, ఆచరణీయములు. శిరోధార్యములు. పరమేశ్వర స్వరూపమైన కాలమహిమ నెవ్వరూహింపగలరు? "కాలోస్మి" కాలమొక్కరీతి చరింపదెట్టి వారికైన. కానిచో భౌతికముగ మహోజ్వల స్థితిలోనుండి, వేదోపనిషద ధర్మమూలమైన ఆధ్యాత్మిక సాధనాన్వేషణలయందు తపోయోగ మార్గముల అత్యున్నత స్థానము నందున్న భారతదేశము, అల్పులగు మానవుల స్వార్థదురహంకార, అజ్ఞాన దుర్మదాడంబరముల, అంతఃకలహములవలన, ధర్మమూర్తులయిన మహర్షుల, తపస్సంపన్నుల ఆప్తవాక్యములను బోధలను పెడచెవిని బెట్టుటవలనను ఇతరములగు అనేక కారణముల (చారిత్రక) వలనను స్వాతంత్ర్యమును కోల్పోయి పరదురాక్రమణ, పర పాలన పీడన దాస్యముల మ్రగ్గి, శతాబ్దుల తరబడి నిర్వీర్యమై యుండుట శోచనీయము, విధివిలాసము. అట్టి తరి భారతదేశ స్వాతంత్ర్యమునకై ఎందరో మహానీయులు, మాతృదేశభక్తులు తమ తమ మహోన్నత జీవితములను, స్వార్థత్యాగులై, భారతమాత స్వాతంత్ర్య సాధనకై ధారవోసిరి. తన జీవిత సర్వస్వమును భారతమాత స్వేచ్ఛకై అంకితము చేసిన త్యాగమూర్తి శ్రీ అరవిందులు. కుటిల కుతంత్ర రాజనీతిజ్ఞులైన, మ్లేచ్ఛులైన

ఆంగ్లేయుల నెదిర్చి. విప్లవోద్యమమును నడిపిన ధీశాలి. ద్వాపరయుగ సంధిలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపనార్థము శ్రీకృష్ణపరమాత్మగా అవతరించి, నరరూపరాక్షసులైన దుర్యోధనాది దుష్ట మానవ రూపధారులైన అసుర శక్తులను కురుక్షేత్రరణరంగమున అర్జునగాండీవ అధిష్ఠాన మహాశక్తియై సుదర్శన మూర్తియై, అంతరింపజేసిన కాలస్వరూపమైన భగవద్దివ్యశక్తియే రెండు ప్రపంచ మహా సంగ్రామములు సంభవించిన సమయములో, ధర్మభూమి, కర్మభూమి, పుణ్యభూమి, తపోభూమి, "భూమాత", అయిన భారతమాతను పరదాస్యము నుండి విముక్త పరచి, మహోన్నత సనాతన ధర్మ ప్రతిష్ఠాపనకు, ఆధ్యాత్మిక జ్ఞాన సముద్ధరణకు, నూతన అధిమానసశక్తి, జ్యోతి, ప్రేమ, సచ్చిదానంద ముల అవతరణకు, నూతన సృష్టి పరిణామమునకు, పృథ్వీ—చైతన్య రూపాంతరమునకు, దివ్యమానవ ఆవిర్భావము(సూపర్ మాన్)నకు, దివ్యజీవనమునకు, భూమి—చరిత్ర యందే ఆధ్యాత్మిక విప్లవమును, సంకల్పించి, సాధించి, పూర్ణ సిద్ధిగాంచి, అచిత్తు (జడము) నుండి శ్రీ అరవింద రూపమున ఆవిర్భవించు చున్నది. నిత్యమై, సత్యమై, దివ్య అధిమానస సచ్చిదానంద మహస్సునందు శతసహస్ర, సహస్ర, దళదివ్యశ్రీ అరవిందమై వికసించి, నిత్యవిభూతి యందు పరమేశ్వర తేజములో, మహోజ్జ్వల శోభతో, ప్రకాశించుచున్నది, ఒక నూతన జగమవతరించుచున్నది నిశబ్దముగా, నిరాడంబరముగా, సహజముగా ఈ శుభోదయ, నవోదయ (అరొవిల్) మహోదయ సమయమున దివ్యజీవన నవ వేదవాణి శ్రీ అరవింద ముఖోద్గత శ్రీ కృష్ణపాంచజన్యారావమై సర్వజీవ కోటిని చైతన్యవంతము జేసి ప్రబుద్ధ మొనర్చి, సకల లోక కల్యాణ కారక పరమేశ్వర భగవతీశక్తి, పరమ కృపామూర్తి, శ్రీ రాజరాజేశ్వరి, శ్రీమాత దివ్యపాదసన్నిధిని, దివ్యనవజీవనమునకు సమాయత్త పరచుచున్నది. "ఒక నూతన జ్యోతిభూమిపై అవతరించినది. ఒక నూతన జగము ఆవిర్భవించినది. ఈశ్వరాభయ వరప్రదానములు సిద్ధించినవి,"

"అవతరించిన ఆ పరాశక్తి పరమేశ్వర దివ్య ద్వారముల తెరచు,
నిత్య అతిమానస మహస్సు మర్త్యలోక కాలవాహిని స్పృశించు,
మర్త్య మానవునియందు మహిత అతిమానవుడవతరించు
అంతర్నిగూఢ అర్ధ—దివ్యత్వము నావిష్కరించు.
ఈశ్వర దివ్యజ్యోతి, ఈశ్వరదివ్యశక్తి యందు వృద్ధి గాంచు

హృదయ గుహ యందలి ఆ పరమాత్మను ప్రకటించుచు.
అంత యా పరమేశ్వర దివ్య పదస్పర్శచే పునీతమగు పృథ్వీస్థలి.
మహోజ్జ్వల మా యాతీత దివ్య తేజో మహస్సు
మనస్సు, హృదయముల వెలిగించు. దివ్యత్వపు ఛ్ఛాయల
అమరలోక అక్షరమాల యందు అవ్యక్త మాయా
శక్తి అర్ధమగుటకు జీవనకర్మ ధారలను వేగపరచు.

* * * *

ఒక మహత్తరజాతి ఈ మర్త్యలోకము నాక్రమించు.
ప్రకృతి ప్రోజ్జ్వల శిఖరముల పరమాత్మ దివ్యభూమికల.
జీవన ప్రభువై అతిమానవుడు జగత్పరిపాలనసేయు.
ఈ భూమినే స్వర్గముతో సాటిగ సరిసమానము సేయు
అజ్ఞాన మానవ హృదయమును దివ్య సత్యోన్ముఖము సేయు.
మర్త్యప్రకృతిని మహితదివ్యత్వమున కుద్ధరించు.

* * * *

జగత్తును జ్యోతిరానందముల వశముజేయు అధిమనస్సు
అనురాగ హృదయమును ఈశ్వర దివ్యప్రేమచే చకితమొనర్చు.
ప్రకృతి ఉన్నత శిరమున తేజో కిరీటము నలంకరించు
సుస్థిర ప్రకృతి ఆధారముపై జ్ఞానజ్యోతి పరిపాలన స్థాపించు.

* * * *

ఒక నూతన దివ్యజీవనము ప్రారంభము కావలె.
పరమ చైతన్య సత్యశరీరము,
పరమప్రకృతి మహిత శక్తుల స్వస్థలము :
అజ్ఞాన మర్త్యభూమిపై అనంత సత్యపాలన సాగు,
సత్య స్వరూప జ్ఞాన తేజోభాగములు
అవిద్యా అజ్ఞానముల గూడ ప్రకాశించు మరియు
సత్యము, ప్రకృతి శిరమున సూర్యునివలె ప్రకాశించు మరియు
సత్యము, ప్రకృతి పదముల మార్గదర్శియగు

సత్యము, అజ్ఞానాగాధములనుండి దృష్టి సారించి.
ప్రకృతికి ప్రభువై అతిమానవుడు ప్రభవించినవేళ
అతడి ప్రభావమున భౌతికప్రపంచమె మారిపోవు :
ప్రకృతి రాత్రియందు సత్యాగ్నిజ్వాలలు ప్రజ్వలింప జేయునాతడు,
పృథ్విపై మహోన్నత సత్యధర్మమునే స్థాపించు నాతడు;
మానవుడుకూడ ఆత్మ — అంతర్వాణి నాలకించు,
ఆత్మనిగూఢ సాధ్యము నెఱిగి,
ఆత్మ — హృదయాన నిద్రాణమైయున్న దానినెరిగి
సృష్టి ప్రారంభమున, అజ్ఞాన లోకమున ఆత్మవాసము చేయుతఱి,
ప్రకృతి సంకల్ప సర్వము నెఱిగి
ఆనంద భగవద్దివ్య సత్యముల నాకాంక్షింపవలెనాతడు.

*　　　*　　　*　　　*

భౌతికమునందు అధ్యాత్మమవతరింపవలె
భౌతికము అధ్యాత్మ సత్యమును వ్యక్తము చేయవలె.
అంతట మానవుడు, అతిమానవు దేకమగుదురు
భూమియంతయు ఒకే (ప్రాణ) జీవనమగును
దివ్యవాణి నందరును ఆలకింతురు
అంతరాత్మ సంయోగమునకై అంతర్ముఖు లగుదురందరు
ఉన్నత అధ్యాత్మ ధర్మాచరణకై యత్నింతురందరు :
ఉన్నత భావోద్వేగ సంచలనముల ఉద్విగ్నమగునీ యుర్వి.
అగాధాత్మ ప్రబుద్ధమగు మానవత్వము
పరమేశ్వరుడు గుర్తించు ప్రకృతివి

*　　　*　　　*　　　*

ఒక దివ్యశక్తి ప్రత్యణువందు ప్రవహింపవలె
ప్రాణమనోవాక్కర్మములు దివ్యశక్తి ప్రబోదితములు కావలె
ఆలోచనలన్నియు అనేక సూర్యుల అమితప్రకాశము కావలె
ప్రతిభావము దివ్యరాగ రంజితము కావలె.
నిద్రాణమైయున్న మనోగుహల ప్రకాశించుచు

ఆత్మహృదయమున దివ్య ఉషోదయము కావలె:
ఒక హఠాత్సంభవానందము ప్రత్యంగమున ప్రవహింపవలె
మహోత్తర దివ్యసన్నిధిచే ప్రకృతి పూర్ణత్వము నొందవలె.
అల్లు వికసిత భూ — అరవిందమున దివ్యత్వము ప్రకాశింపవలె
సర్వసామాన్యజనులెల్లరు విస్తృత ఆత్మోన్నతి ననుభవింపవలె
సర్వ సామాన్యక్రియలు ఆత్మ తేజోకిరణప్రకాశవంతములు కావలె
సర్వ సామాన్యవిషయముల సర్వేశ్వరుని సాన్నిధ్యము గుర్తింపవలె.
పరమేశ్వరుని ప్రకటించుటకై జీవించు ప్రకృతి.
ఆధ్యాత్మశక్తి అంగీకరించు మానవత్వపు జీవన లీల
ఈమర్త్యలోక జీవనమగు జీవనదివ్యశ్రీ (దివ్యజీవనమ్)"

— సావిత్రిమహాకావ్యము.

శ్రీ అరవిందులు కలకత్తాయందు ఆగష్టు 15, 1872లో జన్మించిరి. "విశ్వచరిత్రయందు శ్రీ అరవిందుల జన్మ నిత్యమైనది, భౌతికముగ, ప్రపంచమునందు వారి జన్మఫలితములు శాశ్వత ప్రాముఖ్యము కలిగి యుండును.

"మానసికముగ, విశ్వచరిత్రయందు వారి జన్మము శాశ్వతముగ స్మరింపబడును.

"చైత్యకముగ, భూమిపై వారి జన్మము యుగయుగమున సంభవించుచుండును.

"ఆధ్యాత్మికముగ; భూమిపై వారి జన్మము నిత్య సత్య స్వరూపుడైన భగవంతుని అవతారమే కాగలదు."

—శ్రీమాత

"ప్రపంచ చరిత్రయందు శ్రీ అరవిందులకుగల్ల స్థానము - ఒకానొక ప్రబోధముకాదు. ఒకానొక దివ్యదర్శనమునుకాదు: పరమేశ్వర సంకల్పానుసారమే జరిగిన భగవదవతార సంకల్ప క్రియావిశేష పరిణామమే."

—శ్రీ మాత

"పృధ్వీచరిత్ర ప్రారంభమైనప్పటినుండియు మహత్తర భూ చైతన్య యాపాంతర కార్యములపై. ఏదేని ఒక రూపమున, ఏదేని ఒక నామమున శ్రీ అరవిందులు అధిష్ఠించి యున్నారు."

"పరమేశ్వర నిత్యవిభూతి ఆత్మపరిణామమునందు ప్రతి భగవ దవతారము కూడ, పూర్ణతర భవిష్యత్సాక్షాత్కారము తెలియ జేయునది, పరిణామ అగ్రగామి మాత్రమే.

అయినను భవిష్య దవతారమునకు ప్రత్యర్థిగ భూతకాలపు అవతారమును, దైవముగ పూజించెడి స్వభావము మానవునకు సర్వదా కలదు.

"ప్రస్తుతము మరల శ్రీ అరవిందులు ప్రపంచమునకు భవిష్యద్సాక్షాత్కారము తెలియ జేయుట కవతరించిరి. మరల వారి సందేశము పూర్వావతారములకు వలెనే, అట్టి ప్రతిరోధమునే ఎదుర్కొనుచున్నది. కాని వారి ఆత్మ సాక్షాత్కార దివ్య సత్య దర్శనమును భవిష్యత్కాలమే ఋజువు చేయును' వారి దివ్య కార్యసాధన తప్పక సిద్ధించును." —శ్రీమాత

"జన్మకర్మచమే దివ్యమేవం యోవేత్తి తత్త్వతః." ఈ భగవద్గీతా వాక్యప్రకారము భగవదవతార జన్మ దివ్య ప్రయోజనమును, అవతార రహస్యమును, దివ్యకర్మధార నెవ్వరెరుగగలరు, ఊహింపగలరు ? అపరా ప్రకృతిలోని నీచమానవ పశు స్వభావముతో ఎట్టి సంబంధములేని ఈశ్వర దివ్యత్వమును, మనోవాగతీత స్థితిని భావించుట, అనుసంధానించుట సామాన్య మానవునికి అసాధ్యమైనది. అవతారము నెల్లరును వెంటనే గుర్తింపలేరు. సర్వాతీతుడైన ఈశ్వరుడే, అపారకృపతో దివ్యదృష్టి నొసగకున్న, ఈశ్వరుడే, మానవుడుగా, అవతరింపకున్న, భగవంతుని గుర్తించుట, తెలియుట అసాధ్యము. అయితే ఈశ్వరుడుగా నున్నపుడు అజ్ఞులు తెలియలేరు, "అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్." దివ్యత్వమును మరుగుపరుచుకొని, 'ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా', మానవుడిగా మానవుల మధ్య మాధవుడవతరించినప్పుడు మూఢ మానవులు మానవ—(మాధవ) దివ్యత్వము నెరుగరు, దూషింతురు. "అవజానంతిమాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్, పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్, "నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః, మాయయా పహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః", నరుడైనను హ్రస్వదృష్టికి, అజ్ఞానదృష్టికి నారాయణుడు గోచరింపడు. "హే కృష్ణ, హే యాదవ" భక్తి కలిగిన భగవత్కృపచే ఈశ్వర జ్ఞానము, సత్యసాక్షాత్కారము, భగవంతుని దివ్య మంగళరూపము హృదయ

మున భాసించును. "దివ్యందదామి తే చక్షుః పశ్యమే యోగమైశ్వరమ్" వెలుగునిబట్టి సూర్యుని ఎరిగినట్లు, గుణమునుబట్టి వస్తుతత్వము నెరిగినట్లు, అవతరించిన భగవానుని దివ్యకర్మధారనుబట్టి సగుణ నిర్గుణాతీత మహాత్తేజో భగవత్తత్వమును భక్తితో తెలియనగును. శ్రీకృష్ణుడుగా అవతరించినప్పుడు అమానుష అద్భుతకార్యములను సాధించుటచేత (శ్రీకృష్ణలీల, కంసాది దానవ వధ, కురుక్షేత్రయుద్ధ విజయం) భగవంతుని గుర్తించుట, అంధుడైనను (ధృతరాష్ట్రుడు) సాధ్యము, సహజము. మానవులు గుర్తించినను గుర్తింపకున్నను ఈశ్వరసంకల్పము జరిగితీరును. అవతార ప్రయోజనము నెరవేరును. ఇది సత్యము. కురుక్షేత్ర రణరంగమున శ్రీకృష్ణుడు ఆయుధము చేపట్టలేదు. ఈశ్వరాద్భుత దివ్యశక్తికిది నిదర్శనముకాదా! సర్వశక్తిమంతుడు సర్వేశ్వరుడైనవానికి సంకల్పము చాలు. "కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః .... నిమిత్తమాత్రం భవ" భూమిపై భగవదవతార సన్నిధియే చాలు సర్వమును సాధించుటకు. రెండు ప్రపంచ మహాసంగ్రామములు సంభవించిన విపత్కరసమయములో, భూ-చైతన్యపరిణామమునకు, దివ్యమానవనవజాతి సముద్భవమునకు, దివ్యజీవన స్థాపనకు, పూర్ణయోగోద్ధరణకు, ఇత్యాది మహాకార్యసాధనకు, భగవద్దివ్యశక్తియే శ్రీ అరవింద రూపమున, అధిమానస మహస్సుతో అవతరించినదనిన సందియము లేదు. విశ్వాసముమాత్రమే కాదు ఇది విశ్వసత్యము. సర్వేశ్వరి, జగన్మాత, జ్ఞాన స్వరూపిణి, ఆద్యపరాశక్తి శ్రీమాతగా భూమిపై అవతరించియున్నది. భూమి విజ్ఞానమహస్సును పొందుటకుగాను. దివ్యచైతన్యమే శ్రీమాత 'క్షీరసాగర మధ్యమున ఆదిశేషతల్పము అధిష్ఠించియున్న మహావిష్ణు నారాయణ, దివ్య రూపమును శ్రీమాత దర్శించినది, ఇది అనితరసాధ్యము. అపూర్వము. ఇది వేద సత్యము, వేద సమ్మతము అని శ్రీ అరవిందులు సమర్థించిరి ఆ మహా పురుషుడే, నారాయణుడే, శ్రీ అరవిందులు. "అగాధ తమ అజ్ఞానమున శతాధికజీవులు మగ్గియున్నను ఏమియు కాదు; మేము నిన్నటి దినమున దర్శించిన మహాపురుషుడు (అరవిందులై) భూమిపై ప్రత్యక్షముగా నున్నాడు. అంధకారము ప్రకాశముగా రూపాంతరమొందు దినమేగు దెంచుటయును. భూమిపై మీ (ఈశ్వర) దివ్యపరిపాలన నిశ్చయముగ స్థాపింపబడుటయును, నిస్సందేహముగా తెలియుటకు మా మధ్య నున్న ఆ మహాపురుష సాన్నిధ్యమే

మాకు చాలును." అని శ్రీమాత శ్రీఅరవిందుల నిజతత్త్వమును తెలియజేసినది. "శ్రీ అరవిందులు మహస్సు యొక్క అధిమానసచైతన్యమును తమ శరీరము (భౌతికము) నందు అవతరింపజేసికొనిరి. ఆ గమ్యమును మనము చేరుకొనుటకు ఆచరణ సాధనా విధానమును, ఆ మార్గమునందలి స్వభావమును మనకు తెలియజేయుటయే గాక తమ ఆత్మ సాక్షాత్కార దివ్య దర్శనానుభవముచేత మనకు ఆదర్శముగా నిల్చిరి. అతీత మానసావతరణము సాధ్యమేననియు, దానిని సాధించుట కిదియే తరుణ మనియు మనకు తెలియుటకు వారి యందే అది నిరూపితమైనది." భూ-చైతన్య పరిణామ మహాకార్య సాధనకై తమ దివ్య అధిమానస, తేజోశక్తిమయ దేహమునందు ఆత్మ సిదిని, దివ్యజీవనమును సర్వమానవ శ్రేయస్సుకు, లోక కల్యాణమునకొరకు, భూమిని రక్షించుటకు, రూపాంతర పరిణామ ప్రక్రియను శీఘ్ర పరచుటకు తమ శరీరమునే త్యాగము చేసిన మహనీయుడు శ్రీ అరవిందులు. అపూర్వమైన ఈ త్యాగము, భవిష్యత్పరిణామము, సామాన్యముగా అర్థము గాదు, అనూహ్యము, ఆ మహాపురుషత్యాగము, పూర్ణాహుతి దివ్యనవ జీవన సృష్టి-యజ్ఞ ప్రారంభము కాగలదు ఈ భూమిపై "ఆ మహాపురుష ఆత్మ త్యాగమే ఒక మహోన్నత దివ్యజీవన ప్రారంభము కాగలదు" —సావిత్రి.

"భూమి - చరిత్రయందు శ్రీ అరవిందుల జన్మము నిత్యమైనది." యనుటలో, ఈ సందర్భమున, అలీపూర్ బాంబు కుట్రకేసునందు న్యాయస్థానమునందు శ్రీ అరవిందులనుగూర్చి చిత్తరంజన్‌దాస్ అనిన, అమోఘములు, భవిష్యత్తు సూచించు, వాక్యములు స్మరించుట సముచితము. "మీకు నా విన్నవమిది. ఈ వ్యాజ్యము నిశబములో అణగి అంతరించినా చాలాకాలము తర్వాత, ఈ విప్లవోద్యమము, ఈ గందరగోళము ఆగిపోయిన చాలాకాలము తదుపరి, వారు (శ్రీ అరవిందులు) శరీరమువదలి వెడలిపోయిన చాలాకాలము తరువాత, వారిని, మాతృదేశమును, భరతమాతను, ప్రాణసమానముగా, దైవముగా ఆరాధించిన దేశభక్తుడైన మహాకవిగా, జాతీయతాభావమునందు మహాప్రవక్తగా మానవత్వమునే ప్రేమించిన మహానుభావునిగా ప్రపంచము గుర్తించి, గౌరవించి, పూజించును. వారు శరీరము వదలి పోయిన చాలాకాలము తర్వాత వారి వాక్కులు (శ్రీ అరవిందుల దివ్యజీవన నవవేదవాణి) భారతదేశమునందే గాక దూర సముద్ర తీరములుదాటి, దేశాంతరముల, ఖండఖండాతరముల,

అన్ని భూములందు సర్వప్రపంచమునందు (దివ్యానందవేణుగానము, వేదవాణి, నూతన పాంచజన్య శంఖారావముతో) మేఘగంభీర గర్జనలవలె ధ్వనించి, ధ్వనించి, దిక్కులు ఆ దివ్యనాద ప్రతిధ్వనులతో నిండిపోగలవు. కనుక అట్టి స్థితియందున్న ఆ మహనీయుడు ఈ న్యాయస్థానము ఎదుట మాత్రమేగాక చరిత్రయొక్క ఉన్నత న్యాయస్థానము యెదుట నిల్చియున్నాడని నే నందును." ఇది 1908లో జరిగినది। ఇప్పుడు ప్రపంచమంతయు నవజీవనజ్యోతి కొరకు, జ్ఞానభిక్షకొరకు శ్రీ అరవిందుల నాశ్రయించు చున్నది.

రవీంద్రనాథ్‌టాగూర్ శ్రీ అరవిందులను ప్రథమముగా దర్శించినపుడు ఇట్లు వ్రాసుకొనిరి "ప్రథమ సందర్శనమునందే, శ్రీ అరవిందులు ఆత్మాన్వేషి యగుచు, ఆత్మ సాక్షాత్కారము పొందిరనియు, అట్టి సుదీర్ఘతీవ్రతపోసాధన యందు, ఏకాంతమున నిశబ్దముగా ఒక నూతన చైత్య చోదనమును తమయందే పొందిరనియు గ్రహించితిని. వారి వదనము అంతరాత్మ తేజముతో ప్రకాశించుచున్నది. ఆయన సన్నిధి పరమప్రశాంతముగా నున్నది....

"మానవాత్మను సర్వేశ్వరుని సన్నిధికి గొంపోవు స్వాతంత్ర్యమును ప్రసాదించు సమతనుగూర్చి సనాతన భారత మహర్షి (వేదఋషి) వారి (శ్రీ అరవిందుల) ద్వారా ప్రవచించు చున్నటుల నేనైనుభవము పొందితి. 'శ్రీ అరవిందా, రవీంద్రుడు మీకు ప్రణమిల్లు తున్నాడు వేదవాణి మీ ముఖము నందున్నది. దానిని వినుటకు మేము వేచియున్నాము. భారతదేశము మీ యొక్క వాక్కులతో, ప్రపంచముతో మాట్లాడును. (భారతదేశము జగద్గురువై ప్రపంచ మంతయు శ్రీ అరవింద చైతన్య జ్ఞానతేజములు వ్యాపించును.), నా ప్రార్థన ఆలకింపుము...."

'ప్రగతిపథంలో ప్రబుద్ధభారత' మను గ్రంథమునందు ప్రసిద్ధ రచయిత అయిన రోమారోలా' శ్రీ అరవిందులనుగూర్చి యిట్లు వ్రాసిరి: "ఆసియా ఐరోపాఖండముల జ్ఞానమునందు ఈ నాటివరకు సాధించిన పూర్ణతమ సమన్వయ మూర్తి శ్రీ అరవిందులు." ఇంకనూ, "మహనీయులైన మహర్షుల పరంపరయందు చివరివారైన శ్రీ అరవిందులు తమ కరమునందు నూతన సృష్టికారక దివ్యశక్తి ధనుస్సును దృఢముగా దాల్చియున్నా"రని వ్రాసిరి.

వేరొక మేధావి శ్రీ అరవిందుల 'దివ్యజీవనము' ఈ కాలపు మహోత్తమ గ్రంథరాజమనిరి. ప్రస్తుతకాల భారతీయ దేదావ్యులలో శ్రీ అరవిందులు బహుముఖ ప్రజ్ఞాశాలియని రాధాకృష్ణుడనిరి.

శ్రీ అరవిందుల మూర్తిత్వము మహోన్నతమైనది. అత్యున్నత హిమగిరి (గౌరీశంకర) శిఖరమువలె అన్నివైపులనుండియు ఉన్నతమైనది. నమోస్తుతే సర్వత ఏవసర్వ' మహాయోగి. మహాఋషి. మహానుభావుడు. దివ్యజీవన మహా ప్రవక్త. దివ్య అధిమానస చైతన్య పరిణామ అగ్రగామి. ఉగ్రతపస్వి. పూర్ణ యోగ యోగేశ్వరుడు దివ్యవరనవకవితా వేశమహాభావాగ్ని జ్వాలాసహస్ర పూరిత "సావిత్రి" మహాకావ్య సృష్టికర్త. ఋషి. మహాకవి. మహామేధావి. మహారచయిత. శతాధికగ్రంథకర్త.....దివ్యమానవుడు.....అవతార పురుషుడు. శ్రీ అరవిందుల దివ్యమూర్తి ఏకోణమునుండి చూచినను అత్యున్నత మైనది. అద్భుతమైనది. అపూర్వమైనది.

"అమృత తత్త్వమునుండి అవతరించిన దివ్యమూర్తి.
విశాలాకాశ పరిధులనుండి వారియాత్మ.
మన అనిత్య దృశ్యప్రపంచములోని కరుగుదెంచె.
దుర్గమారణ్యభూముల దారిచూపు వెలుగురేఖ.
భవిష్యత్పరిణామ చిహ్నమై దివ్యమైనది వారి జన్మ :
వారియందలి మానవాత్మ దివ్యవస్త్రమువలె
అంధ ప్రపంచమును నడపించు సర్వజ్ఞశక్తిని మరుగుపరచె.
విశ్వాంతరాళశూన్యకాలముల కనుబంధమై
ఇచట మానవునికి, భూమికి భగవంతుని ఋణము తీర్చుచు
ఒక మహత్తర ఈశ్వర కుమారత్వమువారి దివ్యఅధికారము.
మర్త్యులై జన్మించి అజ్ఞానమున మునిగియున్నను
వర్ణనాతీత దివ్యతేజస్సు వారిజ్ఞానమునందుకలదు.
క్షణమునందు వానిప్రవాహమునందు తగుల్కొనిన
మూలకారణ శాశ్వతత్వముయొక్క దివ్యశక్తి యాతడు.
అంతస్సత్యలోక సందర్శనమునాతడు పొందియుండె ;
తెలియరాని దైవమునుండి పొందిన దివ్యశక్తికల దాతడియందు.
పరసంకేతముల పొందుపరచు నాతడు.

మానవాతీత మధురస్వప్నముల సమకూర్చుకొను నాతడు.
మహితసంస్కృతుల ముద్రాంకితుడాతడు
మానవ జీవితముపై వాని దివ్యతేజము ప్రసరింపచేయు.
ఆతడి జీవితము పరమాత్మవైపు సుదీర్ఘ పరిణామము.
ఆకాశపథముల నారోహించునాతడు
ఆధ్యాత్మిక జలమునాస్వాదించి జీవించు
కాంతి కిరణముల కనిపించని సూర్యుని కలసికొన నేగును.
ఆతడి దివ్యాత్మ నిత్యపరంధామ ప్రతిదిధిగనిల్చె.
ఆతడి మనస్సు అగ్నిజ్వాలవలె అమరలోకమునే ఎదుర్కొను.
ఆతడి సంకల్పము కాంతి మార్గముల పరుగులెత్తు.

*  *  *  *

ఆతడు తన జీవితమును భగవంతునిపై ఆధారము జేసికొనెను."
(భగవంతునిపై భారమువైచి జీవించునాతడు.)

*  *  *  *

ఆతడు సాధించిన దానికంటె కష్టతరమైన కార్యము మిగిలి యున్నది.
సర్వసృష్టికి మూలాధారమైన దానినాతడు సాధింపబూనె.
మనోవాగతీత సత్యజ్ఞాన
రహస్యసంకేత స్థానమునుండి
సర్వమును చూచుదృష్టితో సర్వలోక సంరక్షణము సేయుచుండు
సమీపింపరాని ఆతడి ఆత్మప్రశాంతస్థితిలో,
అమితముగ, ఏకాగ్రముగా, అత్యున్నతముగా, ఏకాంతముగా
అవతరించిన ఆశాజ్యోతివలె సహనమూర్తియై
ప్రార్థనా పీఠముపై చలనరహితముగ కూర్చుండె నాతడు.

*  *  *  *

"అంతిమ మహత్తమ రూపాంతరమేతెంచె.
మనోశరీరముల మహోతరంగముల నాక్రమించుచు
మహాసముద్రమువలె ఆతడి ఆత్మసర్వస్వము ముందటనుండె :
హృదిస్థిత దైవసామ్రాజ్యమును

జీవితమున విశ్వ సామరస్యము సాధించుటకు
బాహ్యాభ్యంతరముల సంయోగపరచి
విశ్వము నంతయు పొందుటకు ఆతడి జీవము విస్తృతమయ్యె.
ఇట్టి అద్భుత విశ్వజనీన భావమునందు
ఆతడి ఆత్మ-స్వభావము, మనోభావము మాత్రమెగాక
ప్రతి ఆత్మను ప్రతి మనస్సును తన యందిముడ్చుకొనె.
శరీరమునందలి ప్రాణజీవనము మారిపోయె
జీవించు ప్రతిప్రాణిలో ఐక్యభావము నొందేనాతడు;
ఇతరుల ఆనందమును తన ఆనందముగా భావించెనాతడు,
ఇతరుల దుఃఖమును తన దుఃఖముగా భరించెనాతడు;
నిగూఢ సర్వాతీత సచ్చిదానంద ప్రశాంతస్థితుల చకితమై
అఖిలప్రాణుల భరించు భూమివలె
మహాసముద్రమువలె, సర్వసృష్టి భారమును
ఆతడి విశ్వాత్మక కరుణాభావము భరించె.

* * * *

విశ్వజీవిత ప్రవాహమె ఆతడి జీవితము.
పూర్ణసిద్ధుడై ప్రపంచాగ్ర భాగమున నిల్చెనాతడు
ప్రపంచాతీత ఆరోహణము నిరీక్షింపుచు
ప్రపంచమును రక్షించు అవతరణను నిరీక్షింపుచు.
ఒక దివ్యతేజము, ఒక దివ్యసంకేతము భూమినావరించె,
ప్రశాంత దివ్యదర్శనములు కలిగె,
పవిత్రాకాశములు ఆక్రమించె
జ్ఞానవార్నిధులు సమీపించె మరియు
తేజో దూరస్థలములు సమీపించి సన్నిహితమయ్యె.

* * * *

"ప్రకృతియంతయు పరమేశ్వర చిచ్ఛక్తియయ్యె :
ఒక జ్ఞానము అందరియందు పనిజేసె, స్వచ్ఛందముగా, సుస్థిరముగా.
ఒక అనంత తేజోవిరాజమాన దివ్యవైభవము,

ఒక ఆత్మజ్ఞాన సందర్శన సత్యసాక్షాత్కార విజయము.
ఒక సృష్టికారక సర్వక్రియాశక్తి మహోద్రేక విలాసము.
"కాలము కల్పించిన సృష్టియందాతడధికుడు.
స్వర్గలోక సుషుప్తినుండి నిర్మితమైన ఇంద్రనీలమణి.
ఆనందమయమైనది ఆతడు ఆత్మ.
పారవశ్యానంతమునుండి ప్రసరించు కాంతికిరణమాతడు.
ఆనందాగ్ని సూక్ష్మ జాగృత నిశబ్దమాతడు.
ఒక దివ్యత్వము, రాజదర్పము ఆతడి ఫాలమున ప్రకాశించు;
ఆనందమయలోక స్మృతి కల్గియుండు నాతడికనులు.
ఆకాశమున ఆ చంద్రునివలె ప్రకాశించువాడు,
వసంతాగమనవేళ వికసించు పుష్ప పమాన సౌకుమార్యము కలవాడు,
ప్రశాంత తీరమున చుంబించు ప్రవాహ సదృశ పవిత్రమూర్తి యాతడు.
ఆత్మేంద్రియజ్ఞానమున ఆశ్చర్య చకితుడగునాతడు.
స్వర్ణమయ స్వర్గ సజీవ మూర్తి యాతడు
నిరీక్షణ లోకమును తాకు వినీలాకాశమాతడు,
నిత్యస్థితి నుండి కాలము గొనివచ్చిన
అద్భుత ప్రకాశ మాన నక్షత్రము ఆనందమయారవిందము.,,

* * * *

"సావిత్రి మహా కావ్యములోని ఇట్టి కొన్ని పాదములను, పైన ఉదహరించినవి, చదివి గ్రహింప యత్నించిన శ్రీ అరవిందుల ఆత్మ ఔన్నత్యము కొంతవరకు బోధపడనలదు, శ్రీ అరవిందుల యోగసాధనా తపస్సులందు వారికి కలిగిన దివ్యఅనుభవములను, దర్శనములను, మహోన్నత భావములను ఉదాత్త గంభీరశైలియందు రచించి ప్రకటించిరి. వారి దివ్య రచనలే వారి అంతరిక యోగ జీవిత సత్యమును తెలియజేయును. "సావిత్రి" మహా కావ్యమే వారి పూర్ణయోగ సాధనా, ఆత్మ పరిణామ మహోన్నతిని. వారి దివ్య అనుభూతి సందర్శనములను ఉదాత్త గంభీర మహాద్భుత మహోత్తమభావముల వర్ణనతో కూడి తెలియజేయును. 'సావిత్రి' శ్రీ అరవిందుల దివ్య జీవిత చరిత్ర యనిన ఆశ్చర్యముకాదు. 'సావిత్రి'యే శ్రీ అరవిందుల ఆత్మకథ.

అశ్వపతి మహారాజు ఆకాంక్ష, సావిత్రి జననము కొరకు సూర్యమండల మధ్య మహా తేజో విరాజమాన అధిష్ఠాత్ర మహాశక్తి, మహాజ్యోతి అయిన సావిత్రి మహాదేవిని గూర్చిన ఘోరతపస్సు — శ్రీ అరవిందులదే. సత్య వంత స్వరూపము, నిజతత్త్వము భగవత్స్వరూపమైన సత్యము, ఋత–చిత్, సచ్చిదానందము, మహస్సు, విజ్ఞానము, అతీత మానస శక్తి, జ్యోతులను, ఆకాంక్షించు– శ్రీ అరవిందులే. మృత్యువును జయించి, పూర్ణయోగ సిద్ధిగాంచి పృథ్వీ–చైతన్యములో మార్పు తీసికొని వచ్చి భూమిపై అతీత మానసావతర ణకు దివ్య మానవ జాతి జన్మించుటకు భూమికొరకై భూమిపై తపస్సాధన చేయు దివ్య చైతన్యమే మూర్తి మంతమై అవతరించిన సావిత్రీ స్వరూపము శ్రీమాత. శ్రీ అరవిందుల తపఃఫలమే సావిత్రీ. శ్రీమాత. భూమికొరకు శ్రీ అరవిందుల ప్రార్థనాలకించి అవతరించిన దివ్యచైతన్యము, ఆద్య పరాశక్తి మహా శక్తి, శ్రీమాత,

'పూవు పుట్టగానే పరిమళించు' నన్నట్లు శ్రీ అరవిందుల మహనీయ ఆత్మ ఔన్నత్యము బాల్యము నుండియు వెల్లడియైనది. వాస్తవమునకు వారి జన్మ సమయమే. 15 ఆగస్టు, 1872,–శ్రీమాత తెలియజేసినట్లు విశ్వ చరిత్ర యందు వారి జన్మ ఫలితములు శాశ్వత ప్రాముఖ్యము కలిగియుండును. సరిగా అదే సమయమున ద్వాపరయుగమున శ్రీ కృష్ణావతారము సంభవించినట్లు నిరూపితమైనది. 'చైత్యకముగా, భూమిపై వారి జన్మము యుగయుగమున సంభవించుచుండును' అని శ్రీమాత వచించుట సమంజసముగా నున్నది. శ్రీకృష్ణపరమాత్మ తిరిగి శ్రీ అరవిందులుగా అవతరించెననుట సత్యము. నిర్వి వాదము. 'ఆధ్యాత్మికముగా శ్రీ అరవిందులు భగవదవతారమ్మే' —శ్రీమాత.

ఆగస్టు 15వ తేదీనాడే భారతదేశము స్వాతంత్ర్యము కూడ సిద్ధించుట పరమాద్భుతము. ప్రపంచ చరిత్రయందే అతి ప్రదానఘట్టము, ఆధ్యాత్మికముగా దివ్యశక్తి కర్మధార. పరమేశ్వర దివ్య సంకల్పానుసారము జరిగిన పరమా శ్చర్య క్రియా విశేష పరిణామసిద్ధియే! ఈ సందర్భమున శ్రీ అరవిందులే స్వయముగా అనుగ్రహించిన వారి జన్మదిన, భారత స్వాతంత్ర్యదిన, సందేశ మును సమీక్షించుట సముచితము. "1947 ఆగస్టు 15 స్వతంత్ర భారత జన్మ దినము. ఇది భారతదేశమునకు గత (పరదాస్య) యుగాంతమును, నూతన (స్వాతంత్ర్య ) యుగారంభమును సూచించుచున్నది. స్వతంత్ర జాతి వలె

మన జీవితము మనము చేయు పనుల ద్వారా సర్వ ప్రపంచమునకు; రాజకీయ సాంఘిక సాంస్కృతిక, ఆధ్యాత్మిక మానవ భవితవ్యమునకు నూతన యుగారంభమున ప్రముఖ దినముగా మనము ఈ దినము (15 ఆగస్టు) ను చేయ వచ్చును.

"ఆగస్టు 15 నా జన్మదినమే. అది ఇంతటి మహత్తర విశేష ప్రాముఖ్యము వహించుట సహజముగానే నాకు హర్షదాయక మగుచున్నది. ఈ సంఘటన, కాకతాళీయముకాదు. అనుకోని ప్రమాదవశమున జరిగినట్లు నేను భావింపను. ఏ కార్యసాధనకై (భారతస్వాతంత్ర్యము) నేను నా జీవితమును ప్రారంభించితినో అట్టి కార్యసాధనయందు నాకు మార్గదర్శకముగా నన్ను నడిపించు దివ్యశక్తి యొక్క ఆజ్ఞా_ముద్రికగా, 'నా సాధన సంపూర్ణ ఫలసిద్ధి ప్రారంభమగుచున్నట్లుగా భావింతును .... స్వతంత్ర భారతదేశము ఒక ప్రముఖ పాత్ర వహించి, అగ్ర స్థానమున ఉండవచ్చును.

"స్వతంత్ర అఖండ భారతదేశ నిర్మాణమునకై విప్లవోద్యమము నా మొదటి స్వప్నము .... ఏ విధముననైన ఏ విధానముననైనను విభజన అంత రింపవలసినదే. భారతదేశ భావి ఔన్నత్యమునకు అవసరము గాన ఐక్యత విధిగా తప్పక సిద్ధించును.

"మరియొక స్వప్నము. ఆసియా ఖండవాసుల పునరుద్ధరణ, స్వేచ్ఛ. మానవ నాగరికతా ప్రగతియందు తిరిగి ఆసియా ఉన్నత స్థానము పొందవలెను .... ఇందు భారతదేశము తన పాత్ర వహింపవలెను. ఆమె సాధింపగలదావిని సూచించు, ఐక్యరాజ్యసమితిలో ఆమె స్థానమును నిర్ణయించు శక్తి సామర్థ్యములలో ఆమె తన కార్యసాధన ప్రారంభించినది. నా మూడవ స్వప్నము, ప్రపంచ_సమైక్యత .... ఇట కూడ భారతదేశము ప్రముఖపాత్ర వహింప నారంభించినది ....

ఐక్యతాభావ నూతనశక్తి మానవజాతి నాక్రమించును

"మరియొక స్వప్నము ప్రపంచమునకు భారతదేశ ఆధ్యాత్మిక జ్ఞాన ప్రదానము అప్పుడే ప్రారంభమైనది. భారత ఆధ్యాత్మికత అధికాధికముగా యూరోపు అమెరికా ఖండముల ప్రవేశించుచున్నది. ఈ ఉద్యమము వృద్ధియగును. కాలమున కలుగు విపత్తుల వలన ప్రముఖ భారతదేశ ప్రబోధముల

నాలకించుటయేగాక భారత చైత్యాత్మ, ఆధ్మాత్మిక యోగసాధనలకై అనేకులు అధికముగా ఆశాహృదయములతో ఆశ్రయించు చున్నారు.

"చివరి స్వప్నము. మానవుని విస్తృతోన్నత చైతన్యములోనికి ఉద్ధరించుటకు పరిణామము నందొక దశ నందుకొనుట. వ్యక్తిగత పరిపూర్ణత్వమునకు, సాంఘిక సంపూర్ణత్వమునకు మానవుడు ఆలోచించుటకు కలలుగనుటకు ప్రారంభించినదిమొదలు అతడిని వేధించిన, కల్లోలపరచిన సమస్యాపరిష్కార ప్రారంభము కాగలదు,ఇది ఇంకను వ్యక్తిగతమైన ఆశాభావము, ఒక ఊహామాత్రమే. భారత పాశ్చాత్యదేశములందు దూరదృష్టిగల మేధావులకు కలుగుచున్న ఆదర్శముకూడ యిట్టిదే. ఇట్టి ప్రయత్నమునందలి (పరిణామమునందు) కష్టములు ఈ మార్గమునందు, ఇతర మార్గములకంటె, భయంకరముగా నుండును. కాని పరమేశ్వర సంకల్పమున్నచో కష్టములన్నియు తొలగిపోవును. ఇచ్చటకూడ ఈ పరిణామము జరుగవలెననిన, ఆత్మాభివృద్ధి, ఆంతరిక చైతన్యాభివృద్ధిద్వారా జరుగవలెను కాన భారతదేశమునందే అది ప్రారంభము కాగలదు. విధానము విశ్వవ్యాప్తమే అయినను. భారతదేశమే కేంద్రముగా జరుగగలదు.

"ఈ భారత స్వాతంత్ర్య దినమునందు ఇట్టి విశేష ప్రాముఖ్యము నేను ఇచ్చుచున్నాను. నా యీ ఆశాభావము ఎంతవరకు సమర్థనీయమొ అది స్వతంత్ర నవభారతదేశముపై ఆధారపడియున్నది." — శ్రీ అరవిందులు.

శతాబ్దుల పర్యంతము పర దురాక్రమణ పర పీడన దాస్యముల క్రుగ్గిన భారతదేశము శ్రీ అరవిందుల జన్మదినమైన ఆగస్టు 15 తేదీన స్వాతంత్ర్యము పొందినది. దాస్యకాల మంతరించినది. నూతన నవజీవన యుగారంభమగుచున్నది. ఆధ్యాత్మికముగ భూ చైతన్య పరిణామమునందు, రూపాంతరమునందు మొదట అతిమానసశక్తి అవతరణకూడ భారతదేశముననే జరిగినది భవిష్యత్తునందు దీని పరిణామములు అనూహ్యములు, అనివార్యములు.. మహత్తర దివ్యమానవజాతి (నూతనసృష్టి?) ఉద్భవించి భూమిపై మహోజ్జ్వల దివ్యజీవనమే ప్రారంభము కాగలదు. ప్రపంచచరిత్రలో ఒక దేశమునందు ఒక వ్యక్తి (మహాపురుషుడైనను) జన్మదినమున ఆ దేశస్వాతంత్ర్య ఊహింపలేనిది, లభించుట ఈశ్వరసంకల్పశక్తి భూమిపై ప్రపంచములో జరుగు సంఘటనలపై ప్రభావము కలిగియుండుట పరమాశ్చర్యము. అతీత మానసశక్తి

(ఈశ్వరశక్తి) పనిచేయుచున్నదనుటకు ప్రత్యక్ష నిదర్శనము. శ్రీ అరవిందులు భావించినది, సంకల్పించినది, వారిస్వప్నములు సత్యములై ఫలించినవి. ఫలించు చున్నది. భవిష్యత్తులో సంపూర్ణ ఫలసిధిగాంచును. స్వాతంత్ర్యానంతరము ప్రత్యేక సంస్థానములంతరించి భారతరిపబ్లిక్ అవతరించినది. బాంగ్లాదేశ్ అవతరణకూడ ఒక విధముగ విభజన అంతరింపజేసినది ఇది ఒక ప్రత్యక్ష నిదర్శనము. అతీత మానసశక్తియొక్క శ్రీ అరవింద కర్మధార విజయము. ఒక దివ్యశక్తి బాంగ్లాదేశ్ ప్రజలను చైతన్యవంతులుగజేసి వారిలో స్వాతంత్ర్య వాంఛ కలిగించినది. ఫలితమే బాంగ్లాదేశ్ ఈ సందర్భమునకూడ శ్రీ అరవిందులు ఆ నాడు (15 ఆగష్టు 1947) దర్శించినట్లు భారతదేశము అతి ప్రధాన ప్రముఖ పాత్రను వహించినది. విజయము గావించినది. అగ్రరాజ్యముల కుటిల కుతంత్ర కుత్సితములు భగ్నమై అవి పరాజితమైనవి. వారి మూడవ స్వప్నమైన ప్రపంచ సమైక్యత భవిష్యత్తులో తప్పక రానున్నది. లేనిచో ప్రపంచమునకు భవిష్యత్తుయేలేదు శ్రీమాత హెచ్చరించినట్లు, ఖండములకు' దేశములకు, మానవులకు, తప్పనిసరియైన విధి. అగాధములో నశించుటయో, ఆ దివ్య సత్యమువైపు పరిణమించుటయో ఎన్నుకొన వలసిన తరుణము ఇది. అగ్ర రాజ్యములు మూఢస్వార్థములను త్యజించి, స్వాతంత్ర్యము, సమానత్వము సౌభ్రాతృత్వము సర్వమానవాళి సహజ జీవన సత్యములని గుర్తించి నిజమై ఆత్మ ఐక్యతాభావముతో దివ్య చైతన్యముతో ప్రపంచ సమాఖ్యను ఏర్పరచి సుస్థిర భవితవ్యమునకు సర్వమానవులు సుఖశాంతులతో దివ్యచైతన్య జీవన జ్యోతియందు ఆనందముగా జీవించుట కొరకు, సకల లోకకల్యాణముకొరకు, హృదయపూర్వకముగా యత్నింపవలెను. సాధింపవలెను. ఇదియే శ్రీమాత ఆకాంక్షించునది. ప్రకృతి పరిణామము. ఇదియే ఈశ్వరేచ్ఛ దీని నెవ్వరును ఆపలేరు. ఇదియే శ్రీ అరవింద కర్మధార. అరోవిల్ నిర్మాణమే నూతన ప్రపంచమునకు నాంది. ఈశ్వర సంకల్పాను సారము శ్రీ మాతయే, పరాశక్తి నూతన ప్రపంచమును నిర్మించు చున్నది. ఎన్ని అవరోధములు కలిగినను నూతన జగత్తు తప్పక అవతరించును.

వ్యక్తి చైతన్యమునందు సంభవించు మహత్తర రూపాంతరము భవిష్యత్తునకు సంబంధించినది. శ్రీమాత ప్రవచించినటుల, "శ్రీ అరవిందుల దివ్య ఆత్మ మాహాత్మ్యము, దర్శన సత్యమును భవిష్యత్కాలమే ఋజువుపరచును.

వారి కార్య సాధన తప్పక సిద్ధించును." ఆత్మ శ్రద్ధా విశ్వాసములందే భూమాత హృదయా కాంక్ష కలదు.

అనంతకాల ప్రవాహమునందు చరిత్రగతిని పరకించి చూచిన, సర్వ విపత్తులను, అవరోధములను దాటి ప్రపంచము, అన్ని ఖండములు, అన్ని దేశములు, సర్వమానవులు సమైక్యతా భావమువైపు ఆకాంక్షించుచున్నట్లు గోచరించును. ఇది సహజము. భేదము స్వార్థములకన్న ప్రేమా ఐక్య భావములు గొప్పవి. స్వాతంత్ర్యము సమానత్వము, సౌభ్రాతృత్వము మానవ హృదయములలో కలిగి, ప్రపంచమున శాంతి సౌఖ్యములు స్థాపనకావలెను. ఇందులకై ఈశ్వర దివ్య ప్రేరణచే శ్రీమాతయందు అరొవిల్, సృష్టి—సంకల్పము కలిగినది. శ్రీమాత స్వప్నము ఫలించుచున్నది! ప్రపంచ సృష్టికర్త ఈశ్వరుడే నూతన ప్రపంచమును, నవజాతిని సృష్టించును. ఈశ్వరేచ్ఛ మహాశక్తి యుతము, సృష్టి పరిణామముల నడిపించు దివ్యశక్తి అదియే. తదితరము నిమిత్తమాత్రము. శ్రీమాత ; "అరొవిల్ ప్రత్యేకముగా ఏ వ్యక్తికి చెందినదిగాదు. అది సంపూర్ణముగా సర్వ మానవులకు చెందినది. అనంత విద్యాప్రదాయిని యగుచు నిరంతరాభివృద్ధి చెందుచు నిత్య యౌవనముతో అరొవిల్ మహోజ్జ్వలముగా విలసిల్లును. భౌతికాధ్యాత్మిక పరిశోధనలకు ఆధారమై సర్వమానవ సమైక్యతకు ప్రతిబింబముగా నుండును....." నూతన ప్రపంచ దివ్య జీవనమునకై సర్వమానవులు హృదయపూర్వకముగా నాకాంక్షవలెను.

(శ్రీ) అరవిందుల దివ్యసందేశము : పూర్ణయోగస్వరూపము.

"భూమిపై ఈ సామాన్య జీవితమే దివ్యజీవనమగును గాక"—'సావిత్రి' దివ్యచైతన్యమూర్తియైన సద్గురువు ఉపదేశించిన సూచించిన మార్గమున యోగ శాస్త్ర విధిని ఉత్సాహముతో ధైర్యముతో యోగసాధన చేసిన కాలక్రమమున ఈశ్వర కృపచే సాధకుడు తప్పక సిద్ధిగాంచును. ఆకాంక్ష హృదయ పూర్వకముగా శ్రద్ధాయుతముగా నుండవలెను. అనంతుడైన ఈశ్వరునే సద్భక్తితో కాంక్షింపు వానిని ఆ ఈశ్వరుడే ప్రేమతో ఆదరించును. హృదయమున భక్తికి కూడా ప్రేమ మూర్తియైన ఈశ్వర దివ్య ప్రేరణ చేతనే కలుగును. పూర్ణయోగమునకు ప్రత్యేకముగా ఒక శాస్త్రము లేదు. ఆలోచింప

గల జీవించు ప్రతిప్రాణి (చైతన్యమానవ) హృదయమునందు రహస్యముగా భాసించు నిత్య వేద సత్య స్వరూపమే పూర్ణయోగము యొక్క పరమశాస్త్రము. నిత్య వేద జ్ఞాన నిత్య ఆత్మ సంపూర్ణత్వ అరవిందము మనలో హృదయమునందు ముకుళితమై యున్నది. భగవద్దర్శనముకై ప్రబలాకాంక్షచే పరమేశ్వరునియందు మహాభక్తి కలుగుటవలన సాధనయందు దివ్య ఆత్మ సాక్షాత్కారము వలన వికసించి విజ్ఞానమున సహస్రారవిందమై శోభిల్లును. ఉపదేశ సర్వస్వము ఒక జ్ఞాన సందర్శనమే. ఆత్మపరిణామ సర్వస్వము ఒక చైతన్య వికాసమే. ఆత్మ సిద్ధియే పరమ రహస్యము ఆత్మ జ్ఞానము, ఆత్మ చైతన్య అభివృద్ధి, ఆత్మ సాధనోపకరణములు.

శ్రీ అరవిందుల దివ్యోపదేశము భారతదేశమునందు అతిప్రాచీన వేద మహర్షుల శృతిస్మృతుల మహోన్నత ఆధ్యాత్మిక జ్ఞానశిఖరముల మహోజ్జ్వల ముగా ప్రకాశించు సచ్చిదానంద మహస్సునుండి ప్రభవించుచున్నది. ప్రకటమైన ఈ దృశ్యప్రపంచము.— (విశ్వము) ఈ ప్రపంచము 'మాయ' అసత్యభ్రాంతి కాదు. సృష్టికర్త ప్రమాద ఫలితముకాదు. ఈశ్వరాహంకార పరిణామము కాదు. ఈ దృశ్యప్రపంచము వెనుక ఒక భగవన్మూర్తియొక్క సత్యమున్నది. పరమాత్మ దివ్యచైతన్యమున్నది. సర్వాధారమైన ఒక ఆత్మశక్తి ఉన్నది. ఒక్కటేగ. నిత్యమై ఒకసచ్చిదానందమహస్సు, విజ్ఞానము, సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ. ఆ ఏకైక పరమాత్మయందు, ఆ భగవంతునియందు సమస్తప్రాణులు ఏకమైయుండును. కాని ప్రాతిభాసిక జగత్తున, మాయావరణయందు, స్థితిభేద మునుబట్టి ప్రాణమనోశరీరములందు అవిద్యావృత ఆత్మసత్య విభ్రాంతిలో భిన్నత్వము అనేకత్వము కలుగుచున్నది. యోగసాధనా తీవ్ర తపోబలముచే ఈ మాయను తొలగించి సత్యమైన ఆత్మసాక్షాత్కారమును, మనలోని అందరి లోని దివ్యత్వ సందర్శనమును పొందవచ్చును.

శ్రీ అరవిందులు;సచ్చిదానందము భౌతికపదార్థమునందు అంతర్నిహితమై యున్నదనియు పరిణామక్రమమునందు అది యిచ్చట అవతరించుననియు, ఇట అచిత్తునుండియే చైతన్యపరిణామము సంభవము సత్యము అనియు తెలుపుదురు. ఈ చైతన్యపరిణామమునందు ప్రాణసృష్టి ప్రథమదశ, మనస్సు రెండవది. పరిణామము మనస్సుతో ఆగలేదు. ఆగదు ఇంకనూ ఉన్నతమైన ఆధ్యాత్మిక

చైతన్యమును, అతిమానస చైతన్యమును. అతిమానస చైతన్య అవతరణ తప్పక జరుగును. "పృథ్వీ చైతన్యపరిణామమునందు విజ్ఞాన పరివర్తన (అతిమానసావతరణ) జరిగితీరును. పరిణామమునందు ఆరోహణ అంతముకాకుండుటే కారణము. మనస్సే చివరిదశ, తుదిశిఖరముకాదు." పరిణామములో పరమాత్మ విజ్ఞానము (అధిమానసము) అవతరించి ఒక మహాశక్తిగా రూపొంది ఒక నూతనజాతి ప్రస్తుత చైతన్య మానవజాతినుండి కలుగును.

కాని మానవునియందు విజ్ఞాన పరివర్తన జరుగవలెననిన వాని సహకారము (మనో) అవసరము. వానిలో సంకల్పము కలుగవలెను, అయితే కేవలము మానవ మనోసంకల్ప బలముచేత యీ పరివర్తన జరుగదు. "మానవుడు తన స్వీయప్రయత్నముచేత తనను మించలేడు. మానవుడిగాకన్న అధికముగా సాధింపలేడు. మనోమయ పురుషుడు తనంతతాను అధిమానస – పురుషుడు (అతీతమానవుడు) కాజాలడు. అవతరించిన ఒక దివ్యశక్తి మాత్రమే మానవుని దివ్యునిగా జేయగలదు, సాధింపగలదు." మనస్సు శక్తి పరిమితము. ఒక దివ్య చైతన్యము మనస్సును మార్చవలెను. ఇది యోగసాధనచేత సాధ్యము గతమునందు ప్రపంచమునకు, జీవితమునకు దూరముగాపోయి అరణ్యములందు కొండగుహలందు ఏకాంతముగా యోగతపస్సాధనలు చేసి వ్యక్తిగతముగా సాక్షాత్కారము పొంది, పూర్వసాధకులు మోక్షము లక్ష్యము కాగలిగియుండిరి. శ్రీ అరవిందులు "సత్యమును కనుగొనుటకు ఎవరును భూమిని వదలనక్కరలేదు ఆత్మసాక్షాత్కారమునకై ఎవరును జీవితమును తెగింపనక్కరలేదు. భగవంతునితో నిత్యసంయోగము కలిగియుండుటకు ప్రపంచమును విడనాడుటగాని, పరిమితవిశ్వాసముల కలిగియుండుటగాని అవసరముగాదు. భగవంతుడు ప్రతిచోట, ప్రతివస్తువునందు, సర్వత్రా, మహావిష్ణువైయున్నాడు. అతడు మనకు కనుపింపకదాగియున్న. అందులకువానిని కనుగొనుటకుభక్తితో తగుప్రయత్నసాధన మనము చేయకపోవుట మాత్రమే యగుట స్పష్టము." సాధనచేత దివ్యశక్తి సాధకునిలో అవతరించి ఆత్మను ప్రపంచబంధములనుండి ముక్తపరచుటయే గాక, ప్రపంచజీవనమునగూడ ముక్తజీవనమునిచ్చి మనస్సు అజ్ఞానమును పారద్రోలి అధిమానస చైతన్య సత్యజ్ఞానమును ప్రసాదించును. దివ్యశక్తి చేతిలో ఉపకరణమై మానవుడు (సాధకుడు) పశుత్వమునధిగమించి దివ్యమాన

పునిగా రూపాంతరము చెందును భౌతికశరీరమునందలి అన్ని కోశములందును ఈ పరివర్తన దివ్యశక్తి అవతరణచే జరుగవలెను. ఇందులకు శ్రీ దివ్యమాతకు సంపూర్ణ ఆత్మసమర్పణ చేసికొనవలెను. శ్రీమాత దివ్యశక్తి కాక ఇతరము ఈ అధిమానస రూపాంతరక్రియ సాధింపలేదు. హృదయపూర్వకముగా శ్రద్ధా విశ్వాసములతో శ్రీమాతకు సర్వాత్మ సమర్పణ చేసికొనవలెను. దీనికి సాధన అవసరము. ఇట్టి ప్రయత్నము ఆకాంక్ష, నిరాకరణ, సమర్పణ అనుమూడిటితో కూడినది; ఆకాంక్ష జాగరూకమై నిరంతరమై యుండవలెను. అధమ ప్రకృతి స్వభావములోని సకలేంద్రియ వృత్తులను నిరాకరింపవలెను. చిత్త వృత్తులను, ఇష్టానిష్టములను, అభిమత పక్షపాత, అభ్యాస, కల్పనలను విసర్జింపవలెను. కోరికలను, తృష్ణలను, ఆశలను రాగద్వేషములను, స్వార్థ మును, గర్వమును, దురహంకారమును, కామమును, ఆసురిక భావమును వర్జింపవలెను. మౌఢ్యము, సంశయము, అజ్ఞానము, మూర్ఖత్వము, అల్పత, అలసత, మార్పుకు అయిష్టత, తపస్సు వీనిని వర్జింపవలెను. ఈశ్వరసన్నిధిని దివ్యశక్తికి సర్వాత్మ సమర్పణ చేయవలెను. ఇట్టి కష్టసాధన ఒక్కసారిగా త్వరగా ఒక మహిమవలె జరుగదు. ఒక క్రమ పద్ధతిని జరుగవలెను.

మొదట యోగసాధనయందు అధికశక్తి కలిగిన అంతరాత్మ చైతన్యమును గుర్తించి సాధింపవలెను. అంతర్వ్యమునందలి అన్నిభాగములను దివ్యశక్తి మయములుగా చేయవలెను. అంతఃచేతనయందుస్థిరుడై సాధకుడు అంతరాత్మ జ్యోతిశక్తుల సహాయముతో బాహ్యజీవనమును నిరసింపక జీవింపవలెను. అట్టి సాధనయందు ప్రాణము మనో భౌతికముల కతీతమగు ఆత్మను సాధకుడు కను గొనును, జీవాత్మమే దివ్యసత్యాగ్నిస్ఫులింగజ్వాల. సాధకుడట్లు ఆత్మయందు జీవించుచు బాహ్యప్రకృతి స్వభావమును మార్చి పరిశుద్ధము చేసుకొనవలెను. అనేకాద్భుత దివ్యభూమికా, చైతన్య దర్శనానంతరము అధిమానసశక్తి భౌతిక మునగూడ అవతరించును. అయితే ఇది దీర్ఘకాల అనంతరము, అతికష్టమైన సాధనక్రమ తర్వాత దివ్యమాతకృప, శక్తిచే కలుగు పరివర్తన.

ఈ పూర్ణయోగ సాధనయందు పూర్వయోగ పథవిధానములు సహక రించును. చిత్తవృత్తినిరోధము, మనోవికాసము, ఆత్మసాక్షాత్కారము, విశ్వ చైతన్యానుభూతి, ఇంద్రియాతీతస్థితి ఇత్యాదులు, ఇందులకు సన్యసింప నక్కర

లేదు కాని నియమము అవసరము. శారీరక వాంఛలు, సంసారమున కతీత ముగ నుండవలెను. శరీరావసరములు, కామనలు ప్రవృత్తులపై అధికార ముండవలెను. పూర్వయోగ విధానములందలి కొన్ని ముఖ్యసూత్రములు పూర్ణ యోగమునందుగలవు. సత్యము, దృశ్యప్రపంచముల మధ్యగల భేదము ఆత్మ విచారముచే జ్ఞానమార్గముననుసరించుట; భక్తిమార్గము, ఈశ్వరప్రేమ. ఆత్మార్పణ; ఫలమునాశింపక ఈశ్వరార్పణగా, స్వార్థత్యాగముతో సేవాబుద్ధితో కర్మమార్గానుష్ఠానము. మానవ చైతన్య సర్వస్వము యోగసాధనతో పరివర్తన, అతీత మానస చైతన్య జ్యోతిశక్తుల లోనికి రూపాంతరము చెందవలెను. దివ్యశక్తిచే స్వభావ పరివర్తన జరుగును

పూర్ణయోగసాధనయందు కఠిన మార్గమునందు క్లిష్టదశలందు గురువు యొక్క ప్రభావము సన్నిధి అతిముఖ్యములు. గురుకృపాశక్తి, శ్రీమాత సహాయము శక్తిలేక పూర్ణయోగ సాధనచేయుట అసాధ్యము. ఉన్నత దివ్య చైతన్యమూర్తియే గురువు. పూర్ణయోగ సిద్ధుడు, భగవదవతారముగాని, దివ్య ప్రతినిధి అయియుండును. ఉపదేశమున, స్వీయజీవిత ఆదర్శమున, ఆత్మప్రభావ మున మాత్రమేగాక తన ఆధ్యాత్మిక దివ్య అనుభూతులకు ఇతరులకు సాధకు లకుగూడ ప్రసాదింపగల శక్తి సామర్థ్యములు కలిగియుండును. సద్గురువగిన సర్వశక్తి ప్రభావుడు, గురుర్దేవోభవ. దివ్యచైతన్యమును శక్తిని, జ్యోతిని, ఆనందమును, పరిపూర్ణతను యివ్వగల సమర్థుడు. నిజమైన గురువు వ్యర్థ దురంహంకారికాడు, ఆతడొక శ్రద్ధమూర్తీ భవించినవాడు. ఒకశక్తిప్రవాహము, వాహకము, ఒక దివ్యప్రతినిధి. తోటిసోదరులకు సహాయమొర్చు ఆదర్శ మానవుడు, పిల్లలను నడిపించు ఒక పిల్లవాడు, ఇతరజ్యోతులను వెలిగించు మహాజ్యోతి, ఆత్మలను ప్రబుద్ధమొనర్చు ఒక ప్రబుద్ధాత్మ. అత్యున్నతముగా దేవునిశక్తి, సన్నిధి, ఇతర దివ్యశక్తులను ఆహ్వానించు దివ్యశక్తి, సన్నిధి.

శ్రీ అరవిందుల ఉపదేశము క్లుప్తముగా నిది. ఏ మతస్థాపనవారి ఉద్దేశము కాదు. ఇతర మతములను కలబోసి ఒక నూతన మతస్థాపనమూకాదు. అంత రాత్మ పరిణామాభివృద్ధియే వారి యోగలక్ష్యము. సాధనయందు దివ్యాత్మ సాక్షాత్కారమునొంది మనస్సు కతీతమైన అధిమానస చైతన్యమును, పరిణా మమున, ఆధ్యాత్మిక అధిమానస చైతన్య శక్తిచే స్వభావ ప్రకృతిని రూపాంత రమొనర్చి మానవ ప్రకృతిని దివ్యమయముజేసి దివ్యజీవనమును భూమిపై సాధ్యము చేయుట.

"శ్రీ అరవిందుల శతజయంతికి ప్రత్యేక సహాయము అవతరించి యున్నది."—శ్రీమాత, ఆకాంక్షించు ప్రతిమానవ హృదయములో ఆనందోత్సాహములు సహజముగా కలుగుచున్నవి. "శ్రీ అరవిందుల శతజయంతికి యోగ్యులమగుటకుమనమెల్లరము ప్రయత్నింతముగాక, సాధనయందు. దివ్యజీవనాకాంక్షయందు, ఆత్మసమర్పణయందు, శ్రీ మాతయందు భక్తిశ్రద్ధలందు హృదయపూర్వకముగా నుండవలెను. ఈశ్వరేచ్ఛ, దివ్యచైతన్యము, ఈశ్వర చిచ్ఛక్తి, జ్యోతిరానందములు మూర్తీభవించి అవతరించిన ఆద్యపరాశక్తి ఆ జగన్మాత, దివ్యమాత, శ్రీమాతయే అధిమానస పరివర్తన నెరవేర్చును. పృధ్వీ చైతన్య రూపాంతరము, నూతనప్రపంచము, నూతనదివ్యమానవజాతి తప్పక సంభవించును. భూమి స్వర్గమై మానవుడు అమృత పుత్రుడై దివ్యజీవనము అవతరించును.

"ఎప్పటివలెనే సజీవముగా నిత్యము శ్రీ అరవిందులు ప్రత్యక్షముగా ఇట నున్నారు. వారి దివ్యకార్యసిద్ధికి అవసరమగు భక్తి శ్రద్ధా ఉత్సాహ ఏకాగ్ర చిత్తము సర్వముతో నెరవేర్చుటకు మనమున్నామని గ్రహింపవలెను."

"ప్రభూ, మీ పృధ్వీ-రూపాంతర కార్యమును నెరవేర్చుటకై మేము భూమిపై యున్నాము అదియే మా ఏకైక సంకల్పము. ఇదియే మా ఏకైక మనోగతనిశ్చితకార్యము. ఇదియే మా ఏకైక సాధనగా నుండునట్లు మా కార్యము లన్నియు ఈ ఏకైక లక్ష్యము చేరుటకు సహకరించునట్లు అనుగ్రహింపుము

"శ్రీ అరవిందులకు మన కృతజ్ఞత తెలుపుకొనుటకు వారి దివ్య ఉపదేశములను నిజజీవితములో నిత్యమూ శ్రద్ధతో ఆచరించుట కంటె అధికముగా మనమేమియు చేయజాలము." —శ్రీమాత

శ్రీ అరవిందుల దివ్యరచనలు : మహోన్నతమై ఆధ్యాత్మిక సత్యసాక్షాత్కార అనుభవజనిత మహాభావములను మహోన్నతాభాషా సరస్వతీ రూపమున మహోదాత్త గంభీరశైలియందు వ్యక్తపరచిన మహామేధావి, దివ్య ప్రతిభాశాలి, మహారచయిత శ్రీ అరవిందులు. వారి మహోన్నత దృష్టియందు ఒక భాషయందు భావమును (భావమున్నతము, నిత్యము) వ్యక్తము జేయుట అల్పమే అయినను వారి శైలి అద్వితీయము. అందు వారికి వారే సాటి. దివ్యమహాశక్తి

పూరితములు. మహోన్నత దివ్య చైతన్యవంతములు అయిన వారి దివ్య రచనలను భక్తి శ్రద్ధలతో చదివి. ప్రశాంత జ్యోతిర్మనస్సుయందు సక్రమముగా 'అర్థము చేసికొని వారి దివ్య మహాభావములను ఆత్మ హృదయములందు సంభావింప యత్నించుట మన కనీస ధర్మము, విధియైయున్నది. మానవులుగ, శ్రీ అరవిందుల మహాగ్రంథములు విజ్ఞాన మహస్సు — మహిమానిత్వములు. మహాసముద్రమువలె, హిమగిరి శిఖరౌన్నత్యమువలె, మధ్యాహ్న సూర్యప్రకాశమువలె ప్రశాంత సుందర మనోజ్ఞ దివ్య ఉషాసందర్శనమువలె—శ్రీ అరవిందుల విజ్ఞానమహస్సు (సూపర్ మైండ్) — దివ్య ప్రతిభకు ప్రత్యక్ష నిదర్శనములు. దివ్య విజ్ఞాన సూర్య తేజో ప్రకాశములు. ఆంగ్ల భాషోజ్వల సూర్య రథారూఢుడై శ్రీ అరవిందులు సర్వప్రపంచముపై ప్రాచీన భారతీయ (శృతిస్మృతి) వేద పురాణేతితిహాస, సనాతన మహోజ్వల సంస్కృతీ వైభవ విజ్ఞానకాంతులను ప్రసరించుచు, భారత భావి మహా ఔన్నత్యమును నిర్మించుచున్నారు. శ్రీ అరవిందుల గద్య రచనలందు ముఖ్యమైనది, మానవ విజ్ఞాన పరిణామ ప్రగతి చరిత్ర యందే ప్రముఖ ఘట్టమైనది, దివ్యజీవన గ్రంధ రాజము. అదియే శ్రీ అరవిందుల దివ్య దర్శనము. సర్వజ్ఞానము అందు నిక్షిప్తమైయున్నది. వేదోపనిషద్ భగవద్గీతల పై వారు రచనలు సాగించిరి. అగ్నిసూక్తము, వేదరహస్యము, గీతా వ్యాసములు, ఈశ కేన మొదలగు ఉపనిషత్తులు, జనని అను మహాగ్రంథమును ; తత్త్వ వేదాంతములందు, పరిణామము, దైవముహూర్తము, ఆదర్శములు—ప్రగతి, పునర్జన్మ. హెరాక్లిటస్, ప్రపంచసమస్య. సూపర్ మాన్, అధిమానసావతరణ, ధ్యానములు—భావనలు, ధ్యానములు—దర్శనములు; యోగము (సమన్వయము) అను మహాగ్రంథము, మానవ ఐక్యతాదర్శము, మానవ పరిణామ చక్రము. కర్మయోగి ఆదర్శము, సాత్త్విక నిరోద సిద్ధాంతము, జాతీయభావము, భారత రాజ్యాంగ విధాన తత్త్వము, జాతీయవిద్య, భారతీయ సంస్కృతి ; ఇక సాహిత్యమునందు, భవిష్యత్కవిత, కాళిదాసు, వ్యాసవాల్మీకులు, వ్యాఖ్యలు, సాహిత్యముపై అనేకలేఖలు, కవిత్వమునందు, బాజీప్రభువు, తుదికవితలు, ప్రేమ—మృత్యువు కావ్యసంగ్రహము. (అన్ని కవితలు, కూడిన పెద్ద గ్రంథము, సావిత్రిమహాకావ్యము, ఎరిక్ రొడోగున్, వాసవదత్త, మొదలగు నాటకములు యోగ సాహిత్యాది వివిధ విషయాలపై వారి లేఖలు, అనంతములు. ఇది శ్రీ అరవిందుల అనంత దివ్య వాఙ్మయ మహాసాగరము.

"స్వర్ణసౌధమది నిర్మితమయ్యె, అగ్నిజ్వాలా-శిఖోదయమయ్యె."

—"సావిత్రి"

# శ్రీ అరవిందులు

— వెంపటి కృష్ణమూర్తి

'పద్మ పత్ర విశాలాక్షీ
పద్మ కేసర వర్ణినీ
నిత్యం పద్మాలయాదేవీ
సా మాం పాతు సరస్వతీ'

అనే శ్లోకాన్ని నిత్యమననం చేయకుండా సంప్రదాయం తెలిసిన భారతీయు తెవ్వరూ విద్యాభ్యాసాన్ని కొనసాగించరు. పద్మశబ్దమయమైన ఈ విఖ్యాత-సరస్వతీ ప్రార్థనంలోవిద్యా సంప్రదాయాన్ని ఉద్దేశించిన మాట ఒక్కటైనా లేకపోవడం అటుంచి. విద్యాపథవర్తిగా పురోగమిస్తున్న వారిని సంరక్షించమన్న అభ్యర్థనం స్ఫుటంగా కనిపించకమానదు. ఈ విధమైన పరిశీలనం చేసిన తరువాత మనకు కలిగే ప్రశ్నలు ఇవి :

1) సరస్వతీదేవి ప్రార్థనలో పద్మ' శబ్దానికి ఇంత ప్రాముఖ్యం ఎందుకు ?

2) చదువుల తల్లిని ప్రార్థిస్తున్న దీనిలో చదువు ప్రసక్తి మాత్రం కూడా లేదేమి ?

3) అంతతో ఆగక "నన్ను సరస్వతీదేవి రక్షించుగాక" అన్న ప్రార్థన ఆ దేవిని గురించి మనలో తరతరాలుగా రూఢమై ఉన్న అభిప్రాయానికి అనుగుణంగా ఉన్నదా ?

సమ్యక్పరిశీలనం మీద ఈ విధంగా చెప్పవచ్చునేమో అన్న ఉద్దేశం కలుగుతుంది. ఆధ్యాత్మికతాసారమే భారతీయ విద్యా సంస్కృతులకు జీవంగా ప్రసిద్ధమై ఉన్నది వీటిలో ఒక మాదిరి పరిచయం ఉన్నవారికి పునః పునరావృత్తంగా ఒక విషయం తప్పక గోచరిస్తుంది. అది జీవిత-వివిధ దశలలో పద్మానికి ఇవ్వబడిన ఉత్కృష్ట. విశిష్టస్థానము, దానికి కల్పింపబడిన సంకేతబాహుళ్యము. పద్మనాభుడు, పద్మగర్భుడు. పద్మాలయ, అర

విందాక్షుడు, మొదలైన పేరులు వరసగా చదువుకొంటూ ఉన్నప్పుడు, వింటూ ఉన్నప్పుడు సార్థక దృక్పథం ఉన్నవారికి ఈ ఆలోచన కాకమానదు. దేవ పూజావిధానంలో పద్మానికి సర్వతోముఖమైన అగ్రస్థానం ఉండడము మాట అటుంచి పద్మంతో సంబంధంలేని దేవతారూపమే భారతీయాధ్యాత్మిక జీవితంలో ఎక్కడా కనిపించదంటె అతిశయోక్తికాదు.

భారతీయ జీవితసర్వస్వంలో పద్మానికి ఇంత సకలోపగతప్రాచుర్యం కలగటానికి కారణం ఈ విధంగా ఊహించవచ్చుననిపిస్తుంది. 'పంకజము' అన్న మాట పద్మానికే మరి ఒక పేరు అని అందరికీ తెలిసినదే. ఆ మాటకి అర్థం "బురదలో నుంచి పుట్టినది" అన్న మాట కూడా ఎవ్వరికీ చెప్పనక్కరలేదు. మనుష్య జీవితంలో అధమాధమమైన ప్రతిదానినీ పంకంతో పోలుస్తాము. ఉదాహరణకి 'పాపపంకం' అన్నమాట ప్రతివారికీ స్ఫురిస్తుంది. అటువంటి పంకములోనుంచి పుట్టిన పద్మానికి జనకలక్షణాలేవీ రాకపోగా సంపూర్ణంగా తద్భిన్నమూ, మహార్ఘ గుణసారసంపన్నమూ అయిన రూపం కలగడంలోనే దీని వైశిష్ట్యం విస్పష్టంగా గోచరిస్తుంది. ఇది సవితృదీప్తి ఉన్నప్పుడు మాత్రమే వికసించడమూ తదితర సమయాలలో ముకుళించుకొని పోవడమూ దీని అంతస్తత్వ సారమన్న విషయం కూడా అనుభవవిదితమే. భారతీయ వేదాంత తత్త్వశాస్త్ర దర్శన సిద్ధాంతాలలో భౌతిక ప్రపంచంలో దృగ్గోచర మయ్యే సవితృబింబము దివ్యసత్య దీప్తి స్వరూపమే అని నిరూపితమై ఉన్నది. అంటే ఈ భౌతిక ప్రకృతి సర్వస్వంలో దివ్యసత్యదీప్తి వైపుకి అప్రయత్నంగా, తన స్వభావంగా, తన సహజధర్మంగా, అతినీచస్థాన ప్రసూతమై ఉండి కూడా ఆకర్షింపబడుతూ ఉన్నది. ఒక్క పద్మమే అన్నమాట. "మనః పద్మము". అన్నమాట మొట్టమొదట కల్పించిన మహనీయ మూర్తి ఎవ్వరో మనకు తెలియదుగాని ఈ సాదృశ్యము,—కాదు. అభేదమే, — ఎంత వ్యంగ్యంగా ఉందో ఇప్పుడు ఊహించవచ్చు. తపః ఫలితంగా సాధకులలో వికసించే మూలాధారాది చక్రాలకి 'పద్మములు' అని నామాంతరం కూడా ప్రసిద్ధంగా ఉండడం మరచిపోకూడదు. వీటిలో చిట్టచివరి దాని పేరు "సహస్ర దళ పద్మం" అనడంలో ఎంత అంతరార్థం ఇమిడి ఉంది; వేదఋషి మంత్రాలూ, శాక్తేయ తంత్రాలూ, సాధక యంత్రాలూ. ఈ పద్మానికి శాశ్వత పద్మాలు కావడంలో ఎంతమహావిపులార్థము గర్భితమైఉందో అనిర్వచనీయము. అనుభవైకవేద్యము.

పద్మానికే ఇంకొక పేరు "అరవిందము" ఈ మాటకి ఉన్న అర్థం దాని వైవిధ్యంలో సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ క్రింది విషయాలు చూస్తాము. 'అరము' లను అంటే కేసరములను పొందుతుంది కాబట్టి దీనికి ఈ పేరు వచ్చిందని నిఘంటువులు చెప్పే అర్థం ఒకటి బాగ తెలిసినదే. "సూర్యోదయ సమయంలో మాత్రమే వికసించేది" అన్నది ఇంకొక అర్థం. కుమారసంభవంలో కాళిదాస మహాకవి "సూర్యాంశుభిర్భిన్న మివారవిందం" అని ప్రత్యేకంగా వర్ణించడంలో ఇదే సూచన.

(ఈ విధమైన దృష్టి కాళిదాసుకి ఎంత నిరతిశయంగా ఉందో తెలుసు కోవాలంటే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన "శాకుంతలముయొక్క అభిజ్ఞానత" అన్న గ్రంథం చూస్తే సూక్ష్మంగా తెలుస్తుంది.

దీనికే అరుణపద్మము, నీతి పద్మము అనికూడా అర్థాలు ఉన్నాయి. ప్రాచీన ప్రాజ్ఞ వ్యాఖ్యాన సంప్రదాయ మార్గాన్ని అనుసరించి ఈ విధంగా కూడా దీనికి అర్థం చెప్పవచ్చు

"అంచరంచ విందతీతి, అధవా అః దివ్యచైతన్యం రస్య పృథివ్యాః
అంతరే యథా స్థిత్వా ఉన్మీలితం భవతి తథా విందతీతి అర విందః

"అ" అంటే దివ్యచైతన్యాన్నీ, 'ర' అంటే ప్రకృతి — తత్త్వాన్నీ సంపూర్ణంగా అవగతం చేసుకొని ఆ దివ్యచైతన్యాన్ని ప్రకృతిలో ఉన్మీలితం చేసే అఖండ విజ్ఞానము కలిగినది అరవిందము అంటే శ్రీ అరవిందులు. దీని మీద కలిగే సందేహాలు నివారించు కోవడానికి "ముఖమస్తీతి వక్తవ్యం"గా భ్రమించడం కంటె "అనుక్తమన్యతోగ్రాహ్యం"గా శ్రమించడం మేలు అని, ఇప్పటివాద—ధోరణులను బట్టిగాని, చెప్పవలసిన అవసరంలేదు.

శ్రీ అరవిందులు సాధించిన అనిదంపూర్వ—సిద్ధులనూ, ఆయన యోగా దర్శాలనూ తెలుసుకొన్న వారికి ఆయన కారణజన్ముడని ఆయన పేరే నిరూపిస్తుంది. విభిన్న మార్గాలలో, విభిన్నాలోచనములలో, విభిన్న పద్ధతులలో వికసితమైన భారతీయాధ్యాత్మిక సంస్కృతి సర్వస్వ సంకేతమైన పద్మానికి దాని ప్రథమ సమగ్రయావ సౌష్ఠవాన్ని ప్రసాదించి దానిని ఆత్మమూర్తిలో ఆవిష్కరింపజేసిన మహాయోగి శ్రీ అరవిందులు, క్షితిమీదగాని, స్మృతిలోగాని ఉన్న

ఏ ఆధ్యాత్మిక జీవిత సూత్రాన్నీ పరిహరించకుండా దాని అర్థాన్ని సందేహాతీతంగా స్పష్టీకరించి, యోగసాధనలో దాని సముచితస్థానాన్ని నిర్దేశించి, తాను చెప్పిన దానిని ఇతరులకు అనుభవంలో నిరాక్షేపంగా నిరూపించి తన్మూలంగా వేదాంత శైవ వైష్ణవయోగ తంత్రాది బహువిధ నౌకాశ్రయములలో ఎక్కడ బయలుదేరిన యాత్రికులకైనా ఆధ్యాత్మిక మహాసముద్రయానం తీరమునుండి పారము వరకూ కంటకరహితంగా, కల్యాణ మహితంగా తీర్చిదిద్దిన మహర్షి శ్రీ అరవిందులు. ఆర్యసంస్కృతి వార్ధకంలో ఏదళానికి ఆదళం విడివడిపోయి వృద్ధగ్రూపాలలో స్థిరపడిపోయిన ఆధ్యాత్మిక పథవర్తి సాధక బృందాలను సంవనన మార్గంలో నడిపించిన మహోర్ధ్వన్మూర్తి శ్రీ అరవిందులు.

ఈ వ్యాసానికి ప్రారంభంలో ప్రతిపాదించిన సంకేతాన్ని ఇంకొక్కసారి పరిశీలించి ఇప్పుడు ఈ విధంగా చెప్పవచ్చు బహుళీకృతమై, అనేకత్వంతో నిండిన ఈ సృష్టి జలపూర్ణమైన సరోవరం వంటిది. అంతశ్చైతన్యజ్ఞత లేని స్థితినే పంకము అని చెప్పవచ్చు. సృష్టిమగ్నమైన ప్రాణమయ జీవితము జలమగ్నమైన పద్మనాళంవలె ఉండగా, జలవికారాతీతమైన నీలిదళంవంటి వికసిత విశుద్ధమానసము సృష్టి వికారాతీతమై సవితృబింబోన్ముఖ పద్మమువంటి ఋత చిదున్ముఖ చైతన్యంయొక్క యోగక్షేమభారం వహిస్తూ ఉంటుంది. 'అరవిందము' అన్న మాటకి చిట్టచివర చెప్పిన అర్థం ప్రకారము దివ్యచైతన్య ప్రాభవాన్నీ, దివ్యప్రణయ ప్రాలనాన్నీ జలసదృశ సృష్టిలోనికీ, పంకసదృశ చైతన్యాజ్ఞతలోనికీ ప్రసరింప జేయడానికి, తత్పరిణామ-సిద్ధిని మానవసాధ్యం చేయడానికి అవతరించిన పురుషోత్తముడే "శ్రీ అరవిందులు" అని అవగతమవుతుంది.

ఇంతటి మహత్తర పరిణామదశను సిద్ధింపజేయడానికి పనికివచ్చే ఏకైకమైన ఉపకరణంవిద్య-అంటే బ్రహ్మవిద్య. ఈ బ్రహ్మ విద్యా సాఫల్యానికి పాఠకుని (సాధకుని) ప్రజ్ఞాపాటవమూ, గురూపదేశమూ, దైవానుగ్రహమూ ఒకదానికంటె దాని పిమ్మటిది అత్యావశ్యకము. కేవలం ఉపకరణ బలంవల్ల ఇంతటి పరిణామము సిద్ధించదు కాబట్టి దానికి అధిదైవతమైన సరస్వతీదేవిని, — తాత్వికదృష్టిలో జగదంబిక —స్వరూపిణి—పరిణామారోహణ మార్గంలో రక్షించమన్న ప్రార్థనరూపంలో ఈ వ్యాసం మొట్టమొదట ఉన్న

శ్లోకం ఉన్నది. ఎన్నో అర్థాలలో పద్మం ఉద్దేశింపబడిందని చెప్పడానికి ఆ శబ్దం పునః పునరుక్తమయ్యింది. 'లక్ష్మీదేవి' అనే అర్థంలో రూఢమైన "పద్మాలయా" అనేశబ్దాన్ని సరస్వతీపరంగా వాడడంతో ఆ దేవి జగదంబికా స్వరూపిణి అని దృఢీకరించడమె ఉద్దేశము. ఆ సరస్వతీరూప జగదాంబికాను గ్రహ రక్షణమే ప్రార్థించేవారు. విద్యాపథంలో జీవయాత్రాసాఫల్యాన్ని పొందే వారై కేవలం విద్యను గూర్చి తలపెట్టలేదు. విద్యకోసమే ప్రార్థించేవారు కేవల గ్రంథలగ్న బుద్ధులై ఉపకరణమాత్ర లాభసంతృప్తిచే ఫలహీను లవుతారు. స్పష్టంగా ఈ ఉద్దేశంతోనే పై సరస్వతీప్రార్థనలో విద్యను గూర్చిన ప్రసంగం పరివ్యక్తమై రక్షణను గూర్చిన అభ్యర్థనం ప్రస్ఫుటమయ్యింది.

అరవిందము అంటే అరుణపద్మము. నీలపద్మము అనికూడా అర్థాలు ఉన్నవని ఇంతకు ముందే తెలుసుకొన్నాముకదా. ఈసందర్భంలో శ్రీ అర విందాశ్రమాంబిక చెప్పిన ఈ క్రింది మాటలు ఎంత అన్వర్థంగా, అద్భుతావ హంగా ఉన్నవో చూడండి.

"The red lotus is the flower of Sri Aurobindo, but specially for his Centenary we shall choose the blue lotus, which is the colour of his physical aura, to symbolise the Centenary of the manifestation of the supreme upon earth." (Bulletin. Feb. 1972, P. 49)

— —

# యోగసమన్వయము - దాని ఆవశ్యకత

— కమలాకర వేంకటరావు

శ్రీ అరవిందులు రచించిన మహాగ్రంథములలో, 'దివ్యజీవనము' 'యోగసమన్వయము'— అనునవి కడుంగడు ముఖ్యమైనవి. 'దివ్యజీవనము' ఆయన చాటిన అపూర్వదర్శనమును ప్రవచించే సిద్ధాంత గ్రంథము. 'యోగసమన్వయము' ఆదర్శనానుభవ సాక్షాత్కార సంసిద్ధులకు మార్గములను నిర్దేశించి చూపిన సాధనగ్రంథము. పూర్ణయోగమని కూడ ఈ సాధన విధానమునకు నామాంతరమున్నది. లక్షించిన దర్శనము పూర్ణము కావుననే, దానిని పొందుటకు వలసిన సాధనయు పూర్ణత్వమును సంతరించుకోవలసి వచ్చినది. వివిధ యోగపంథల సమన్వయద్వారమునగాని యీ పూర్ణత్వసిద్ధి కలుగనేరదు.

శ్రీ అరవిందుల దర్శన మెట్లు పూర్ణదర్శనమైనదో ఇచట ఇంచుక ప్రస్తావించుకొనుట అవసరము. ఏ దర్శనమునకైననూ పూర్ణత్వము అద్వైత సాక్షాత్కారము వలన మాత్రమే ఘటిల్లును. శ్రీ అరవిందులది అద్వైత దర్శనమే. కాని అది యీ జగత్తునంతనూ వట్టి ఇంద్రజాలముగా మనః కల్పితముగా, భ్రాంతిమూలకముగా కొట్టిపారవేయుజూచు మాయాద్వైతముకాదు. మనస్సునకతీతమైన దానిని మనోఘటితమైన తర్కమునకు సరిపుచ్చు ప్రయత్నములో, ఈ శాశ్వత సృష్టి అంతయు వట్టి మిథ్యగా త్రోసిపుచ్చబడినది. జగత్తునకు వ్యావహారిక సత్యత్వ మంగీకరించబడిననూ, ఆ వ్యవహారము భ్రాంతిమూలకము మాత్రమే, అందు పరమార్థమేమియును లేదు. అజ్ఞాన జన్యముగాక పరమాత్మని చిచ్ఛక్తి ప్రభవమై ఒక మహాప్రయోజనము కొరకు ప్రవర్తిల్లు విశ్వమును మిథ్యగా పరిగణించిననే తప్ప నిలువబోదనుకొనే అద్వైత తత్త్వపు పూర్ణత్వమున నేదియో లోపమున్నదని అనిపించక మానదు.

శ్రీ అరవిందుని సత్యాద్వైతం పరతత్త్వ స్వరూపమును మానసాతీత తర్కముతో అన్వయించి చూపి ఈ లోపమును సర్దుబాటు చేస్తున్నది. నిర్గుణముతోబాటు సగుణమును, నిరాకారముతోబాటు సాకారమును తనలో అంత

ర్భుక్తము గావించుకొని ఉభయమునకు అతీతమై విలసిల్లు తత్త్వమది. అచలము, సచలముగూడనైన అనంతశక్తి సమన్వితమై అనంతజీవకోటి రూపములగూడ తానే దాల్చి, తన స్వస్వరూపమునకు భంగపాటు లేకుండగనే జడములోనికి తనను తాను కుంచించుకొని పిమ్మట ఆజడమునందు చైతన్యమును క్రమముగా వికసింపజేసికొనుచు, అత్మోపలబ్ధినిగాంచి, జడమును సైతము రూపాంతరము చెందించు మహాలీలను అనంత కాలగతిలో కొనసాగించుచున్న తత్త్వమది. శ్రీ అరవింద దర్శనములోని వైశిష్ట్యం ఇచటనే కలదు. జగత్సృష్టిని వట్టి మిథ్యాకల్పనగా గాక భగవల్లీలా విశేషముగ నిరూపించిన దర్శనములుకూడ లేకపోలేదు. కాని, ఆ లీలయందొక దివ్యప్రయోజనమును గుర్తింపనేర్చి తత్పర్యవసానముగా నొక వినోత్న దర్శనమునకు ప్రవర్తకుడై తదుపలబ్ధి కొరకు అపూర్వ సాధన మార్గమును లోకమున నెలయింపజేసిన ఘనత శ్రీ అరవిందులకు మాత్రమే దక్కినది.

శ్రీ అరవిందుల దృష్టిలో పరతత్వము విశ్వాతీతమేకాక, విశ్వమయము కూడ. సమష్ట్యాత్మకమేగాక, వ్యష్ట్యాత్మకము కూడ. అయ్యది అనేకమును తనలో అంతర్భుక్తము గావించుకొనిన ఏకము. అనంత కేంద్ర విలసితమైన అనంత తత్త్వముగా శ్రీ అరవిందులద్దానిని అభివర్ణించినారు. ప్రతి జీవాత్మయు అట్టి యొకకేంద్రమే. ఈ యనంత కేంద్రముల ఆధారముపైననే విశ్వలీలయెల్ల కొనసాగుచున్నది. జడములోనికి అవరోహణము— తిరిగి చైతన్యము లోనికి ఆరోహణము నిర్వహింపబడుచున్న యీ మహాలీల యందంతటనూ వాని యాధారముండనేయున్నది. సత్యమును మరుగుజేసుకొన్న అజ్ఞానలీలయందీ యాధారము మరుగుపడియుండును. అజ్ఞానలీల, జ్ఞానలీలలోనికి పర్యవసించు సమయమేతెంచినపుడీ యాధారము మరుగువీడి ముందుకువచ్చి, స్వస్వరూపమైన పరతత్వముతో ఏకత్వమున స్వయముగా జ్ఞానలీలను కొనసాగించును. విశ్వాతీతమున లీనమైపోవుటకాదు. శ్రీ అరవింద దర్శనములో జీవాత్మ లక్ష్యము. విశ్వాతీతముతోడి సాయుజ్యమున ఆ విశ్వాతీతమున విశ్వలీలలో పాల్గొను సాధర్మ్యమూర్తి అతని లక్ష్యమైయున్నది. కేవల విశ్వాతీతానుభూతి పూర్ణానుభూతి కానేరదనియు, విశ్వలీలను సైతమంతర్భుక్తము గావించుకొన్న విశ్వాతీతానుభూతియే పూర్ణానుభూతియనియు శ్రీ అరవిందుల నిశ్చయము.

ఈ పూర్ణోపలబ్ధికి దారితీయు సాధనకూడ పూర్ణత్వ లక్షణోపేతమై యుండుటావశ్యకమని వేరుగ చెప్పవలసిన పనిలేదు. స్వస్వరూపమైన పరతత్వముతోడి యోగమును కలయికను, కూర్చునది కావుననే యీ సాధన యోగమనెడి ప్రత్యేక నామముతో పిలువబడు చున్నది. కాని, లక్ష్యభేదమును బట్టి యీ యోగసాధన అనేక విధములుగా, అనేక రూపములలో భారతదేశమున యుగ యుగముల నుండియు అనుష్ఠింపబడుచు వచ్చుచున్న సంగతి సర్వ విదితమే. హఠయోగము. రాజయోగము. జ్ఞాన – భక్తి - కర్మయోగములు, తత్వము,– అనునవి యిందులకు ముఖ్యోదాహరణలు. శ్రీ అరవిందులు వీని స్వరూప స్వభావములను కూలంకషముగా పరిశోధన యొనర్చి, తాము లక్షించు పూర్ణోపలబ్ధి దృష్ట్యా ఇవియెల్ల అసమగ్రములేయని నిరూపించినారు. ప్రతిసాధన ఫక్కిలోనూ ఒక్కొక్క గుణ విశేష మున్నది. దాని లక్ష్యము మేరకది పటిష్టమే కాని. ఆ లక్ష్య సాధనయందు నిమగ్నములో నది ఇతర ముఖ్యాంశములను నిర్లక్ష్యము చేయుచున్నది. మానవ జీవితము దివ్యజీవితముగ పరివర్తనము చెందవలసియున్న దనునదే శ్రీ అరవిందుల సిద్ధాంతము కావున. అట్టి దివ్య పరివర్తనమున కనుగుణమగు రీతిని ఈ యోగ పద్ధతుల సమన్వయ రూపము నొకదానిని వెలియింప జేయుటే అవశ్య కర్తవ్యముగా ఆయన భావించినారు.

జీవితమును దివ్యపరివర్తన మొందించుటగాక. అద్దానిని పర్యవసానమున సన్యసించుటయే సామాన్యముగా యోగసాధనల లక్ష్యముగా గణించ బడుచున్నది. జీవిత సన్యాసద్వారమున పరతత్వోపలబ్ధి గాంచుటయె వాని ముఖ్యలక్ష్యము. ఈ లక్ష్యసిద్ధిని సుగమము చేయునంతవరకే జీవితమును సంస్కరించుటకు వాని ప్రయత్నము. లక్ష్యసిద్ధి అనంతరము వాటికిక ఆ సంస్కారముతోకూడ పనిలేదు. జీవిత సన్యాసమే ప్రధానమైనపుడిక దాని సంస్కారమునకు మాత్రము ప్రాధాన్యమేముండును ? శ్రీ అరవిందులు నిర్దేశించినది జీవిత సంస్కారముకాదు. జీవిత పరివర్తనము,–దివ్యత్వ స్థితికి పరివర్తనము. జీవితమున కిట్టి దివ్య పరివర్తనము సాధ్యమని ఇతర యోగములు విశ్వసించక పోవుటచేతనే అవి జీవిత సంస్కారము తోడనే తృప్తి వడినవి. అజ్ఞాన మూలకమగు జీవిత మెన్నటికీ జ్ఞానమూలకము, దివ్యలక్షణోపేతము కాజాలదని వాని నిశ్చయము. పరతత్వములోనికి లంఘించుటకే జీవితమొక ఆధారభూమి

మాత్రమే కాగలదుగాని పరతత్వావతరణ ద్వారమనిన తాను దివ్య పరివర్తనము చెందుట పొసగ నేరదని వాని అభిప్రాయము. కాని, విశ్వలీలయందలి ప్రకృతి కార్య సరణిలో ఇది సాధ్యమేయని, ప్రకృతి పరిశ్రమ మంతయు పర్యవసానమున దానిని సాధించుటకేయనీ శ్రీ అరవిందులు నిరూపించినారు. ఆయన దర్శనమందలి ముఖ్య వైలక్షణ్య మిచ్చటనే కలదు.

తన యోగదృష్టి యందాయన ప్రకృతి రహస్య భేదనముగావింప నేర్చుటయే ఇందులకు కారణము. ప్రకృతి కార్యకలాప మాయనకు కేవల మజ్ఞాన మూలకమై చూపట్టలేదు. అపరాప్రకృతి కార్యకలాప మజ్ఞానావరణముతో కూడియున్నదనుమాట నిజమే కాని యీ అపరాప్రకృతికి మూల పరా ప్రకృతి యున్నది. అయ్యది అజ్ఞానావరణములేని దివ్యజ్ఞాన తేజో విలసితము. దాని దివ్యసంకల్పశక్తి ప్రేరణము చేతనే అపరాప్రకృతి యందలి అజ్ఞానలీల కొనసాగుచున్నది. శాశ్వతముగా అజ్ఞానమున నిత్య పరిభ్రమణ మొనర్చుటే దాని లక్ష్యముకాదు. అజ్ఞానములోనుండి క్రమక్రమముగా జ్ఞానములోనికి వికాసముచెందుట, దాని లక్ష్యము-అంతేకాదు, ఈ క్రమ వికాసగతిలో, పరచేతనావతరణద్వారమున అపరరూపములను పరివర్తనము చెందించుటయు దాని లక్ష్యము. ప్రకృతి కార్యకలాప సరణిలో కానవచ్చు క్రమ వికాసగతియందీ దివ్యపరిణామ దశను భవిష్యత్తులో గుర్తించుట చేతనే శ్రీ అరవిందు లీ దివ్య సందేశమును లోకమునకుచాటి తత్సిద్ధికి వలయు వినూత్న యోగమార్గ ప్రవర్తకులై విలసిల్లినారు.

మర్మభేదియగు ఆయన విజ్ఞాన నక్షత్రమునకు, జీవితమంతయు ప్రకృతి కొనసాగించుచున్న యోగముగనే పొడగట్టినది. అసలీ విశ్వలీలయే ప్రకృతి కొనసాగించుచున్న ఒక మహాయోగము. ఈశ్వరేచ్ఛచేత ప్రకృతి తన నిజ తత్వమునుండి తాను తొలుత వేరుపడి తిరిగి ఆత్మోపలబ్ధి గాంచుటకై చేయు మహాప్రయత్నమే జగల్లీలలో కానవచ్చు నీ క్రమ వికాసము మానవ జీవిత మనునది ఆత్మోపలబ్ధికై ఆత్మాభివ్యక్తికై ప్రకృతి కొనసాగించు సాధనలోని యొక దశావిశేషమే. స్థూల, సూక్ష్మ, కారణ శరీరములతో సంఘటితమై యున్నది మానవరూపము. అన్నమయ, ప్రాణమయ కోశముల సామరస్య ఘటనతో ఏర్పాటైనది స్థూల శరీరము. మనోమయ కోశముతో రూపొందించ

బడినది సూక్ష్మ శరీరము. విజ్ఞానమయ, ఆనందమయ కోశములతో నొప్పారునది కారణ శరీరము. తైత్తిరీయో పనిషత్తునందలి చెప్పబడిన పంచకోశములలో విజ్ఞానమయ కోశమును శ్రీ అరవిందులు బుద్ధి తత్వమున కన్వయించలేదు. మనస్సుకు, బుద్ధికిగూడ అతీతమైన అతి మానసమున కన్వయించి, కారణ శరీరాంతర్భాగముగా ఆనందమయ కోశమును దానికి జతగూర్చినారు. మానవ జీవితమును దివ్యముగా పరివర్తనము చెందింపగల లక్షణమీ విజ్ఞానావిష్కారమునకు మాత్రమే కలదు.

శ్రీ అరవిందుల నిరూపణము ప్రకారము, మానవజీవితపు క్రమవికాస గతియందు, శారీరక జీవితము. మానసిక జీవితము, దివ్యజీవితము అను మూడుదశలు కలవు. దీనిలో శారీరక జీవితమును మాత్రమే ప్రకృతి ఇప్పటికి పూర్తిగా క్రమవికాసము నొందించి యున్నది. మానసిక జీవితము అట్లింకనూ సరిగా వికాస మొందించబడలేదు. అందుకొరకై జరిగే కృషి నడిమి స్థితిలో నున్నది. ఈ కృషి పూర్తియైన పిమ్మటనే మూడవదియగు దివ్యజీవనారంభ మని భావించవనిలేదు. ప్రకృతి కార్య సరణి యంత్రప్రాయమైన క్రమ గతిలో కొనసాగునట్టిదికాదు. గమ్యమును చేరుటకు మహావేగముతో నొక్కొక్కప్పుడది ముందునకు దుముకుచు, లోపములను కూడదీసికొనుటకు మరల వెనుకకు మరలుచు, తిరిగి పురోగతిని మరింత విస్తృతస్థాయిలో సాధించుచు.— ఇట్లు దాని గమనము సర్పిలాకృతిలో కొనసాగుచుండును. మానవజీవితపుక్రమ వికాసగతిలో దివ్య జీవనస్థాయిని సైతము ప్రకృతి యొకానొకప్పుడిదివరలో అందుకొని యున్నట్లు నిదర్శనములున్నవి. కాని, అందుండి తిరోగతి సంప్రాప్త మగుటకు కారణము పూర్వ లోపములను పూరించుకొనుచు మరల విస్తృత తర పురోగతిని సాధించవలసి యుండుటే ప్రపంచ పరిణామము నేడట్టి దివ్యజీవనపు పూర్వ రంగమును చేరుకొన్నదనియే శ్రీ అరవిందుల ఉద్బోధ.

ఈ మహాకార్యసాధనలో యోగము విస్తృతతర పాత్రను నిర్వహించ వలసియున్నది. యోగముకూడ ప్రకృతి కార్య సరణిలోనిదే. ప్రకృతి ప్రదర్శించు శక్తులలో నిదికూడ యొకటి. ప్రకృతి సంకల్పించిన క్రమవికాస సాధనోపాయములందు దానికి ప్రముఖస్థానమున్నది. క్రమ వికాసగతిని

అత్యంతముగ త్వరితపరచు సామర్థ్యము దానికి కలదు. సామాన్య సరణిలో అనేక జన్మలు పట్టు పరిణామమును ఒకే జన్మలో ఒకే జన్మలోని అత్యల్ప కాలములోనైతము, సాధించగల శక్తి యోగమున కున్నది. ప్రకృతి ప్రసాదించిన యీ శక్తిని మానవుడు పలు రీతుల వినియోగించియున్నాడు. సమన్వయ పూర్వకమైన మార్గములో దానినతడు వినియోగించిన సందర్భములు కలవు పలువిధములగు ప్రత్యేక మార్గములలో దానిని వినియోగించిన సందర్భములును కలవు. ఈ ప్రత్యేక సాధనలు ఘనిష్ఠరూపమున ప్రత్యేకోపలబ్ధులను కలిగించునవేమైనను పూర్ణోపలబ్ధిని కొరవడజేయునవి యగుటచే, అట్టి పూర్ణోపలబ్ధికై సమన్వయ పూర్వకమైన పద్ధతిలో తిరిగి విస్తృతసాధన కొనసాగించుటను. శ్రీ అరవిందుల దృష్టిలో నేటి ప్రపంచము అట్టి విస్తృత సమన్వయము కోసమే నిరీక్షించుచున్నది.

సలసలక్రాగు నొక పెద్దక్రాగుతో నేటి ప్రపంచమును శ్రీ అరవిందులు పోల్చినారు. సకల వస్తువులూ అందు విసరివేయబడి చిద్రుపలు చిద్రుపలుగా నొనర్పబడుచున్నది వాటిని మరల మరల విశ్రితమొనర్చి ఏదియో చేయవలెననేది ప్రయత్నమది. ప్రయోజనాత్మక ప్రాబల్య విశేషమున నొప్పారుచు పట్టి పెంచి ప్రవర్తిల్లు యోగ్యతా విశేషమును తమలో గర్భిత మొనర్చుకొనిన సకల మానసిక భావనలు, కర్మ ప్రవృత్తి విశేషములు నొక మహత్తరమైన పరీక్షకు గురిచేయబడి పునర్నిర్మాణము నొందుటకై ప్రేరేపింపబడుచున్నవి. యోగము కూడ అట్టి తీవ్ర పరీక్షకు గురి యగుచున్న వానిలో నొకటి. మానవజాతి విస్తృతజీవితమును క్రమేణా సుసంపన్నముగావింప నిర్దిష్టమెయున్న శక్తి విశేషమది. మానవ జీవితమునుండి వేరుపడి, రహస్య కూటములలోనూ, తపోవనసీమంలోనూ అజ్ఞాతముగా అది దాగియుండి కాలక్షేపము చేసినది. ఇకమీద అట్లు జరుగుటకు వీలులేదు. వినూత్న సమన్వయ రూపములో అది పునరుజ్జీవనమునొంది. షడర్వ్యవ స్థితమగు మానవ జీవితమున మరింత సులభముగా, శక్తివంతముగా ప్రవేశింప గలుగుచు, అద్దానిని అంతర్ముఖముగా దాని వివరణా వ్యక్తిత్వ విశేషముల పరమవిగూఢ తలములకను, ఊర్ధ్వముఖముగా అక్కే అ పరా వ్యక్తిత్వ విశేషముల ఉన్నతోన్నత సీమలకును తన నిధానముల ధ్యానమున చేర్చవలసిన అవసరమున్నది.

ప్రకృతిలో విద్యుత్తు, నీటి ఆవిరి,— వీని సామాన్య వ్యాపారములకును, వీని సహజశక్తిని వైజ్ఞానికముగా వినియోగమునకు దెచ్చుటకును ఎట్టి సంబంధము కలదో, ఒక విధముగా అట్టి సంబంధమే మానవుని సామాన్య మానసిక వ్యాపారములకు యాగవిధానములకును కలదు. వైజ్ఞానిక పద్ధతులవలె యోగ విధానములోకూడా క్రమబద్ధమైన ప్రయోగము, అనుభవ పూర్వకమైన పరిశీలన, సుస్థిరమైన ఫలితములను పురస్కరించుకొని పెంపొందించబడి ద్రువీకరించబడిన విజ్ఞానమాధారముగా రూపొందినట్టివే. సర్వసామాన్యమగు ప్రకృతివ్యాపారములచే సులభముగ అభివ్యక్తముగాక నిగూఢముగ దాగియున్న శక్తులను, ఫలితములను ఆ సామాన్య వ్యాపారములలో నుండియే ఆవిష్కరించుట యోగవిధానముల లక్ష్యము, కాని, భౌతిక విజ్ఞానరంగమున వైజ్ఞానిక ప్రక్రియలు కొల్లలుగా పెరుగుట వలన ఏ విధముగా కొన్ని కష్టములు వాటిల్లు చుండునో అట్లే యోగప్రక్రియలు, వాని విశిష్ట ప్రయోజనములతో, మునిగి తేలుచుండుటవలన గూడ కొన్ని కష్టనష్టములు సంప్రాప్తమగుట కవకాశమున్నది. వైజ్ఞానిక ప్రక్రియా బాహుళ్యము కృతకత్వమును పెంచి యంత్రపరికరాల భారముక్రింద సహజ మానవజ్యోతిశమును ఉక్కిరి బిక్కిరి చేయుట సంభవించునట్లే, యోగప్రక్రియా బాహుళ్య ఫలితముగా యోగి సామాన్యజీవితమునుండి వేరుపడి పోయి దానిని తన యధీనమునుండి జారవిడుచుకొనుట తటస్థించుచుండును.

ఈ విపరిణామమును నివారించి, మానవజీవితమునందు ఈశ్వర ప్రకృతుల పునరైక్యమును సాధించుటయే శ్రీ అరవిందులు ప్రతిపాదించిన యోగ సమన్వయపు లక్ష్యము. భౌతిక జగత్తులోని కవతరించిన ఒకానొక పరసత్తకూ ప్రతీకగ వెలసినవాడు మానవుడు. అపరము రూపాంతరముచెంది పరస్వభావమును సంతరించుకొనుటకును, పరము అపరరూప విశేషములందు తనను తానావిష్కరించుకొనుటకును ఈ భౌతిక జగత్తున నవకాశమున్నది. అట్టి దానిని సాధించుటకై తన కీయబడిన జీవితమును మానవుడు త్రోసిపుచ్చుట ఆత్మసంసిద్ధికై అతడొనర్పదగు పరమ ప్రయత్నమునకు, మహోత్కృష్ట సాధనకు, తప్పనిసరియగు విధాయక కృత్యమనిగాని, సమగ్రమగు చరమ లక్ష్యమనిగాని గణించుటకు వీలులేదని శ్రీ అరవిందుల హెచ్చరిక. మానవ జాతిని మొత్తముమీద ఉన్నతస్థాయికి సిద్ధముచేయు నిమిత్తము ప్రత్యేకమైన యొక తీవ్ర ప్రయత్నము చేయవలసివచ్చు సందర్భమున తాత్కాలికముగా అట్టి జీవిత సన్యాసావశ్యకత కలుగవచ్చును. కాని, యదార్థము, సమగ్రమునైన

యోగలక్ష్యము ప్రయోజనమూన మాత్రము, ఎరుకతో మానవుడుకొనసాగించెడి యోగము—ప్రకృతిలో మరుగున కొనసాగు యోగమువలెనే—బాహ్యమున జీవితమునంతనూ తనలో ఇముడ్చుకొనిన దైనప్పుడే నెరవేరుటకు వీలగును.

అనేకాంశ సంఘాత రూపమైన పూర్ణాంకము వంటిదిగా మానవసత్తను శ్రీ అరవిందులు వర్ణించినారు. అందు ఒక్కొక్క అంశను మాత్రమే ప్రధాన యోగ మార్గములు వేర్వేర చేపట్టి వాని పూర్ణ సామర్థ్యముల వెలికిదీయుటకు ప్రయత్నించినవి. ఏతత్ఫలితముగా అవి, అత్యంత విభిన్నధోరణులతోకూడి ప్రత్యేక రీతులలో అత్యంత విస్తృతముగ పెంపొందించబడినవై, భావము లందునూ, విధానములందునూ అన్యోన్య వైరుధ్యమున దీర్ఘకాలముగ స్థిరపడి పోవుటయు తటస్థించినది. కాని, అనేకాంశ సంఘాతరూపమైన పూర్ణాంకముగా మానవసత్తను దర్శింపనేర్చువాని కీ వైరుధ్యములు కేవలము అసహజములుగా పొడగట్టకమానవు. బయటికి కానవచ్చు నీ వైరుధ్యములకు మూలమున నొకానొక సామరస్యముండి తీరవలెను. శ్రీ అరవిందుల విశిష్టత ఆ సామరస్యమును గుర్తించుటయందే కలదు. యోగ సమన్వయ సాధనకు అదియే దారి తీసినది. మానవసత్తయందలి సకలాంశములకు, సకల విభాగములకు చరితార్థత గూర్చునట్టి సమన్వయమది. దివ్యత్వమును ఘటింపచేసికొనుటకంటె ఉత్తమ చరితార్థత ఇంకేమి కావలెను? ఆ దివ్యత్వము వానికి మూలస్వరూపమై జగద్విధానమున వానికి పరమగమ్యముగ నిర్దిష్టమైనదే. మానవసత్తయందలి సకల విభాగములు నిట్లు దివ్యత్వమును సంతరించుకొనుట ద్వారముననే మానవ జీవితమెల్ల దివ్యత్వస్థాయికి చేరుకోవలసియున్నది.

మానవసత్తయందలి సకల విభాగములను ఈశ్వరాభిముఖ మొనర్చి ఈశ్వరార్పణము గావించి, ఈశ్వరస్పర్శను వానికి పొందించి, ఈశ్వరశక్తిని వానిలోనికాహ్వానించి, తద్వారమున ఈశ్వర ప్రకృతిలోనికి వానిని పరివర్తనము చెందించుటే ఈ సమన్వయ విధానములోని ముఖ్యాంశము. ఇందు వర్ణించవలసినది అహంకారమును, అహంకారికమైన అపర ప్రవృత్తులను మాత్రమే. అహంకారము అపరలీలలో వ్యవహారముకై ప్రకృతికల్పించిన యొక కల్పన. అపరలీల దివ్యలీలగా మారవలసిన సందర్భమువదానికిక తావులేదు. తనకు మూలమైనఆత్మయందు, పరమాత్మయందు, లీనమగుచుఅదిఅంతర్ధానమై పోవలసినదే.

సృష్టిలో కొనసాగవలసినది పరమాత్మని దివ్య సంకల్పము మాత్రమే. ప్రస్తుతము అపరలీలలో కొనసాగుచున్నదియు ఆ దివ్యసంకల్పమే అనుమాట నిజమే. కాని అది అజ్ఞానపు తెరచాటున కొనసాగుచున్నది. అహంకారమది గుర్తించక కర్తృత్వమును తన కాపాదించుకొనుచున్నది. దివ్యలీలయందు ప్రత్యక్షముగనే దివ్యసంకల్పము కొనసాగును. పరమాత్మయందంతర్యాతులగు అసంఖ్యాక జీవాత్మరూప అనంతకేంద్రముల ద్వారా అనంత వైవిధ్యమున కొనసాగులీల అది. అహంకారము నాహుతియొనర్చి- సర్వ సమర్పణ భావముతో పరమాత్మన కర్పితమైపోయి, ఆత్మయందు అతనితోడి దివ్య తాదాత్మ్యమును పొందుటేగాక, అతని దివ్యశక్తులను మనః ప్రాణశరీరములలోని కాహ్వానించుకొని, తద్వారమున వాటి దివ్యపరివర్తనమును సాధించుకొనుచు, మానవజీవనపు దివ్య లక్ష్యమును సఫలత నొందించుటే ఈ సమన్వయ విధానమున పూర్ణయోగి కొనసాగించవలసిన సాధన.

హఠయోగసాధనకు ఉపకరణములైన అన్నమయ, ప్రాణమయ కోశములు, రాజయోగసాధన కుపకరణమైన మనోమయకోశము, ఆ మనోమయ కోశములో ప్రత్యక్షముగ జ్ఞాన-భక్తి-కర్మయోగసాధనల కాధారమైన బుద్ధి వృత్తులు, హృదయావేశములు, క్రియాసంకల్పములు — అన్నియు ఈ విధానమున నొక వినూత్నలక్ష్యముతో వినియోగమునకు తేబడుచున్నవి. వీనిలో ఏది ముందు, ఏది వెనుక అనెడి నిశ్చితక్రమమేదియులేదు. సాధకుని స్వభావము ననుసరించి, పరిణామదశ ననుసరించి, అవసరము ననుసరించి యీ ముందు వెనుకలు మారుచుండును. ఒకవిధముగా ప్రతి సాధకునిది ఒక ప్రత్యేకపంథా అని చెప్పవలసియుండును. సృష్టితత్త్వముననుసరించి యీ సాధన మార్గములో అంతటి వైవిధ్యమున కవకాశమున్నది. కాని యిన్నిమార్గములు తుదకొక పూర్ణత్వసిద్ధిని పొందితీరవలసినవే.

జరగవలసినది అపరసత్త పరివర్తనము కావున, ఇది పైనుంచి క్రిందికి అనగా తొలుత మనోమయసత్త, పిమ్మట ప్రాణమయసత్త, అనంతరము అన్నమయసత్త పరివర్తనము చెందుటే సహజక్రమమని చెప్పవలసియున్నది. సూక్ష్మము మొదట పరివర్తనము చెందినగాని, పిమ్మట స్థూలము పరివర్తనము చెందుట సాధ్యపడనేరదు. వేదాంతజ్ఞానభావముపై ఆధారపడి రూపొందిన హఠ

యోగ, రాజయోగ జ్ఞాన-భక్తి కర్మయోగములే కాక, తంత్రభావముపై ఆధారపడి విస్తరిల్లిన తాంత్రిక విధానము సైతము ఇందు వినూత్న సమన్వయమును పొందినవి. వేదాంతము పురుష తత్త్వమునకు ప్రాధాన్యమీయగా, తంత్రము శక్తితత్త్వమునకు ప్రాముఖ్య మొసగినది. శ్రీ అరవిందులు రెంటికి సమన్వయము కూర్చినారు. ఉభయము ఒక్కటియే. సచ్చిదానందమున శక్తి లీనమై యున్న స్థితియొకటి. వెలికి వచ్చిన స్థితివేరొకటి. అచలుని సంకల్పమే సచలము. పర్గ్రహించుచున్నది. ప్రకృతి శక్తులను పటిష్ఠముగ వినియోగమునకు తెచ్చుటలో తంత్రము ప్రముఖపాత్ర వహించినది. కాని, తంత్రమును తమ సమన్వయమున వినియోగించుకొనుటలో శ్రీ అరవిందులు లోకములో దానిని అప్రతిష్ఠపాలొనర్చిన పెక్కు అపమార్గములకెట్టి అవకాశమూ లేకుండునట్లు జాగ్రత్త పడినారు. ఆయన సమన్వయములో వేదాంతము, తంత్రము వినూత్న తేజోబల వీర్యములను సంతరించుకొన్నవి.

కర్మ, భక్తి, జ్ఞానముల సమన్వయమును మన పూర్వాచార్యులు సైతము చేసియుండక పోలేదు. కాని, ఏ ఒక్కదానికో సర్వప్రాధాన్యమొసగి, తక్కిన వాటిని దానికి అంగభాగములుగా జేయుటే వారి పద్ధతి. కర్మ ప్రారంభదశలోని మందాధికారులకవి చెప్పబడినది. వేదవిహిత కర్మానుష్ఠానము చిత్తశుద్ధిని కలిగింపగా, ఉపాసనారూప భక్తి సాధనచిత్తైకాగ్రత కలిగించి పర్యవసానమున పరమప్రాప్యమైన జ్ఞానసిద్ధికి దారితీయునని యుద్ఘాటించబడినది. జ్ఞానపారమ్యమునుగాక భక్తి పారమ్యమును చాటుచు, దానికి తక్కిన రెంటిని అంగభూతములుగావించినసమన్వయమునూకలదు. కాని వాస్తవమున కిదియొక క్రమము నేర్పరుటయేకాని, మూడింటిని ఏకముగ మేళవించు సమన్వయము కాదు. శ్రీ అరవిందుల సమన్వయములో ఈ మూడును అన్యోన్య సాధకములగుచు మహత్తరమైన సంయోజనమును పొందినవి.

ఆశించిన పూర్ణ సంసిద్ధి దృష్ట్యా కర్మయోగము దివ్య కర్మయోగముగా రూపొందినది. జ్ఞానయోగము పూర్ణజ్ఞాన యోగముగా పరిష్కరించబడినది. భక్తియోగము దివ్యప్రేమ యోగముగా విలసిల్లినది. కర్మభక్తి జ్ఞానములీవిధా క్రొత్త వెలుగులను సంతరించుకొని దివ్యరూపమున తేజరిల్లినది, కాని అంతటితోనే సాధనకు పూర్ణత్వసిద్ధి ఘటింపనేరదు. అతిమానసమైన దివ్య

విజ్ఞానావతరణము ద్వారమున అపర ప్రకృతియెల్ల దివ్య పరివర్తనముచెంది పూర్ణ సంసిద్ధిని గాంచవలసియున్నది. ఈ చరమ సాఫల్య నిరూపణముకొఱకే శ్రీ అరవిందులు ఆత్మసంసిద్ధి యోగమును తురీయఖండమునుగూడ తమ సమన్వయ గ్రంథమునకు చేర్చినారు. ఈ సంసిద్ధి ఏ కొలది వ్యక్తులు మాత్రమే సాధించుకొనునదికాదు. ప్రకృతి క్రమ వికాస క్రమమున నొక దివ్యమానవ జాతియే అవిష్కారము చెందవలసియున్నది. ఇయ్యది అతిమానసావతరణము ద్వారా సాధ్యము కావలసియున్నది గనుక ఆ దివ్య పరిణామమును సన్నిహిత పరచుటకే శ్రీ అరవిందులయు, ఆయనకీ మహత్కార్య సాధనమున భాగస్వామిని కావలసియున్న శ్రీమాతయు అవతరణము.

శ్రీ అరవిందులు దర్శించిన దివ్యపరిణామ మెన్నటికైన సాధ్యమా, అని సంశయించువారు లేకపోలేదు. కాని, సంశయరహితమగు పరమనిశ్చయ భావముతోనే తత్సాధనకై ఆయన బాటలు వేసినారు. పరంపరాగతములగు పూర్వయోగ పద్ధతుల ననుసరించువారు కొల్లలుగ ఉండనేయుందురు. కాని, మానవజీవితమునకొక వినూత్న గమ్యమును నిర్దేశించుచు నొక వినూత్న యోగ పద్ధతిని తీర్చిదిద్దుట జరిగినది. ఇందువలన మానవజీవితము మరింత సుసంపన్నమైనదనుట నెవ్వరును కాదనజాలరు. మానవజాతి దివ్యసాఫల్య సిద్ధిని లక్షించు నీ మహనీయ సాధనానుష్ఠానములలో మనకు పొడగట్టునది సైతము ఒకానొక అపూర్వ సాఫల్యసిద్ధియే.

———

# ఆధ్యాత్మికయుగమునకు నాందికర్తలు శ్రీ అరవిందులు

— బి. నరసింహాయ్య

"అంతర్నిహితమై యున్న చైతన్యము అభివ్యక్తమగుటయే యీ సృష్టి. మఱియు సర్వవ్యాపియై యీ విజ్ఞానతత్త్వము నిశ్చేతనమనబడు జడమునందు గూడ గలదు. యీ విజ్ఞానముయొక్క రహఃప్రేరణచేతనే జగమునందలి పరిణామరేఖ ఉనికియొక్క ఉత్తరోత్తర సానువుల నధిరోహించుచున్నది. కావున మానవుని విజ్ఞానమయదశ అతని పరిణామము యొక్క సహజ పర్యవసానము; అతని ఇహజీవితముయొక్క దివ్యచరితార్థత."

— శ్రీ అరవింద దర్శనము

పరిణామము ప్రగతిశీలము గలది. జడమునుండి వృక్షజాలము, అందుండి జంతుసమూహము, అందుండి మానవజాతి క్రమముగా సృష్టిలో ఫలసిల్లినవి. మానవుని వరకు జరిగిన పరిణామక్రమము వేరు. అది ప్రకృతిసిద్ధయుగము. అతినెమ్మదిగను బహుకాలమువరకు సాగినజీవయాత్ర. అది ప్రకృతియోగము. కాని మానవుని ఆవిర్భావముతో పరిణామగతి మారిపోయినది. మానవుడు మనోమయుడు, బుద్ధిగతప్రాణి. దివ్యతత్వము పరిపూర్ణముగా వికసించుటకు తగిన ఉపాధి అతడు. స్వీయ ఆలోచన, సృజనాత్మకశక్తి అతనికి గల ప్రత్యేకశక్తులు. వీని నుపయోగించి తన పరిణామక్రమమును శీఘ్రగతిని నడుపుకొనగల్గు సమర్థుడతడు.

అట్టి దైవప్రతిరూపుడే యనదగిన మానవుడు భౌతికరంగమున సాధించిన విజయములు అనూహ్యములన్నను అత్యుక్తి గానేరదు. అటులనే ఆధ్యాత్మికరంగమునను అతడంతర్ముఖుడై కనుగొన్న దివ్యరహస్యములు, సత్యములు, మహాద్భుతములు. యోగముద్వారా అతడు ప్రకృతినుండి వేరై తాను బ్రహ్మగా నిలిచి దివ్యానందానుభూతిని బడసి ఆత్మోన్నతి నందగల్గినాడు.

మానవుడు కేవలము ఆత్మమాత్రమేగాదు. అతడు ఆత్మ. మనస్సు. ప్రాణశక్తి, శరీరము మున్నగు విభిన్నశక్తుల సమ్మేళనము. ఇవన్నియు అతనిని లోగొని తమతమ తత్త్వములవైపునకు లాగివేయుచుండును. అతని జీవితము జటిలమై సత్యాసత్యములమధ్య, దైవ అసురీశక్తులనడుమ, వెల్గు చీకటుల సందున, ముక్తిబంధాల మధ్యమున ఊగాడుచున్నది. అది అంతయు నెరుగని ఒక వింత దాగుడుమూతలాటగా పరిణమించినది. అతడాత్మోన్నతిని పొంది నను అతని యితర భాగములు ప్రకృతి చేతికీలుబొమ్మలై తికమకపడుచునే యున్నవి. అతని బాహ్యాంతర జీవితాలమధ్య. అతని ఆశయ ఆచరణలమధ్య పొత్తుకుదురుటలేదు. అతడు పరిపూర్ణ దివ్యజీవనమునకు తగినవాడుగను, దివ్య శక్తి అతనిలో పూర్ణముగా నెలకొని అతనిని నడపుటకు తగిన సాధనముగను, అతడింకను రూపొందవలసియేయున్నది. అనగా నేటి మానవుడింకను అపరిపూర్ణుడే.

నలుగురు అంధులు ఏనుగుయొక్క వివిధ అంగములు స్పృశించి వారి వారి కందిన భాగములే ఆ ఏనుగుయొక్క పూర్ణ స్వరూపమని భ్రమించి కీచులాడుకొన్నట్లు, వివిధ మతములవారు ఏకమైన సత్యముయొక్క వివిధ తత్త్వముల గుర్తించి ఎవరికివారు తమదే సత్యమని వాదులాడుచున్నారు.. వారిలో నింకను పూర్ణదృష్టి అలవడలేదు. వారి మనః ప్రాణ శరీరశక్తులు దివ్య పరివర్తనమునకు ఆయత్తపరుపబడలేదు. కనుకనే యీ విజ్ఞానయుగమునకూడ మనిషిలోని పశుస్వభావము. వైరుధ్యాలు అంతరించకున్నవి. నేటి ప్రపంచమున వెలసిన మతములు మానవుని నిక్కంపుటాధ్యాత్మిక వ్యక్తిగా తయారు చేయుటలో కృతార్థత చెందలేదు.

ప్రాచ్య పాశ్చాత్య తత్త్వముల జీర్ణించుకొన్న మహాయోగిపుంగవులైన శ్రీ అరవిందులు నేటి మానవాళి భావిపరిణామదశను దర్శించి తదనుగుణమైన భాగవత జీవనవిధానమును రూపొందించిరి. వారిది పూర్ణయోగము. దీనిని పూర్ణాద్వైతమనియునందురు. ఇది యోగ సమన్వయ పద్ధతి. ఈ యోగమునకు ప్రాతిపదిక, ఆధ్యాత్మిక శక్తి లేక దివ్యశక్తి. నిరంతరదివ్యచేతనా వాసమే పూర్ణయోగలక్ష్యము. ఇది భక్తిజ్ఞాన కర్మ యోగముల సమ్మిశ్రితము.

పూర్ణయోగమున భౌతికజీవితము వేరు, ఆధ్యాత్మిక సాధనలు వేరుగావు. ఇందు మొత్తము జీవితమంతయు యోగముగనే సాగిపోవును. జీవితమంతయు యోగమే యనగా యోగమును పశుస్థితికి దిగజార్చుటగాదు; సామాన్యమానవ స్థాయిని ఉన్నతస్థాయికి గొనిపోవుటయే దాని పరమావధి. సాధకుడు గతమును గూర్చి చింతింపక. భావినిగూర్చి కలలుగనక ఎప్పటికప్పుడు నిత్యవర్తమానమున జీవించుటకు అభ్యాసపడవలెను. తన్నుతాను దివ్యచైతన్యశక్తికి అర్పణము గావించుకొని, తన మనఃప్రాణ హృదయ కోశములను ఆ దివ్యశక్తి అవతరణమునకై ఉన్మీలన మొనర్చుకొని, దైవఉపకరణముగా మనవలెను. అతని మనోవాక్కాయ కర్మలు దైవముకొరకే నిర్వర్తింపబడవలెను. తనకేది అవసరమో, ఏది ఉత్తమమో అట్టి పరిస్థితినే భగవంతుడు తనకు కల్పించునను దృఢవిశ్వాసమును గలిగియుండవలెను.

భౌతికచేతనమును దివ్యచేతనములోగొని నడపుటద్వారా భౌతిక జీవితమును ఆధ్యాత్మికమయము గావించుటయే భగవదాశయమని శ్రీ అరవిందులు నుడివియున్నారు. అప్పుడు యింతవరకు శరీరియైన మనోమయ సత్తగానున్న మానవుడు శరీరియైన విజ్ఞానమయ సత్తగా మారును. అనగా మనోమయుడైన మానవుడు విజ్ఞానమయుడగును. మానవుడు విజ్ఞానమయుడగుటయనగా "మర్త్యశరీరమునందుండియు ఆత్మయొక్క ఐక్య అమృతత్త్వముల యందును, జ్యోతిశ్శక్తులయందును జీవించుట, వర్తించుట, వ్యవహరించుట, భౌతికధాతుబద్ధమైన మానవసత్తను మరల చిన్మయమొనర్చుట." అట్లయినపుడే పరిపూర్ణ భాగవత జీవనము సుసాధ్యమగును.

ఇట్టి పరిణామము కేవలము మానవశక్తివల్లనే సాధ్యమగునది గాదు. ఏలయన అతని శరీర ప్రాణ మనఃచేతనములట్టి దివ్యపరివర్తనమును నిరాకరించుచు తీవ్రముగ ప్రతిఘటించును. వానినెదుర్కొని వానిని పరివర్తన మొనర్చుటకు మానవశక్తి ఓపదు. కనుకనే యీ క్రింది భూమికల సైతము పరివర్తన చెందింపగల సర్వశక్తియుతమై విరాజిల్లు అతిమానసచేతనను లేక విజ్ఞానచేతనను, పృథ్వీచేతనమునకు అవతరింపజేసి దానినిచ్చో సుప్రతిష్ఠిత మొనర్చుటకే శ్రీ మాతారవిందులు కృషి సల్పుచున్నారు. ఈ అవతారమూర్తుల అద్వితీయకృషి మానవ ఆధ్యాత్మికచరిత్రలోనే అపూర్వమైనది.

మత ప్రమేయము లేకుండ, దేవునితో పనిలేకుండ కేవలము మానవ శక్తిపై ఆధారపడి భౌతిక జీవితమును కొనసాగించుచున్న మానవ జాతులు కొన్ని నేడు గలవు. ఆయా దేశాలవారు మనకన్నను ఆర్థిక వైజ్ఞానిక సాంఘిక రంగాలలో ప్రగతిని సాధించినమాట సత్యమే. వారు మానవులలో సమతను స్థాపించవలెననెడి సామ్యవాద విప్లవనినాదముతో పురోగమించుచున్న విషయము యదార్థమే. కాని ఆయా దేశాలలోగూడ స్వార్థము, వర్గపోరాటము, పదవులకైన కుమ్ములాటలు లేకపోలేదు. ఆయాజాతులవారును సప్తవ్యసనముల కతీతులుగాలేరు. వారిలోను విశాలదృక్పథమేర్పడలేదు. వారిలోను శాంతిలేదు. వారు సహశాంతిపేరుతో మారణాయుధాల ఉత్పత్తిలో పోటీపడుచునేయున్నారు. వారు భౌతికముగా ఎంతటి ఉన్నతపథాన విహరించుచున్నను, శ్రీ రామకృష్ణ పరమహంస తెల్పిన కథలోని గ్రద్ద ఎంత ఎత్తున ఎగురుచున్నను దాని దృష్టి క్రింద భూమిపై పడియున్న క్రుళ్ళిన శవాలపైననే యున్నట్లు వారి దృష్టియు అరిషడ్వర్గపరిధిలోనే పరిభ్రమించుచున్నది. వారు మనఃపరిధిని దాటి ఆత్మ తత్వమును గుర్తింపలేదు.

విజ్ఞానామృతభాండము, దైవతభూమి, ఋషులభూమి, పుణ్యభూమి అని పేర్గాంచిన భారతదేశమున జన్మించిన మనము ఆధ్యాత్మికతను విస్మరించి భౌతిక శక్తిని పొందలేక రెంటికి చెడిన రేవలగుడుండుటలేదా? అట్లని భౌతికవాదుల వలె మనమును కేవలము భౌతికాసిరిసంపదల పెంపునకే కృషి సల్పుదమా? సిరిసంపదలతో తులతూగి భౌతికసుఖాల ననుభవించి అందు తృప్తిని శాంతిని పొందజాలక తీరని కొరతతో ఆధ్యాత్మిక భిక్షకై పాశ్చాత్యులు భారతదేశమునకు వచ్చుచున్న యీ తరుణమున మనమే ఆధ్యాత్మికతను విడనాడుట విచారణీయము కాదా? కనుక భౌతికజీవితమున ఆధ్యాత్మికతను మేళవింపజేసి జీవితమునకు విలువను, నిజమైన ఆనందమును, శాంతిని ప్రసాదించుట నేటి భారతీయ తత్వవేత్తల కర్తవ్యము. ఇట్టి ఆశయమే పూర్ణయోగలక్ష్యమగుటవలన శ్రీ అరవిందులు ఆధ్యాత్మిక యుగమునకు నాందికర్తలైనారు.

శ్రీ అరవిందుల యోగదృష్ట్యా మనుష్యుడు విజ్ఞానమును లేక అతిమానసమును తనయందు ఆవిష్కరించుకొని, దాని ధర్మముచే మనః ప్రాణభూత ధాతువులకు సంబంధించిన తన సకలజీవితమును నియమించి రూపాంతర

మొందజేయగల్గినపుడే పరిపూర్ణ భాగవతజీవనము సాధ్యమగును. కాని నేటి మానవుడు చేయజాలని కష్టసాధ్యమైన కార్యములలో నూతన భావమును గ్రహించుట యనునది మరింత కష్టసాధ్యమైన కార్యము. ఏలయన అతని మనస్సు నిరంతరము ప్రాతపద్ధతులనే పట్టుకొని వ్రేలాడుచుండును. వానినుండి విడివడుటయన్న అంత సులభము కాదు. అది మానవుని మానసిక బలహీనత. కాని జీవితవాహిని నిరంతరము ప్రవహించుచు ముందుకు సాగిపోవు జీవనదిగా యున్నదేకాని నిలిచియున్న నీటికుంటగా లేదు. కనుక ఒకనాడు మానవుడు మారక తప్పదు. అందువలన విజ్ఞానశాస్త్ర ఫలితములైన విద్యుచ్ఛక్తి, నవీన యంత్రసాధనలను మనము నిత్యజీవితమున ఉపయోగించుకొనుటకు అలవాటుపడినట్లే ఆధ్యాత్మికరంగమునగూడ మతాతీతమైన నూతన దివ్యతత్త్వముల గ్రహించి నూతనపథాలలో పయనించుటకు అలవాటుపడవలెను. లేదేని విశ్వపరిణామమును నడపు ప్రగతిశీలియైన దివ్యశక్తి ఉపద్రవాత్మక పరిస్థితుల యొత్తిడిచేతను, బాధలచేతను, మన అంతశ్చేతనలో పరివర్తన గల్గించితీరును. అది తథ్యము. కనుక ఐచ్ఛికముగానే అట్టి దివ్యపరివర్తనమును అభిలషించి దానికై కృషిసల్పుట నేటి మానవ కర్తవ్యము.

———

# ధ్యానము - శిక్షణ

## శ్రీ మాత, శ్రీ అరవిందుల బోధనల ననుసరించి కొలది సూచనలు

—డి. వీరయ్య

### ధ్యానమునుగూర్చి

భద్రముగ నిరంతరాయముగ కనీసము ముప్పావు గంట మొదలు గంట వరకు గడపుటకై ప్రశాంతము ఏకాంతమునగు స్థలమును ఎంచుకొనుము.

కుర్చీయందుగాని చేతులు కలిగి వీపు ఆన్చుకొనుటకు వీలున్న కుర్చీపై గాని మెత్తని ఆసనముపైగాని, తివాచిమీదగాని పద్మాసనమున కూర్చుండుము. శరీరమును తిన్నగా నుంచుట శ్రేష్ఠము కాని ఒత్తిడిలేక సుఖముగా నుండవలెను. వాస్తవముగా ఆసనము ముఖ్యముకాదు. శరీరమును త్వరగా మరచుటకై ఆసనము సుఖముగా నుండుట ముఖ్యము. ఆనుకొని కూర్చుండుట అంతమంచిది కాదు. రోగమున్నపుడు శరీరమసమర్థముగా నున్నపుడును ఆనుకొని కూర్చుండవచ్చును. ఆనుకొని కూర్చుండిన సులభముగా నిద్రవచ్చును.

దైవమును గూర్చి యొక ఆశయముతో, ప్రార్థనతో భక్తితో కూడిన పిలుపుతో ధ్యానమెప్పుడును ప్రారంభించుము.

(అ) నీ మనసునందు మూగిన చింతలను పరిశీలించుచుండుట మొదటి పద్ధతి. నీ మనసున జనసంచార ప్రదేశమునందువలె చింతలు లోనికి వచ్చుచు వెలుపలకు పోవుచునుండును. అందు కొలది నీ మనసు నాకర్షించి చాలాసేపు నిలచును. వానిలో ఏ దానితోను తాదాత్మ్యము పొందక వాని యాటలను పరిశీలించుము. నీ చైతన్యము — నీ మానసిక ఆత్మ — (విశుద్ధి) సాక్షివలె విడిగా నుండుట నీకు తెలియవచ్చును. నీలోని మానసిక స్వభావముయొక్క గతుల కంటె వేఱని తెలియును. ఒకప్రక్క సాక్షియైన చైతన్యమును వేఱొకప్రక్క మానసిక స్వభావమును ఉండును.

ఆ చింతలతో నీవు తాదాత్మ్యమును చెందుటకు నిరాకరించుటచే వాని గతియు, దృఢాగ్రమును క్రమముగా బలహీనమగును. నీ మనః స్వభావపు తరంగములు అణగిపోవును. కొలదిసేపయిన పిమ్మట ప్రశాంత మనస్సునందు లేక ప్రశాంతతయందు ప్రవేశింతువు. ఇంకను చింతలు కలుగుచుండును. కాని అవి పరాజితములు, కావున అంతర ప్రత్యక్షతకు భంగము కలిగింపజాలవు.

(ఆ) నీ మనస్సును శూన్యముగా నొనర్చుట మనస్సును సంయమించుటకు వేఱొక పద్ధతి. మొదటి పద్ధతికంటె ఇది మిక్కిలి కష్టము. కాని ప్రాథమికము, త్వరితము. మనసునుండి అన్ని చింతలను పూర్తిగా తొలగింపవలెను. ఒక చింత వచ్చిన వెంటనే దానిని తొలగింపుము లేక త్రోసివేయుము. అపుడు మనస్సున అది స్థిరపడుటకు కాలము చాలదు. ఈ మార్గముననే నీ హేతువాద రీతిని, స్మృతులను (సంసర్గములను) తొలగిండుకొనుము. నీ మనసు నిశ్చలతా ప్రశాంతిలో క్రమముగా ప్రవేశించును.

నీ మనస్సును బలాత్కారముగ నిగ్రహింప అట్లు యత్నించుట ఒక్కొక్కప్పుడు మానసికా వ్యవస్థతను అధికముచేయుచున్నట్లు కానవచ్చును. నీవు ఆకులుడవు కాన మరల మరల నిగ్రహింప యత్నించుము.

సంపూర్ణ "నీరవతా" స్థితికి మనస్సును గొనివచ్చుట సంభవము కాని యిది మిక్కిలి క్లిష్టకార్యము. కనీసము శ్రీ అరవిందులు ''సంపూర్ణ యోగమునందు" అది తుదికి అపరిహార్యమును కాదు. దేహమును పరవశత్వమున నుంచుట యీ యోగము లక్ష్యమును కాదు. దీని లక్ష్యము ఆ యనుభూతులనే సంపూర్ణముగా సచేతనమై మెలకువ (జాగృతమునగల)స్థితియందు పొందుటయే.

(ఇ) ఏకాగ్రతచే కూడ మానసిక నిగ్రహమును కలిగింపవచ్చును. అనగా ధ్యేయవస్తువుతో నైక్యమగునంత బలముగా మనస్సును దానిపై లగ్నము చేయవలెను. ఈ తాదాత్మ్యమువలన వస్తుజ్ఞానము మనస్సున పుట్టును. ఏకాగ్రతకు అత్యుత్తమ విషయము, జ్ఞానమునకు మిక్కిలి యోగ్యమైనది. నిశ్చితముగా దైవము; పరాత్పరుడు. అదియు సగుణముకాని నిర్గుణముకాని విషయిగా తన ఆత్మయే అయినను కావచ్చును. ''దైవమునందు సర్వము, సర్వమునందు దైవము, సర్వమును దైవము" అను భావము నీకు మిక్కిలి సాయపడును.

నీ మనసునకు నిలకడ లేనపుడు, వేరుచోట్ల చరించుచున్నపుడు తిరిగి ధ్యేయముపై నిశ్చలముగా నిర్బంధముగా నిలుపుము. ఇటకూడ నీ మనస్సునుండి నిస్సంగుడవై యుండుము.

నీవు సార్థకమగు శబ్దమును గాని, వాక్యమునుగాని, ప్రార్థననుగాని నీవుపయోగింపవచ్చును. వాని జపము నీ మనస్సు యాంత్రిక భాగమును నిశ్చల మొనర్చును. దైవముయెడ అధికభక్తి గలవాడు అట్టి ప్రియదైవ నామ జపమును తఱచుగా చేయవచ్చును.

ఆవశ్యకమునుబట్టి. ఆ కాలమున సులభమనిపించిన రీతిని ఈ మూడు పద్ధతులను ఏక కాలములో ఉపయోగించుట అత్యుత్తమము. ఏ విషయము నందైనను ప్రతిదినమును, మేలుగా ఒకే వేళకు నియతసాధన అవసరము,

ఒకదినమున ఆకస్మికముగా అనిర్వచనీయ సంతోషపు సరభసప్రవేశము నీకు ఎఱుకపడును. ప్రపంచమున దేనితోడను ఏ మానవప్రమోదము-సౌఖ్యము-అనుపమితమగు మాధుర్యము ఎరుకపడును. అది విషయరహితమగు నిర్గుణ స్థితి. అయినను అట అదృశ్యమగు సాన్నిధ్యము కలదు. కాని ఆత్మ లోతుల లోనకి చొఱబారుట లేక ప్రాయికముగా ఆత్మ ఉన్నత భూమికలనుంది ఆవరించుట కలుగును.

అన్ని సందేహములును మాయమగును. అన్నిసమస్యలును అంతర్ధానమగును. వాని స్థానమును భద్రత, విశ్వాసము (నిశ్చయము) ధ్రువత్వము ఆక్రమించి పాలించును.

ప్రపంచమును, (వస్తువులు) విషయములను, వ్యక్తులనుగూర్చి విశద మొనర్ప అవసరములేదు. వాని ఉనికియే వాని సమర్థనము. వారును అవియును అనంతకాలమునుండి ఉన్నవి. ఇపుడుగాని ఎపుడుగాని వారు ఉండుట మానరు. మృత్యువు అనుపపన్నమగు అసాధ్యమయినది.

ఈ స్థితియందు ఒకడు పొందు అద్భుతావహములగు అనుభూతుల వర్ణనలు పెక్కు గలవు. చేరుకొనిన లోతులనుబట్టియు, ముందుగానున్న పక్షమునుబట్టియు, వ్యక్తి పరిస్థితులబట్టియు, తత్కాలావశ్యకమునుబట్టియు,

దానిననుసరించు సంఘటనల(కాంతులు, శిరోగ్రమున విశ్వచైతన్యపు ప్రవృత్తి మొదలగువానిని) బట్టియు మారుచుండును. ఇచట ప్రసంగింపఁబడినవి దివ్య దర్శనములు కావు. — దివ్యదర్శనములు వేఱు స్వభావము కలవి — కాని "మానసికావస్థలు" లేక మేలుగ "చైతన్యావస్థలు".

ఈ యనుభూతులను పొందిన అన్నిదేశముల యోగులును వానిని వేఱు వేఱు పేరులతో వ్యవహరించిరి. "మహాశాంతి, దైవశాంతి, దైవసాన్నిధ్యము, యదార్థమగు ఆత్మను కనుగొనుట, ఆత్మవికాసము, రెండవపుట్టుక, బ్రహ్మ మున విశ్రాంతి, ఏకైకసత్యమున ప్రవేశము, విశ్వచైతన్యము, ప్రకాశము, ప్రత్యక్షజ్ఞానము, నిర్వాణము", ఒక నూతనజీవితము యదార్థముగా ప్రారం భించును. అంతరప్రపంచము బాహ్యప్రపంచముకంటె మిక్కిలి యదార్థము.

## శిక్షణానియమములు

ఇపుడు వర్ణింపఁబడిన యనుభూతులు కాందిశీకులు ; ధ్యానము ముగిసిన కొలదిసేపటికి అవి వాని సజీవశక్తిని కోల్పోవును. వానిని నిలుపుకొన పెక్కు ప్రయత్నములు చేసినను అవి మాసిపోవును. ఈ తాత్కాలికత్వము మన వ్యక్తి వివిధభాగనిర్మాణమువలన కలుగును. మనము పెక్కు భాగములచే నిర్మింపఁ బడితిమి. అవి వేఱు వేఱు దిశలకు లాగుచుండును. అత్యున్నత స్పృహేచ్ఛ లకు క్రింద మానసిక, ప్రాణమయ పురుషుడును, పిమ్మట భౌతిక పురుషుడును నుండును. ఇందొక్కొక్కటి బహుభాగముల సమ్మిశ్రణము, బాహ్యప్రపంచా భ్యర్థనలకు ఈ భాగములన్నియు విభిన్నముగా ప్రతిక్రియల నొనర్చును. ఈ వ్యత్యస్త ప్రవాహములు ఆధ్యాత్మికానుభూతి స్మృతిని మాయించును.

మనలోని సమస్తభాగములును మన ప్రముఖ స్పృహేచ్ఛలచుట్టును వ్యవస్థీకరింపఁబడి వాని దర్శకత్వమును అంగీకరించినచో మన మభినివిష్టులమగు సాధారణ వ్యాపారములయందును మనము ధ్యానమున పొందిన శక్తి, శాంతి, దీప్తి, ఆనందమును నిలిచియుండును. ఈ లక్ష్యమును చేరుటకు చక్కని శిక్షణ మత్యావశ్యకము. ఈ శిక్షణమాత్రమే మన వ్యక్తి సమైక్యమును అనుమతించి దానికి సంసిద్ధమొనర్చును.

సమైక్యము క్లిష్టకార్యమని నీవు వెంటనే గుర్తింతువు. ఇది ఇంద్రియ జీవితమే కేవలసత్యమని తలంచు సామాన్యములగు అలవాటులకు అన్నిటికి విరుద్ధము. దీర్ఘ బలపంతశిక్షణ ప్రతిరోధమునంతను భగ్నమొనర్చును; మన వ్యక్తి పరివర్తనమును కలుగజేయును. ఇందు మకుటాయమానమగు అనుభూతి మన జాగృత చైతన్యమునకు నిశ్చిత వ్యత్యస్తమగుట.

ఇట శ్రీ అరవిందుల సంపూర్ణయోగము రేఖామాత్రముగనున్నను మన అవశ్యకమునకు సమగ్రముగ (సమాధానమగును) చాలును.

అవశ్యకమగు వైయక్తికప్రయత్నము మూడువిధములు. స్పృహ, నిరాకరణము, సమర్పణ.

విరామములేని నిరంతర జాగరూకమగు స్పృహ. — మానసికేచ్ఛ, హృదయాన్వేషణము, ప్రాణపురుషుని సమ్మతి, భౌతికచైతన్య స్వభావములను సుఖ సమ్యముగ నొనర్చి వివృతముగ నుంచుటకు ఇచ్ఛ.

అధమ ప్రకృతి గతుల నిరాకరణము — మన బుద్ధికి చెందిన భావములను, అభిప్రాయములను, అధికరుచులను, అలవాటులను ఊహలను నిరాకరించుట. దానివలన యథార్థజ్ఞానము నీరవ బుద్ధియందు స్వేచ్ఛావకాశమును కలిగియుండును. ప్రాణమయ ప్రకృతి వాంఛలను, బలాత్కార వాంఛలను, లాలసలను, ఇంద్రియవృత్తులను, స్వార్థమును, గర్వమును, అహంకారమును, కామమును, లోభమును, ఈర్ష్యను, అసూయను, సత్యమునకు ప్రతిరోధమును, తిరస్కరించుట. దానిచే యదార్థమగు శక్త్యానందములను పైనుండి నిశ్చల, విశాల, బలవంత, సమర్పిత ప్రాణమయ పురుషునిలో పూరించుటకు వీలగును. భౌతిక ప్రకృతియొక్క జడతను సందేహము, అవిశ్వాసము, గూఢత, ప్రతీపతి, క్షుద్రత, మార్పునకు అనంగీకృత, మాంద్యము, అలసత్వమును నిరాకరించుట. దీనివలన నిరంతరము దైవ సంబంధిగా వృద్ధి పొందుచుండిన దేహమునందు జ్యోతి, శక్తి, ఆనందము యథార్థ స్థైర్యముతో ప్రతిష్ఠితమగును. తానయినది, తనకుగలది, తన ఆత్మను ప్రతిచైతన్యస్థాయిని, గతిని, దైవమునకు శక్తికి సమర్పించుట.

సమర్పణము, ఆత్మసంస్కారము పురోగమించుకొలది సాధన యొన ర్చుచు సాధకుడు, దివ్యశక్తి విజ్ఞానమును పొందును. ఆ దివ్యశక్తి తానే స్వయముగా పూరితమగుచున్నట్లు, దివ్యప్రకృతి స్వేచ్ఛా సంపూర్ణతలు అతని యందు కనుగొనినట్లు జ్ఞానము కలుగును. స్వీయ ప్రయత్నస్థానమును ఈ ప్రయత్న పూర్వక ప్రక్రియ ఆక్రమించుచున్నకొలది, అధికముగ, త్వరితము, యథార్థము అతని పురోగతి యగును. కాని మొదటినుండితుదివరకు సమర్పణ, ఆత్మ సంస్కృతి, స్వచ్ఛము, సంపూర్ణము అయినకాని దైవశక్తి వైయక్తిక ప్రయత్నావశ్యక స్థానమున సమగ్రముగా ఆక్రమింపజాలదు.

శ్రీ అరవిందులు—శ్రీమాత—II

ఈ సర్వగ్రాహియగు ఉపదేశమును ఆచరణయోగ్యమగు సాధనముగా ప్రయోగించుట నీ అందుబాటులోనున్నది. ఇది సులభమని దీని యర్థముకాదు. ఆ యుపదేశము ఇటనున్నది ;

నీ దైనందిన జీవితమునందలి అన్ని సంఘటనలను, పరిస్థితులను పెద్దవి కానిమ్ము స్వల్పము కానిమ్ము పరాత్మత్పరునకు అర్పింపుము. అవి వచ్చిన తీరుననే గ్రహింపుము, మంచి చెడుగులని, సుఖదుఃములని భేదమును జూపకుము. నీ సమర్పణయందు నీ ప్రణతియందు చిత్తశుద్ధియున్నయెడల నీ జీవితము కేవలము మారును. ఒక శక్తియొక్క కానరాని చేయి నీకు దారి చూపుచున్నదని ఈ ఏండ్ల అన్నిటను నిరంతరము దారిచూపుచున్నదని నీవు కనుగొందువు, ప్రతి ప్రాతఃకాలమునను నీ కొక నూతన ప్రమోదము ఉత్పన్న మగును.

(అ) ధ్యానకాలమున నీ మానసిక వ్యక్తి నీలోని మానసిక స్వభావము నుండి దూరముగ నుండునని యనుభూతమైనది, —ఒక పక్క నీ ఆత్మయు వేరొకప్రక్క నీ చింతలు, నీ భావములు, అభిప్రాయములు — కావున వేఱు (అవి వాస్తవముగా నీవా ?)

(ఆ) నీ వీ నిస్సంగతను నీ చిత్తవికారములకు, సంవేదనలకు, ఇపుడు వ్యాపింపజేయవచ్చును. దైనందిన జీవితమునందే ఇట్లు చేయుట మేలు. నీకు

చిత్తవికారము — విసుగు, కోపము, లోభము లేక యింద్రియవృత్తి —కలుగుచున్నప్పుడు నిస్సంగుడవై పరిశీలింపుము. వెంటనే ఆ చిత్తవికారము లేక సంవేదన నీపై పట్టు పోగొట్టుకొనినదని లేక మాయమైనదని కూడ నీవు గుర్తింతువు. ఈ యనుభవము నీ సంవేదనలను, చిత్తవవృత్తులను ఆకాంక్షలను (అవి యధార్థముగా నీవా ?) — నీలోని ప్రాణమయ ప్రకృతిని — నిగ్రహించుటకు సాధనము కావచ్చును.

(౩) పిమ్మట మూడవ అనుభవము, నీకును నీ భౌతిక దేహమునకును గల బేధము తెలియును. — మూడింటిలో నిదియే మిక్కిలి విశిష్టమైనది. నీ విక్రియములనుండి దూరముగా నిలిచి అవి కలిగినను లేకపోయినను నా ఆత్మ యదియే యని పరిశీలింపుము, సుఖ దుఃఖకరములు లేక బాధాకరములైన వాని నుండి సమముగా నీ యాత్మను నిస్సంగ మొనర్పుము. దానిని అంగీకరించి దానితో తాదాత్మ్యము చెందినగాని అందేదియు నిన్ను సంచలింప జేయజాలదని గ్రహింపుము.

నీకును నీ భౌతిక దేహ ప్రక్రియలకును మధ్య విశ్లేషము కలిగించుట మిక్కిలి కష్టము. ఏలన నీ యావజ్జీవమును భౌతిక ప్రపంచమే ఏకైక సత్యమని తలంచి శిక్షణ యొసగితివి. కాని ఒక పర్యాయము దానిని సాధించినచో అత్యధిక లాభమునది కలిగించును అనగా నీలోని భౌతిక ప్రకృతిలోని గూఢత, మాంద్యము చంచలత్వము, భంగురత్వముపై సంయమనము. ఈ విశ్లేషత్వము లేనంతకాలమున నీ దేహమునకు నీవు దాసుడవు — ఒక పరి దానిని సాధించినచో దాని కధికారివగుదువు.

ఇట్లు ప్రతిష్ఠింపఁబడిన త్రివిధ విశ్లేషత ప్రతిక్రియను మిక్కిలి స్వల్పమైనదికూడ నీ అత్యుత్తమ సామర్థ్యముతో గొప్ప ఏకాగ్రతతో, సంయమముతో నిపుణతతో సాధింపనిచ్చును. శ్రీ అరవిందులు వచించినట్లు దైవశక్తి "ఆమెయే స్వయముగా, అధికాధికముగా" నింపుచున్నదనియు "దైవ ప్రకృతి స్వేచ్ఛా సంపూర్ణతలు" నీలో ప్రతిష్ఠిత మగుచున్నవని నీవు గ్రహింతువు నీవు నిగూఢమగు ఆనంద విధానమును అవిష్కరింతువు. దాని మారు వేషములు మూడును నిర్లక్ష్యము, బాధ, సంతోషము. ఇట్లు ఆమె యోగమునందలి

సంపూర్ణతకును నీ స్వభావ పరివర్తనకు (కీలకముఅని మర్మోద్ఘాటకమును) గొనివచ్చును.

నీ శిక్షణయందు నీకు లభ్యములగు శ్రీమాత, శ్రీ అరవిందుల రచనలను కొలదిగా చదువుట, నేర్చుకొనుట, ఉత్తమమగు అలవాటు. ప్రశంసిత గ్రంథములు. శ్రీ అరవిందుల – 1) యోగమునకు ఆధారములు, 2 యోగముపై దీప్తులు 3) యోగముపై పెక్కు దీప్తులు 4) యోగమును గూర్చి లేఖలు–రెండు సంపుటలు, 5) శ్రీమాత, 6) యోగసంయోజనము, 7) మానవుని భావిపరిణామము. 8) శ్రీమాత–సంభాషణలు. 9) శ్రీమాత, శ్రీ అరవిందుల ప్రేమనుగూర్చి. 10) సత్ప్రేమ–శ్రీ అరవిందులు–లేక చైతన్యపరాక్రమము 11) శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాకేంద్రసంక్షిప్తసంచిక.

ఎక్కువగా చదువుట అవసరముకాదు. దినమునకు ఒక అరగంట చాలును. మెల్లగా చదువుము. అవసరమగుచో తిరిగి చదువుము. నీవు చదివిన దానిని గూర్చి ధ్యానింపుము. ఆ దినమునందు అప్పుడప్పుడు దానిని గూర్చి చింతింపుము. ఆచరణమున నుంచ యత్నింపుము. దానినిగూర్చి జీవింప యత్నింపుము. ఇట్లు క్రమముగా శ్రీమాత, శ్రీ అరవిందుల చైతన్యములో (మాకు వారొక్కటియే) సంపర్కమును పొందుదువు. వారి రచనల నిగూఢార్థమును అర్థముచేసికొన నారంభింతువు.

నీవు లైంగికసమస్యలచే సంక్షుభితుడవా? స్వేచ్ఛా స్తంభనప్రతిరోధములు లేకయే తాత్కాలిక సమరసభావమును కల్పింపుము. ఇది కొలది కొలదిగా పరిణమించి, స్వచ్ఛముగానయి, ఈ రంగమునందును ఆధిపత్యమును సంపాదింతువు. ప్రేమనుగూర్చి శ్రీమాత, శ్రీ అరవిందుల గ్రంథము సృష్టియందలి ప్రేమ స్థానమును నీకు చూపుము. నీవెచటనుందువో చూపుటకది సహాయపడును. అందరకును ఒకే నియమము లేదు. ప్రతి స్త్రీయు పురుషుడును వారి నియమమును వారే కనుగొనవలెను.

పురోగమింపుము. విశ్వాసివైయుండుము; ఈ విధముగా నీవు నీ వ్యక్తి ఐక్యమును నిర్మింపుము. నీవీయైక్యమును సాధించినపుడు నీ సమస్తప్రకృతి పరివర్తనమును (సంభవమగును) శక్యమగును. ఏండ్లను జన్మలను గణింప నవసరములేదు. దైవమును చేర్చు రాచబాటయందు నీవుంటివి.

ఖనిజములు, మొక్కలు, జంతువులగుండ ప్రపంచ దీర్ఘపరిణామ లక్ష్యమును స్మరింపుము. అటుపిమ్మట అనుక్రమిక మానవజన్మలద్వార నాగరికతలద్వార పరిణామలక్ష్యము మానవులను వ్యష్టిగా సమష్టిగా సంపూర్ణ జాగృతవ్యక్తులుగా నొనర్చుట, అనగా వారియందును, ప్రపంచమున చుట్టును జరుగు అన్నిటినిగూర్చి సచేతనమగుట, ఆధిపత్యము కలిగియుండుట, అభిప్రాయములకు, ఇంద్రియవృత్తులకు, విక్రియలకు నున్న యుగాంతరబంధము నుండి ముక్తమగుట.

* * * *

మిత్రులారా! శ్రీమాత ఈ పర్యాయము ఆమె తన ఉగాది సందేశముగా, "మానవులారా! దేశవాసులారా! ఖండవాసులారా! ఆవరణము విధాయకము సత్యమునా లేక అతలస్పర్శఖాతమునా?" అని వచించినది. ఇది సహజముగా "వరణమేమి? అది ఏల విధాయకము?" అను ప్రశ్నను ఉత్పన్నమొనర్చును.

శ్రీమాత సందేశము ఏతత్క్షణ సార్ధక్యముదృష్ట్యా ఈ ప్రశ్నకు ఆమెనే తన సమాధానమొసగవలెనని మేము అడిగితిమి. ఆమె తన సమాధాన మొసగినది. ఏదైన చెప్పుటకు ముందుగనే నేను దానిని చదువుదును.

"ఈ వరణమేల విధాయకము," అను ప్రశ్నకు సమాధానము; శ్రీ అరవిందులు చెప్పినట్లు దైవఘడియలలో నొకదానియందు మనముంటిమి కావునను ప్రపంచమును పరివర్తనమొందించు పరిణామము త్వరితము, గాఢీకృతము నగు గతిని గ్రహించినది.

* * * *

మానవ పరిణామమున దీర్ఘదర్శిత్వమున గాంచి ఆమె తన సందేశమున శ్రీమాత సూచించిన వరణము మానవపరిణామ భవితవ్యతావరణము అని మనము చెప్పవచ్చును. భౌతిక పరిణామమునందు మానవుడు పరివర్తనమొందు వ్యక్తి. ఆతడు యధాప్రకారముండి ఉన్నత చైతన్యస్థాయికి క్రొంగొత్తరీతి వ్యక్తిగా ఉత్థితుడుకా నుద్దేశింపఁబడెను. తద్వర్తమాన మానవస్థావము నతిక్రమించి దివ్యమానవాతీతుడగుట ఆతని భవితవ్యత.

మానవుని యీ యున్నతపరిణతికి శ్రీమాత చెప్పిన వరణము ఒక ప్రాథమికావశ్యకము. పరిణామ ప్రక్రియయందు మానవునకీ ప్రతేకస్థాన మర్హము. శ్రీ అరవిందులు వచించినట్లు భౌతికపరిణామమున మానవుడు గోచరించుట, పరిణామము ప్రక్రియయందు మార్గమునందు ఒక నిర్ణాయక వికృతి (Change) నిర్ణాయక పదము. ప్రాత మార్గముల సాగించుట మాత్రము కాదది. భౌతికపదార్థమున అతిశయిత మననశీలమగు బుద్ధివరకు పరిణామము ప్రవర్తించినది.ఇది సజీవవ్యక్తిస్వోపజ్ఞతతోకూడిన స్పృహ.ఉద్దేశ్యము,ఇచ్ఛ లేక అన్వేషణముగాని లేదు. కాని ప్రకృతి స్వతఃప్రేరిత వ్యాపారముచే అవ్యక్తముగా జరిగినది. ఇది అట్టిదే యగును. దానికి హేతువు అచేతనమునుండి పరిణామ మారంభమైనది. తత్సజీవప్రాణి వైయక్తి కేచ్ఛ పాల్గొను స్వీజ్ఞతతో వ్యాపార మొనర్చుటకు దానినుండి రహస్యముగనున్న చైతన్యము పర్యాప్తముగా (Sufficiently) ఉదయింపలేదు. కాని మానవుని యందు ఆవశ్యకమగు వికారము కలిగినని_వ్యక్తి జాగృతుడై తన్నుతానెరింగెను. చైతన్యము దాని ఇచ్ఛను వృద్ధి పొందించుటకు, జ్ఞానమును పెంపొందించుటకు, అంతరమగు ఉనికిని గంభీరమొనర్చుటకు బహిరమగు ఉనికిని విపుల మొనర్చుటకు ప్రకృతి సామర్థ్యములను వృద్ధిచేయుటకు మనస్సునందు వ్యక్తమైన స్వీయమగు చైతన్యము కంటె ఉన్నతపదవి చైతన్యమునకు ఉండగలదని గాంచెను. ఆతని భాగములగు మనస్సున, జీవితమునందు బలవత్తర ప్రేరకము కలదు. తన్ను తానతిక్రమింప స్పృహ సంక్రమితము, పరిస్ఫుటము అయినది. అతనికి ఆత్మభావము కలిగెను. ఆతడు ఆత్మను, భావమును కనుగొనెను. అపుడు మానవునిలో అవ్యక్త పరిణామమునకు బదులు జ్ఞాతపరిణామము బోధయోగ్యము, ఆచరణ యోగ్యము నయ్యెను. స్పృహ ఉత్తేజము (Urge) అవిరత ప్రయత్నము మహత్తర పదవి ఉదయమునకు సిద్ధికి ఒక ఉన్నత మార్గమునుగూర్చి ప్రకృతి ఇచ్ఛకు నిశ్చిత చిహ్నమని మనము చక్కగా నిర్ణయింపవచ్చును.*

మానవుడు ఉన్నత పరిణామమునకై ప్రయత్నపూర్వకముగా వరించి, పాల్గొను ఆవశ్యమున కిదియే ప్రాథమిక హేతువు. వృక్షములయందు జంతువుల

---

* జీవితము దివ్యము _ అమెరికా ముద్రణము పుటలు 750_751.
(1960 _ పుట 1004_5)

యందువలె ప్రకృతి అవ్యక్త ప్రేరణచే ఇది స్వయం ప్రేరితముగా సంభవింపదు. ఈ మార్పునకై స్వయముగా మానవు డిచ్ఛింపవలెను, దాని సిద్ధికై ప్రయత్నింప వలెను. పరిణామమున మానవుడే ఆత్మజ్ఞానముతో కూడిన వ్యక్తియను వాస్తవ విషయమే ఉత్తమ పరిణామ పదవికి తన్ను తానుద్ధరించుకొన ఎరుకతో వరించు టకు ఆవశ్యక మొనర్చుచు చున్నది.

కావున, దివ్యమానవాతీతుడు అగుట మానవునకు పరిణామ భవితవ్యత అయినను, మానవుడు ఎఱుకతో వరించి ప్రయత్నించి యా భవితవ్యతను గ్రహింప అవశ్యకమని మనము చెప్పవచ్చును. దైవముచేకాని, ప్రకృతిచేకాని స్వచ్ఛందమగు కానుక (దోపహారము) గా మానవాతీతత్వముగా ప్రసాదింపఁ బడదు. పరిణామమున శ్రేయోపజ్ఞమగు బుద్ధిని, ఇచ్ఛను కలిగియుండు అపూర్వాధి కార విశేషమును మానవుడు పొందియున్నాడు. కాని యా అధికార విశేషము కూడ ఒక బాధ్యత లేక యొక విధి అగును. ఆతనికి ఆత్మచైతన్యము కూడ నొసగఁబడినది. తత్ఫలముగా ఆతనికై వేచియున్న ఉన్నత పరిణామశక్యత లను తెలిసికొని తన ఇచ్ఛను వానిసిద్ధికై అభ్యాస మొనర్పవచ్చును. వేఱు విధముగాకాక అప్పుడే ప్రస్తుత మానవపదవిని అతిక్రమించి దివ్యమానవాతీతుడు కావచ్చును.

భూమిపై మానవుడు కానవచ్చి నప్పటినుండియు, ఈ వరణావశ్యము ఎపుడును అతనిపై నున్నది. కాని ఆతని యభివృద్ధి తొలి దశలయందు అది అధికముగా నిగూఢము, నిర్వివాదము నయినది. ఇట్లుండుటకు కారణము పుడమిపై నాతని ప్రాచీన చరిత (Career) యందు మానసికశక్యతలను సమ గ్రముగా మొదట సిద్ధింపఁ జేసికొనవలెను. పరిణామమున మానవుడు మానసిక వ్యక్తికి ప్రతినిధియైనను తొలి దశలయందు ఆతని బుద్ధి ప్రారంభావస్థ యందుం డెను. ప్రారంభమున చిరకాలము భౌతిక ప్రాణమయబుద్ధియందే వాని ఆవశ్య కముల యందు ప్రవత్తులయందు ఆసక్తుడై అనాగరికుడుగా నుండెను. పిమ్మట క్రమముగా ఉన్నత మానసిక శక్తులు ఆతనిలో వృద్ధినొంద నారంభించెను. ఆతడు ఉన్నత మానసిక స్పృహాశయములతో వసింప యత్నించి సంస్కృతిగల వాడయ్యెను.

ఈ దీర్ఘ శతాబ్దుల మానవచరిత్ర మానవుని సాంస్కృతిక ప్రయత్న సిద్ధుల స్పష్టలేఖ్యమగును.

కావున పరిణామమున మానవుడు పరివర్తన చెందు వ్యక్తియు సమగ్ర ప్రవృద్ధ మానవుడైన పిమ్మట పరిణామమున నిల్చిపో నుద్దేశింపబడలేదు. కావున బుద్ధికతీతముగా నాత్మలోనికి ఉత్థితుడై తన్నుతానతిక్రమింప అపరిహార్యభవితవ్యత కావున అతనిలో అవిధి యాహ్వానము మేల్కొలిపి అతనిపై అతిశయిత త్వరలో ఒత్తిడి కలిగించుకాలము మానవచరిత్రయందు వచ్చును. ఉండినంతకాలమును మానవుడు మానవుడుగా నుండరాదు పురోగతికై అడుగుపెట్టి మానవాతీతుడగు కాలము తప్పక వచ్చును.

మానవ పరిణామమునందీకాలము వచ్చినప్పుడు మానవున కావశ్యకమైన యీ వరణము త్వరితము, బలాత్కారమునగును ఏలన దానిని ఎంత మాత్రమును పరిహరింపలేము. లేక విలంబము చేయలేము. ఈ కాలమునే శ్రీ అరవిందులు దైవముహూర్తము (Hour of God) అనెను. అతని వరణము నభ్యాకాంక్షించు మానవభవితవ్యతాహ్వానము విధాయకమగును. అది మానవుని భావిపరిణామమునకైఅత్యధిక సార్థకమగు సంకట పరివర్తన సమయమగును.

శ్రీమాత, శ్రీ అరవిందుల ననుసరించి ప్రస్తుతకాలమున పరిణామము వందు అట్టి సంకట పరివర్తన కేంద్రమును మానవాళి చేరుకొనినది. శ్రీ అరవిందులు వచించినట్లు ప్రస్తుతము మానవాళి తన భవితవ్యతావరణము మరుగు పడియున్న పరిణామాత్మక సంకటదశను అనుభవించుచున్నది. అట్లే శ్రీమాత కూడ వచించును; "భూమి చరిత్రయందు పరివర్తనసమయములున్నవి. అప్పుడు వేలకొలదియేండ్ల నుండిన విషయములు వ్యక్తము కాబోవు విషయములకు స్థానముమొసగవలెను. ప్రపంచ చైతన్యము ప్రత్యేక కేంద్రీకరణము తత్ప్రయత్నమును గాఢమొనర్చుట. అట్టి సమయములందు సంభవించును. చేయవలసిన పురోగతిరీతి ననుసరించియు, సిద్ధింపజేసికొనవలసిన పరివర్తనగుణము ననుసరించియు ఆ ప్రయత్నము మారుచుండును. ప్రపంచ చరిత్రయందు సమ

1 * జీవితము దివ్యము—పుట 1252 (1960 ముద్రణ)

2 * శారీరక పరిశ్రమవిద్య సంక్షేప సంచిక - (1953)

ముగా మనము అట్టి పరివర్తన స్థానమున నున్నాము. భూమిపై ఒక మానసిక వ్యక్తిని ప్రకృతి సృజించినది కావున, అట్లు అయినను ఈ చింతనాపద్ధతియందు విజ్ఞానమయ చైతన్యమును. వ్యక్తిత్వమును కలిగించుటకు ఇపుడు కేంద్రీకృత వ్యాపారము గలదు."

* * * *

విషయముల ఉన్నత లక్ష్యమునుండి ఈ వరణమేల విధాయకమైనదో వేఱొక కారణము గలదు. పరిణామమున నూతన సిద్ధాంతోదయము, సమకాలీనముగా క్రిందినుండి దానికై ఒక పిలుపును లేక ఒక స్పృహయు పైనుండి ఆ సిద్ధాంతముయొక్క ఒత్తిడియు, అవతరణమును ఆవశ్యకము. పరిణామమున ఆవిర్భవించుటకు నూతన సిద్ధాంతమగు విజ్ఞానమయ సత్యము చిరకాలము పూర్వమునుండియే అవతరించుట ఆరంభమైనది. కాని దాని వ్యాపారమునకు సంబంధించినంతవరకు అది సంసిద్ధిపరచు స్వభావము గలది. దాని ఒత్తిడి (స్పష్టముగా) బహిరంగముగా అనుభూతముకాలేదు. దీనికి కారణము అది రహస్యముగను తెరమరుగుగా నున్నది. కాని 1956 ఫిబ్రవరిలో ప్రపంచమున వ్యక్తమయినప్పటినుండి ఆ సన్నివేశము సమూలముగా మారిపోయినది. ఏలన ఇపుడు విజ్ఞానమయబుద్ధి భూమి ప్రవేశ ద్వారముకడ సమీపముగా, మిక్కిలి సమీపముగా నిలిచియున్నది. ప్రపంచము బాహ్యరజీవనమున ప్రకటముగా నావిర్భవింప తిరిగి తిరిగి పీడనమును కలిగించుచున్నది. అది అవిర్భవించిన 11 ఏండ్ల పిమ్మట ఆ కాలము ఇపుడు వచ్చినవి. ప్రతిరోధక దుర్భావమునుగాని ఉదాసీన నిర్లక్ష్యమునుగాని దాని మార్గమును నిలువ ఎంతమాత్రమును సహింపదు. ప్రతి మానవుడును, ప్రతిదేశమును దాని పిలుపును తప్పక వినవలెను. వారికి ఇచ్చిన అవకాశమును దుర్వినియోగమొనర్చుట లేక ఊ నిర్లక్ష్యమునకు ఫలితముల ననుభవించుట లేక దానిని సంపూర్ణహృదయముతో స్వీకరించుట గాని చేయవలెను. ఈ రెండు వికల్పములమధ్య వరణము అందరకును వివృతముగ నున్నది. వేఱొకదానిని వరింపరాదు.

* * * *

ఇపుడు ఈ వరణము ఏలవిధాయకమైనదో ఇంకను యితర కారణము గలదు. పృథివి అంతరవాతావరణమున విజ్ఞానమయ సత్యము అవిర్భావము

తోబాటు అసత్యపు అతీతామసము విపత్కారము, వినాశకరమునగు శక్తుల శీఘ్రప్రకాశితకూడా సంభవించినది. మానవాళి జీవితముపై యుగముల కొలది నున్న పట్టును. నిలుపుకొనుటకు ఆ విజ్ఞానమయ సత్యావిర్భవమును ప్రతిరో ధించి విఫలమొనర్ప ఆ యసత్యశక్తులు తీవ్రముగా ప్రయత్నించుచున్నవి. ప్రస్తుత కాలమున విజ్ఞానమయ సత్యమునకును, అసత్య శక్తులకును, మధ్య తీవ్ర ఘర్షణ జరుగుచున్నది. శ్రీమాత వచించిన రీతిగా, "ఈ ఘర్షణ. వైరుధ్యము ఆరోహక పరిణామ నిర్మాణాత్మక శక్తులకును,, అధికసమగ్ర దివ్య సాక్షాత్కారమునకును , నిగ్రహింపరాని ఉన్మత్తతాశక్తులకును అధికవినాశకరములు, శక్తివంతవినాశకరములు నగుశక్తులకును మధ్య స్పష్టము. (గణనీయము) ప్రముఖము దృశ్యము నగుచున్నది. ఎవరుముందు గమ్యమును చేరుకొందురని పందెమువంటిదియిది. తమ కార్యరంగముగా దాని నుపయోగించుచు విపత్కార దైవవిరుద్ధ శక్తులన్నియు, ప్రాణమయ ప్రపంచ శక్తులన్నియు, భూమిపై అవతరించినవనుకొనవచ్చును. ఈ ఏక కాలమునందే అత్యున్నతము అతిశక్తివంతమునగు ఆధ్యాత్మికశక్తులు భూమియందు నూతన జీవితమును కలిగించుటకు ప్రథమ పర్యాయము భూమిపైకూడ అవతరించినవని కొనవచ్చును. ఇదియే ఘర్షణను ఇత్యోధికముగా తీక్షము. ప్రచండము. దృశ్యము మాత్రమే కాక నియతావశ్యకము మొనర్చుననికొనవచ్చును. ఒకడు ఒక శీఘ్ర పరిష్కారమునకు వచ్చునని ఆశించుటకిదియే హేతువు."

ఈ ముహూర్తమునందు మానవాళీ స్వయముగా చేసికొను వరణముపై పాక్షికముగా ఈ ఘర్షణ నిర్గమనము ఆధారపడినది. మానవాళి తోనే మనః స్ఫూర్తిగా సత్యపక్షమునే వహించి దాని ప్రవర్తక శక్తులను అనుసరించినచో విపత్కార వినాశావశ్యకములేకుండ మానవజీవితము నందును, ప్రపంచము నందును అపుడు సత్యము సుప్రతిష్ఠతమగును. కాని దాని యధమ ప్రకృతి అంధత్వముచేతను వ్యత్యస్తత చేతను అసత్యశక్తు పక్షమవలంబించినయెడల తనపై దారుణ వినాశములను తెచ్చుకొనవచ్చును. ఏలనన విజ్ఞానమయ సత్య శక్తి పృథ్విపై తత్త్వాలనా ప్రతిష్ఠాపనకు ఎట్టి ప్రతిరోధనమును ఎంత మాత్రమును సహింపదు. ప్రతిదేశమును మానవుడును ఈ రెండు శక్తుల మధ్యనొక మౌలికవరణము ఇపుడు ఒనర్చుట ఆవశ్యకము. ఇది ప్రస్తుతము ప్రపంచ రంగమునందు దారుణద్వంద్వ యుద్ధమునందు వ్యాపృతమైనది.

వరణము విధాయకమని శ్రీమాత చెప్పుటకు అపుడు ఇవియే కారణములు. దానిని చెప్పుటయందు ఆమె ఏ స్వచ్ఛందాంశమును గాని ఆకస్మికాంశమునుగాని సూచింపలేదు కాని మానవుని యున్నతపరిణామమునకు ప్రాథమికాంశములకు మన ఏకాగ్ర ఆసక్తిని మరల్చుచున్నది. విధాయకమని అడుగబడిన వరణము కాలశక్తియొక్క సమీపించిన యాహ్వానము. పరిణామాధిపతిగా కాలశక్తి ఎంతమాత్రమును కపటమును, పరిహారము లేక దాంభికఅస్పష్టార్థమును అనుమతింపదు. కాని ప్రపంచమునకు వ్యక్తమగుటకు ఇపుడు సమీపమగు ఒత్తిడి కలిగించుచున్న సత్యమును స్వీకరించుటకాని దానిపిలుపును వినకుండుటవలన అవకాశమును దుర్వినియోగ మొనర్చుటవలన కలుగు విపత్కరఫలితముల గ్రహించుటకు కాని మానవులపై దేశములపై. ఖండములపై నిర్వ్యాజాఋజుమౌళిక నిర్ణయమును చేయు ఒత్తిడి కలిగించుచున్నది. శ్రీ అరవిందుల మాటలయందు "దివ్య ముహూర్తము వచ్చినప్పుడు నిద్రయందుండిన, లేక దైవకాలమును ఉపయోగింప సిద్ధముగానుండని దేశము, లేక మనుష్యుడు, సంతోషముగ నుండజాలడు. ఏలన స్వాగతమునకై దీపము సిద్ధముగ చేయబడలేదు. ఆ పిలుపు వినకుండ చెవులు మూసివేయబడినవి. కాని బలముగ సిద్ధముగ నున్నవారు ఆ శక్తిని వృధా పరచుట. లేక ఆ క్షణమున దుర్వినియోగము చేయుట జరిగిన మూడురెట్లు క్లేశమునకు పాల్పడుదురు. వారికి మహానాశముగాని, తీరని నష్టముగాని సంభవించును."

ఈ వరణమొనర్చుట, ఈ విజ్ఞానమయ సత్యమును గ్రహించుట. అనగా శ్రీ అరవిందుల సంపూర్ణపరివర్తనా యోగమును తత్ఫలితమున ఆచరించుట. 1928 నవంబరులో శ్రీ అరవిందులు వ్రాసిన ఒక దీర్ఘ లేఖయందు శ్రీ అరవిందుల యోగము చేయగోరు ఎల్లవాడు ఏ వికల్పములమధ్య నిపుణవరణము చేయవలసియుండునో అతడు మిక్కలి స్పష్టముగా తెల్పెను.

## నిర్ణాయకవరణము

"దైవమునందు తమ్ము గాంచుటకై దానినిగూర్చి సంపూర్ణోత్సాహము గలవారును తమ స్వల్ప మానవాహంకారమును. దాని అభ్యాకాంక్షలను నిర్మూలించుకొన సిద్ధముగా నున్నవారును తుదివరకును ఈ యోగము నొనర్పవచ్చును.

లౌల్యభావముతోడను, శైథిల్యభావముతోడను ఇది యొనర్పబడజాలదు. ఈ కార్యము మిక్కిలి ఉన్నతము, క్లేశకరము అధమప్రకృతియందలి విరుద్ధశక్తులు, స్వల్పవివృతినిగాని స్వల్పానుమతిని అవకాశముగా చేసికొనుటకు మిక్కిలి సంసిదముగ నుండును. మానవ ప్రకృతి పేరట సామాన్యముగా సమర్థితములగు మానవబుద్ధియొక్క భావముల కర్కశ ఆత్మప్రతిపాదన లేక వక్తి అధమ ప్రకృతియొక్క అభ్యాకాంక్షల, ప్రకృత్తుల కపటముల పైన్వైరాసక్తియున్నచో యోగమునకు తగరు. దివ్యసత్యముతో అజ్ఞానమయములగు ఈ యథమ విషయములతో, లేక ఈ యోగమార్గమున అసమతమగు అధమసత్యముతో తాదాత్మ్యమొంద నీవు నిర్బంధముగా వచించుచో ఈ యోగమార్గమునకు పనికి రావు. నీ వెనుకటి జీవితమునకు, దాని మానసిక, ప్రాణమయ శారీరక కల్పన లకు (ఘటనలకు) అలవాటులకు దృఢముగా అవలంబించియుండుచో ఈ యోగమునకు పనికిరావు. తన వెనుకటి జీవితములను, వెనుక అవిరతము విడిచివేయవలెను. ఎల్లప్పుడు ఉన్నతోన్నత చేతనస్థాయినుండి చూచుచు, పని చేయుచు, జీవించుచుండవలెను. నీ మానవబుద్ధికిని, ప్రాణమయాహంకారము నకు స్వేచ్ఛకై నీవు దృఢముగా వచించుచో నీవీయోగమునకు పనికిరావు. సామాన్య మానవజీవితము గడపనంతకాలము. అట్లాతడు ఎన్నుకొనినచో మానవ వ్యక్తిభాగములన్నియు తత్స్వీయమార్గమున స్వీయవిపత్సంకటములకు (అభిముఖుడై) సంసిద్ధుడై తమ్ము వ్యక్తీకరించుకొని తృప్తిపరుచుకొనవచ్చును. కాని యోగమార్గమున ప్రవేశించుటకు ఈ మానవవిషయముల స్థానమున ఒక మహత్తర సత్యశక్తి నియమముల నిలుపుట ప్రయోజనముగా గలవాడును, దివ్యశక్తికి సమస్తహృదయమును సమర్పించుట తన పద్ధతిగా గలవాడును అయినను (కొలది అజ్ఞానమయ వైశ్వశక్తులకు వశమగుటతప్ప మఱేమియుకాని) స్వేచ్ఛయని పిలువబడు దీనిని ఆకాంక్షించుట అంధవైరుధ్యమున ఆసక్తమగుట, ద్వివిధజీవితమును గడుపు స్వామ్యమును అభ్యాకాంక్షించుట.

యోగసాధకులమని ప్రకటించుకొనినవారు, దాని సిద్ధాంతమును ప్రయోజ నమును ప్రతిరోధించి, తిరస్కరించి పరిహసించు అజ్ఞానమయశక్తులకు తామే కేంద్రములు, సాధనములు, ముఖములుగా నగుటకు ఎల్లప్పుడు నారంభించినచో స్వల్పముగాకూడ నొనర్పజాలరు. ఒకప్రక్క విజ్ఞానమయ సాక్షాత్కారమున్నది. భూమిపై ఇప్పటికి సిద్ధించినదానికంటెను అతిమహత్తర సత్యముయొక్క జ్ఞాన

శక్తులును, విజ్ఞానమయ దైవప్రభావమును ఆచ్ఛాదించుచు అవతరించుచున్నవి. కాబట్టి దాని శాశ్వత వాస్తవములనిమాత్రము తలంచు మానవబుద్ధి, దాని తర్కమున కతీతముగా ఒకటి గలదు. మానవబుద్ధి తన చాలని స్వీయసాధనములచే విజ్ఞానమయ శక్తి వృద్ధి స్వభావ మార్గ ప్రక్రియలను భావింపజాలనట్టి లేక గ్రహింపఁజాలనట్టి లేక బాలోచితప్రమాణములచే నిర్ణయింపరానట్టి ఒకానొకటి గలదు. ప్రతిరోధములున్నను భౌతిక చైతన్యమునందును భౌతిక జీవితమునందును వ్యక్తమగుటకది క్రింద ఒత్తిడి కలిగించుచున్నది. వేఱొకప్రక్కస్వత్వప్రతిపాదకమగు ఔద్ధత్యము, అజ్ఞత, నిగూఢత; నిస్తేజస్కత లేక అసమర్ధమగు దుర్దాంతత్వము అంతటితో అధమప్రాణమయ స్వభావము స్వీయ దీర్ఘప్రపత్తికై విజ్ఞానమయ ప్రకాశావతరణమునకు ప్రతిరోధముగా నిలిచినది. ఇది అధమప్రాణమయ స్వభావము. విజ్ఞానమయమగు చైతన్యము, సృజనము యొక్క అతిమానుషమగు చైతన్యము, సృజనముయొక్క ఏ వాస్తవ యదార్థమునందు కాక ఏ వాస్తవ సంభవతయందును విశ్వసింప తిరస్కరించును. లేక అసలు అది యుండినచో స్వీయ స్వల్ప ప్రమాణముల ననుసరింపవలెనని అభ్యాకాంక్షించుట ఇంకను అసంబద్ధముగా నుండును. దైవసాన్నిధ్యమును తిరస్కరించుచు, దానిని నిరాకరించు ఎల్లవిషయమును లోభముచే గ్రసించును— ఏలన ఆ సాన్నిధ్యములేక కార్యము అసాధ్యమని దానికి తెలియును— దైవమును తిరస్కరింప స్వీయములగు భావములను, నిర్ణయములను, వాంఛలను, ప్రవృత్తులను మొదలైనవానిని బిగ్గరగా దృఢముగా పచించును. ఇవి ఖండింపఁబడినచో సంశయము, తిరస్కారము కించపరచు విమర్శనము, విప్లవము, అవ్యస్తతను బహిరంగముగా ప్రసారముచేయుచు పగతీర్చుకొనును. ఇపుడు సన్నిధియందున్న రెండు విషయములు ఇవియే.

ఏలన దివ్యసత్యము అవతరించుటకు వ్యతిరేకముగా ఈ ప్రతిపక్షత, ఈ వృధా నిరోధము, పరివేష్టినము శాశ్వతముగా మనజాలదు. ఎల్లవారును ఏదియో యొకపక్షము, సత్యపక్షము లేక తద్విరుద్ధపక్షమునో అవలంబింపవలెను. విజ్ఞానమయ సాక్షాత్కారము అధమమగు అజ్ఞతతోగూడ వసింపఁజాలదు. స్వభావద్వైవిధ్యమున నది అవిశ్రాంతతృప్తితోనుండుట అసంగతము.

———

# శ్రీ అరవింద దర్శన వైశిష్ట్యము

—ఇ. గంగన్న

మానవున్నిగురించి తెలిసికోవలసిన ఆవశ్యకత యీనాడు మరీ యెక్కువైంది. ఎందుకంటే మానవుడు తానిప్పుడు అనుకరిస్తున్న నాగరికత ఆనంద దాయకంగా లేదు. ఈ నాగరికత మానవుడిని సుఖదాయకమైన స్థితికి కొనిపోవడంలేదు. నాగరకతపేరట తాను సృష్టించుకొన్న శృంఖలాలలో తగుల్కొని, వుక్కిరిబిక్కిరియై పతనమౌతున్నాడు. అత్యంత అధునాతనమైన నాగరికతా జీవితాన్ని అనుభవిస్తున్నామని అనుకొంటున్న అమెరికావంటి దేశముల పరిస్థితి యేమిటి?

నేటి యా మానవుడు ప్రాణములేని పదార్థాలను గురించి ఆలోచిస్తూ తన్మయత్వంపొంది తన సంగతినే తాను మరచిపోయినాడు. బయటి ప్రపంచము వలెనే తన శరీరం తన చైతన్యం కొన్ని నిబంధనలమీద ఆధారపడి వృద్ధి చెందుతుందని గ్రహించలేక వాటికి విరుద్ధంగావుండే నాగరికతను సృష్టించుకొని ఖిన్నుడై నిస్సహాయస్థితిలో నిలచిపోయి దురపిల్లుచున్నాడు. అనగా మానవుని సహజ స్వభావానికి విరుద్ధంగా ఈ ప్రాపంచక జీవనవిధానం పరిణితిచెంది మానవునిపాలిటి ఘోరకలిగా తయారై మానవునిలోని వ్యక్తిత్వాన్ని మట్టుపెట్టడానికి దారితీసినదని చెప్పనగును.

ఈ పరిస్థితి మారిపోయి మానవుడు తేజోవంతుడు కావలెనంటే, ప్రపంచానికి లేదా ఈ ప్రకృతికి, మానవులకు, మనస్సునకు వున్న పరస్పర సంబంధాలను క్షుణ్ణంగా తెలిసికోవలెను. మానవుడు అతి ప్రధానముగా పరిగణింపదగినవాడు. అతడు పతనమైతే ఈ ప్రపంచమే పతనావస్థకు దిగజారిపోతుంది.

ఈ సృష్టికంతటికి ఆధారభూతమై యొప్పు ఒకేఒక 'సత్' పదార్థమొకటి యున్నది. అది తననుండి ఉత్పన్నమగు సకల ఆవిర్భావములకు, రూప విశేషములకు మిన్నగాను, నిత్యముగానువుంటూ విలసిల్లుతున్నది. ఆ 'సత్' పదార్థము ప్రతివస్తువునందును వుంటూ, ప్రతివస్తువునకు తనకుగల స్థితిని, శక్తిని, విలువను అదియే ప్రతిపాదిస్తున్నది. ఈ విశ్వము ఆ 'సత్' శక్తియొక్క,

యొక ఆవిర్భావ విశేషమే, ఈ విశ్వస్థితిలో అంతర్భూతంగా ఒకానొక సత్యము. ఒకానొక శక్తి అనగా ఒక బృహదాత్మ, లేక విశ్వాత్మ వున్నది. మానవాళి ఈ విశ్వమునందు ఆ 'సత్' పదార్థము యొక్క ఒక అవిర్భావ విశేషమే. తదను గుణముగా యీ మానవస్థితికి 'సత్' శక్తి ప్రతిపాదితమైన ఒక ఆత్మ — మాన వాత్మ కలదు. మానవజీవిత సరళిని నిర్దేశించుచున్నదదియే. అనగా ప్రతి వ్యక్తియు, ఆ 'సత్' శక్తి ప్రతిపాదితమైన ఆత్మను పొందిన ఒక రూపము అన్నమాట.

పరిణామక్రమము ననుసరించి, మానవుడు అభివృద్ధి చెందుచున్నాడని, ఈ అభివృద్ధి మానవుడు వ్యక్తిగతంగా, సాంఘికంగా పరిపూర్ణతను పొందే దాక జరుగుతుందని చెపుతారు. చలనంలేని పదార్థమునుంచి ప్రాణము వచ్చిన దని ప్రాణమునుంచి తన్నుతాను తెలిసికొనే జ్ఞానం వచ్చిందని, ఈ జ్ఞానం మానవునిలో, పరిపూర్ణ స్థితిని అందుకోవటానికి ప్రయత్నిస్తూవుందని చెప్పు చున్నారు. పరిణామము ఇంతటిలో ఆగిపోయేదికాదని పరిణామములోనికి యింకొకదశ రాబోతూ వున్నదని ఆదే అతీత మానసశక్తి సమన్వితదశ అని కూడా శ్రీ అరవిందులు వక్కాణించారు అనగా ఈ పరిణామ క్రమములో ఒక అంతస్తు కారణంగా మరొక అంతస్తు వస్తూ వుందన్నమాట.

తత్వదర్శనములలో శ్రీ అరవిందుల దర్శనమునకుగల స్థానం అత్యంత విశిష్టమైనదనిచెప్పకతప్పదు. ఒకవిధంగా అది అపూర్వదర్శనమని కూడ చెప్ప నగునేమో ! మనస్సున కతీతమైన అతిమానస విజ్ఞానముకూడ ఆవిష్కరణము చెంది తత్ఫలితముగా దివ్య మానవజాతి పృథ్విపై విలసిల్లుట మూలమున జగత్సృష్టికొక సాఫల్యం సిద్ధించవలసి వున్నదని శ్రీ అరవిందులు తమ దర్శన ములో నిరూపణ చేయుట ద్వారా, వారి దర్శనమునకు యెనలేని విశిష్టత చేకూరినదనాలి. జగత్తున కీ విధమైన పరమార్థ నిరూపణము పూర్వదర్శనకారు లెవ్వరు చేసి వుండలేదు.

అట్లని మరేదో ఒక క్రొత్త సిద్ధాంతమును కనుక్కొన్నారని చెప్ప నగునా ? లేదు. "వారు యే పూర్వ సిద్ధాంతమును నిర్మూలించలేదు. అన్ని పూర్వసిద్ధాంతముల అవసరాన్ని నిర్వచించి వాటిని సమన్వయపరచి ఒక పూర్ణ సిద్ధాంతాన్ని సృష్టించి, వినూతనమైన దృష్టిని కల్గించినారు. ప్రపంచమున

ప్రస్తుతం మనకు పరస్పర విరుద్ధంగా గోచరించుచున్న వాదములన్ని అందులో వున్నాయి. అయితే మనకు కనబడుచున్న వైరుధ్యము తొలగించబడినది. వీటి నన్నిటిని తనలో యిముడ్చుకొని ఒక్కటిగా కలుపుకొని పోగల్గిన సిద్ధాంత మొకటి యేర్పడినది.

శంకరభగవత్పాదుల అద్వైత దర్శనమునందు జగత్తు అవిద్యగా అజ్ఞాన కల్పితమైన భ్రమగా పరిగణింపబడినది. తర్కముచేత అద్వైతమును సాధించుటకు జగత్తును మిధ్య యని చెప్పవలసి వచ్చినది. పారమార్థిక సత్యమని వ్యావహారిక సత్యమని సత్యమును రెండుగా విడదీయవలసి వచ్చినది. సచ్చిదానంద లక్షణోపేతమైన నిర్గుణ, నిరంజన, నిరాకార నిష్క్రియ పరబ్రహ్మమొక్కటే పారిమార్థిక సత్యము. మాయోపాధకుడైన ఈశ్వరునితో సహా జగద్వ్యవహారమంతా మిథ్య. అనగా యీ జగత్తు అజ్ఞానస్థితిలో వున్నంతకాలం వున్నట్లు కనిపించి జ్ఞానావబోధ కల్గినంతనే కాకుండ పోవునది. అపరిహార్యంగా ప్రస్తుతం అనుభవిస్తూ వున్నది గనుక, యీ వ్యావహారిక దశను గుర్తింపక తప్పదు. ఈజంజాటములోనుంచి బయటపడగల వుపాయమును వెతుక్కోవడం మాత్రమే కర్తవ్యం కాగా జగజ్జీవన మొక జడకల వంటిదైనది. చిత్తశుద్ధిని చిత్తైకాగ్రతను సాధించి ఇవి వుత్తమాధికారముమ చేకూర్చిన మీదట జ్ఞానబోధ ద్వారా అజ్ఞానవిముక్తుడైనప్పుడు నిర్గుణ బ్రహ్మైక్యరూపపరమార్థమును పొందవలసివుంటుంది. కాగా జగద్వ్యవహారము నొక దుస్స్వప్నము వంటిదిగా శంకరాద్వైత దర్శనము నిర్దేశించుచున్నదనే విషయం సుస్పష్టము.

బౌద్ధ దర్శనం సహా యించుమించు యిటువంటిదే. జగత్తును మిథ్యగా నిరసించడములో వుభయ దర్శనములు ఒకదానికొకటి తీసిపోలేదు. కాని జగత్తును త్రోసిపుచ్చగా మిగిలేది అఖండ సద్వస్తువని అద్వైత దర్శనం నిరూపించగా దానిని వట్టి శూన్యముగా బౌద్ధదర్శనం పేర్కొన్నది. ఒకానొక దివ్యానుభూతిని పురస్కరించుకొనియే అద్వైత దర్శనంకాని, బౌద్ధదర్శనంకాని ప్రవర్తిల్లినవనే విషయం యిచట గమనార్హం. మనస్సునకతీతమైన ఆ యనుభూతి ఒకరికి పరమానందరూపమైన సత్తుగా గోచరించగా : మరొకరికి పరమశాంతిరూపమైన అసత్తుగా తోచింది. జగత్తును నిరసించి వట్టి మిథ్యగా కొట్టిపారవేయడంనందు ఉభయ దర్శనములు సమజ్జీవులే నన్నది గుర్తింప

నగును. ప్రాపంచిక వ్యవహారమున యెట్టి పరమార్థము. ఆ దర్శనకారులకు బోధగట్టలేదు.

జగత్తును మిథ్యగాకాక సత్యముగా పరిగణించిన ద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాద్వైతశైవ, శాక్తాది దర్శనములు కూడ శ్రీ అరవిందులు యీ పృథ్వీ జీవితమునకు సూచించిన పరమార్థమును గుర్తించలేదనియే చెప్పనగును.

పృథ్వీజీవనము పరమాత్మను పొందుటకు సాధన భూమి మాత్రమే యని, సాలగక్య, సాన్నిధ్య సాయుజ్య, సాధర్మ్యముక్తులన్ని లోకాంతరము లందు బడయవలసినవని, సృష్టి విలాసం భగవల్లీలా విశేషమని, పృథ్వీ జీవనము భగవల్లీలాంతర్భాగమైనప్పటికిని దుఃఖమయమైనందున పరిత్యాజ్యయే నని కడపటికి వదలివేయబడవలసినదిగా వుంటున్న ఈ ప్రాపంచిక జీవనమున గల పరమార్థము యేమిటని. పూర్వ దర్శనముల సిద్ధాంతమైనట్లు తెలియు చున్నది.

శ్రీ అరవిందులు తమ దర్శనమునందట్లుకాక, పృథ్విపై దివ్యజీవన విలసనము యేర్పడగల పద్ధతిలో ప్రకృతి క్రమానుగతవికాస కార్యక్రమము నడుస్తూ వున్నదని వక్కాణించినారు. మనః ప్రాణశరీర ప్రవృత్తుల నతిక్రమించి యే కొందరో ధన్యాత్ములు దివ్యభూమికల నందుకొనుటయే కాదు; ఆ దివ్యానుభూతులు క్రిందికి అవతరించి, మనఃప్రాణ శరీరములను రూపాంతరము చెందవలసి వున్నదని ప్రకటించిరి.

నేటి ప్రకృతి శాస్త్రజ్ఞుల (Anthropologists) దృష్టిలో జడద్రవ్యము, జడశక్తియే సకల జీవపరిణామక్రమమునకు మూలం. కాని శ్రీ అరవిందులు ఆ జడద్రవ్య శక్తులకు ఆధారమైన దివ్యచైతన్యమును గుర్తించిరి.

ఇట శ్రీ అరవిందులు తన "భాగవతజీవనము" (The Life Divine) గ్రంథమున ప్రారంభ ప్రకరణములో పేర్కొన్న మాటలు గమనార్హములు.

If it be true that spirit is involvod en Matter and appa rent native is secret God, then the manifestation of the Divine in himself and the realisation of God within and with-

out are the highest and most legitimate aim possible to man upon earth."

(ప్రాణము పదార్థమున ఇమిడివున్నమాట నిజమే. అయితే కనపడే ప్రకృతి కానరాని భగవంతుడే అయితే తన లోపలా, బయటా కల భగవంతుని గురించి తెలుసుకోవటానికి చేసెడి ప్రయత్నమే మానవుని మహోన్నతమైన ఆదర్శము.) (The Human Aspiration - Chapter-I).

ఆ దివ్యచైతన్యము తన మతానుక్రమ వికాసగతిలో జడమునందు ఆవిష్కరింపజేసుకొంటూ పోయెడి ప్రయత్నమున ఇంతవరకు చేరుకొన్న స్థాయియే ఈ మానవుడని; అతిమానస విజ్ఞానావతరణము ద్వారా దివ్యమానవ ఆవిర్భావమే దీని తరువాత ఘటిల్లవలసి వున్నదని, ఆయన సందేశము. శ్రీ అరవింద దర్శనమే కారణమున అత్యంత విశిష్టమైనదిగా కన్పట్టుచున్నదని చెప్పవలసి వచ్చినదో దీనివలన సువిదితము.

సృష్టియందీ దర్శనం తనకే తొలుతగా కలిగినట్లు ఆయన చెప్పడంలేదు. ఋగ్వేదమున దీని సూచనలు కలవని ఆయన అంటున్నారు. కాని, కాలగతిలో వేదార్థనిర్ణయమున ఆ సూచనలు మరుగుపడిపోయినవని, వేదమున జ్ఞానకాండ యని చెప్పబడు ఉపనిషద్భాగమునకేకాక కర్మకాండయని చెప్పబడు మంత్ర భాగమునకు కూడ పట్టి కర్మపరమైన అర్థమునుమించి జ్ఞానపరమైన పరమ నిగూడార్థము కలదని నిరూపణచేస్తూ ఆయన పెక్కు ఋక్కులకు తానొక ప్రత్యేకమైన అర్థవివరణం చేసివున్నారు. వేదవిజ్ఞానమునంతటని అవలోకన చేసినపిమ్మట ఆవిర్భావమైనదే ఆయన దర్శనంకూడ. అంతేకాని అది కేవలము బుద్ధికల్పితమైనది కాదని ఇతర ముఖ్యదర్శనములవలెనే అదియు బుద్ధి నతీతించిన దివ్యానుభూతి ననుసరించి రూపొందినదేనని మనమిచట గుర్తింపనగును.

అతీంద్రియ, అవాఙ్మానస గోచరతత్వనిరూపణము చేయుటలో తర్కబద్ధమైన బుద్ధికి గల పరిమితిని అసమర్థతను ఆయన గుర్తించారు. కావుననే ఆ తత్వనిరూపణమునందాయన తర్కమున కతీతముగా సాగిపోవలసివచ్చినది. ఇతర దర్శనకారులట్లుగాక పరతత్వమును తమ తర్కమునం దిముడ్చుటలో ఆ పరతత్వమునకే పరిమితిని కల్పించినవారైనారని చెప్పనగును. పరతత్వ

మును నిర్గుణం నిరాకారం నిష్క్రియ అని నిర్వచించి తక్కినదెల్ల మాయగా, వాస్తవముకానిదానిగా కొట్టివేయడం పరతత్వమునకు ఒక సంకుచితస్థితిని కల్పించడమే అవుతుంది.

నిర్గుణత్వాది లక్షణములతోకూడిన పరతత్వము పరతత్వపు ఒక పార్శ్వము మాత్రమే. అది కడు ముఖ్యమైన పార్శ్వమే కావచ్చు. కాని అది పూర్వవస్తువు కాదనుటకుమాత్రం సందేహంలేదు. ఏలనంటే నిర్గుణం నిర్గుణంగా వుండిపోవడంలేదు. సకలగుణములు దానిలోనుండియే బయలుదేరుచున్నవి. ఎట్లు బయలుదేరుతున్నవనేది ఒక జటిలసమస్య. నిర్గుణములో, సగుణం అంతర్లీనమై వుండకపోతే దానిలోనుండి బయలుదేరుటెట్లు? బయలుదేరు తున్నట్లు కనిపిస్తుందేకాని వాస్తవంగా బయలుదేరడంలేదనేది సరియైన పరిష్కారం కానేరదు. ఏలనంటే ఆ విధమైన అన్వయమును సాధించ పూనుకోవడంలో పరతత్వపు మరొక ముఖ్యపార్శ్వమును చులకనచేయడం అవుతున్నది. అయితే తర్కబుద్ధికి పరస్పర విరుద్ధములుగా గోచరించు ఈ ఉభయపార్శ్వములనూ ఒక్కటిగనే పరిగణించడమెట్లా? తర్కబుద్ధి ప్రతిపాదించే ఈ వైరుధ్యమును సమయింపజేయడానికే, ఒకదానిని మాయగా కొట్టివేయడం జరుగుతూవున్నది. కాని, బుద్ధికి అతీతమైన అతిమానస దృష్టిలోనుంచి పరికించినపుడు ఈ వైరుధ్యము దానంతటదే సమసిపోగలదని శ్రీ అరవిందులు వక్కాణించి యున్నారు. అసలు విషయమేమిటంటే బుద్ధికి అతీతమైన తర్కమును అవలంభించి ఆ పరతత్వం సగుణ, నిర్గుణముల కతీతమై విలసిల్లుతూ ఉభయమూ తానే యగుచున్నదని అనుకోగల్గితేతప్ప, ఈ సమస్యకు సరియైన పరిష్కారం సాధించబడినట్లు కానేరదు. అనగా అది కేవలం పరతత్వమే కాదు. పరాత్పర తత్వము అన్నమాట.

బ్రహ్మమనగా నిర్గుణబ్రహ్మమే. సగుణబ్రహ్మము కాదు. అట్లని, సగుణ బ్రహ్మము అవాస్తవికము అని అనుకోరాదు. నిర్గుణ, సగుణబ్రహ్మములు ఈ రెండునూ వాస్తవికములేకాక ఆ పరాత్పరతత్వముయొక్క రెండు ముఖములు కూడాను. ఈ రెండునూ తాను కాగల్గుచున్నదే ఆ పరాత్పర పరబ్రహ్మము. తాను తానుగా వుంటూ, అన్నియూ తానేయై అది విలసిల్లుచున్నది. "సోకామ యత బహుస్స్యాం ప్రజాయేయేతి" అన్నట్లు అనేకముగా కావలెనని సంకల్పించి

నదియు అదియే. అట్లు సంకల్పించగల శక్తి దానియందే ఇమిడియున్నది. అదియూ, ఆ శక్తియూ ఒక్కటే. సూర్యునినుండి తేజస్సును విడదీయడానికి వీలులేనట్లే దానినుండి ఆ శక్తిని వేరుచేయడానికి వీలులేదు. కాని విడదీసే స్వభావంగల బుద్ధి కడు సాహసంతో దానిని విడదీయడానికి పూనుకొని శివుడు వేరు, శక్తి వేరు. శక్తికంటె శివుడు గొప్ప లేక శివునికంటె శక్తి గొప్ప అని వ్యాఖ్యానించడం జరుగుతుంది. ఈ పొరపాటును పరిహరింపచేయు వుద్దేశ్యము ననే అర్ధనారీశ్వర రూపకల్పనను మన పూర్వులు చేసివున్నారు. అయినప్పటికిని బుద్ధి, బుద్ధిమాలినదై ఆ తప్పును పదే పదే చేస్తూవుంటుంది.

కాగా తాను అనేకం కావాలని అభిలషించిన ఆ పరాత్పరతత్వం తన పరాశక్తి ప్రాభవంచేత అసంఖ్యాక జీవాత్మలుగా భాసిల్లినది.

'పరాప్రకృతిర్జీవభూతా' అని భగవద్గీత నిర్దేశించినదియు ఇదియే. శ్రీ అరవిందులు దీనిని పురస్కరించుకొనియే, ఆ పరాత్పరతత్వం ఏకము అనేకముకూడా అని వక్కాణించి, ఆ పునాదిపైననే తన దర్శన సౌధమును నిర్మించిరి. సృష్టి ప్రారంభమునందే అనేక జీవాత్మలతోకూడిన పరమాత్మ ఉనికి అనంతకేంద్రములతో విలసిల్లు ఒకే మహాచైతన్యశక్తిని పోలినది. ఏకత్వములోని ఈ నానాత్వమే జగత్సృష్టిలోని నానాత్వ విలసనమునకంతకునూ మూలము. అనంత వైఫల్యముతో తనను తాను అభివ్యక్తమొనర్చుకొని, అనంతరీతులలో తనను తాను చూచుకొంటూ క్రీడించుటయే ఈ జగన్నాటకము. లేదా విశ్వలీలయందలి ఆంతర్యము, ఆత్మ చైతన్యస్థాయినుండి జడత్వ స్థాయి లోనికి క్రిందికి దుమికి ఆ తర్వాత, ఆ జడభూమియందే యది (ఆత్మ) చైతన్య మును క్రమముగా వికసింపచేసుకొను మహాప్రస్థానమే ఈ విశ్వలీల, అన్న మయ, ప్రాణమయ, మనోమయ ప్రకృతిపురుషుల ఆవిష్కృతి ఈ ప్రస్థాన వశమున సంభవించినదే.

'జడభూమియందే ఆత్మచైతన్య విలసనం' అనే వాక్యము నిచట గమనించవలసి వున్నది. ఏకారణమునైననేమి, జడత్వస్థితిలో పడిపోయిన జీవుడు తన ఆత్మచైతన్యమును యెట్టకేలకు గుర్తించి, ఆ నిజస్వరూపములోనికి రివ్వున ఎగిరిపోవలసి వున్నదని అదియే మోక్షమని అట్టి మోక్షసాధనయే ఈ శరీర ధారణకు పరమలక్ష్యమని ఇతర దర్శనముల సిద్ధాంతమై యున్నది. కానీ

వాటి దృష్టిలో ఆ ముక్తిపదవి నందుకొన్నమీదట, యిక యీ శరీరేంద్రియ సంఘాతముతో పనిలేదు. ఇవన్నీ తుచ్ఛములే. లేక తాత్కాలికముగా వుపయోగించుకొని పర్యవసానమున విసర్జించవలసినవే. అనగా ఇతర దర్శనములందు భౌతిక శరీరేంద్రియ సంఘాతమునకు ప్రత్యేక సాఫల్యమేదియును లేదు. శ్రీ అరవింద దర్శనమట్లుగాక ఈ భౌతిక శరీరేంద్రియ సంఘాతమునకు కూడ సాధించవలసిన సాఫల్యసిద్ధి కలదని నిరూపిస్తున్నది.

మానవుని ఆధ్యాత్మిక సంబంధమైన సాధనకు నాయకత్వం వహించవలసినది బుద్ధి కాదు. కొంతవరకది ఒక విధమైన మార్గదర్శి మాత్రమే. అందువలన సాధనకు నాయకత్వం వహించవలసినది మనలో మరుగుపడివున్న ఇచ్ఛాశక్తి, తపశ్శక్తి. ఈ ఇచ్ఛ మనోవాంఛితం కాదు. హృదయాభిలాషయుకాదు. ఈ ఇచ్ఛ, బహుప్రకారములుగా తనను తానభివ్యక్తము చేసుకొంటున్న పరమాత్మ చైతన్యపు పరమేచ్ఛకు సంబంధించినదై మన అంతరమున నిగూఢమై యున్నది. బుద్ధికంటె అది జ్ఞానవంతమైనదది. అది వెలువడి సాధనకు సారథ్యము వహించునపుడు బుద్ధి, హృదయము కూడ అద్దానికి వశవర్తులై మెలగవలసినవి మాత్రమే. అది మరుగున పడివున్న స్థితిలో మానవ విభాగములలోనికెల్ల బుద్ధియే ఆధిక్యత నందినదిగ భావించుకొని, జ్ఞాన సాధనపేరిట నేతినేతి — ఇది కాదు — ఇది కాదు అనుచు శరీరము, ఇంద్రియములను ప్రాణప్రవృత్తులను హృదయమును త్రోసిపుచ్చి తుదకు తనను కూడ తాను త్రోసిపుచ్చుకొనుచూ తనకు ఆవలనున్న నిశ్చల, నిర్వికల్ప ఆత్మచైతన్యమున లీనమగుట కుచ్ఛహించుచు అదియే పరమ సాఫల్యసిద్ధియని అనుభవించుట సంభవించుచుండును. శ్రీ అరవిందుల దృష్టిలో అది పూర్ణ సాఫల్యసిద్ధి కాదు. పరానుభూతియే అయినను పరాత్పరానుభూతి కాదు. పరమును పొందవలెననెడి తొందరపాటులో ఈ జ్ఞానసాధన — సమాధిస్థితిలో కనులు మూసుకొనుచు, నడుమ విస్తరించియున్న దివ్యభూమికలవైపు చూడనైన చూడక అనంతములోనికి లంఘించుట పర్యవసించుచున్నది.

ఇట్లుగాక బుద్ధికి ఆవలనున్న దివ్యసీమలలోనికి ఓపికతో నెమ్మదిగా పయనిస్తూ పోయిన తరి అతిమానస విజ్ఞాన భూమికలలోనికి మనము ప్రవేశింపనేర్తుమనియు అనంతుని-అంతము నెఱుగని మహదైశ్వర్య సమృద్ధి నంతటిని

అచట మనము దర్శించి, స్పృశించి అనుభవించ గల్గుదుమనియు శ్రీఅరవిందులు వక్కాణించారు. అచట మనకు కల్గెడి ఆత్మానుభూతి కేవలం అచల నాత్మానుభూతి కాదు. వ్యష్ట్యాత్మకము సర్వాత్మకము ఉభయాతీతమునై విలసిల్లు శక్తిమయాత్మానుభూతి కూడాను. ఇదియే భూపరాత్పరానుభూతి. తన వివిక్త భావనలచే మనస్సు దీనిని వ్యక్తపరుపజాలదు. మహర్షులు, మహాయోగులు దివ్యప్రబోధపూర్వకముగా చేసిన వర్ణనల నన్నిటిని కలిపి పరిశీలించినను దాని మహదైశ్వర్యమును వర్ణించినట్లు కానేరదు. ఆ పరాత్పర తత్వము మూర్తామూర్తములకు అతీతమై అనంత గుణములు తానే యగుచున్నది. ఏకత్వానేకత్వ భేదమునకతీతమై అనంత నానాత్వము తానే యగుచున్నది. జీవాత్మ, సకల జీవాత్మలు, విశ్వాత్మ, విశ్వాతీతాత్మ, పరమేశ్వరుడు, పరమాత్మ, పరమ పురుషుడు, పరాశక్తి జన్మలేనిదయ్యు — అనంతముగ జన్మించుచుండునది, అపరిచ్ఛిన్నమయ్యు అసంఖ్యాకముగ పరిచ్ఛిన్నమగుచుండునది, అన్నియు నదియే. దాని నెఱుగనేర్చిన జ్ఞానమే పూర్ణజ్ఞానము.

వివిధ భాగములలో అజ్ఞాన జనితమైన అహంకారిక ప్రవృత్తులను త్రోసిపుచ్చినయెడల అనగా, వీటి నన్నింటిని దైవోన్ముఖము కావించి దివ్య పరివర్తన మొందించినయెడలి యివి యన్నియు నికపై దివ్యప్రవృత్తులతోడనే విలసిల్లుతూ, మానవ జీవితమునకు దివ్యత్వమును ఘటిల్లజేసి పృథ్వియం దీశ్వర శక్తి కేంద్రముగ మానవుడు విరాజిల్లునట్లు చేయగలవని శ్రీ అరవిందుల నిశ్చితాభిప్రాయము. సృష్టి విధానపు పరమలక్ష్య మిదియేనని ఉద్ఘాటించి, ఆ లక్ష్యసిద్ధిని పృథ్వియందు మానవునకు సన్నిహితం చేయడానికే — పూర్ణయోగ సాధనమను వినూతన పద్ధతిని తాము కనుగొని అనుష్ఠించి, అందులో మహా ఉత్తమమైన సిద్ధులను పైతము ఆయన సాధించగల్గిరి.

పరాత్పర స్వరూపముగా నిర్దేశించుచు శ్రీ అరవిందులు చేసిన వర్ణనలను పోలినవి, ఆధ్యాత్మిక విషయ పరిశీలనతో కూడిన, అన్ని గ్రంథములలోను మనకు పొడగట్టునవియే. అనన్య భక్తిభావనతో ఈశ్వరునకు సర్వమర్పణ మొనర్చుకొని, సర్వమును పరమేశ్వర స్వరూపముగనే దర్శించుచూ, సర్వ కర్మలనూ ఈశ్వరార్పణముగ చేయు సాధన విధానములుకూడా, ఇతర దర్శనములలోను కొల్లలుగా నున్నవి. కాని వానన్నిటి పరమలక్ష్యము — తుదకు,

ఈ ఐహికజీవన జంజాటనమునుండి విముక్తిని సాధించి ఈశ్వరసాయుజ్యమును పొందుటను నదియే దివ్యచేతనను క్రిందికి అవతరింపచేసి మనః ప్రాణేంద్రియ శరీరముల దివ్యపరివర్తనముద్వారా ఐహిక జీవితమును రూపాంతరం చెందించుట కాదు. ఒక్క అరవింద దర్శనం మాత్రమే ఇట్టి విశిష్ట లక్ష్యమును నిర్దేశించి తత్సిద్ధికై వలయు విశిష్ట సాధన విధానములనుకూడ ఉపదేశించుచూ — అత్యంత విశిష్టమైన యోగసాధనగా వినుతికెక్కి విరాజిల్లుచున్నది.

———

# శ్రీ అరవింద విరచిత
# 'సావిత్రి - ఒక గాథ, ఒక ప్రతీక'

— వి. వి. యస్. రామదాసు

ఇంగ్లీషుభాష అంగ్లేయులు భారతీయుల కిచ్చిన కానుక అనుకుంటే శ్రీ అరవింద విరచిత భాగవత జీవనము "ది లైఫ్ డివైన్" అనే ఆధ్యాత్మిక గ్రంథమూ, సావిత్రి అనే మహాకావ్యమూ భారతీయులు ఆంగ్లేయులకు వారి భాష ద్వారా ప్రపంచానికి యిచ్చిన గొప్ప బహుమానం అనడంలో సందేహం లేదు.

ఇంగ్లీషు భాష ఖండఖండాంతరములలో వ్యాపించినందువల్ల ఆయా దేశాల కవులు ఇంగ్లీషులో రచనలు చేసి దానికి బలాన్నీ వైవిధ్యాన్నీ చేకూర్చారు. కాగా ఇంగ్లీషుకి ఆధ్యాత్మిక పుష్టిని సమకూర్చిన ఖ్యాతి శ్రీఅరవిందులకే చెందుతుంది.

ఎ. ఇ. "జార్జి రస్సెల్" అనే ఐరిష్ కవి దిలీప్‌కుమార్ రాయ్ గారికి వ్రాసిన ఉత్తరంలో ఇంగ్లీషు భాషకు ఆధ్యాత్మిక భావాలను వ్యక్తపరచడానికి తగిన సరంజామా లేదని వ్రాశారు. కాని శ్రీ అరవిందులు ఆ అభిప్రాయాన్ని వ్యతిరేకించి క్రొత్తభావాలకు అనుగుణంగా ఆంగ్లభాషనుమలచవచ్చునని వ్రాశారు. వ్రాయడమే కాక అది ఒక సవాలుగా తీసుకుని ఆధ్యాత్మిక భావాలను ఆంగ్లంలో వ్యక్తంచేసి దివ్యజీవనం అనే గ్రంథంలోనూ సావిత్రి అనే మహావిశ్వ కావ్యంలోనూ అద్భుతంగా రుజువు చేశారు.

యోగిగా తాత్వికునిగా, సాంఘిక మేధావిగా రాజకీయవేత్తగా శ్రీ అరవిందులకున్న ప్రజ్ఞ బృహత్తరమే అయినా కవిగా వారికున్న అసమాన ప్రాభవము మనకు ప్రస్తుతాంశము.

శ్రీ అరవిందులు 1872 సంవత్సరం ఆగష్టు 15 వ తేదిన కలకత్తాలో జన్మించారు. వారి తండ్రిపేరు కృష్ణధన ఘోషు. తల్లి పేరు స్వర్ణలతాఘోషు. వారిని అజాతీయం చేసేపని వారి అయిదవ ఏటనే జరిగికది. 'నాటు'

భాష. 'నాటు అలవాట్లు' వీలయినంత వరకు వారికి అంటకుండా చేయాలని కేవలం ఇంగ్లీషు వాతావరణంలో పెంచాలనే అభిప్రాయంతో వారి అయిదవ ఏట డార్జిలింగులోని ఒక కాన్వెంటుకు పంపారు వారి తండ్రిగారు. ఇంటిదగ్గర కూడా ఇంగ్లీషు నర్సును పెట్టారు. 1879 నుంచి 1892 వరకు శ్రీ అరవిందులు ఇంగ్లండులో విద్యాభ్యాసం చేశారు. ప్రతి అంశంలోనూ ప్రథమ శ్రేణిలో కృతార్థులయ్యారు.

ఇంగ్లండులో వారు ఇంగ్లీషు. లాటిన్, గ్రీకు భాషలలో అపార పాండిత్యమును సంపాదించారు. ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, స్పానిషు భాషలతో పరిచయం సంపాదించారు. వారి పదమూడవఏటనే ఇంగ్లీషులో కవిత్వం వ్రాయడం ప్రారంభించారు.

ఈ విధముగా అజాతీయం చేయాలనే అభిప్రాయం వారి తండ్రిగారి కున్నప్పటికి వారు 1893 వ సంవత్సరంలో అనగా తమ 21 వ సంవత్సరంలో భారతభూమిమీద అడుగు పెట్టగానే దైవ కృపవల్ల పునర్జాతీయం చేసే లీల ప్రారంభం అయింది. ఆ క్షణంలో ఎంతో ప్రశాంతత వారిని ఆవరించి, తరువాత ఎన్నో నెలలు చెదరకుండా నిలిచింది. కాశ్మీరులో నడుస్తూండగా వారికి దివ్యానుభవం కలిగింది. నర్మదా నదీతీరాన వారికి మహాకాళశక్తి అనుభూతి కలిగింది. రాజకీయ కారణావల్ల వారు అల్లిపూర్ జైలులో నిర్బంధించ బడినప్పుడు అక్కడ వారికి నారాయణ దర్శనం లభించింది. సర్వం నారాయణ మయంగా సాక్షాత్కారం అయింది. రాజకీయాలలో ముమ్మరంగా పాల్గొనిన తరువాత మానవ జీవిత సార్థకత ఆధ్యాత్మిక పథంలోనే యిమిడి ఉన్నదని గ్రహించి, మౌన యోగ సాధనకు అనువుగా పాండిచేరికి చేరుకున్నారు. 1926లో నవంబరు 24 వ తేదీన వారి సాధన పరిపక్వమయి విజ్ఞాన సితిని పొందే మార్గంలో ఒక దశ అయిన అతిమానస చైతన్యానుభవ సిద్ధిని పొందారు.

ఆధ్యాత్మిక రంగములో శ్రీ అరవిందుల తత్త్వమునకు ఆధారభూతమైనది నూతన ఆధ్యాత్మిక విజ్ఞానమే అయినప్పటికి ప్రధానముగా రెండు నూతన సిద్ధాంతములను వారు ద్యోతకం చేశారు. 1. పూర్ణయోగ ప్రతిపాదన, 2. మహామానవ ఆవిర్భావ సిద్ధాంతము వారి ఆధ్యాత్మిక కృషి ఫలములు.

ప్రపంచ సాహిత్యరంగంలో 1. భవిష్యత్కవితా సిద్ధాంతప్రతిపాదన. 2. ఆ సిదాంతమును ప్రతిబింబిస్తూ చేసిన ఆధునిక మహా విశ్వకావ్యమైన సావిత్రి రచన వారు చేసిన రెండు ఘన కార్యములు.

హైందవ జాతీయ శృతి పథం ఎంత ప్రగాఢమైనదంటే భారతీయ కవి మతాలు మారినా దేశాలు ద్రిమ్మరిచ్చినా కొన్ని యితి వృత్తాలు కవి స్మృతిలో గాఢముద్ర వేసుకుంటాయి. తోరూదత్ అనే కవియిత్రి తల్లితండ్రులు క్రీస్తు మత స్వీకారం చేసినప్పటికీ, ఆమె ఇంగ్లండులో కొన్ని సంవత్సరాలున్నప్పటికీ ఆమె ఇంగ్లీషులో కవిత వ్రాసినప్పుడు హైందవ గాథల్ని ఎన్నుకున్నారు. అందులో ముఖ్యంగా సావిత్రి యితివృత్తాన్ని తీసుకుని చక్కని కవిత్వం వ్రాశారు. రమేష్ చంద్ర దత్‌గారు కూడా ఇంగ్లండులో కొంతకాలం ఉండి వచ్చినప్పటికీ ఇంగ్లీషు పరిసరములలో మెలగినప్పటికీ వారు కూడా ఆంగ్లంలో కవితల్లినప్పుడు అనేక నూతన యితివృత్తాలతో పాటు సావిత్రి యితివృత్తం కూడా తీసుకుని వ్రాశారు.

మృత్యువుపై ప్రేమ సాధించిన విజయాలు శ్రీ అరవిందులను బరోడా కాలం నుంచి ఆకర్షించాయి. పురూరవుడు ఊర్వసికోసం ఊర్వలోకానికి పోయి సాధించాడు. దానిని యితివృత్తంగా తీసుకుని 'ఊర్వసి' అనే కావ్యం వ్రాశారు. బ్రాహ్మణపుత్రుడు రురుడు ప్రియంవద కోసం పాతాళ లోకానికి పోయి సాధించాడు దానిని యితివృత్తంగా తీసుకుని లవ్ అండ్ డెత్ వ్రాశారు.

ఊర్వసి, లవ్ అండ్ డెత్ వ్రాసిన బరోడా కాలంలోనే సావిత్రి కావ్యం మొదటి ప్రతిని వ్రాశారు. పురూరవుడు, రురుడు చేసిన త్యాగములలో స్వార్థం ఉన్నందువల్ల ఆ యితివృత్తములతో తృప్తిచెందక మానవాళి అంతటినీ ఉద్ధరించే మహాశక్తి సావిత్రి కథను యితివృత్తంగా తీసుకున్నారు శ్రీఅరవిందులు

మహా విశ్వ కావ్యమైన సావిత్రిని రచించడంలో శ్రీ అరవిందులకు అయిదు ధ్యేయాలున్నవి.

1. వ్యాస మహాభారతంలోని సావిత్రీ ఉపాఖ్యానాన్ని ఒక ఆధునిక మహా కావ్యంగా రూపొందించడం మొదటి లక్ష్యం.

2. ఆధ్యాత్మిక సాధన, సిద్ధిని చూపించే పూర్ణయోగ పాఠ్యపుస్తంగా ధ్వనించే పద్యకావ్యమును రచించడం రెండవలక్ష్యం.

3. మానవ కార్యకలాపాలలో విశ్వ కార్యకలాపాన్ని ప్రతీకగా స్ఫురింప చేసే దివ్యలీలా నాటకాన్ని విశ్వకావ్యంగా రచించడం అనగా వారి దివ్య జీవనం అనే గ్రంథంలో చెప్పిన అంశాలనే కవిత్వ పరిభాషలో రసవంతంగా అందించే విశ్వకావ్యాన్ని రచించడం మూడవ లక్ష్యం.

4. కవియొక్క ఆత్మ అనుభవించిన ఆధ్యాత్మికానుభూతిని పాఠకుని ఆత్మకు సూటిగా అందించే గుణముగల భవిష్యత్కవిత అనగామానసభూమికను దాటి అతిమానస విజ్ఞానభూమికలను ప్రయాణింపచేసే కవిత్వానికి మచ్చుతున కగా రచించడం నాలుగవ లక్ష్యం.

5. ఇంగ్లీషుభాషలోని బ్లాంక్‌వర్స్‌లోఉపనిషత్తులలోను కాళిదాస కావ్యా లలోను ఉన్న భావచలనాన్ని వీలయినంతవరకు సృష్టించడం. అనగా సంస్కృత భాషలోని స్పష్టత, స్వచ్ఛత వేదాలలోని అర్థబాహుళ్యం ఇంగ్లీషు ఛందస్సులో యిమిడ్చే ప్రయత్నం చేయడం అయిదవ లక్ష్యం.

వారు సావిత్రి మహాకావ్యాన్ని బరోడా కాలంలోవ్రాసినప్పటికీ అది వారు అతిమానస స్థితిని దాటినతరువాత కలిగిన ఆధ్యాత్మికానుభవాలదృష్ట్యా చాలా పర్యాయములు మార్చారు. కొన్ని భాగాలు పదిమార్లు సవరించడం కూడా జరి గింది. కవితా గుణంలో దేనికదే రసగుళిక అయినప్పటికీ ఆధ్యాత్మికాను భూతిలో వారికి కలిగిన పరిణామం దృష్ట్యా పూర్ణవిరాట్ దర్శనానికి ప్రస్తుత బృహద్గ్రంథం అవసరమయింది.

చివరకా ఉద్గ్రంథానికి 'సావిత్రి—ఒక గాథ. ఒక ప్రతీక' అని నామ కరణం చేశారు.

మూడు భాగాలు, 12 పుస్తకాలు, 49 పర్వాలు. మమారు 24,000 చరణ ములు ఆ మహాకావ్యములో ఉన్నాయి.

అసంపూర్ణత_కనీసం మొదట సంకల్పించిన పథకంలోనివన్నీ లేక పోవడం_ప్రతి మహాకావ్యానికి ఒక లక్షణమేమో అనిపిస్తుంది. 1. ఏడవ

పుస్తకం "ది బుక్ ఆఫ్ యోగా" ఆఖరు పర్వంయొక్క మకుటం యివ్వలేదు. 2. మొదట సంకల్పించిన 51 పర్వములలో 49 మాత్రమే వ్రాశారు. ఎనిమిదవ పుస్తకం "ది బుక్ ఆఫ్ డెత్" లో మొదటి రెండు పర్వాలూ రచింపలేదు.

స్వల్పంగా ఈ భాగాలు లోపించినప్పటికీ గ్రంథమంతా ఏకబిగిని చదివితే ఒక సంపూర్ణత, నిండుతనం గోచరిస్తాయి. చెప్పవలసినది సందర్భశుద్ధితో చెప్పడం జరిగింది. ముఖ్యమైనదేదీ విడిచిపెట్టలేదు.

ఈ మహాకావ్య రచనకు శ్రీ అరవిందులు 50 సంవత్సరాలు కృషిచేశారు.

గ్రంథవిశ్లేషణ చేయడానికిముందు సావిత్రి పాత్రయొక్క ఉత్కృష్టత, విశిష్టత మనవి చేస్తాను.

శ్రీ అరవిందులు తమ మహావిశ్వకావ్యమైన 'సావిత్రి'కి ఇతివృత్తాన్ని వ్యాసమహాభారతంలోని సావిత్రి ఉపాఖ్యానంలోనుండి తీసుకుని వారి అయిదు ధ్యేయాలకూ అనుగుణంగా మార్చి మెరుగు పెట్టారు. వ్యాసుని 'సావిత్రి' విశిష్టమైనది. అందములో, సత్యసంధతలో, సత్ప్రవర్తనములో, శక్తిలో సాటి లేనిది. పదునెనిమిది సంవత్సరముల తపఃఫలముగా సావిత్రిదేవి వరప్రసాదిని. సూర్యుని యంతటి తేజస్సుతో కూడిన సౌందర్యము కలిగినందువల్ల ఆమెను వరించుటకెవరికి సాహసము లేకపోయింది, చిన్న విషయాలలోకూడ ఆమె అసత్యము పలుకలేదు. ఆమె సహజంగానే మంచిది కావడంవల్ల అందరికీ ఉపకారం జరిగింది. చరిత్రలలోగాని, గాథలలోగాని ఉన్న కథానాయికలలో ఆమెకు విశిష్టస్థానం ఆమెకున్న 'శక్తి' వల్లనే వచ్చింది. ఆమెకున్న మరొక విశిష్టలక్షణం ఏమిటంటే ఆమె అసలు ఏడ్వదు, సత్యవంతుడు తన తల్లి దండ్రులను గురించి ఏడ్చినాడు. ద్యుమత్సేనుడు కుమారుని గురించి ఏడ్చినాడు, కాని సావిత్రి ఏడ్వదు.—నారదుడు అప్రియమైన మాటలను పల్కినప్పుడు గాని, సత్యవంతుడు మరణించినప్పుడుగాని, పునర్జీవనము పొందిన తరువాత సత్యవంతుడు తల్లిదండ్రులను తలుచుకొని ఏడ్చినపుడుగాని ఆమె ఏడ్వలేదు. అది మొండితనంవల్లనూ కాదు. బండతనంవల్లనూ కాదు. ఆమె ధ్యేయాన్ని సాధించగల శక్తి ఆమెకున్నదనే ఒక చైతన్యమూ, ఏ సంఘటననైనా ఎదుర్కొనగలిగే సంసిద్ధతా మాత్రమే ఆమె స్థితప్రజ్ఞత్వమున్నకు కారణములు.

ఆమె అందమును, సత్యసంధతను, మంచిని, శక్తిని యినుమడింపచేసే ప్రత్యేక గుణం ఆమెకు సత్యవంతునియందుగల మహోజ్వల ప్రేమయే. ఆమె సాధారణంగా స్త్రీగురించి అదంరూ అనుకునేటట్లు సుందరి, అబల, మగవాని ప్రక్కఎముక నుండి చేయబడిన నారి మాత్రంకాదు. — ఆమె దివ్యధామమునుండి దిగివచ్చిన అనంత స్త్రీమూర్తి.

సావిత్రి ఏడవకపోవడమేకాదు, ఆమె యాచించదుకూడా. నారదుడు హెచ్చరించినమీదట అశ్వపతి ఆమెను మరల వరించుమని చెప్పినప్పుడు ఆమె సత్యవంతుని పెండ్లాడనిమ్మని తండ్రిని బ్రతిమాలలేదు. హృదయార్పణ జీవితంలో ఒకసారి మాత్రమే జరుగుతుందని మాత్రమే చెప్పింది. నారదుడు తన మనస్సు మార్చుకుని సత్యవంతునికి సావిత్రి నిచ్చేటట్లు అశ్వపతిని ఒప్పించాడు. ఆమె వజ్రసంకల్పాన్ని దివ్యముని నారదుడూ, మహారాజు అశ్వపతి యిద్దరూ ఎదిరించలేకపోయారు. త్రిరాత్ర వ్రతంచేసే నిర్ణయం ఆమెదే. ఆమె మామగారు దానిని అనుమతించారు. నాలుగవరోజు రాత్రివరకు నిరాహారదీక్ష పూనడం ఆమె నిర్ణయమే. ఆ గడ్డురోజున సత్యవంతునితో అడివికి వెళ్లాలనే నిర్ణయంకూడా ఆమెదే. "మీతో రావాలని ఉంది. వద్దనకండి" అంటుంది భర్తతో. అత్తమామలతో "అడివి చూడాలని ఉంది" అని చెబితే వాళ్ళు కాదనలేకపోయారు. సత్యవంతుడు అసువులను బాసిన క్షణంలో అతని ప్రాణాల్ని తీసుకొని పోవడానికి ఆమె ముందు యముడు నిలిచినప్పుడు ఆమె ధృతి సడలలేదు. "ఎవరు మీరు ? ఎందుకు వచ్చారు ?" అని కాస్త కటువుగా అడిగింది సావిత్రి. యముడు సత్యవంతుని ప్రాణాలనుతీసుకొని పోతున్నప్పుడు తనభర్త ప్రాణాలవెంబడి వెళ్ళింది సావిత్రి. ప్రతిపర్యాయమూ యముడు మాట్లాడిన తరువాతనే ఆమె మాట్లాడింది. ఆమె వదనంలో గాని, కంఠస్వరంలో గాని యాచన అనేది ఎక్కడా కనిపించలేదు. ఆమె ధర్మబద్ధంగా మాట్లాడడంతో యమధర్మరాజు యిరుకున పడ్డాడు. ఎందుకంటే అతడు మరణానికి మాత్రమే కాక ధర్మానికి కూడా దేవతే. ఆమె మాటల సారాంశము అదే. యమధర్మరాజు కోరమన్న తరువాతనే ఆమె వరాలడిగింది. అత్తమామలకోసం, తలిదండ్రుల కోసం అడిగిన తరువాత చివరకు సత్యవంతుని గురించి, తనగురించి ఆలోచించింది. ఆమె మాటలను వినిన యముడు చైతన్యమునుపొంది ధర్మరాజుగా తన ధర్మమును గ్రహించి సత్యవంతుని ప్రాణమును తిరిగి యిచ్చి సావిత్రి వద్దనుండి శలవు తీసికొనినాడు.

సావిత్రి కూతురుగా, భార్యగా, కోడలుగా తన ధర్మమును మరువ లేదు. అయా ధర్మములను పాటిస్తూ కూడా వాటిని అధిగమించి ఆమె తల్లితండ్రులకు అత్తమామలకు సంరక్షకురాలిగా వారిని ఉద్ధరించింది.

సాహిత్యాభిమానులకు సావిత్రి ఉదాత్త కథానాయకురాలు కావచ్చు. కాని హిందువులకు, ముఖ్యముగా హిందూ స్త్రీలకు ఆమె మ్రొక్కిన వరమిచ్చు వేల్పు. ఈ రోజువరకు హైందవ నారీమణులు వారి అయిదవతనం కోసం సౌభాగ్యం కోసం సావిత్రీవ్రతం ఆచరిస్తున్నారు. సావిత్రీ ప్రియులకు రాముడు రామాయణ కావ్య నాయకుడు. కాని కోట్లాది హిందువులకు రాముడు దేవుడు. సాహితీ పరులకు కృష్ణుడు మహాభాగవత నాయకుడు. భారతకథలోని పార్థసారథి. కాని అతని కోట్లాది భక్తులకు అతడు కృష్ణభగవానుడు, గీతా ప్రవక్త. అదే విధముగా సావిత్రి సౌశీల్యమునకు, సౌభాగ్యమునకు, పతివ్రతాశక్తికీ అధిష్ఠాన దేవత. తక్కిన దేవతలను పూజించినట్లు ఏదో మ్రొక్కుబడి చెల్లించుకోడం కాదు ఆమె విషయంలో హిందూస్త్రీలు చేసేది. వారి హృదయాలయాలలో నిరంతరం నిలచి ఏలే దేవి సావిత్రి.

వ్యాసమహాభారతములోని సావిత్రీ ఉపాఖ్యానమును శ్రీ అరవిందులు ఎంతవరకు మార్చినారో గమనిద్దాము.

ప్రధానఘట్టములు మార్చలేదు. అశ్వపతి 18 సంవత్సరములు తపస్సు చేయడం తత్ఫలితంగా సావిత్రి జననం. సావిత్రీ సత్యవంతుల పరిణయానికి విధి పెట్టిన అగ్నిపరీక్ష, సావిత్రి త్రిరాత్ర వ్రతం, సావిత్రి యమునీ విధినీ జయించి సత్యవంతునికి పునర్జీవనం యిప్పించడం, అత్తయింటివంశాన్నీ, పుట్టింటి వంశాన్నీ ఉద్ధరించడం—ఇవి ప్రధాన ఘట్టములు, వీటిని మార్చ లేదు.

కాని గాథను ప్రతీకగా మలచటంలో కొన్ని మార్పులు అవసరమయ్యాయి.

అశ్వపతి పదునెనిమిది సంవత్సరములు తపస్సు చేసినట్లు ముక్తసరిగా సుమారు పది పాదములలో వ్యాసమహర్షి వ్రాసినారు. అశ్వపతి యోగమును వివరించుటకు శ్రీ అరవిందులు 15 సర్గలు వ్రాసినారు. వారి మహాకావ్యంలో దాదాపు సగభాగం అశ్వపతి యోగము ఆక్రమించినది.

సావిత్రి ఆచరించిన త్రిరాత్ర వ్రతము గురించి మూల ఉపాఖ్యానములో రెండు శ్లోకములలో సంక్షిప్తంగా చెప్పబడినది. కాని ఒక దివ్య శక్తినీ దివ్య చైతన్యాన్నీ పొందడానికి, అవతార లక్ష్యమును తెలుసుకొనడానికి సావిత్రి అంతర్‌దృష్టి ప్రసరించిన తపస్సును వివరించడానికి శ్రీ అరవిందులకు ఆధ్యాత్మికంగా కలిగిన అనుభవాన్ని వారి సాహసాధకురాలయిన మాతృశ్రీకి కలిగిన యోగసిద్ధి అనుభవాన్నీ వినియోగించి దాదాపు 4,000 పాదములలో విపులీకరించారు.

సావిత్రి యముల సంవాదము, సావిత్రి విజయమును శ్రీ అరవిందులు మూడు పుస్తకములుగా 150 పుటలు వ్రాశారు. సావిత్రిదేవి యిచ్చిన వరముగా వ్యాసమహర్షి చిత్రించిన సావిత్రిని శ్రీ అరవిందులు వారి కావ్యములో ఆదిశక్తి అవతారముగా రూపొందించారు. సావిత్రియొక్క దివ్యమానవ గుణం వారి కావ్యమునకు పునాది వంటిది. అంతటి దివ్యశక్తివల్ల సావిత్రి యమునిలో మార్పు తేగలిగినది. జడముగా నున్న యమునిలో నిద్రాణమై ఉన్న ధర్మమును మేల్కొలిపి చైతన్యం కలిగించి యమధర్మరాజనెడి పేరును సార్థకము చేసినది.

మరణమును జయించిన తరువాత సావిత్రి సత్యవంతుల జీవితమును చిత్రించడంలో శ్రీ అరవిందులు ప్రత్యేక ప్రతిభ చూపించారు. గాథలో వారిరువురూ భువికి దిగి వచ్చి, సత్యవంతుడు వాని తండ్రి రాజ్యమును పొంది చాలకాలము సఖముగా పరిపాలిస్తాడు. కాని శ్రీ అరవిందుల ప్రతీకలో సావిత్రి సత్యవంతులు మరణ రాజ్యం నుండి లేపి ఎక్కడ సత్యసూర్యుడు ఎన్నడూ అస్తమించడో ఎక్కడ అజ్ఞానమనేదే తెలియదో ఎక్కడ మరణానికి తావు లేదో అటువంటి అనంత దినప్రదేశంలో ప్రవేశిస్తారు. అటువంటి సత్య ప్రదేశంలో కొంతకాలము కడపిన తరువాత నూతన మానవత్వాన్ని సృష్టించడం అనే దివ్య కార్యాన్ని చేయడం కోసం భూమికి దిగి వస్తారు. ఆవిధముగా వ్యాసముని వ్రాసిన గాథను సృజనాత్మక దర్శనము గలిగిన శ్రీ అరవిందులు విశ్వప్రతీకగా మార్చారు.

ఇక గ్రంథవిశ్లేషణ చేస్తాను. ఈ మహావిశ్వ కావ్యం పేరు సావిత్రి_ఒక గాథ. ఒక ప్రతీక. ఈ మహాకావ్యంలో గాథకు సంబంధించినదీ, దానిలోని

చిహ్నానికి లేక ప్రతీకకు సంబంధించిన నిగూఢత్వాన్ని వీలయినంతవరకు విడమరచి చెబుతాను.

మొదటి పుస్తకం "ది బుక్ ఆఫ్ బిగినింగ్స్" లోని మొదటి రెండు పర్వాలూ సంఘటనల మధ్యలో "సత్యవంతుడు మరణించవలసిన రోజు" నాడు ప్రారంభమవుతాయి. సావిత్రి సత్యవంతుల వివాహం జరిగి పన్నెండు మధుర మాసాలు అప్పుడే గతించి సత్యవంతుడు మరణించవలసిన నాటి అరుణోదయమది. గాధలోనే కాక ప్రతీకగా కూడ అది అరుణోదయమే_అది విశ్వచరిత్రలో ఒక క్రొత్త శకానికీ ఉషఃకాలము. ఈ మహాకావ్యం అంతటిలో ద్వికాలము ద్విచర్య కనిపిస్తాయి. ఒక ప్రక్క గాధగా అది ఒక రోజు సంఘటనే చెప్పినప్పటికీ ప్రతీకగా ఆధ్యాత్మిక భూమికలో సర్వకాలము అనంతకాలము దానిలో యిమిడి ఉన్నాయి. గాధలో భౌతిక భూమికలో సత్యవంతుడు మరణించవలసిన రోజున ప్రారంభమై యమునిపై సావిత్రి విజయం సాధించి సత్యవంతుడు పునర్జీవనం పొందడంతో అంతమవుతుంది.

ఇక ప్రతీక చూద్దాం.

ఆధ్యాత్మిక భూమికలో కూడా సంఘంటనల మధ్యలో ప్రారంభమయింది. మానవ చరిత్రలో అణ్వస్త్రాల అసురసృష్టితో మానవ జాతే నాశనమయ్యే పరిస్థితులు ఎదురయినవి. ఈ గడ్డుసమస్య దాటి మానవాళి బ్రతికి బట్టకుడుతుందా లేక నాశనం అవుతుందా ? ఇదే జీవన్మరణ సమస్య గురించి వారి దివ్య జీవనం అనే గ్రంధంలో ప్రశ్నించారు. దానికి పరిష్కారం మార్గాన్ని కూడా సూచించారు. మళ్లీ అదే సమస్యను సావిత్రి అనే మహా కావ్యంలో కవితా పరిభాషలో చర్చించి పరిష్కరించారు. సావిత్రికావ్యంలోని ఆధ్యాత్మిక నాటకం ప్రతి ఆత్మలోను జరుగుతున్నది. నిజానికి అసురశక్తిని ఆధ్యాత్మిక శక్తితో ఎదుర్కొని, లొంగదీసి మార్చివేయవచ్చును, అందుచేత ఆత్మకు_ప్రకృతికి పట్టిన తాత్కాలిక పాక్షిక చీకటి తొలగిపోవడంతో కావ్యం ముగుస్తుంది.

ఇంతటి మహాకార్యాన్ని సాధించే శక్తి సావిత్రికి ఏట్లా వచ్చిందీ ; దానికి జవాబు మొదటి పుస్తకంలోని రెండు పర్వాలలోను, రెండవ పుస్తకం "ది బుక్ ఆఫ్ ది ట్రావెలర్ ఆఫ్ ది వరల్డ్స్ "లోను మూడవ పుస్తకం" ది బుక్ ఆఫ్ ది డివైన్ మదర్‌లోను వివరంగా చెప్పారు.

మహాభారత ఉపాఖ్యానంలో అశ్వపతి రాజు పిల్లల కోసం తపస్సు చేసి పుత్రికా వరం పొందుతాడు. శ్రీ అరవిందుల కథనంలో అశ్వపతి కేవలం పిల్లలకోసం తపస్సు చేసే రాజు మాత్రమే కాడు, యుగ యుగములుగా ఆత్మజ్ఞానం కోసం అన్వేషించే సాధకుని ప్రతీక.

అరవిందుల అశ్వపతి యోగము మూడు భాగములుగా విభజించవచ్చును. వ్యక్తిగా ఆధ్యాత్మిక సిద్ధిని పొందడం మొదటిది "యోగా ఆఫ్ ది కింగ్"లో వర్ణించబడింది. తరువాత మానవుల ప్రతినిధిగా చైతన్య భూమికలను సాధించడం రెండవది రెండవ పుస్తకంలో వివరించారు. అయితే ఇంతవరకు ఇది వ్యక్తిగత విజయం మాత్రమే. చివరకు విశ్వ మంతటికి దివ్యచైతన్యం లభించి నూతన సృష్టి జరిగే విధం మూడవ పుస్తకం "ది బుక్ ఆఫ్ ది డివైన్ మదర్‌లో" వర్ణించారు.

అశ్వపతికి తెలిసిన రహస్యజ్ఞానం నాలుగవ పర్వంలో వివరించారు. దేవుని లీలలు అశ్వపతికి తెలిసినవి. సృష్టిలోని నిగూఢత అర్థమయింది.

లోకాన్ని అవరించిన చీకటిని తొలగించడానికి ఆదిశక్తి అంశ అశ్వపతికి కుమార్తెగా అవతరిస్తుందని వరం పొందుతాడు ఆ రాజు.

రెండవభాగం "నాలుగవ పుస్తకం"తో మనం మళ్ళీ మానవ కథకు వస్తాం. రాజుకిచ్చిన వరం ఫలించింది. జ్వాలామతల్లి జననం, శైశవం వర్ణించే పర్వం, తరువాత పర్వాలలో సావిత్రి బాల్యంనుండి స్త్రీ మూర్తిగా ఎదిగి ప్రేమించే దశకు చేరడం చూస్తాం. రాజ్యభ్రష్టులైన ద్యుమత్సేన మహా రాజు కొడుకు సత్యవంతుని పర్ణశాలలో గ్రుడ్డివారైన తలిదండ్రులకు సేవ చేస్తున్నవానిని సావిత్రి చూసింది. సావిత్రి సత్యవంతులు పరస్పరం ప్రేమించుకున్నారు. ఇంటికివచ్చిన తండ్రితో తన ప్రేమ వృత్తాంతమును తెలిపింది సావిత్రి. ఆ సమయంలో అక్కడ ఉన్న నారదమహర్షి సత్యవంతుని గొప్ప గుణాల్ని యోగ్యతల్ని పొగిడి అతడు అల్పాయుర్దాయం కలవాడని ఒక సంవత్సరంలో అతనికి మరణం తప్పదని చెప్పాడు. సావిత్రి తల్లి సత్యవంతునిమీద ఆశ పెట్టుకొనవద్దని సలహా యివ్వగా సావిత్రి సత్యవంతుని మాత్రమే పెండ్లాడుతానని పట్టుపట్టింది.

సావిత్రి అందరి కన్యలవంటిదికాదని ఆమె దివ్య సంకల్ప శక్తివల్ల అంతా సవ్యంగా జరుగుతుందని నారదుడు ధైర్యం చెబుతాడు.

ఏడవ పుస్తకం "ది బుక్ ఆఫ్ యోగా"లో సావిత్రి సత్యవంతుల వైవాహిక ప్రేమ వర్ణించబడనది. సావిత్రికి సత్యవంతుని తలవ్రాత ముందు గానే తెలుసును. కనుక ఆమె వైవాహిక జీవితంలోని మాధుర్యాన్ని పూర్తిగా చవి చూడలేకపోయినది. సావిత్రి ఆదిశక్తి అంశతో జన్మించినదే అయినప్పటికి మానవాకృతి ధరించడంవల్ల కొంచెం మనఃక్లేశం తప్పదు. అయినా ఆమె లోని దివ్యత్వం జాగృతంగానే ఉంది. ఆమె అశ్వపతి యోగఫలం కాబట్టి యోగినిగా తన బలాన్ని గ్రహించి, విధితోరానున్న పోరాటానికి సన్నద్ధమయినది. సావిత్రి తనలోనికి అంతర్ దృష్టిని ప్రసరించి స్థూలనేత్రానికి కనిపించే ఆకారాన్ని నిరాకరించి లోనున్న ఒక్కొక్క తెరనే తొలగించి ఆమె పూర్ణ దివ్యత్వాన్ని తన అవతార లక్ష్యాన్ని గ్రహించింది. అశ్వపతి కేవలం సాధనా స్వరూపుడయితే సావిత్రి ఆ సాధనయొక్క పరిణామమేకాక, ఆ సాధన సిద్ధి కూడా. ప్రకృతిధర్మాన్ని దివ్య ధర్మంగా మార్చే పరాశక్తి అంశం ఆమహాతల్లి. అశ్వపతి, సావిత్రి ఇద్దరూ కూడా తమ స్వార్థం కోసం మాత్రమే ఆధ్యాత్మిక కృషిచేయలేదు. సర్వమానవ విముక్తికి విశ్వ విముక్తికి దివ్య పరిణామ సృష్టికి వారు సాధనచేసి సిద్ధిపొందారు.

మళ్ళీ ఆ గడ్డురోజు దగ్గరకు వద్దాం. సావిత్రి యోగ సాధన తర్వాత దివ్య దృష్టితోను దివ్యశక్తితోనూ శక్తిమంతురాలై సత్యవంతునితో అడవికి వెళ్ళింది. మృత్యుక్షణం సమీపించడంతో సత్యవంతునికి తలనొప్పి రావడం ఆమె పేరు తలుస్తూ ఆమె ఒడిలో తల పెట్టుకుని దీర్ఘనిద్రలో మునగడం జరిగాయి.

సావిత్రి మహాకావ్యంలోని మూడవభాగంలో సత్యవంతుని ఆత్మకోసం సావిత్రికీ, యమధర్మరాజుకీ జరిగిన సుదీర్ఘ పోరాటమూ, సావిత్రి విజయమూ వివరించారు.బోధి వృక్షంక్రింద సిద్ధార్థుని సాధన సమయంలో మహాజ్ఞానోదయం జరిగేముందు సిద్ధార్థుడు మారునితో పోరాడి జయించి బుద్ధుడయ్యాడు. అదే విధమయిన అగ్నిపరీక్షకు లోనయింది సాధ్వి సావిత్రి. అయితే స్త్రీగా భార్యగా

ఆమె యమునితో పోరాడడం యింకా ఆసక్తికరమైనది. ఆమె విజయం ప్రేమ మృత్యువుపై సాధించిన విజయం. అమృత జీవనమే ఆ విజయఫలం.

యముని సాక్షాత్కారం చాలా అందముగా వర్ణించారు శ్రీ అరవిందులు భయంకరముగా ఉంటూనే అందముగా ఉన్నాడు యముడు. చావుని ప్రసాదించె వాడయినా ఆయననొక దేవత.

సావిత్రీ యములకు జరిగిన పోరాటం కురుక్షేత్ర యుద్ధం మాదిరి వర్ణించారు శ్రీ అరవిందులు. పరాశక్తి అవతారమైన ఆ మహాతల్లి యమునికి బోధించిన వాక్యాలలో ఒక దివ్యగీత, ఆ గీత ప్రభావం యమునిపై విస్తృతంగా ఉండడానికి తన ఆదిశక్తి స్వరూపాన్ని యమునికి చూపించడంలో ఒక విశ్వరూప సందర్శనం శ్రీ అరవిందులు వారి కావ్యం చివరి భాగంలో చూపించారు. సావిత్రితోపాటు ప్రతీక స్థితిలో అనంతరాత్రి, ద్విసంధ్యలు గడిచి అనంత ప్రభాతంలో అడుగు పెడతాం.

సావిత్రి యముని జయించి విధిని మార్చింది. యముని పాశం నుంచి సత్యవంతుడు విముక్తుడైనాడు. పాశిక తిమిరం ఆవరించిన ఆత్మ సత్య స్వరూపం తేజోమయం అయింది. గాథగా ప్రతీకగా సావిత్రికావ్యం శుభాంతం అవుతుంది. అయితే ఈ ముగింపు ఈ శుభాంతం మానవ చరిత్రలో యింకా వర్తమాన భవిష్యత్తులలో పూర్తి కాలేదు. అది యింకా సాధించవలసి ఉంది. మానవుని దివ్యకరుణంవల్లకాని అది సాధ్యంకాదు. అది శ్రీ అరవిందుల పూర్ణ యోగ సాధనవల్లనే సాధ్యం అవుతుంది.

శ్రీ అరవిందులు ఇంగ్లీషు ఛందస్సులో అన్ని రకముల పద్య రచనలను చేయగలిగి నప్పటికిని బ్లాంక్ వర్స్‌లో వారు సిద్ధహస్తులు. వారి మహాకావ్యం సావిత్రి అంతా బ్లాంక్‌వెర్స్‌లోనే వ్రాశారు. వారి బ్లాంక్‌వెర్స్ మిల్టన్ మహాకవి వ్రాసిన బ్లాంక్‌వెర్స్‌తో కొంతవరకును టెన్నిసన్‌మహాకవివ్రాసిన బ్లాంక్‌వెర్స్‌తో కొంతవరకు పోలి ఉన్నప్పటికిని ఎన్‌జాంబ్‌మెంట్ లేకుండా అనగా ఒక పాదంలోని భావం తరువాత పాదానికి పరుగెత్తకుండా ఏ పాదానికి పాదం స్వయం సమృద్ధంగా ఇటుకలు పేర్చినట్లుండడం వారి కవితా విశేషం.

కాగా మరొక గొప్ప గుణం కూడా వారి కవిత్వంలో ఉంది. అనుష్టుప్ ఛందస్సులో వాల్మీకి మహాకవి సాధించినట్లు శ్రీ అరవిందులు బ్లాంక్‌వెర్స్‌లో మంత్రప్రభావం యిమిడ్చారు.

దివ్యానుభూతి పొందిన కవికి ఆ అనుభవ ప్రసారానికి భాష ఒక ప్రతి బంధకం కాదని శ్రీ అరవిందులు తమ విశ్వకావ్యం అయిన సావిత్రి ద్వారా నిరూపించారు.

ప్రపంచ సాహిత్యంలో శాశ్వతంగా ఏదయినా కావ్యం నిలవడానికి నాలుగు లక్షణాలు కావాలి. ఒకటి అంతర్దర్శనము. రెండు మానవ సనాతన ధర్మంతో సంబంధము. మూడు సహజంగా, సజీవంగా అమరంగా కదిలే పాత్ర పోషణ. నాలుగు ఆత్మగుణం అనగా కవియొక్క ఆత్మ అనుభవించిన దానిని పాఠకుని ఆత్మకు అందించకలిగే గుణం. ఈ నాలుగు గుణాలూ శ్రీ అరవింద విరచిత సావిత్రిలో పుష్కలంగా కనిపిస్తున్నందువల్ల ఈ మహా విశ్వ కావ్యం శాశ్వతంగా ప్రపంచ సాహిత్యంలో నిలుస్తుందనడంలో సందేహం లేదు.

---

# శ్రీ అరవింద మహాకవి

—ఆర్. ఇందిరాదేవి

కవిత్వమొక కళ. ఇతర కళలైన సంగీతము, చిత్రలేఖనము, శిల్పము తదితర లలితకళలవలె కవితగూడ మనకు రస భోగానందముల నందించును. కవిత్వము శబ్దార్థ భావ రసమును మన కొసగును ఈ శబ్దార్థ భావముల ద్వారా వానియొక్క మనో, ప్రాణ, ఆధ్యాత్మిక రూపగుణములను మనలో స్ఫురింప జేయును. వానియొక్క చరమ సత్యమును వానియందును వస్తుచయము నందంతటనుండు పరమాత్మ సాక్షాత్కారమును మనకు కలుగజేయును. దివ్యార్థ, భావ ధ్వనులు కల్గి, దివ్యగుణ యతిప్రాసలు కలిగినదై మధుర మనోహరముగ నుండి ఛందోబద్ధమై, స్వర్గతుల్యమగు దివ్యానందమును చేకూర్చునదియే మహోన్నతమైన కవితాధార. ఇటువంటి కవిత్వమును పోషించినవారే వేదఋషులు, తరువాతివారు శ్రీవాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, భవభూతి, హోమరు, వర్జిల్ మరియు షేక్సిపియర్. నేటియుగమున అత్యంత రసవత్తరమైన గాంభీర్యమైన కవిత్వమును సృష్టించి జ్ఞానభిక్ష పెట్టినవారు శ్రీ అరవిందులు.

శ్రీ అరవిందులు నవ్యభారత నిర్మాతలలో నొకరు. ఆయన దేశారాధకుడు. మహోజ్జ్వల మేధావి. మరియు మహాయోగీశ్వరుడు. కవిగా శ్రీవారికి వారే సాటి. వారెన్నియో కావ్యములు వేదాంతాది గ్రంథములను రచించిరి. శ్రీవాల్మీకి మహర్షి రచించిన రామాయణ మహాకావ్యమువోలె శ్రీవారు రచించిన 'సావిత్రి' అను మహాకావ్యము ఇరువదినాలుగు వేల చరణముల ప్రమాణమున సుమధుర గాంభీర్యమై యొప్పారుచున్నది. శ్రీవారు ఆంగ్లమునందే గాక, సంస్కృతము, వంగ, గ్రీకు, లాటిన్ తదితర భాషలందు కవన మల్లిరి. 'దివ్యజీవనము' అన్న ఒక మహత్తర గ్రంథమును రచించి దైవమార్గానురక్తులకు దివ్యజీవనమును ప్రసాదించిరి.

పుష్పము వికసించిన తోడనే పరిమళము వెదజల్లు రీతి, బాల్యదశలోనే శ్రీవారి కలమునుండి కవితాధార యేకధాటిగా ప్రవహించినది. శ్రీ అరవిందుల

విద్యాభ్యాసము విదేశములోనే ప్రారంభింపబడెను. శ్రీ అరవిందులు భారతీయులైనను బాల్యముననే ఆంగ్ల విద్యాభ్యాసమునకై విదేశమునకు సహోదరులతో సహా పంపబడుటచే హిందూదేశమును గూర్చిగాని హిందూమత సాంప్రదాయములను గూర్చి ఆతని కేమియు తెలియకుండెను. శ్రీ అరవిందుని బాల్యదశ కొంతవఱకు డ్రూయట్ దంపతుల వద్దనే గడచినది. డ్రూయట్ సతీమణి ఈ చిన్ని బాలునికి ఫ్రెంచి, గణితము, చరిత్రయు నేర్పెను. కుశాగ్రబుద్ధి గలవాడగుటచే బాలుడైన శ్రీ అరవిందుడు షేక్స్పియర్, షెల్లీ, కీట్స్, బైబిలీను గూర్చి చక్కగ అవగాహన చేసికొనెను. కవిత్వమన్న ఆతని కమిత ప్రీతి గనుక పద్యములను కొన్నింటిని శ్రీ అరవిందులు రచించెను. ఆ పద్యములు 'ఫాక్స్ ఫామిలీ మాగ్గయిన్' లో ప్రచురింపబడినవి. పాఠశాలలోని నియమిత గ్రంథములే గాక సమయము దొరికినపుడెల్ల సాహిత్యమును గూర్చి చదువుట యందును, పద్యరచన యందును శ్రీ అరవిందులు కాలమును సద్వినియోగ మొనర్చుచుండెను. పాశ్చాత్యదేశమున ఆంగ్లము, గ్రీకు, లాటిన్ భాషలలో అసమాన్యమైన ప్రజ్ఞగడించి అరవిందులు మాతృదేశమైన హిందూదేశమునకు విచ్చేసెను.

తదుపరి శ్రీవారు బరోడా నగరమున వాసముజేయుచు ప్రధానోపాధ్యాయ పదవిని స్వీకరించిరి. మాతృదేశమున అడుగిడినంతనే ఆయన దృష్టి దేవభాషయైన సంస్కృతము వైపునకు మరలినది. అంత సంస్కృతము నభ్యసింప మొదలిడిరి. అంతియేగాక, వంగభాషను క్షుణ్ణముగా నెఱుగ ప్రయత్నించిరి. సంస్కృతభాషా జ్ఞాన మతిశయ మగుకొలది, ఉపనిషత్తుల సారమంతయు శ్రీవారికి కరతలామకమాయెను భగవద్గీత, రామాయణ, మహాభారతాది గ్రంథములలోని సారమంతయు బాగుగా అవగాహన మొనర్చుకొనిరి. శ్రీ కాళిదాస మహాకవి, భవభూతి, భర్తృహరి రచించిన మహత్తర గ్రంథము లెన్నియో పఠించి హిందూమత సాంప్రదాయములను సంస్కృతి నెఱిగి పండితోత్తములైరి. ఒకవైపు ఆంగ్లసాహిత్యమును, మఱియొకవైపు హైందవ సాహిత్యమును రెంటిని జేర్చి తదేక ధ్యానముతో పఠించుచు తమ యింటినొక గ్రంథాలయముగా మార్చివేసిరి. తమ నెలసరి జీతమును పుస్తకముల కొరకై వ్యయము చేయుచుండిరి. తపాల ద్వారా వారికెన్నడును గ్రంథములు వచ్చినది లేదు. పెద్దపెద్ద జాజికాయపెట్టెలలో పార్సిలుద్వారా వచ్చుచుండెను ; అదియును మాసమునకు

రెండు పర్యాయములు. పది దినములలో వచ్చిన పుస్తకములన్నియు జదివి క్రొత్తపుస్తకముల కెదురు చూచు చుండెడివారు. రైల్వేపార్సల్స్ ద్వార వచ్చిన పుస్తకము లన్నిటి యందును ఫ్రెంచి, లాటిన్, గ్రీకు భాషలయందు రచించిన పుస్తకము లమితముగా నుండినవి.

శ్రీ అరవిందులు సర్వశక్తి సంపన్నులు, విద్యా వాచస్పతి. శ్రీ వారు గ్రంథపఠనమేగాక పద్యరచనయు గావించుచుండిరి. తాము ఇంగ్లడు నందు రచించిన పద్యకావ్యము "సాంగ్స్ టు మిర్‌టిల్లా" (Songs to Myrtilla) అనునది పూర్తి చేసి ముద్రణ గావించిరి. శ్రీ అరవిందులు ఉషఃకాలమున మేల్కాని తేనీరు సేవించి కవిత్వమల్ల నారంభించుచుండిరి. కలమెత్తి వ్రాయ నారంభించుటకు పూర్వ మించుక యాలోచించుచు కూర్చొనెడివారు అతి త్వరగా పద్యములను వ్రాయుదురని చోచదుకాని వ్రాయ మొదలిడినచో లేఖినికి విరామ మొసగెడివారుకాదు. మహాభారతము నుండి యెన్నో యుపాఖ్యానములు ఆంగ్ల మున పద్య రూపమున ననువదించిరి. ఆంగ్లమున నానా ఛందస్సులలో నవ్య వైఖరులలో కవన మల్లిరి. ఆంగ్లభాషలో వారికిగల మేధా సంపత్తు, అసాధా రణ సారస్వతి నంపద అత్యద్భుతము. ఆయన యేకాంత వాస ప్రియుడు, ప్రపంచ సుఖముల కతీతుడు. ఆయన వేతనమంతయు గ్రంథములకే అధికముగ వ్యయమగుచుండెను. 'లవ్ అండ్ డెత్' (Love and Death), 'వూర్వశి' అన్న పద్యములను రచించిరి. బరోడాలో వాసము జేయుతఱి 'సావిత్రి' అన్న కావ్యమును రచించుటకు ప్రారంభించిరి. వంగదేశపు యువకుడు దినేంద్ర కుమారరాయ్ శ్రీ వారితో రెండు సంవత్సరములు గడపిరి. శ్రీ వారి నిరాడంబర జీవితమును గాంచి ఆశ్చర్యచకితుడై వారి జీవితవిశేషములను కొన్నింటి నీవిధ ముగ లఖించిరి.

"విద్యయం దత్యంత అభిలాష గలిగిన మనుజుని నేనిదివరకెన్నడును చూడలేదు. రాత్రులందు పద్యరచనయందు, కావ్యపఠనము నందు నిమగ్ను లగుటచే అరుణోదయమునగాక కొంత ఆలస్యముగ నిదుఃనుండి మేల్కొనుట శ్రీ అరవిందులకు పరిపాటి యయ్యెను. ఆంగ్లమునందు వివిధ ఛందస్సులలో పద్య రచన గావించిరి. ఆంగ్లము ననర్గళముగ మాటాడు మేధాశక్తి వారికి గలదు. వారి కవిత్వము ద్రాక్షాపాకము వలె మధురమై తేటయై నొప్పారు

చుండును. అసమానమైన చాతుర్య భావప్రకాశత ఆయనకుండినది. ఒక్క పదమైనను తప్పుగా ఉపయోగింపరు. ఆయనకు క్షణమాలోచించిన తోడనే కవిత్వము ధారగా ప్రవహించెడిది."

సంస్కృతభాషలో అత్యంత పాండిత్యమును సంపాదించి శ్రీఅరవిందులు రామాయణ, మహాభారతాది ఇతిహాసములలోని కొన్ని భాగములును, శ్రీ కాళిదాసు, భవభూతి తదితర మహాకవులు రచించిన కావ్యముల నాంగ్లమున కనువదించిరి. ఒకపరి సంస్కృతాది కావ్యములను ఆంగ్లమున కనువదించిన పండితోత్తముడైన రమేశ చంద్ర దత్తు, శ్రీ వారిని బరోడాలో గాంచుట తటస్థించెను. శ్రీ వారి అనువాదములను గాంచి అచ్చెరువొంది ఈ విధముగ నుడివెను.

"నేనీ గ్రంథముల ననువదించి నాశక్తినంతయు యించులకు వినియోగించితిని. కాని, నేను జేసిన కృషి వృధాయనుకొందును. మీ అనువాదములను ముందుగ గాంచుట తటస్థించి యుండినచో నేను నా అనువాదములను ముద్రించెడివాడనుగాను, మీ రచనలముందు నా రచన లే పాటి! నా రచనలు బాల్యక్రీడ వంటి వనుటకు సందియము లేదు."

శ్రీ అరవిందులు 1914 వ సంవత్సరమున 'ఆర్య' యను పత్రికను తమ జన్మదినమైన ఆగష్టు 15 వ తేదిన ప్రచురించుటకు ప్రారంభించిరి. 'ఆర్య' లో వేదాంతమును, సాంఘిక శాస్త్రమును రాజకీయములను గూర్చిన అంశలు ముద్రింప బడుచుండెను. అందులో "దివ్యజీవనము" (The Life Divine), "వేదరహస్యము" ( The Secret of Veda ), "గీతావ్యాస సంపుటి" (Essays on the Gita), "భారతీయ సంస్కృతి" (The Foundations of Indian Culture ), "మానవ ఐక్యతా ఆదర్శము" (The Ideal of Human Unity ) తదితర గ్రంథములు క్రమముగ ముద్రింపబడినవి. అవి క్రమేణ పుస్తకములుగా రూపొందినవి, ఒకసారి "ఆర్య" అను పత్రికను గూర్చి శ్రీ వారిట్లునుడివిరి.

"దీని నెవ్వరును తెలిసికొనజాలరు. "ఆర్య" ను స్వక్రమముగ నెఱుగ వలయునన్న ఆంగ్లభాషాజ్ఞాన మత్యవసరము. ఈ విషయ గ్రాహ్యమునకు

చమత్కృతి, అతిశయ జ్ఞాన మెంతేనియు అవసరము. వాస్తవముగ జెప్పవయు నన్న "ఆర్య"లోని శీర్షికలు నా మనోతృప్తికై అనగా నా కొఱకే వ్రాసు కొన్నాను. నా హృదయాంతరములోని భావములను రూపొందించుటకే ఆర్యను రచించితిని"

శ్రీ వారి మాటలు, శ్రీ రామచరిత మానసము నందు శ్రీ తులసీదాసు కావ్యారంభమున "స్వాంతః సుఖాయ రఘునాథగాథా_భాషా నిబంధమతి మంజుళ మాతనోతి" అనగా "శ్రీతులసీదాసు తనఆత్మ సుఖమునకై లేక మనోతృప్తికై, అత్యంత మనోహర భాషయందు, మృదుమధురముగను విస్తారముగను చెప్ప బోవు చున్నాడు' అన్న మాటలను మరల మరల స్మరింపజేయు చున్నవి.

మహత్తర గ్రంథరాజమైన "గీతావ్యాస సంపుటి"యందు శ్రీఅరవిందులు భగవద్గీతను గూర్చి విపులముగ వ్యాఖ్యానించిరి. ఇందు మానవ మాత్రుడయిన అర్జునునకు దివ్యగురువైన శ్రీ కృష్ణునకు జరిగిన సంభాషణమే భగవద్గీత యనిరి. గీతను శ్రీ కృష్ణ దర్జునన కేల బోధించ సమకట్టినది ఒక పరి వఱగ భాషయందు శ్రీ అరవిందులు క్షుణ్ణముగ వివరించిరి. అందులోని కొన్ని అంశములను వివరింతును.

"తన సమకాలికులలో అర్జునుడేమంత ఘనుడుకాడు. వ్యాసుడు దివ్య జ్ఞాన పరిపూర్ణుడు, లౌకిక జ్ఞానమందు భీష్ముడంతటి వాడు లేడనియే చెప్పవచ్చును, జ్ఞాన పిపాస యందు ధృతరాష్ట్రుడును, విదురుడును వారికి వారేసాటి, సాత్త్వక గుణోపేతుడును మరియు సాధు పుంగవుడు ధర్మరాజు. భక్తిమార్గమున అక్రూర ఉద్ధవాదులకు సాటి యెవ్వరును లేరు. అర్జునుని సహోదరుడైన కర్ణుడత్యంత బలశాలి అందరిలోను శ్రీకృష్ణు డర్జునునే యెన్ను కొనెను. గాండీవము మొదలగు దివ్యాస్త్రములను అర్జునుని చేతిలో నుంచెను. శ్రీ కృష్ణపరమాత్ముడు శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలను, విజయలక్ష్మిని అర్జునునకే ప్రసాదించెను. అంతకు మించి అర్జునునకు దివ్యజ్ఞానమును బోధించెను. యేల? ఈ విషయములో శ్రీ కృష్ణభగవానునకు గాని మహాభారతము రచించిన వ్యాసునకు గాని పక్షపాతమే మాత్రమును లేదు. అర్జునుడత్యంత భక్తి విశ్వా సములతో ఆత్మసమర్పణ గావించెను,

యెవరైతే అత్యంత విశ్వాసముతో తనకోరికలకు ప్రాధాన్యమొసగక తన మంచి చెడ్డలకు జవాబుదారి వహింపక, ధన, దారిద్ర్యములు, పాప పుణ్యములన్న ద్వంద్వముల కతీతుడై తనకు నచ్చిన పనుల నొనర్చక భగవదేచ్ఛ ప్రకారము కార్యముల నొనర్చుచు, ఆయన ఉద్దేశించిన పనులను నిర్వర్తించుచు, తన వాంఛలను సఫలీకృతమొనర్చుటకు జూడక, తనలో గొప్పగాయున్నవన్న గుణములకు విజ్ఞివీగక యెవరుండెదరో ఆ కర్మయోగియే భగవానుని యొక్క ప్రాణమిత్రుడును, ఉపకరణమగును. అటువంటి వాని ద్వార భగవానుని యొక్క మహత్తర కార్యములు నెరవేరును.''

అర్జునుడు అత్యంత విశ్వాసముతో సర్వమును భగవానునకు సమర్పణ జేసి కేవలము భగవానుని ఉపకరణమై యుద్ధభూమియందు అస్త్రశస్త్రముల నెల్ల బడవైచి దీనాతి దీనుడుగ కర్తవ్యపాలనను గూర్చి అవతారపురుషుడైన దివ్యగురువైన శ్రీ కృష్ణపరమాత్మని నడిగెను గాన అర్జునుడే భగవానుని శ్రీ ముఖము నుండి గీతను వినుట కర్హుడైనవాడు.

దివ్య గురువైన శ్రీకృష్ణపరమాత్ముడు భగవద్గీతను బోధించిన తక్షణమే అజ్ఞానాంధకారము నుండి విముక్తుడై అర్జునుడు 'అచ్యుతా ! నీ అనుగ్రహ మువలన నా భ్రమ తొలగిపోయినది' దనును, అర్జునునకు గలిగిన భ్రాంతిని తొలగించిన దేదియో దానిని గురించి శ్రీ అరవిందు లీవిధముగ వక్కాణించిరి.

"బంధములను వీడి ఉన్నతస్థానమునకు చేరుటకును, మర్త్యభూమి నుండి—దివ్యభూమికకు పోవుటకు గీతా శాస్త్రమునందు మూడు సోపానము లేర్పాటుప బడియున్నవి. మొదటిది కోరికను త్యజించి సమత్వముతో మానవుడు కర్మయోగిగా తనలో యింతవరకు ఉపలబ్ది పొందని దైవమునకు సర్వమును నొక యజ్ఞముగా అర్పించి కార్యములు సలుపుట. ఇదియే ప్రదానమైన సోపానము. రెండవది కర్మఫలమును త్యజించుచు తాను చేయుచున్నానన్న అహం భావమును కూడ వదలి సర్వమును భగవానుడే యొనర్చుచున్నాడన్న భావన మపలబ్ధి నొందవలయును. కడపట పురుషోత్తముడే ఈ ప్రకృతి కంతయు అధిష్టానము వహించి సర్వమును పురుషోత్తముడేననియు, జీవుడా పురుషోత్త మునియొక్క ప్రకృతిలో అధిష్టించిన పురుషోత్తముని అంశమనియు, సర్వకార్య

ములను పురుషోత్తముడే ప్రకృతిమూలముగ యొనర్చుచున్నాడనియు చూడవల యును. ఆ పురుషోత్తమునికే సర్వకర్మలు నర్పించి మనసత్తనంతయు సమ ర్పించి, చేతన నంతటిని దివ్యచేతనలోనికి లేవనెత్తి ఊర్ధ్వస్థానమునుండి సర్వకార్యములు జరుపుట జరుగుచుండుట తెలిసికొని పరిపూర్ణాధ్యాత్మిక స్వాతం త్ర్యమును పొంది ముక్తుడుగ సంచరించవలయును."

"మొదటిమెట్టు కర్మయోగము, ఇచట గీత కర్మలకే ప్రాశస్త్యమొసగు చున్నది. రెండవది జ్ఞానయోగము, ఆత్మనుపలబ్ధిబొంది జ్ఞానమును సంపా దించుటయే। జ్ఞానమును పొందిన తరువాత కర్మలు విడనాడుట కాదు. కర్మలు జ్ఞానదృష్టితో నొనర్చుచు, కర్మజ్ఞానముల సమ్మేళనము కావలయును. పురు షోత్తముడే దివ్య సత్తాయని యుపలబ్ధి పొంది ఆరాధించవలయును. ఇచ్చట భక్తికి ప్రాధాన్యము, కాని జ్ఞానదశ తక్కువయని భావించక భక్తి,జ్ఞాన,కర్మలు మూడును త్రిపుటియని ఉపలబ్ధి నొందవలయును. భగవంతునిలో లీనమగు టయు, భగవత్ప్రకృతిలో యేకమగుట యను సాధకుడాశించు యజ్ఞఫలము నతడు పొందును.''

## 'సావిత్రి'

మహాకవులైన వాల్మీకి, వ్యాస, కాళిదాసులు — వీరు ముప్పురును ఒక వాఙ్మయమునకు, యుగమునకు ప్రధానమూర్తులు. వీరి కావ్యములు ధర్మార్థకామ మోక్షమను చతుర్విధ పురుషార్థములను ప్రదర్శింపుచు, ఆర్యనాగరికతను, చాటుచున్నది. రామాయణ మాదర్శమైన సంఘమును నీతిప్రాధాన్యమైన అఖండ నాగరికతచే వెలయు మానవసంఘముయొక్క స్వరూపమును చిత్రించుచున్నది. ఇందొక సంఘమునకు ప్రతినిధియైన రావణుడు, సాత్త్వికస్వభావమును వీడి దౌర్జన్యమునకు, హింసాకాండ కొడగట్టి సీతాదేవి నపహరించి రాక్షసకృత్య ములనెన్నియో యొనర్చి తుదకపయశము నొందును. శ్రీరాముడు ధర్మజ్ఞుడై, సర్వభూతహితేరతుడై, సకలగుణోపేతుడై రాక్షసుడైన రావణుని సంహ రించి, ధర్మసంస్థాపన మొనరించెను. ఇటువంటి ఆదర్శయుక్తమైన రామా యణ కావ్యమును రచించి శ్రీ వాల్మీకి మహర్షి చరితార్థుడాయెను. రామాయణ మహాకావ్యము, సుమధుర కోమల మనోజ్ఞ శబ్దరచనతో శోభితమై శ్రవణానంద కరముగను సహజగంభీర్యమై కవితావైభవముతో అలరారుచున్నది. అటులనే

శ్రీ అరవిందులు రచించిన మహాకావ్యమైన సావిత్రి స్నిగ్ధ, గంభీరమై పద లాలిత్యముతో రసవత్తరమై దివ్యజ్ఞాన సమ్మిళితమై యొప్పారుచున్నది. సావిత్రిని పఠించినంతసేపు రామాయణ, మహాభారత రచనావిన్యాసాన్నడుగడుగున మనకు జ్ఞాపకం వస్తుంది. 'సావిత్రి' మహాకావ్య రచనకై శ్రీ అరవిందులు మహాభారతమునుండి కథావస్తువును సేకరించిరి. ఈ కావ్యము ఆంగ్లమునందు రచింపబడెను. ఇందులో ప్రధాన పాత్రలు అశ్వపతి, సావిత్రి, మరియు సత్యవంతుడు. మహాపతివ్రతయైన 'సావిత్రి' కథ యెల్లరెఱింగినదే। ఈ కథ మహాభారతములో వనపర్వము' నందు విశదీకరింపబడినది.

మద్రదేశమునకు రాజయిన అశ్వపతికి సంతానము కలుగలేదు. సంతానము కొఱకై అశ్వపతి అరణ్యమునందు ఘోరతప మొనరింపగ దేవతయైన సావిత్రి సాక్షాత్కరించి సంతానప్రాప్తి కలుగునట్లుల ఆశీర్వదించెను. ఆ జగజ్జనని కటాక్షమువలన అశ్వపతికొక పుత్రిక జన్మించెను. ఆ బిడ్డకు సావిత్రి అని ఆదేవత నామధేయమే నొసగి అశ్వపతి ఆయేకైకపుత్రిక నతి గారాబమున పెంచి పెద్దచేసెను. ఆమె దినదినప్రవర్ధమానయై అత్యంత సౌందర్యవతియై సుగుణశీలయై విరాజిల్లుచున్న సమయమున ఆమెకు, తగిన వరుడితడని నిశ్చయించలేక అశ్వపతి వరాన్వేషణమునకై, ఆమెనే స్వయముగ పంపెను. రెండు సంవత్సరముల తరువాత సావిత్రి వెనుదిరిగివచ్చి ద్యుమత్సేన మహారాజ పుత్రుడే తనకు తగిన వరుడని ఆ తండ్రితో విన్నవించెను. ఇంతలో నారద మునీంద్రుడేతెంచి ద్యుమత్సేన కుమారుడైన సత్యవంతుడల్పాయుష్మంతుడని తెలిపెను.

కాని, సావిత్రి సత్యవంతునే పరిణయమాడ నిశ్చయించినది. ఆమె ఇచ్ఛప్రకారము సత్యవంతునితో ఆమె వివాహము జరిగినది. వివాహానంతరం అంధులైన అత్తమామలకు సేవచేయుచు అరణ్యవాసము చేయసాగెను మహా పతివ్రతయైన సావిత్రి. ఇట్లొక సంవత్సరము గడచినది. ఒకనాడు సత్యవంతుడు కట్టెలుకొట్టి తెచ్చుటకు పోగా, సావిత్రికూడ అతనిని వెంబడించెను. సావిత్రి యమధర్మరాజును గాంచి భయముచెందక, ఆతన్ని మెప్పించి వరమును బడసి, ఆ వరప్రభావముతో సత్యవంతుని మరల సజీవునిగ నొనర్చెను. ఇది మహాభారతములో వర్ణింపబడిన గాథ.

ఈ కథావస్తువు నాధారముగా తీసికొని, శ్రీ అరవిందులు అమృతత్వ మకుటమును సంపాదించుటకు మానవకోటి అన్వేషణమున ఈ కథను రూపొం దించిరి. అజ్ఞానాంధకారము నుండి మేల్కాన్న జీవుడు విజ్ఞానసోపానమును చేరుటకు దివ్యశక్తులైన సత్య, జ్ఞాన, ప్రకాశ అమృతత్వములను బడయుటకు పోరాడు వీరునిగా ప్రాణప్రభువైన అశ్వపతి నిరూపింపబడినాడు. ఆత్మజ్ఞాన మును, ప్రపంచజ్ఞానమును, దివ్యజ్ఞానమును బడయుటకు సంసిద్ధులైన యోగి అశ్వపతి. ఆధ్యాత్మిక మహాశిఖరమునుచేరి అచ్చటనుండి దివ్యసృష్టికర్త్రిణిని ఈమర్త్యలోకమున అవతరించి, దుఃఖము, పాపపుణ్యములు మరియు మృత్యువు నుండి విముక్తి నొందింప జేయుమని అశ్వపతి యిట్లు ప్రార్థించెను:—

ఓ విజ్ఞానతేజ స్వరూపమా ! విశ్వమాతా !
ఓ సృష్టికర్త్రిణి ! నిత్యకళావధూ !
నీలో యిమిడియున్న సజీవాకృతి నింకుక ఈపృథ్వీతలమున
అవతరింపజేయుమా !

నీ యనంతత్వము ఒక తనువునందే జీవించునట్లొనర్చుమా !
మర్త్యచరణములతో ఈ భూమండలమున నడక సాగించు
అమృతమయీ !

ఉచ్ఛ్రేయముల విహరించుచు ఒక ఘనమైన పలుకు పలుకనిమ్ము !
ఒక ఘనకార్యముచేత విధి కవాటము తెరువనిమ్ము.
ఈ భువికిని — ఈ భూలోక మానవులకును నీ మధురత్వమును
ప్రసాదింపుమా !

అశ్వపతి ప్రార్థనలాలకించి కరుణార్ద్ర హృదయమైన దివ్యమాత సాక్షా త్కరించి ఆమె శక్తియే భూలోకమున అవతరించి మానవునిలో పరివర్తనము కలుగ జేయునని చెప్పుచు యిట్లు వరప్రదానము చేసెను:—

ఉగ్రతపస్వీ ! ఓ అశ్వపతీ ! అమిత బలాన్విత మార్గదర్శకా ! ఆల కించితి నీ యార్తనాదము ;
ప్రకృతి నుద్ధరించు ప్రచండ యోగశక్తి పరమాద్భుత దివ్యశక్తి దివ్య మయమై మొనర్చుటకు పృథ్వీనవతరించు

.... .... .... .... .... ....

మృణ్మయ మానవశరీరములో భగవానుడు సాక్షాత్కరించు.

.... .... .... .... .... ....

ప్రకృతి తన మర్త్యభావమున కతీతమై అమృతత్వమును బడయు ;
మార్పునొందని ఇచ్చతో విధిమార్పు నొందగలదు.

ఆ దివ్యశక్తియే ఈ జగత్తున మానవరూపమున సావిత్రిగ అవతరించెను. మానవ జగత్పరిణామమునకు ఆమె మూర్తిత్వము కళ్యాణ ప్రదమైనది. అశ్వపతి కార్యమున కంటె ఈ పృథ్వియందు సావిత్రి యొనర్చినకావ్యమత్యంత భారమైనది. నిశ్చేతనము మరియు అజ్ఞానములో మునిగియున్న మానవుని — భూమిని రక్షించుటయేగాక మృత్యుబారినుండి కాపాడినది. సామాన్యముగ అసత్య, అజ్ఞాన మృత్యువులే మానవునంటిపెట్టుకుని యుండును. సత్య, సౌందర్య, జ్ఞాన, ప్రకాశ, శాంతి, సామంజస్య, అమృతత్వములను మానవుడు బడయుట బహుప్రయాసతో కూడినపని. దివ్యత్వమును—మానవత్వము ఏకీభవింప చేయుటకు సావిత్రి మధ్యవర్తినియై అతీతమానస దివ్యప్రకాశము నుత్పత్తి స్థానమునుండి ధరాతలమునకు ప్రవహింపజేసినది. మానవ సరిహద్దులను జయించుటకు యోగమే సాధనము. కనుక సావిత్రి యోగమార్గము నవలంభించి ప్రప్రథమమున ఆత్మోపలబ్ధిని పొంది, ఈ పృథ్వీతలమున ఆమె తన కార్యమును సఫలీకృత మొనర్చినది.

అమృతత్వమును సంపాదించుటలో సావిత్రి పొందిన పరిణామములను గూర్చి శ్రీ అరవిందు లిట్లు వర్ణించిరి. అశ్వపతివలె సావిత్రి ఉన్నత లోకముల కేగుచు మార్గమధ్యమున దుఃఖమాతను, దివ్యశక్తిని, దివ్యమాతను క్రమముగ దర్శించెను. ఈ ఘనతర శక్తులన్నియు ఆమె పాత్రను గూర్చి న్యాయసమ్మతముగ మాటాడగ ఆమె తృప్తి నొందలేదు. ఈ ఘనతర దివ్యశక్తులేవియు అపరిపూర్ణతనుండి విముక్తి నొందింపలేవని ఆమెకు బాగుగా విదితము. ఆమె పరాచేతనలో ఐక్యతనొంది, ఇంకను ముందుకు పురోగమించి పరాశక్తిని చేరుకొన్నది. తరువాత తన కార్యసాధన అనగా మృత్యువును జయించుటకు సంసిద్ధురాలై యముని సహిత మెదిరించి వానిని పదభ్రష్టుని గావించి అమృతత్వమును బడయుటకు సమకట్టినది. మృత్యుదేవతయైన యముడు సాక్షాత్క

రించి, తనను వైతొలగి పొమ్మన్నమాట కతడాశ్చర్య చకితుడాయెను. తనకు తాను మరణించినచో ఆయన పరివారమైన అజ్ఞాన, నిశ్చేతన, అసత్యము లత నితో గూడ యంతరించ గలవు; పృథ్విపై సత్యము మరియు అమృతత్వము సామ్రాజ్యమొనర్చగలవు. మృత్యుదేవతయైన యము డంత సులభముగ లొంగ లేదు. తనయునికిని తన కర్తవ్యపాలనము నాతడు సమర్థించుకొని, అంతటితో పూరుకొనక ఆమెతో యిటుల వాదించుచు హేళన చేయును:—

సజీవ సత్యమును భువియందు నాటుటకు పాల్పడకుము
ఈ జడప్రపంచమును దివ్యధామముగ నొనర్చుటకు ప్రయత్నించకుము.
సత్య మచ్చటకు రానే రాదు; కాని సత్యముయొక్క తలంపుమాత్రమే।
అక్కడ భగవానుడు లేడుకాని భగవానుని నామము మాత్రమే।

ఆయన వాదము లన్నిటను సావిత్రి నిరసించిన యముడు తుద కామెతో యిట్లనును:—

ఓ అమృతత్వమునకు వారసురాలా।
నీ ఆత్మశక్తిని నాకు వ్యక్తమొనరించుము; నీ ఆత్మశక్తిని బహిరంగపఱచుము.

అప్పుడు నేను సత్యవంతుని నీ కొపగెదను.
ఆ తుదిఘడియ సమీపించెను. పరాశక్తియైన సావిత్రి తన తెరను తొలగించి తన యునికిని వ్యక్తపఱచును.

అప్పుడు మహోజ్వల క్షణము ప్రసన్నమాయెను.
అవతారమూర్తి తన తెర నావలకు వైచెను
.............................................
శాశ్వతము, మృత్యువు నయనములలోనికి చూచెను.
అంధకారము, భగవానుని సజీవ సత్యాకృతిని దర్శించెను.

ఆ దేదీప్యమాన వెలుగును భరించలేక మృత్యువు తనయొక్క నిశ్చే తనములోని బలమును, ఇతర బలములను పిలచి వాటితో సహా సత్యము వేది

లించెను. కాని, విఫలుడై, తుదకు తానా మహత్తర మహోజ్జ్వల వెలుగులోనే లయమై పోయెను. అప్పుడు, దివ్యసత్య జ్యోతులు పృథ్విలో అభివ్యక్త మాయెను. మృత్యువను బంధమును త్రెంచుకొని సత్యవంతుడు సజీవుడై ఈ జగత్తు నమృతతత్వమయముగ యొనర్చెను. ఇది అమృత భూమిగా యెల్లప్పుడు నుండుటకు మార్గదర్శకుడాయెను.

శ్రీ అరవిందు లీ మహత్తర కావ్యమైన 'సావిత్రి'ని సామాన్య పఠితలకు గాక తమకొరకును, కవిత్వముయొక్క పోకడలను, మనోదృష్టిని కథాంశము లను సేవించు వారలకొఱకే రచించితి మనిరి. వేదములను, ఉపనిషత్తుల నే విధముగ పఠింతుమో అటులనే 'సావిత్రి'ని భక్తిశ్రద్ధలతో పఠించవలయును. కేవలము బుద్ధివికాసముకొఱకు దీనిని పఠించుటగాదు, సాధనాసంపత్తిని పొందు టకే ఇది సాధనము. ఈ మహాకావ్యమును తలంపులనెల్ల త్రోసివుచ్చి నిర్మల వృత్తులై పెక్కుమారులు పఠించినచో ఆత్మదర్శనము నొంది దివ్యజ్ఞానముచే విలసిల్లుదురు. యోగసాధన, సిద్ధి కలుగజేయుటకు సావిత్రి యెంతయో ఉపక రించును. ఇందులో ఆధ్యాత్మిక సాధనోపలబ్ధులు మిక్కుటముగ వర్ణింపబడినవి. ఒకసారి సావిత్రిని పఠించిన చాలును అదియే నీకు ప్రాణప్రదమై మార్గదర్శకము కాగలదు.

'సావిత్రి'ని గూర్చి శ్రీ జనని యిట్లు వక్కాణించిరి:—

"'సావిత్రి'ని పఠించుటయే యోగసాధనము మరియు ఆధ్యాత్మిక చేతన నొందుటయు అగును. దైవమునుపలబ్ధి చేసుకొనునట్టువంటి సాధనాసంపత్తందు గలదు. ఇతర యోగరహస్యములే గాక యోగముయొక్క ప్రతిమెట్టునుగూర్చి యిందు చెప్పబడినది. ప్రతి ఒక శ్లోకపాదమున కనబరచిన అంశముల నెవరైతే అవగాహన చేసికొందురో వారలు యోగ పరిణామము నొంది అతీత మానస భూమికకు వాస్తవముగా చేరుకొందురు. యెవరైతే మంచిమార్గమును విడువక ఆకాంక్షింతురో వారలకిది అమోఘమై మార్గదర్శకమై వాని కష్టాక్లేశముల సహాయ మొనర్చుచునే యుండును. 'సావిత్రి'లో కనబరచిన ప్రతి ఒక శ్లోకము మంత్రమై, మానవు డాత్మజ్ఞానముచే పొందినదాని కంటెను అతిశయించునని నేను మరి మరి చెప్పుచున్నాను. అందులో చెప్పబడిన పదములెల్లను లయ బద్ధమై ఓంకారమునకు సన్నిహితకాగలవు.

'సావిత్రి' ఒక గూఢమైన గంభీర్యమైన పద్యకావ్యము. ఇందలి కవిత్వ మొక ప్రత్యేకమైన భావకవిత్వమునందదు; భావ ప్రేరిత భూమిక నుండి ప్రవహించినది కాదు. ఇది వేదోపనిషత్తులవలె ఒక మహత్తర ఊర్ధ్వభూమిక నుండి ప్రవహించిన కవితాధార, రామాయణ, మహాభారతాది కావ్యములలో అధర్మము రూపుమాపుటకును. ధర్మసంస్థాపనార్థమునకు వల్లయు శాస్త్రలు సృష్టింపబడి రచన గావింపబడినది. మానవాత్మ, అధ్యాత్మికపిపాసతో ఉన్నత చైతన్యము గలదై లోకములన్నింటి లోనికి తేజోవంతముగ జొచ్చి, విజ్ఞాన వెలుగు శక్తులలో వానిని మదించి జీవితమును దివ్యమయము చేయు కథావిధానమును శ్రీఅరవిందులు 'సావిత్రి' యను మహాకావ్యములో సృష్టించిరి. భారతదేశములో యున్నదంతయు మహాభారతములో నున్నదనినుడిగలదు. ఆ విధముగనే మానవుని యదార్థమును. అతనిలో నున్నదానినంతటిని, అతడిక సాధించవలసినది—ఇత్యాదులను గూర్చి 'సావిత్రి'లో తెలుపబడినది. శ్రీ అరవిందులు 'సావిత్రి లో నిశ్చేతనా మృత్యువుల స్వరూపములు, బాధకును దుఃఖమునకు కారణములు—వీని నుపశమింపజేయు విధానములు—మానవుని ముక్తి మార్గము—జ్ఞానోపలబ్ధినొందిన పిమ్మట చేయవలసిన దివ్యజీవనము—వీటి నన్నిటను గూర్చి అత్యంత మనోహరముగ చిత్రించినారు. పరమచేతనకును,—నిశ్చేతనకును, కాలాతీతమునకును—కాలమునకును అనేకులు వైపరీత్యమును. విరోధమును, కల్పించి మొదటిది సత్యమనియు రెండవది భ్రాంతి యనియు నిరూపించినారు. శ్రీ అరవిందులు ఈ రెంటికిని గల సామంజస్యము చూపి, ఆ విద్య దివ్యము యొక్క ముసుగనియు, కాలాతీత పరబ్రహ్మయు కాలమునకు మూలమనియు, భగవానుడే ప్రపంచము యొక్క సృష్టికిని స్థితికిని కారణభూతుడై వీనిని తెరవెనుకనుండి పోషించుచున్నాడనియు నిరూపించిరి. శ్రీ వారు పలుమారీ కావ్యములో పరమసత్తా నిశ్చేతనలోనికి దిగు సోపానమును మార్గమును గురించి వివరించినారు. సంపూర్ణజ్ఞానము కలుగుటకు మానవుడు సచ్చిదానందమునకు—మనో, ప్రాణ భౌతికములకు మధ్యనున్న విజ్ఞానస్తరము జేరి అచట స్థాపితుడైనచో ఆ విజ్ఞానశక్తి యొక్క దివ్య ప్రేమానుగ్రహములచే జీవితమును, పృథ్విని దివ్యమయమొనర్చి, యీ లోకమునుండి పలాయన మగుటకు బదులుగ యిచటనే దివ్యజీవనమును సలుప ప్రయత్నించును. ఈ సత్యములే మహాకావ్యములో తేజోవంతముగ చిత్రింపబడినవి.

శ్రీ అరవిందుల యందు వాగ్దేవియైన సరస్వతి, కవిత్వమును ప్రవాహముగ దివ్యావేశపూరిత శ్రుతి రూపకముగ పొంగి పొరలించినది. 'సావిత్రి' లోని కవితా ప్రవాహము సంపూర్ణముగ అధిమనస్సు నుండి ప్రసరించినది. ఇది పుష్టివంతమై, సద్భావములు కలిగి ఉత్తమలయ సమన్వితమై, భాషా ప్రౌఢత కలిగి, రసానంద పూర్ణమై అత్యుత్తమ కవిత్వముగా రాణించుచున్నది.

శ్రీ అరవిందుల కవితామృతమును గ్రోలి, మనమెల్లరును ధన్యజీవుల మగుదుము గాక!

---

# శ్రీ అరవిందుల ఉపన్యాసములు

— కె. బి. సీతారామయ్య

'ఎందరో మహానుభావులు' కాని కొందరే అవతార పురుషులు. ఆ కొందరిలో 'నభూతోనభవిష్యతి' అను నట్టి వ్యక్తి శ్రీ అరవింద లొక్కరే. సామాన్యముగ ఎంతటి ఘనుల గురించియైనను ఏ పొగడ్త అతిశయోక్తిగ దోచునో అట్టి పొగడ్తలు వేయి శ్రీ అరవిందుల మహత్తులో దశాంశ భాగమును జూప జాలదు.

1907—9 సంవత్సరములలో వారింకను బాబు అరబిందోఘోష్. మహా యోగికాదు. శ్రీఅరవిందులు కాదు. కాని అప్పటికే వారి సమాన ప్రతిభా వంతులు, బరోడాలో తమకున్న గణ్య స్థానము వదలి రాజకీయ రంగము ప్రవేశించి జాతీయ తనే ఒక మతముగ భావించి తమ ఉపన్యాసములతో శ్రోతల మనసుల కొక క్రొత్త జ్ఞానము, హృదయముల కొక క్రొత్త భావము, జీవితముల కొక క్రొత్తమార్గము ప్రసాదించుచుండిరి.

ఆయన ఇచ్చిన ఉపన్యాసములెన్నియో మనికిపుడలభ్యములు. ఆశ్రమమున ముద్రింపబడిన 'Speeches' లో పండ్రెండుపన్యాసములే కలవు. 'Publishers' Note' లో "The speeches here collected comprise only those which it has been possible to trace from old journals,-for many there are no records-" అని చెప్పబడినది. ఆ పండ్రెండుపన్యాస ములలోను ఏడు మాత్రమే పూర్తిగా కలవు. తక్కిన వాని సారాంశము లివ్వ బడినవి.

సారాంశములు జదువునపుడు వారేమి చెప్పియుందురో అను కుతూహల మును, మన మది తెలియలేమను నిరాశయు నేక కాలమున కలుగును. 'వందే మాతరం' జాతీయ గీతమును గురించి యుపన్యసించున్నపుడు మాతృ దేశవిషయమున నెట్టి భావన కలియుండవలెనని చెప్పిరన్న తర్వాత సారాంశ మిట్లు కలదు. "The speaker then unfolded the meaning of the song. As with the individual, so with the nation there were

three bodies or *Kosas*, the *Sthula*, *Suksma* and *Karana Sariras*. In this way the speaker went on clearing up the hidden meaning of the sorg. The manner in which he treated of love and devotion was exceedingly touching and the audience sat before him like dum statues not knowing where they were on whether they were listenirg to a prophet revealing to them the higher mysteries of life.''

మనము శిలా ప్రతిమల వలె విని యానందించు భాగ్యము లేకున్నను ఎట్లు వారా విషయమును వివరించిరని తెలియలేకుండుట మన దురదృష్టమే.

కొన్ని సారాంశములు విశదముగా నుండుటచేత మనకు వారేల చెప్పిరనుట బాగుగ తెలియుచున్నది.

1909 సంవత్సరమున కుమర్తులియను స్థలమున ఇచ్చిన ఉపన్యాసమున వారి 'శ్రేయోభిలాషులు'( Friends' 'ఇద్దరు వారు రాజకీయ రంగమును వదల గోరియుండుటను గూర్చి వారపహసించి యుండుట సారాంశము మూలముననే దెలియగల్గుచున్నది. ఆఇద్దరిలో మొదటి అతను 'The Hare Street Friend, His friend said that he had heard that Sj. Aurobindo Ghose had promised to devote himself to literature and religion, and it was strange that Mr. Ghose should go to Jhalkati and make speeches on Swadeshi and Boycott.

He (the Speaker) was devotirg himself to literature and religion. He was writing as he wrote before on Swraj and Swadeshi, and that was a form of literature. He was speaking on Swaraj and Swadeshi and that was part of his religion. (Cheers)

రెండవ అతను "The Madras Friend".

There were other friends who were nearer to us than those he had mentioned, but they also were dissatified with his activities. There was, for instance, a friend in Madras — "The Indian Patriot" — who invited him to give up politics

and became a Sanyasi. This anxiety for his spiritual welfare some what surprised him at the time, but he was yet more surprised by persistence of his friend's anxiety. One reason for suggesting inactivity to him was that he was imperilling his safety. That was a very singular reason to put before a public man for shirking his duty."

ఇది సారాంశమే ఐనను వివరముగ నుండుటవలన వక్త ఇట్టిదే చెప్పెను, ఇట్లే చెప్పెను అని తెలియుచున్నది.

పై వాక్యములు చదువునపుడు మనకొక సందేహము కలుగక తప్పదు. శ్రీ అరవిందులు "శ్రేయోభిలాషుల" మాటల నప్పు డపహసించినను తర్వాత వారదే రీతి రాజకీయరంగము వదలి సాహిత్యము, మతము – సంకుచితార్థమున కాకున్నను యోగమను అర్థమున – అవలంబించిరికదా? అట్లవలంబించుట "a public man shirking his duty" అగునా కాదా?

శ్రీ అరవిందులు తమ జీవితమున ప్రతి ఘట్టమందును దైవము ప్రేరేపించిన రీతి నడచిరనుట మనము జ్ఞాపకముంచుకొన్న వారి కీనాటి "duty" రేపుండజాలదని తెలియగలదు. ఆ "duty" లలో వైపరీత్యమేమియు కనబడదు.

ఆశ్రమమున ముద్రితమైన పండ్రెండుపన్యాసములందే మొదటి భాగములోని ఆరు ఒక ధోరణిలోను, రెండవభాగములోని ఆరు వేఱొక ధోరణిలోను కలవు. ఆ రెండు ధోరణులందు పూర్వాపరవిరోధము (Inconsistences) కన్న వికాశనము (development) చూచుచున్నాము, రాజకీయము వదలి వారేకాంతతలో నూతనలోకమును సృజింప నొనర్చిన యత్నమును వారి పూర్వజీవితపు వికాశనమే కాని వేఱుకాదు.

మొదటి యారుపన్యాసములలో జాతీయత మతముగ, ధర్మముగ గణింపబడినవి. తర్వాతివానిలో ధర్మమే జాతీయతగ గణింపబడినది. ఖ్యాతిగాంచిన "ఉత్తరపరా" ఉపన్యాసమున వారే చక్కగ తెలిపినారు. "I say no longer that Nationalism is a creed, a religion, a faith; I say that it is the Sanathana Dharma which for us is Nationalism."

అలిపూర్ బాంబుకేసు సందర్భమున వారు జైలులో నున్నపుడు వారికి కల్గిన ఆత్మానుభవమే ఆ మార్పుకు కారణము. జైలులో, కోర్టులో శ్రీకృష్ణుని, వాసుదేవుని వారెల్లెడల దర్శించిరి. "I looked at the jail that secluded me from men and it was no longer by its high walls that I was imprisoned; no, it was Vasudeva who surrounded me. I walked under the branches of the tree in front of my cell but it was not the tree, I knew it was Vasudeva, it was Sri Krishna whom I saw standing there and holding over me in his shade.. Or I lay on the coarse blankets that were given me for a couch and felt the arms of Sri Krishna around me, the arms of my Friend and lover "

వారి పంద్రెడుపన్యాసములును దైవప్రేరితముగను (Inspired) ప్రబోధాత్మముగను (Inspiring) ఉన్నవనుటలో సందేహంలేదు.

"The Presnt Situation" అను ఉపన్యాసమున భారతదేశ విమోచనము సాధుజనులతో ప్రారంభమైనదనునపుడు శ్రీరామకృష్ణపరమహంస ఆంగ్లవిద్యనభ్యసించిన భారతీయునకెట్లగబడునో యనుచు నిట్లు వ్యాఖ్యానించిరి.

He will say, "This man is ignorant What does he know? What can he teach me who have received, from the west all that it can teach?" But God knew what he was doing. He sent that man to Bengal and set him in the temple at Dakshineshwar in Calcutta, and from north and south and East and West, the educated men, men who were the pride of the university, who had studied all that Europe can teach, came to fall at the feet of the ascetic. The work of salvation, the work of raising India was begun.

"The Present Situation" మొదటిభాగము యుపన్యాసము. రెండవ భాగమునగం "The Right of Association" లో సమత (Equality) గురించి యిట్లు చెప్పినారు.

Our religion, our philosphy set equality forward as the essential condition of emancipation. All religions send us this message in a diffrent form but it is one messege christianity says we are all brothers, Children of one God, Mahomedanism says we are the subjects and servents of one Allah, we are all equal in the sight of God. Hinduism says there is one without a secod. In the high and the low, in the Brahmin and sudra, in the saint and the sinner, there is one Narayana, one God and he is the soul of all men, Not until you have realised him, known Narayana in all, and the Brahmin and the sudra the high and the low, the saint and the sinner are equal in your eye, then and not until then you have knowledge, you have freedom, until then you are bound and ignorant.

దైవప్రేరితోపన్యాసముల శైలి ప్రత్యేకమైనదని వేరుచెప్పనక్కరలేదు. కృత్రిమముగ గూర్చిన పదములనెడి పూసలాశైలియందు కానలేము. భావోద్వేగము ఆవేశము అందు చూడ సాధ్యముగాదు. పదచమత్కృతి పాండితీ ప్రకర్షల కందు స్థానమేలేదు. వాక్కులు అందు సత్యావిష్కరణమునకు సాధనములు మాత్రమే.

వాక్యముల నడకలలో ఉపమానముల నుపయోగించురీతిలో కావ్యగుణ మందందు కానవచ్చును. బరయ్‌పూర్ ఉపన్యాసమున నుపనిషత్తులోని ఇరు పక్షుల దృష్టాంతము వారప్పటి రాజకీయపరిస్థితికి సమన్వయపరచినది కావ్య ఫక్కియే. ఉత్తరపరాలో నొసగిన ఉపన్యాసమున కానవచ్చు దిగువ వాక్యములలో కావ్యగుణమున్నది; కాని కావ్యగుణముమాత్రము గాదు. శ్రీ అరవిందుల ఆత్మయే అందు ప్రతిధ్వనించుచున్నది.

A hush had fallen on the country and men seemed bewildered; for instead of God's bright heaven full of the vision of the future that had been before us, there seemed to be overhead a leaden sky from which human thunders and lightnings rained. No man seemcd to know which way to

move. But one thing I knew, that as it was the Almighty Power of God which had raised that cry, that hope, so it was the same power which sent down that silence. He who was in the shouting and the movements was also in the pause and the hush.

ప్రతి యుపన్యాసమందును మనము తప్పక జూచు గుణము గాంభీర్యము (depth). రాజకీయమునకు జీవితపు ప్రతి అంగమందును దైవశక్తిని జూచుట చేత వారి వాక్యములందు గంభీరత చూడగల్గుచున్నాము. ఆ దైవశక్తిని వారు మాతగ (The Mother) దర్శించినారు. ఉపన్యాసములలో ప్రారంభముననే, నేషనల్ కాలేజి విద్యార్థులతో ఈ రీతి చెప్పుట చూచుచున్నాము.

' I take it that whatever respect you have shown me today was not shown to me, not merely even to the principal but to your country, to the mother in me, because what little I have done has been done for her, and the slight suffering that Iam going to endure will be endured for her sake."

కుమ్తలి ఉపన్యాస మీ రీతి ముగియుచున్నది.

' If they were unfaithful now, let them remember to whom they would be unfaithful—, to themselves, their vows, to the future of the country, to god, to their Mother."

దేశమున జూపిన శక్తిని తర్వాత వారు యోగశక్తిగ జూచి యాశక్తి యవతారమును జూచిన పిదప తమ ఆశ్రమమును, ప్రపంచము భవిష్యత్తును ఆమె చేతిలో నుంచిరి.

శ్రీ అరవిందుల శతజయంతి భారత స్వాతంత్ర్య రజతోత్సవమును నేడు ఈ సందర్భమున ఆ శక్తి, మన దేశమును గమ్యస్థానమునకు జేర్చి, ఆమెయే చెప్పినట్లు భారతమును ప్రపంచగురువుగా ("The Guru of the world") నిలుపుగాక యని ప్రార్థింతము.

———

# శ్రీ అరవిందులు - భారతదేశముయొక్క పునర్నిర్మాణము

— వి. మన్ మోహన్ రెడ్డి

శ్రీ అరవిందులు దశావతారముల క్రమమున కడపటి కల్కి అవతార భగవానుడు. శ్రీ మాత పరాత్పర శక్తి. ఈ మహాశక్తి మొదటిసారి ఈ ప్రపంచమునందు పూర్ణ దివ్యశక్తితో అవతరించింది. ఇదివరకు పార్వతివలె, సీతవలె, మహాలక్ష్మివలె జగత్ కల్యాణముకొరకు అవతరించియుండెను; కాని పూర్ణరూపంగా, పూర్ణ శక్తితో ఈ సారి యావత్తు ప్రపంచాన్ని మార్చేందుకు వచ్చినది. ఇదివరకు ఎందరో మహాపురుషులు ఈ భువి మీద అవతరించినారు. ప్రబోధములు గావించినారు; కాని ప్రపంచలో చెప్పుకోదగ్గ మార్పు రాలేదు. మార్పు ఎందుకు రాలేదు? అని ప్రశ్నించగా ఒక సమాధానం మనకు స్ఫురించగలదు. ఇది వరకు మహాపురుషుల ఏకైక ధ్యేయం కేవలం మోక్షం మాత్రమే అయియుండెను. వ్యక్తిగత మోక్షమే మహా పురుషుల, ఋషుల, ప్రవక్తల ప్రబోధసారం. ఇంతకు పూర్వము ఎప్పుడూ ప్రపంచాన్ని మార్చేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. విజ్ఞానంలో ప్రతిరోజు పరివర్తన కలుగుతూంది. మానవ జ్ఞాన పరిధులు విస్తరిస్తున్నవి. కాని నైతికంగా, ఆధ్యాత్మికంగా ప్రజలు ఏమాత్రం మారలేదు. ఆధ్యాత్మిక ప్రపంచం. లౌకిక ప్రపంచం, రెండూ వేరువేరుగా భావింపబడ్డవి. ఈ రెండింటి మధ్య ఒక పెద్ద అగాధం ఏర్పడ్డది. అందుకొరకే ఈ ప్రపంచం మంచి ఆధ్యాత్మికం అస్త ప్రాయమైంది. ప్రజల్లో అవినీతి ఏర్పడ్డది. ఈఅవినీతి, ప్రభుత్వ శాసనములతో లేక అల్ప సంస్కరణలతో నిర్మూలింపబడదు. ఒక పెద్ద మార్పు మనిషిలోనే రావలెను. మనిషి మార్పే ప్రపంచం మార్పు. అందుకొరకే ఈసారి ఆ జగ ద్రక్షకుడు, సర్వవ్యాపకుడు శ్రీ అరవిందులై, ఆ జగన్మాత, ఆ ఆదిశక్తి మన శ్రీ అరవిందస్థ మాతయై ఈ భువిపై అవతరించినారు శ్రీ మాత. శ్రీ అరవిందుల శక్తి. ప్రపంచంలో శాశ్వతమైన మార్పు దివ్య శక్తియే తేగలదు. అందు కొరకు ఈ పారి భగవానుడు శ్రీ మాతను వెంట తీసుకొచ్చారు. ఆమె ఏకైక గమ్యం—ప్రపంచపు మార్పే. వీరు కవి వివి ఎఱుగని

ఒక నూతన భగవత్ తత్త్వమును కనిపెట్టినారు. దాని పేరు 'అతి మానసికము'. దీని మరోపేరు అనన్యశక్తి, దివ్యశక్తి. ఈ శక్తి, పైన పేర్కొనిన రెండు ప్రపంచముల మధ్యగల అగాధాన్ని పూరించగలదు. ఈ శక్తి ఒక దివ్య సేతువు, దివ్య పరివర్తనయొక్క బీగం. మన 'బహుప్రపంచాన్ని' మరియు "దివ్య ఏకప్రపంచాన్ని" శాశ్వతంగా పొందుపరచగలదు. దాని సామర్థ్యం అమోఘము, బలపరాక్రమము అపారం. ఎవరూ ప్రతిఘటించలేరు. అందు కొరకే శ్రీ మాత ఒక ప్రళయాత్మకమైన మార్పుయొక్క బీగమును చేపట్టి నది. శ్రీ మాతారవిందులు కేవలం ప్రబోధించేందుకు ఈ ప్రపంచంలో అవ తరించలేదు. వారిరువురు వ్రాసిన గ్రంథాలు అమూలాగ్రమైన మార్పుకొరకే వారు అవతరించింది రూపాంతరముకొరకే. ఈ మార్పు మన వ్యక్తిగత ఇచ్ఛమీద ఏమాత్రం ఆధారపడదు. అది బలత్కారంగా ప్రపంచాన్ని మార్చ గలదు. ఇదివరకు మహాపురుషులు ప్రబోధించింది "సత్యం" ఇప్పుడు వీరిరువురు చెప్పేది "పరమ సత్యం".

ప్రస్తుత కలుషిత, అవినీతిమయ ప్రపంచంలో అతిమానసిక జాతి అవ తరించునా? పరమ సత్యము ప్రపంచంలో అవతరించింది. అందుకొరకే అసత్యము పలాయనం అవుతుంది. అతిమానస మనుష్యుడు అవతరించక ముందు ఈ లోపభూయిష్ఠమైన ప్రపంచాన్ని పూర్తిగా ఆర్థికంగా, రాజకీయంగా మార్చవలెను. అమూలాగ్రమైన మార్పు రావలెను. ఊహించలేనంతటి మార్పు రావలెను పాత ప్రపంచాన్ని మరవవలెను. క్రొత్త ప్రపంచము రూపురేఖలను ఆలోచించి నూతన ప్రణాళికను తయారుచేయవలెను. ఇదివరకు జరిగిన అన్ని విప్లవాలు — అమెరికన్, ఫ్రెంచ్, రష్యన్ — శ్రీ మాతారవింద అతిమానసిక విప్లవానికి మైలురాళ్లుగా పరిణమించినవి. అతిమానస మానవుడు ఈ బీద, ధనికవర్గ పీడిత ప్రపంచంలో అవతరించడు. తన ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిసరాన్ని, వాతావరణాన్ని చక్కగా దిద్దుకున్న తర్వాత ఈ భూమిమీద ఆవిర్భూతుడు కాగలడు.

## ఆర్థిక విప్లవం

శ్రీ మాతారవిందులు ధనం గురించి కొన్ని మూల సూత్రాలు వ్రాశారు. "దివ్యజ్యోతి" సంచికలో. ఈ సూక్తులు సేకరించినాము. డబ్బు శ్రీ తల్లిగారి

అంశము. దాన్ని మన ప్రపంచానికి శ్రీ మాత ప్రసాదించింది. నిజంగా ఆమెయే డబ్బుకు, లక్ష్మికి మూలం. లక్ష్మీదేవత ఆమె అంశమే. ప్రస్తుత అశాంతి, కల్లోలాలు డబ్బుగురించినవే. అధికారము, మరియు డబ్బు—ఈ రెండు ప్రపంచాన్ని కలతపరుస్తున్నవి. ఈ రెండిటి కుతంత్రపు పొత్తును పటాపంచలు చేయవలెను. డబ్బు అందరికి కావలెను. శ్రీ తల్లిగారి శెలవు ప్రకారం ఇప్పుడు డబ్బు దుష్ట శక్తుల చేతుల్లో చిక్కింది. దీని ముక్తికొరకు పోరాటం సల్పవలెను. రష్యన్ విప్లవం ఈ పోరాటంలో మొదటి మైలురాయి. కాని ఇప్పటి వరకు రష్యా ఆదర్శ సమాజాన్ని నిర్మింపజాలలేదు. కారణమేమనగా, అమూలాగ్రమైన మార్పు తేచ్చే ఆవేశంలో, ఉద్రిక్తతలో అసలు వ్యక్తిత్వాన్ని పోషించే ఆధ్యాత్మికతను తన ప్రణాళికనుంచి నిషేధించిది. ఇప్పుడు ఈ లోటును మనం సవరించుకొనవలెను. ఇటు హైద్రాబాదులో నల్గురు, అటు తాడిప్రతిలో డజను శిష్యులు లేక ఏ తెనాలిలోనో ఐదుగురితోను ఈ ప్రపంచం బాగుపడదు. పాత యోగాలవలె ఈ సమగ్ర యోగం ప్రపంచాన్ని బహిష్కరించదు. యావత్తు ప్రపంచాన్ని మార్చవలెను. శ్రీ అరవిందుల విప్లవం అన్ని విప్లవాలకు మూలం. ఇదివరకు జరిగినవి అంశిక విప్లవాలు. శ్రీ మాతారవిందులది సమగ్ర లేక పరిపూర్ణ విప్లవం. అమెరికాలో రాజకీయ 'స్వయం ప్రతిపత్తి' గురించి, ఫ్రాన్సులో స్వాతంత్ర్యం గురించి, రష్యాలో ఆర్థిక సమానత్వం కొరకు విప్లవాలు జరిగాయి. శ్రీఅరవిందుల శెలవుప్రకారం స్వాతంత్ర్యం, సమానత్వం. సౌభ్రాతృత్వం—ఈ మూడు రాజకీయ మంత్రాలు. ఆధ్యాత్మిక రంగానికి ఉపనిషత్తు మహావాక్యాలు ('అహం బ్రహ్మాస్మి' ఇత్యాది) ఏలాగో. రాజకీయ రంగానికి ఈ పైన చెప్పబడ్డ మంత్రత్రయం అలాగు. ఫ్రెంచ్ విప్లవం స్వాతంత్ర్యాన్ని సాధించింది, రష్యా ఆర్థిక సమానత్వాన్ని సాధించింది. మన భారతదేశం సౌభ్రాతృత్వాన్ని ప్రపంచానికి భిక్షపెట్టవలెను. అప్పుడే స్వాతంత్ర్యం, సమానత్వం—ఈ రెండు చక్కగా అమర్చబడుతవి. అప్పటి వరకు ఈ రెండింటిలో పరస్పర వైరుధ్య ముండగలదు. అందుకొరకే రష్యా మరియు పాశ్చాత్య ప్రజాస్వామ్యాలమధ్య పెద్ద అగాధం ఎర్పడ్డది. ఇప్పటి వరకు స్వాతంత్ర్యము సమానత్వములమధ్య సామరస్యం కుదరలేదు. సౌభ్రాతృత్వం సాధించినప్పుడే, ఈ రెండింటి కలయిక, సహజీవనం ఏర్పడును ఈ మూడు బ్రహ్మ విష్ణు శివత్రయంవలె లేక సత్—చిత్—ఆనందములవలె ఒకే ఉమ్మడి మంత్రము. ఈ మూడింటిని మనము వేరుపరచలేము. ఎందు

కనగా, ఇవి ఆత్మయొక్క గుణములు. ఈ మూడు ఒకే క్రాడు యొక్క మూడు పురులు. సౌభ్రాతృత్వం రాజకీయ పారిభాషిక శబ్దం కాదు. అది ఆధ్యాత్మికతా గర్భితమైన ఏకాక్షర బీజమంత్రము. భారతదేశమే దీనిని సాధించగలదు. 'సౌభ్రాతృత్వం' యొక్క నిర్వచనం అంత తేలికగా చెప్పలేము.

మానసికంగా, బౌద్ధికంగా తెలుసుకోలేము. అనుభవరీత్యా, భావనద్వారా కొంత తెలుసుకోగలము. ఎప్పుడైతే మనము ఇతరులతో నిజమైన సోదరభావం స్థాపించగలమో అప్పుడు మనం దీని గూడార్థమును తెలుసుకోగలము. అందరూ శ్రీమాత బిడ్డలే. ఈ భావానికి మొదటి గీటురాయి ఆర్థిక సమానత్వం. డబ్బు మనలో ఇమిడియున్న దేవత్వాన్ని పెంపొందించుకునేందుకే వినియోగించవలెను. భగవత్ ఐశ్వర్య ఆవిర్భావాన్ని ఎక్కువ ప్రకటింపజేయవలెను. రష్యన్ విప్లవకారుల ఉద్దేశము మొదట బాగానే యుండెను. కాని తర్వాత వికృతమైనది. అతిమానసిక విప్లవం రాకముందు దారిద్ర్యం. జాతివిచక్షణ, కులమత తారతమ్యాలు నిర్మూలింపబడెను. ఇది శ్రీమాతారవింద యుగం మనకు నిజంగా శ్రీవారి మీద భక్తివుంటే భారతదేశాన్ని యావత్తు ప్రపంచానికి గురువుగా, ఆదర్శంగా చేయవలెను. భారతీయు లందరూ ఉమ్మడి కుటుంబమే, వసుధైక కుటుంబమే. శిష్యులు ఎక్కడెక్కడ ఉన్నారో అక్కడక్కడ చిన్న చిన్న అరోవిల్ నివాసస్థలాలు స్థాపించవలెను. అంతవరకు ప్రపంచం మారదు.

## క్రొత్త రాజకీయ సంహిత

ప్రస్తుత రాజకీయ విధానము లోపభూయిష్టమైనది. వ్యవస్థ పాతది. అల్ప సంస్కరణలతో ఈ వ్యవస్థను దిద్దలేము. అయిదు సార్వజనిక ఎన్నికల తర్వాత కూడ అవినీతి పెరుగుతుంది. వోట్లు కొనుక్కుంటున్నారు. ప్రజాస్వామిక వ్యవస్థ మంచిదే. పంచాయతి వ్యవస్థ మెచ్చుకోదగ్గదే. ప్రజాస్వామ్యము మనిషి వ్యక్తిత్వాన్ని పెంచుతుంది. మనిషికి స్వేచ్ఛ కావలెను; కాని మన సమాజంలో ఎక్కువ స్వేచ్ఛతో మనం చెడిపోతున్నాము. ధనం అందరికి అందుబాటులో యుండవలెను. కాని కొందరు అజీర్ణంతోను. కొందరు క్షుద్బాధతోను పీడింపబడుతున్నారు. విజ్ఞానం పాశ్చాత్యదేశం యొక్క భిక్ష. వేదాంతం ప్రాచ్యదేశాల భిక్ష.

16-12-1971 నుంచి, భారతదేశంలో క్రొత్తయుగం ప్రారంభమైంది. పాశ్చాత్య 'డిప్లోమసి' పరాజయమైంది. బంగ్లాదేశ్‌లో ప్రజాస్వామ్యం సంకటంలోఉంటే, అమెరికన్ లింకన్ మహాశయుడు చెప్పిన ప్రజాస్వామిక సూత్రాలు వల్లించుకుంటూ, సప్తమ అకాదళాన్ని పంపింది. దీనితో భారతీయులు ఒక గుణపాఠం నేర్చుకోవాలి. అది ఏమనగా ఇక యావత్తు పాశ్చాత్య సభ్యతను మనం అనుకరించే ముందు దానిని బాగా పరిశీలించవలయును. పాశ్చాత్య సభ్యతయొక్క విశిష్టత్వం, గురుత్వం పోయింది. శ్రీమాత నుడివినట్లు రాజకీయం ఒక పెద్ద కుంభకోణం. రాజకీయవేత్తలు తమ హద్దులను మించి పోతున్నారు. వేదకర్తల్లాగ వ్యవహరించుతున్నారు. రాజకీయ వాతావరణం ఈలాగే ఉంటే భారతదేశం పురోగమించదు. అందు కొరకు రాజకీయ సదస్సులు ఏర్పాటుచేసి, గొప్ప మేధావులు చర్చించి, ఒక నూతన రాజకీయ సంహితను తయారుచేయవలెను.

## సాంఘిక పునర్నిర్మాణము

నియంతృత్వ రాజకీయ విధానంలో వ్యక్తికి ఏమాత్రం ప్రాధాన్యతలేదు. సమిష్టికే ప్రాధాన్యత యున్నది. ఇటు ప్రజాస్వామిక రాజకీయ వ్యవస్థలో వ్యక్తికి కావలసినదానికన్న ఎక్కువ స్వేచ్ఛయున్నది. ఈ రెండు తెగలవారి మధ్య అగాధం పెరుగుతూనే యున్నది. అటు మార్క్సిస్టు ఇటు క్యాపిటలిస్టు విధానాలలో సామరస్యం కుదరలేదు. భారతదేశమే ఈ రెండింటిని సమన్వయం చేయగలదు. అసలు పాశ్చాత్య రాజకీయతత్త్వ వేత్తలకు సమిష్టి-వ్యక్తి సంబంధాన్ని గురించి మూలసూత్రాలు స్ఫురించలేదు. మూలానికిపోక పైపైననే వ్యాఖ్యానించుచున్నారు. ఏ శాస్త్రానికైన ఆధ్యాత్మికం మూలం ఎన్ని వివిధ విజ్ఞాన విభాగాలు (డిపార్ట్‌మెంట్సు) ఉన్ననో, అవన్ని నిజానికి ఆధ్యాత్మికము యొక్క ఉపశాఖలే. శ్రీమాతారవిందుల అతిమానసిక దృష్ట్యా వ్యక్తి, సమిష్టి- ఈ రెండు ఆ పరాత్పర సచ్చిదానందముయొక్క ఆవిర్భావాలే. అనగా వ్యక్తి మరియు సమాజం ఈ రెండు ఆ పరాత్పరునియొక్క రూపాలే. అందుకొరకు ఈ రెండింటిలో మూలతః భేదంలేదు. ఈ రెండు పరస్పర పూరకులు. వ్యక్తి సమాజం కొరకు కృషిచేయాలి. సమాజం వ్యక్తిత్వ పోషణ కొరకు తగిన వాతావరణాన్ని సృష్టించవలెను. ఒక దానికి ఒకటి ఆధారముగా మండవలెను.

ఈ సాంఘిక తత్త్వశాస్త్రము శ్రీ అరవిందులు తన గ్రంథాలలో చక్కగా వ్రాసినారు. అందుకొరకే ధనికవర్గం నిర్మూలింపబడవలెను. ఇప్పుడు జాతికి తగిన నిర్వచనమేలేదు హిట్లర్ జర్మన్ జాతిని తనకు తోచినట్లు నిర్వచించాడు. నిజంగా జాతి మనిషివలె ఒక సమిష్టివ్యక్తి. అదికూడ ఆత్మగత వ్యక్తియే. ఇప్పుడు జాతుల్లో పరస్పర కలహముంది. శ్రీ అరవిందుల సాంఘిక తత్త్వాన్ని సరిగా అర్థం చేసుకుంటే అంతర్జాతీయస్థాయిలో ఏర్పడ్డ అపోహాలు పోవును. అందుకొరకు ఒక నూతన సాంఘిక శాస్త్రాన్ని రూపొందించాలి.

## సమగ్ర విద్యావిధానం

ప్రస్తుత విద్యావిధానం పాశ్చాత్య దేశాలనుండి తీసుకున్నది. ఎప్పుడైతే పాశ్చాత్య సభ్యతే లోపభూయిష్టమైందో, దాని నుంచి వచ్చిన విద్యా విధానం మనకు సరిపడదు. శ్రీ అరవిందుల దృష్ట్యా ఒక క్రొత్త లేక సమగ్ర విద్యా విధానాన్ని తయారుచేయవలెను. ప్రస్తుత విధానం కేవలం "పొట్ట విద్యా విధానం" అంటే అతిశయోక్తికాదు. ఈ రోజు విద్యార్థులు రేపు కాబోయే పౌరులు. యావత్తు ప్రపంచం వసుధైక కుటుంబం. అందరము సోదరులమే. అన్ని జాతులు ఆ పరాత్పరుని రూపాలే. మన అందర్ని ఐక్యంచేసే విద్యా విధానం తయారుచేసుకోవాలి. సంకుచితత్వం మీద, జాతితత్త్వంమీద ఆధార పడ్డ విద్యా విధానాన్ని ఎత్తివేయవలెను.

## శ్రీ అరవిందపురం (గడ్డిపల్లె) ప్రయోగము

మానవుడు సహజంగా లోపభూయిష్టుడు. మనలో లోపాలున్నాయి. నిజమే అందుకొరకు ఎన్ని లోపాలున్నా ఒక వెలుగు ఈ శ్రీ అరవింద పురంలో కనబడుతుంది. ఇక్కడ జరిగే ప్రయోగం అద్భుతమైనది. అన్ని ఆర్థిక ప్రశ్నలకు, అన్ని సాంఘిక సమస్యలకు ఇక్కడ సమాధానాలు, పరిష్కారాలు కనబడుతున్నవి. మన భారతభూమి అటు రష్యాకుగాని, ఇటు అమెరికాకు గాని తీసిపోలేదు. అన్ని రంగాల్లో మన భారతఖండం ఇతర దేశాలతో సరిసమానంగా ఉండగలదు. మనలో ఒక పెద్ద విప్లవం రావలెను. ఈ విప్లవం శ్రీమాతారవిందులు స్ఫూర్తినుంచే రావలెను. మొట్టమొదట శ్రీ అరవిందుల ప్రబోధ

ములు ఆర్థిక - రాజకీయ పరిష్కారానికి ఈ శ్రీ అరవిందపురంలో అమలు లోకి తేబడ్డవి. ఇది శ్రీ అరవింద కర్మధార అనగా శ్రీ అరవిందులు స్వయంగా తన శక్తిని బాహ్య ప్రపంచాన్ని మార్చేకొరకు ప్రయోగించినాడు. శ్రీ తల్లి గారి ఆశీస్సులతో ఈ చిన్న దివ్యజ్యోతి భారతదేశానికేకాక ప్రపంచానికి వెలుగు చూపును. దీనికి నిదర్శనం శ్రీ అరవిందులు ఇక్కడికే భౌతికరూపంలో వచ్చారు. వారి దైనందిన సాన్నిధ్యం మన సంకల్పాలకు బలం, శక్తి చేకూర్చునుగాక—

---

# నవ ఆధ్యాత్మిక సమాజం - దాని ఆవశ్యకత

— వేలూరి సహజానంద

మామూలు జీవితంలో ఎన్నిరకాలు ఉన్నవో ఆధ్యాత్మిక జీవితంలోను అన్నిరకాలు ఉన్నవి. "ఆధ్యాత్మికం" అనేది మాత్రం ప్రారంభంలో సమానాంశం. ఇక ఆమూలంలోంచి ఎన్నో మార్గాలు విస్తరించుకుంటూ పోతై. ఒక్కొక్కప్పుడు, అదేచిత్రం వీటికి మూలం ఒకటే అయినప్పటికి, తల్లివేరు ఒక్కటే అయినప్పటికి, ఒకదానిలో ఒకటి ఘర్షణపడుతూవుంటై. వివిధ మతాల మధ్య (అనవసరమైన)వైరుధ్యం ఇందుకు నిదర్శనం. ఆస్తికులకు, నాస్తికులకు మధ్య చెలరేగే విరోధంకన్న, అస్తికులమధ్యనే వ్యాపించే ఆజన్మశత్రుత్వం మనలను ఆశ్చర్యపరుస్తూ వుంటుంది. పంచభూతాలకు, ప్రాణానికి, మనస్సుకు అతీతమైన ఏదో ఒకానొక పరమార్థాన్ని, సత్యాన్ని దర్శించినప్పటికి, ఆ సత్యాన్ని జీవితసత్యంగా అనుభవించేక్రమంలో మానవుడు మనస్సునే సాధనంగా ఆశ్రయిస్తున్నాడు. ఏ మనస్సు మూలంగా సృష్టి విచ్ఛిన్నంగా, వికృతంగా, అస్తవ్యస్తంగా అనుభవం అవుతుందో, ఆ మనస్సుద్వారానే దైవాన్ని భావించి, అనుభవిస్తున్నాడు. అందువల్లనే ఇంద్రియగోచరమైన పాంచభౌతిక విషయాల పట్ల ఎలా పరస్పర ఘర్షణలు దాపరిస్తున్నయో, అలాగే అంతర్యామి, అంతస్సత్యం అయిన దైవంపట్ల కూడా సంఘర్షణలు వాటిల్లుతున్నయ్. ఇదీ మూల దోషం.

వివిధమతాల మధ్యనుండే వైరుధ్యాల సంగతి ఇలాఉండగా, ఇక ఆధ్యాత్మిక దర్శనంలోని తారతమ్యాలను చూద్దాం.

విశ్వవ్యాప్తంగా, వివిధమతాల్లో స్థూలంగా రెండు దృక్పథాలు గోచరిస్తయ్. దైవం సత్యం, జగత్తు అసత్యం అనేదీ ఒక దృక్పథం. ఈ సృష్టిలోకి ఎలావచ్చిపడ్డామో, ఇప్పుడుమాత్రం దీంట్లోంచి బైటపడి, దైవంలో లీనమైపోవటమే మార్గం' ఇక రెండవదృక్పథం_ ఇది దైవసృష్టి, దైవంతో పాటు సృష్టికూడా సత్యమే. కాబట్టి దైవతత్వాన్ని సృష్టిలో అవతరింపజేసి,

వ్యాప్తిచేయటమే మానవజన్మకు అర్థం. అయితే మామూలుగా మొదటిమార్గాని కున్న ప్రచారం రెండవమార్గానికి లేనట్టు కన్పిస్తుంది. భగవద్గీతలో సాక్షాత్తు భగవంతుడే తన విశ్వరూపాన్ని ప్రదర్శించి, అవతార–విభూతి–మార్గాన్ని ప్రవచించినప్పటికి, అదేదో కర్మలో చిక్కుకొన్నవారికి చూపిన దారి మాత్రమే నని, సృష్టినుంచి నిష్క్రమించటమే గీతాబోధ అని చెప్పుతూ ఉండటం కద్దు. ఈశ, కేన, కఠ, ఐతరేయ ఇత్యాది ఉపనిషత్తుల్లో సృష్టికూడా సచ్చిదానందపు తేనెపట్టు అని విన్పిస్తున్నా మొత్తంమీద సృష్టి అనేది, కర్మ అదేది అజ్ఞానమని సన్యాసమే ఆధ్యాత్మిక మార్గమని నిర్దేశిస్తూవుంటారు.

సిద్ధాంతరాద్ధాంతాలు ఎలాఉన్నప్పటికి, ఆధ్యాత్మికవాదులు ఏదోవిధంగా సాంఘికజీవితంలో పాల్గొనటమేకాక, జీవితాన్ని ఏదోవిధంగా కాంతిమంతం చేయటానికి ప్రయత్నిస్తూనేవుంటారు. ఈశ్వరుని పరాప్రకృతిని, సచ్చిదానంద–తత్వాన్ని భూమిపై అవతరింపజేయడమే (గీతా) కర్మయోగపు పరమలక్ష్యం అని భగవంతుడే ముఖాముఖీగా మానవుడికి చెప్పినప్పటికి. కర్మయోగమంటే అదేదో కేవలం పరోపకారంమాత్రం అయినట్లుగా కొందరు వ్యవహరిస్తూ ఉంటారు. తోటిమానవుల (ప్రాపంచిక) దురవస్థలవిషయంలో ఏదోవిధంగా తోడ్పడమే స్థూలంగా ఆధ్యాత్మిక కృషిగా వుంటుందేకాని, మానవుల మూల పురుషుడైన పరమేశ్వరుని దివ్యతత్త్వాన్ని సచ్చిదానందాన్ని మానవుల్లో మూర్తీభ వింపజేసేదిగా వుండదు. మనుష్యుడు దైవంలో లీనమవటంతోపాటు, దైవం మనుష్యునిలో ప్రవేశించి, మానవ స్వభావ స్వరూపాలను మళ్లీ కొత్తగా తీర్చి దిద్దగలడు అనే సృజనాత్మకమైన ఆధ్యాత్మిక సంకల్పం ఇంకా మానవజాతి మనస్తత్త్వంలో గాఢంగా వేర్లు తన్నుకోలేదు.

ఉదాహరణకు భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు వివిధ ఆధ్యాత్మిక మార్గాలను నిర్వచించాడు. ఒక్కొక్కడు దైవాన్ని ఒక్కొక్కందుకుగాను ఆశ్రయిస్తాడు. ఇలా నాలుగురకాలవారిని గురించి భగవంతుడు పేర్కొన్నాడు. ఈ నాడు స్థూలంగా మూడుపాయలుగా ఆధ్యాత్మికప్రవంతి ప్రవహిస్తూందని చెప్పవచ్చు. దైవసహాయంతో స్వార్థప్రయోజనాలను నెరవేర్చుకోవాలనుకొవటం ఒకరీతి. ప్రాపంచిక జీవితాన్ని నిర్లిప్తతతో పరిగణిస్తూ, సాధ్యమైనంతవరకు దైవంతో తాదాత్మ్యం పొందటానికి ప్రయత్నించటం మరొకరీతి. ఈ రెండూ

మనకు స్పష్టంగా కనబడుతూవుంటై. ఇవి అనాదిగా వస్తున్నాయ్. ఇక మూడవది జీవితంలో దైవశక్తిని అవతరింపజేసుకొనటం. ఈ మూడవ మార్గం ఇంకా విస్తృతంగా ప్రచారంలోకి, అనుభవంలోకి రావలసి ఉంది.

దైవ—విశ్వాసం లేనివారందరూ మానవతా_విశ్వాసం లేనివారు కారు. దైవధ్యానం లేకుండా మానవసేవచేసెవారు వుంటారు. ఇక దైవపరులు వీరి కన్న భిన్నమైన దృష్టిని, శక్తిని ఆవిర్భవింపజేయగల్గినప్పుడే, ఆధ్యాత్మికవాదుల సాంఘిక కృషికి విశిష్టత దక్కుతుంది. దివ్యత్వం సిద్ధిస్తుంది.

ఇందాక చెప్పిన మూడవమార్గపు ఆధ్యాత్మిక మానవుల సమాజం విశిష్టంగా, ప్రత్యేక రూపురేఖలతో ఏర్పడాలి. అదొక కొత్త సమాజంగా రూపు తాల్చాలి. సత్త్వరజస్తమోగుణాల ప్రేరణలకు వశమైవున్న రాజకీయ ఆర్థిక వాతావరణంలో ఈ నవసమాజం మొలకెత్తలేదు. మానవసమాజాలు ఆ యా మానవుల స్వభావాలబట్టి ఏర్పడుతై. ఈ నాటి ఆధ్యాత్మిక — ఉద్యమాలు మామూలుగా చాలావరకు ఈ గుణ—బద్ధ_సమాజాన్ని దైవపరంగా సంస్కరించడానికి ప్రయత్నిస్తూవుంటై. అది అవసరం. కాని ఈగుణత్రయ ప్రభావిత సమాజానికి ప్రతిగా, ప్రత్యేకంగా విశిష్టంగా ఏర్పడాలి, నవ ఆధ్యాత్మిక సమాజం. ఈ సమాజానికి ప్రత్యేక లక్ష్యం ఉండాలి. ఈశ్వరుని సచ్చిదానందాన్ని, పరాశక్తిని దైవానుగ్రహంతో మూర్తీభవింపజేసుకొని, ఆ ఆనందస్పందాలకు అనుగుణంగా సామాజికబాంధవ్యాలను రూపొందింపుకొనడమే వీరి లక్ష్యంగా ఉండాలి. యావన్మంది మానవులను మనమనుకొనేరీతిగా కొన్ని బాహ్య సంకేతాలతో ఇట్టే మార్చివేయాలనుకొనటం ఆచరణరీత్యా అసాధ్యమే కాక, ఆధ్యాత్మికంగా అనుచితం, ఏదో చేసెయ్యాలి' అని దైవం పేరిట అయినాసరే, ఏదో సాధించేయాలి అని ఉద్రేక పడడం పూర్వరజోగుణపు హతశేషం.

'ఆధ్యాత్మికం అన్నప్పుడు, మనమార్గమేది, మన లక్ష్యమేది, మన దైవ_భావనఎట్టిది,' జగత్తుదైవం ఏ విధంగా మానవునిలో సమ్మేళనం పొంది ఉన్నారు. అనే విషయాలగురించి స్పష్టమైన గ్రహింపు ఉండాలి. నిజానికి నాస్తిక ఉద్యమాలకన్న ఆస్తికఉద్యమాలకే ఎక్కువ వ్యాప్తి' ప్రభావమూ ఉన్నాయ్. కాని ఎందువల్లనో ఆధ్యాత్మిక_శక్తి మాత్రం సుసంఘటితం

కావటంలేదు. ఆధ్యాత్మికపరులైనవారి లోపాల నెత్తిచూపి తద్వారా నాస్తికులు దైవంవేపే వేలు చూపుతారు. ఇంద్రియములను వ్యామోహపరచే గుణప్రభావాలకు లోనైవున్నంతవరకు, ఆధ్యాత్మికపరులూ జీవితచక్రపు దివ్యగతిని భంగపరుస్తూనే వుంటారు. కాబట్టే పూర్తిగా ఈశ్వరావతరణకే అంకితమైనవారు ఒక కొత్తసమాజాన్ని రూపొందించవలసిన అవసరం ఉంది ఉన్న సమాజాన్ని ఆర్థికంగా, రాజకీయంగా, నైతికంగా సంస్కరించే శక్తులు వేరే వున్నయ్. అవీ దైవశక్తులే. అయితే ఈ మామూలు సమాజం సంస్కరణలకు మాత్రమే అంగీకరిస్తుందిగాని, పూర్తి మార్పుకు, సరికొత్తకు, ఆధ్యాత్మిక పరివర్తనకు సిద్ధపడదు.

అయితే సమకాలిక సంఘటనల విషయంలో ఈ నవసమాజం ఎలాంటి దృక్పథాన్ని అనుసరించాలి అనేది ఒక సమస్య. మామూలు సామాజిక సంఘటనలపై ఏదో ఒకానొక ఆధ్యాత్మిక ప్రభావం ప్రసరిస్తూనే ఉంటుంది. దుష్టశక్తులను ఎంతో కొంత నిరోధిస్తూనే ఉంటుంది. కాని సమగ్ర ఆధ్యాత్మిక దృక్పథాన్ని మామూలు సమాజం స్థూలంగానైనా అంగీకరించనంతవరకు, సమకాలిక (రాజకీయ) చరిత్రలో ఆధ్యాత్మికపరులు పాల్గొనటం నిరుపయోగం అని అన్పిస్తుంది. ప్రకృతి వసతులను మానవవికాసానికి వినియోగించడంలో నవ - ఆధ్యాత్మిక - సమాజం కొత్తలక్ష్యాలను, కొత్తసాధనలను ఆచరణసాధ్యం చేయగలిగినప్పుడే, మానవుల రూపాల్లో ఈశ్వరుడు భూమిపై కాలూనటానికి సదవకాశం సిద్ధిస్తుంది ప్రకృతి వసతులను స్వంత ఐశ్వర్యంగాకాక, ఐశ్వరీయంగా, ఈశ్వరపరంగా పరిగణించే మానసికవిప్లవం సిద్ధించనంతవరకు, తత్త్వతః మానవచరిత్రలో మార్పురాదు. పెట్టుబడిదారి, కమ్యూనిస్టు, సోషలిస్టు, లేదా మిశ్రమవ్యవస్థల్లో కుడి ఎడమలు ఉండవచ్చుకాని, అవి పరిణామంలో మానవుని స్వభావ స్వరూపాలను మార్చలేవు. కాబట్టే ఈశ్వరుని సర్వావతరణకు జీవితాలను అంకితం చేసుకొనేవారు ఈ పాతవ్యవస్థల సంస్కరణకోసం కాక, కొత్త దివ్య వ్యవస్థకోసం పాటుపడాలి. ఈ లక్ష్యం సుస్పష్టమై. ఈశ్వరేచ్ఛగా ద్యోతకమైనప్పుడు, దివ్యశక్తి మనలో అవతరించి, ఇప్పటి మన లోపాల నతిక్రమించ గలిగిన కొత్తజ్ఞానాన్ని, కొత్తశక్తిని మనకు ప్రసాదిస్తుంది.

---

# మానవైక్యతాదర్శము - భారతదేశము

— ఎం. శ్రీరాములు

మానవజాతి క్రమాభివృద్ధిని భంగమొనర్చుచున్న పీడలకు పరిష్కారమేమని అనేక మేధావులు యోచనచేసియున్నారు. ప్రపంచమందు శాంతి సుఖములు నెలకొల్పుటెట్లని ప్రతి దేశమునందును బుద్ధిమంతులు యోచించి యోచించి ఈ సమస్యాపరిష్కారమునకు యొక మార్గమును సాధించియున్నారు. ఈ సందర్భములో భారతదేశము చేయగలిగిన, చేయవలసిన సహకారమెంత? దాని రూపు రేఖలెట్లుండ వలెననునదియే, ఇప్పటి ప్రశ్న.

మానవుడు స్వభావముచే సహవాసము నపేక్షించు జీవి. సంఘజీవమునకై తహ తహ లాడుచుండును. అతనిలో సజాతీయమైన వ్యక్తులతో కనసి మెలసి జీవించుచు అభివృద్ధి పొందవలెనను కోరిక ప్రకృతి సిద్ధముగ నెలకొనియున్నది. ఈ సంఘభావ మాతనికి ప్రప్రథమగు స్వభావము.

మానవజాతి యందు రకరకములైనట్టియు, వివిధ స్థాయిలకు చెందినట్టియు వ్యక్తులను — వివిధ సాంఘిక, రాజకీయ సమిష్టి సంఘములును కలవు. వ్యక్తికి, సమిష్టి సమూహమునకు గూడ బాహ్యాభ్యంతర జీవితములు కలవు. బాహ్యజీవితము—అంతర్జీవితము యొక్క పూర్ణ ప్రతిబింబమో, పాక్షిక ప్రతి బింబమో అయియున్నది. వ్యక్తియొక్కగాని, వ్యక్తుల కూటమిచే నేర్పడిన సంఘము యొక్కగాని, అంతర్జీవితము—ఆయావ్యక్తుల యొక్క, సంస్థల యొక్క సహజసిద్ధమైన స్వభావముపై ఆధారపడియుండును. అది వ్యక్తి యొక్క సంఘముయొక్క స్వధర్మమని చెప్పవలెను. కనుక వ్యక్తి యొక్క, సంఘముయొక్క బాహ్యజీవితమునకు పునాదులు అనగా మూలాధారములు, ఆ వ్యక్తి యొక్క, సంఘము యొక్క అంతర్గతా దర్శములవియే వారి ఆత్మ స్వభావము, స్వధర్మమునై యున్నవి. బహుముఖములైన మానవ జాతుల యొక్క అంతర్గత భావములే-లేదా ఆయా జాతులయొక్క మానసిక ప్రవృత్తుల పంపుటి, స్థాయిలే—మానవైక్యతకు, మానవశాంతి సుఖములకు-వారు ఎంత వరకు తోడ్పడగలరో—ఎంత వరకు శక్తి మంతులో నిర్ణయించగల కొలబద్ద.

మానవజాతిని పీడించుచున్న బాధలు వ్యక్తుల యొక్కగాని, దేశముల యొక్కగాని స్వార్థ సంపాదన యందు జనించిన భిన్నాభిప్రాయములచే నేర్పడిన వైరుధ్యములు. అందుచే మానవజాతి యందు శాంతిస్థాపనకు_వివిధ జాతుల మధ్య, వివిధ దేశముల మధ్యగల భిన్నాభిప్రాయములు, భిన్నాశయములు, విరుద్ధ భావములను పరస్పర సంఘర్షణచే_ఐక్యతను దూరమొనర్చుచున్నవి. అట్టి విధ్వంసకరకారణములను తొలగించి సామరస్యమును నెలకొల్పుటయే మానవజాతియందు సుస్థిరమైన ఐక్యతను స్థాపించుటకు ప్రథమసోపానము.

ఈ మానవసమైక్యతకు మూలాధారము-మానవ జీవితము నందలి పరమ సత్యమును తెలిసికొనుటయే___అనగా ఏ ధర్మము ననుసరించిన ప్రపంచమునకు కారణమైన సత్యధామమును చేరగలమో అట్టి ధర్మము నన్వేషించుట శ్రీ అరవిందుల పలుకులలో "అంతర్గతమైన ఏకత్వముచేత అనగా వ్యక్తులలో బాహ్యదృష్టికి భిన్నత్వము గోచరించినను-అంతర్గతమైన దైవ తేజస్సుచే మానవత్వము నందేకత్వము నెల కొనియున్నది. మానవుని బాహ్యజీవితము నందలి వ్యావహారిక సామరస్యముల. (1) పశుత్వము నుండి మానవత్వము సంపాదించుట చేత .......... ఆర్థిక జీవితము (2) బుద్ధి సౌందర్యములు దివ్య జీవనముగా ఉన్నత పరిణామము చెందుట (3) స్థూలదేహములోనికిని, మానవకోశములోనికిని దైవ తేజస్సు అవరోహించి (మనుష్యుని మానవా తీత్వమునకు అనగా దివ్యత్వమున కారోపింపచేయుట .......) మనుష్యుడు మానవాతీతుడుగా అనగా దివ్యపురుషుడుగా పరిణామమొందుట.... ఈ మూడును ఒకటే. ఎందుచేత ననగా మానవైక్యతయు మానవాతీత్వమును దైవము నందు జీవించుటచేత అనగా దివ్య జీవితముచేత మాత్రమే సాధ్యములు.

ప్రపంచము నందలి మానవ చరిత్రను సింహావలోకనము చేసినచో ప్రకృతియు, మానవ ప్రకృతియు గత కాలములో ఐక్యతను సాధించుటకు ఎట్టి కృషులను చేసియుండెవో విశదమగును. మనుష్యుని యందలి సహజమగు సహవాస సుఖమే_ప్రథమమున-సంఘముగ కలసి మెలసి జీవించుట, పిమ్మట కుటుంబముగను. అటు పిమ్మట తెగలుగను, పిదప సంఘముగా-గ్రామముగా-పట్టణముగా తుట్టతుదకు దేశముగా నేకమయి జీవించు విధానమునలవరచుకొని స్థిరమైన వ్యవస్థారూపమును దాల్చినది. అనేక పరిస్థితులు, శక్తులు సంఘములను

తీర్చి దిద్ది వానికి బలము చేకూర్చినవి. ఆదిలో స్వయంసంరక్షణకు ప్రేరణ కల్గి సంఘము లైక్యతను పొందినవి. రక్షణచేకూరిన పిమ్మట ఆ సంఘములు చాల అభివృద్ధికిని, విస్తరణకును యత్నించెను. శక్తిచేకూరినంతనే తత్ ప్రదర్శనా కుతూహలము నందెను. ఆ అభిలాష పరిసర ప్రదేశముల నాక్రమించి బలహీనుల నణగుద్రొక్కుటకు దారి తీసెను. ఈ విజయ కాంక్ష, రాజ్య సంపాదనా తృష్ణ వైరములకును, యుద్ధములకును దారి తీసెను. ఇది పూర్వ మానవుని భౌతిక ప్రాణిక భూమికలపై నడచిన చరిత్ర.

మానవులు తమ మానసిక శక్తులను గుర్తించిన కాలమునుండియు ప్రాణిక మానసికశక్తులు మనుష్యుని జీవితమునందు చొరచుండుట మొదలు పెట్టినప్పటినుండియు, ఐక్యతా విధానములును, ఐక్యతయును మార్పుచెందెను. మానవత్వముయొక్క విలువలు మార్పు చెందెను.

పాశ్చాత్యులు ప్రముఖముగా ఐక్యత యొక్క బాహ్య స్వరూపము నభివృదిచేసిరి. కుటుంబమునుండి ముఠా, జాతి సంఘము—పురమునుండి దేశము—దేశమునుండి సామ్రాజ్యమునకును ఐక్యతను సాధించిరి. స్వసంరక్షణము, ఆధిపత్యమును లక్ష్యముగా గల్గిన ఈ విధానమునందు సంఘర్షణమును, పోరాటములు ప్రాముఖ్యత వహించెను. కాని ఇరువదవ శతాబ్దములో విభాగము నుండియు పశుబల ప్రయోగముతో ఆధిపత్యమును సాధించుట సంభవమని తేలినది.

మానసిక వికాసము సృష్టియందడుగు పెట్టినప్పటినుండియు మనస్సును, మేధను సాధనములుగాగొని మానవైక్యతను సాధించుటకు పకృతి పలు పరిశోధనలుజరిపినది. మానవునియందుత్రివిధములుగానున్న శారీరక, ప్రాణిక, మానసిక అవశ్యకతలననుసరించి మనోభావనలందు రూపొందిన ఆ ధర్మముల ననుసరించి మానవైక్యతను సాధించుటకు ప్రయత్నములు జరిగినవి. మనస్సుకు జ్ఞాన సముపార్జనాంగములు—విభిన్నత్వము, విభిన్న విషయ పరిజ్ఞానము, భిన్న విషయముల నేకీభూతమొనర్చునేర్పు, తత్ జ్ఞానమున సిద్ధాంతనిర్మాణ కౌశలము మాత్రమే. తాను గ్రహించిన బాహ్య సత్యములనేకీభూత మొనర్చుటచే మనస్సు తన అభిప్రాయములను గాని, ఆశయములనుగాని నిర్మించు స్వభావము కలది. అందుచే మనస్సు నిర్మించిన మానసికాదర్శము మనస్సునకు

సహజమగు సంకుచిత్వముచే నిబద్ధమైయున్నది. అందుచే మానసికాదర్శము కూడ అవి నైక్యతను సాధింప సమర్థము కాకపోయెను. రాజకీయ శక్తిచే ప్రాబల్యమునందిన ఈ మానసికాదర్శము ప్రభావముచే ప్రజారాజ్యము మొదలగు ప్రభుత్వము లేర్పడినవి. ఆర్థిక క్షోభలచే వర్తక సంబంధములు మొదలగు అనేక ఐక్యత లభించినది. అటులనే మనస్సుయొక్క ఉదాత్తప్రవృత్తి—మతము మూలముననూ, సంస్కృతి మూలముననూ, తనకు శక్యమైనంత మానవైక్యతను సాధించుటకు యత్నించినది. కాని ఆ యత్నములు అన్నియు విఫలములయ్యెనని చెప్పవచ్చును. ఎందుచేతననగా వానిపుట్టుక విభజించుటే గుణముగాగల మనస్సునందగుటచేతను, దాని ప్రేరణాశక్తిసామర్థ్యముల నాధారముగాగొని బహిర్గతములైనవగుటచేత మనోజనితమైన ఆదర్శమునకు నిరుపద్రవమైన ఐక్యత సాధించునేర్పు దుర్లభము.

ఏ జాతి యందుగాని ఊర్ధ్వభూమికలనుండి వత్తుడులు జీవితపరిస్థితుల లోనికవతరించినపుడు ఆ శక్తుల పోషణమునకు తగు స్థానమును జాతి జీవితావకాశములలో కల్పించుకొన్నచో — అవి అప్పటి మానవైక్యతపైనను, జాతి జీవితముపైనను విధ్వంసకత్వమును ప్రయోగించి వానియింకొక విధమగు అశాంతిని సంక్షోభమును సృష్టించును. ఇట్టి పరిస్థితిని మనమనేక పాశ్చాత్యదేశములలో కనుగొనుచున్నాము. అమెరికాయందును, ఆర్థికముగా, రాజకీయముగా, పారిశ్రామికముగ వ్యక్తిత్వమును సంపాదించిన ఇతర దేశములందును శాంతి, పవిత్రతల నెలకొల్పుటెట్లని పెద్ద పెద్ద వివాదములు బయలుదేరుచున్నవి. అట్లే సమిష్టి జీవితమునందు పారిశ్రామికముగను, రాజకీయముగను, ఉన్నతస్థాయి నందిన దేశములందును, అట్టి అభివృద్ధిగల రష్యాదేశమునందును, ప్రజలు స్వతంత్ర వాయుసేవనముకును, నిర్బంధరహితమైన కర్మాచరణమునకు మార్గము లన్వేషించునట్టి ఘోషలు బయలుదేరినవి.

క్రొత్త యగు నీ ఒత్తిడులకు, ప్రేరణలకు కారణమేమి ? ఇవి ఎచ్చట నుండి ఉద్భవించుచున్నవి ? పరిశీలించి చూచినచో — ఇవి మానవహృదయము నుండియే — అందు గుప్తమైయున్న ఆత్మ స్వాభివ్యక్తికై యొనర్చిన ఘోషక్రములని చెప్పక తప్పదు.

ఈ విధముగా పాశ్చాత్యదేశము మానవజాతియొక్క బాహ్యజీవితమును సుస్థిరమైన సమైక్యతాస్థాయి నందించుటకు మానవబుద్ధితో ప్రపంచ విజ్ఞానముతో నిర్మాణముచేసిన రాజకీయ, సాంఘిక, ఆర్థిక సమైక్యతావ్యవస్థలు ఒక్కటియును నాశరహితమును, సుస్థిరమునగు మానవైక్యతను సాధించలేక పోయినది.

ఇక ప్రాచ్యదేశములు సాధించిన సమైక్యతను పరిశీలింతము. తుది దశల యందు ఇది మానవజాతిచరిత్రలో సమానముగనే యున్నది. ప్రాచ్యదేశములు వ్యక్తి జీవితమునకు ప్రాధాన్యమునిచ్చి ఉదారుడగు ప్రభువును ఆదర్శముగా నిరూపించినవి. బలహీనుడగు ప్రభువును బట్టిగాని, దుర్మార్గుడగు రాజునుబట్టి గాని యుద్ధములు, సంఘర్షణలు సంభవించినవి. జాతి జీవితమునకు రక్షణలు సన్నగిల్లి అశాంతి సంప్రాప్తమై సమైక్యత దెబ్బతినుచుండును. అదిగాక వ్యక్తి నియంతృత్వములో బాహ్యప్రపంచములోని పరిస్థితులు గమనింపబడుటలేదు. అందువల్ల సామంతులయొక్క, సామాన్యులయొక్క స్వాతంత్ర్యముతగ్గి — వారిలో స్వాతంత్ర్య కాంక్ష పెరిగినకొలది తిరుగుబాట్లు, కల్లోలములు సంభవించుచుండెను. వాని నివారణ నిమిత్తము పాశ్చాత్య సమిష్టి జీవిత భావానుకరణము ప్రవేశపెట్టబడినది. కాని అవికూడ జాతియొక్క సమైక్యతను స్థాపించుటకు శక్తిమంతము కాలేదు.

పై విమర్శమున తెలిసిన విషయమేమనగా — పాశ్చాత్య దేశములు బాహ్యప్రపంచ జ్ఞానముతో కామించి సాధించిన మానవ సమైక్యతగాని అంతరంగాభివృద్ధి విజ్ఞానముతో మాత్రమే ప్రాచ్యదేశములు కామించిసాధించిన మానవ సమైక్యతగాని, సుస్థిరముగాని, శాశ్వతముగగాని నిలువలేదు. కారణమేమనగా ఈ యత్నము మనస్సు నాధారముగగొని ఒక వంక బాహ్యప్రపంచ జ్ఞానముచే నడిపించబడుటచేతను మరియొక బాహ్యప్రపంచమునుజ్జగించి కేవల అంతరంగాభివృద్ధినే ఆధారముగ గొనుటచేతను.

మానవుడు శరీరము, ప్రాణము, మనస్సు మాత్రమేగాక వానికన్న ఉదాత్తమైన ఆత్మయై యున్నాడు. మానవజీవిత ప్రణాళికలో ఈ యాత్మలయొక్క సాన్నిధ్యమును దానియొక్క సుస్థిరమైన ఉనికిని విస్మరించిన సమైక్యతా

రచన పూర్ణము గాని మార్పు పొందనిదిగాని కాజాలదు. మనమిప్పుడెట్టిస్థితికి వచ్చితిమనగా — బాహ్యక్రియలతో పాశ్చాత్యులు సాధించిన సమైక్యతగాని అంతరంగ వికాస మాత్రముచే ప్రాచ్యము సాధించిన సమైక్యతగాని మానవ కోటికి సంతృప్తి నిచ్చుటలేదు.

మనుష్యుడు ముఖ్యముగా బంధరహితమైనట్టియు, అవిభక్తుడు ఒక్కడును. ఏకస్వరూపుడునైన ఆత్మ, అందుచేనాతడు తనయందలి పాత్ర విభాగమునకును, సర్వత్ర ప్రపంచమునకు తృప్తికరమగు నైక్యతను ఆకాంక్షించుచుండును. అట్టి సర్వతోముఖ సమైక్యతను సాధించువరకును మానవుడు తృప్తి నందడు. శాంతము, శ్వాశ్చత, ప్రేమ, జ్ఞానము, స్వేచ్ఛ, సౌందర్యము అనునవియె ఆత్మయందున్న దివ్య స్వభావములయొక్క శాశ్వతములును, ప్రముఖములునగు లక్షణములు, ఆ గుణములయొక్క వికృతియే మానవస్వభావము. కనుకనే మానవ ప్రకృతియొక్క ప్రయత్నమెల్లప్పుడును వెనుకటి పరమోత్కృష్టమైన దైవస్థాయినందుకొనుటయె. ఏ వ్యవస్థకాని, ఏ పథకముగాని ఆధ్యాత్మిక పునాదిని కల్గియుండునో అట్టి మానవైక్యతాదర్శము అచంచలమై అభేద్యమైన మనుగడను ఈ ప్రపంచమునందు సాధించగలదు.

అట్టి ప్రణాళిక మానవునియొక్క వివిధభూమికలపై— వ్యక్తిగత స్వేచ్ఛా స్వాతంత్ర్యములకుకాని, సమిష్టిజీవితముయొక్క వృద్ధి వ్యాప్తులకుకాని భంగము లేని పద్ధతి నుండవలెను. సమిష్టిజీవితము తన స్వప్రయోజనమునకై వ్యష్టిజీవితమునణగద్రొక్కరాదు. అటులనే వ్యష్టిజీవితము తన స్వార్థమునకై సమిష్టి జీవితమును త్రోసిపుచ్చరాదు. ఈ రెండింటికిని సరసమైన సామరస్యముండవలెను. ఆ సమైక్యతనందు వ్యష్టిజీవిత వికాసావకాశములును, సమిష్టి జీవిత సందర్భములును పరస్పర వైరుధ్యములులేక పరస్పరసహకారముతో ఆధ్యాత్మిక స్థైర్యమును విధ్వంసముగానీయక మెలంగవలెను.

మానవాళికి అట్టి ఉదారములైన మహోన్నత ఆదర్శముల నేర్పర్చి రూపొందించగల సమర్థులెవరు? ఏ వ్యక్తి ఆ ఐక్యతాసూత్రమును సంపూర్ణముగ నెరుంగునో అతడుగాని ఆత్మయును భౌతికప్రకృతియు సర్వసమగ్రములగు దివ్యతయొక్క ప్రకృతి వికృతుల అనుభూతినందియుండునో అట్టివాడు

మాత్రమే ఆ ఆదర్శమును సాధించగలడు. అట్టి మహనీయుని ప్రపంచజ్ఞానము ఆత్మజ్ఞానప్రపూర్ణములై ఆయనయందు సంపూర్ణస్వరూపంతో సామరస్యమునంది యుండవలెను.

వికాసమందిన ప్రతి సమిష్టి వ్యవస్థయందును సాముదాయికాత్మని పేరందిన ఆత్మస్ఫులింగమున్నదని వాకొనబడినది. మన భారతభూమిలో రక్షక దైవతము లేక గ్రామదేవత అని ఆ సాముదాయకాత్మకు పేరుపెట్టి తత్తత్కాలములలో అరిష్టములు కలుగకుండ కాపాడుటకు భక్తిశ్రద్ధలతో పూజించుచుండిరి. సమిష్టిజీవిత శాంతిభద్రతలు కాపాడబడవలెనని యీ విధముగా వాకొనబడి యున్నది. ఇదియే సమిష్టి జీవిత శాంతిభద్రతలకు మూలకందము. దీని సాహాయ్యమున సంఘజీవితము ప్రేరణనంది నడిపింపబడుచున్నదో అట్టి సర్వవ్యాప్తకమైన ఆత్మయొక్క సూత్రము. ఈ సూత్రమునే మనుష్యకోటి కావాసమగు గ్రామమునకు, నగరమునకు, రాష్ట్రమునకు, దేశమునకు వ్యాపింపజేయవలెను.

ఈ రీతిగ మానవైక్యతాదర్శమును సుస్థిరముగ స్థాపించు బాధ్యత ఆధ్యాత్మకపరిణితిని సాధించిన — వ్యక్తులు కానిమ్ము — సంఘము కానిమ్ము — మహాపురుషులపై ఆధారపడియున్నది.

మానవత్వము, భగవతత్వము, ప్రపంచతత్వము అను మహాసముద్రములలో మునిగి వాని లోతుల నవగాహనచేసికొనిన ముద్దుబిడ్డలతల్లి హిందూదేశమే. భరతభూమియందలి ఋషులును, మునులును, తత్వవేత్తలే విజ్ఞానపరిధులను విస్తరింపజేసి, ఇతర లోకములతో సంబంధము నేర్పరుచుకొని, వాని వైభవములను సంపూర్ణముగా గ్రహించి, ఆధ్యాత్మికోషస్సు లనేకములును దర్శించినవారు. అట్టి విజ్ఞానతేజోవికాసమునకు ఆలవాలమైన భరతభూమికే ఆత్మతత్వముయొక్క అవకాశములను పరిశీలించి మానవసమైక్యతాదర్శమును నిర్మించి ప్రపంచమునందు ప్రతిష్టించునట్టి బాధ్యతగలదు.

అపరవ్యాసుడై, యోగిపుంగవుడై, ఋషియై—యుగపురుషుడై జన్మించిన శ్రీ అరవిందునివల్లనే ఈ ఐక్యతకు, వెలుగును, క్రియాప్రపూర్తియు సిద్ధించునని నిరూపించుట కెట్టియనుమానమును లేదు. (మార్గదర్శకత్వమునకు) ఆయన

ప్రాచ్యదేశములకు పుత్రుడు — పశ్చిమదేశముల పెంపుడుబిడ్డయు నైయున్నాడు. శ్రీ అరవిందులయందు ప్రాక్పశ్చిమ విజ్ఞానములు గులాబియందు వర్ణమును, సువాసనయు వలె . క్షీర నీరములు) — నామమున కనుగుణమగు సౌరభములు సమ్మిళితములై వేర్పరుపరాని సమన్వయమును పొందియున్నవి. శ్రీ అరవిందులే మహోన్నతాదర్శములయొక్క విశాలములైన మూలసూత్రములను "మానవైక్య తాదర్శము"( The Ideal of Humanity ) అను గ్రంథరాజమందు వివరించి యున్నారు. వారు నిరూపించిన మానవ సమైక్యతను ప్రపంచమందు నెలకొల్పి, నూతనాధ్యాత్మికోషస్సును మొలకెత్తించి శాంతి, శక్తి, సౌందర్యము, ప్రేమ యవధులుగా గలిగిన సామ్రాజ్యములోనికి మానవాత్మను ప్రవేశింపజేయు బాధ్యతను ఆయన అనుయాయులును, భక్తులును చేబట్టి ప్రపంచమందు మానవై క్యతను స్థాపించవలసియున్నది.

శ్రీ అరవిందులచే చేయబడిన అతి నీలశాంతివర్ణము — ఆ ఆదర్శము — శ్రీ మాతచే పుదుచ్చేరియందు కార్యరూపము నందుచున్నది. ఆమె దివ్యశక్తి— భారతదేశముయొక్క ఆత్మ — శ్రీ రామకృష్ణునికి నరేంద్రుడెట్టివాడో అనగా వివేకముచే నానందించువాడైనాడో — ఈమె శ్రీ అరవిందులకట్టిశక్తి. ప్రపూజ్య శక్తి, కేవల విజ్ఞానానందమయశక్తిగాక దోషరహితమైన ప్రపంచనిర్మాణశక్తి శ్రీ మాత భారత పౌరసత్వమును స్వీకరించి— ద్రష్టయగు శ్రీ అరవిందుల దర్శించిన మానవైక్యతాదర్శముయొక్క కళ్లెములను చేబూని నడిపించు నాయ కత్వమును భారతదేశము చేబట్టుటకు అనువగు సన్నివేశముల నామె సృష్టించు చున్నది.

భరతఖండము ఆధ్యాత్మికోన్నత శిఖరముల నందుకొనుటకు భగవంతుడు నిర్ణయించిన దేశమై యున్నది. అందుచే భారతదేశమే — ప్రపంచములో సుస్థిర మైనట్టియు, శాశ్వితమైనట్టియు మానవైక్యతను సాధించుటకు సంపూర్ణమగు నర్హతను కల్గియున్నది. శ్రీ మాత శ్రీ అరవిందుల నాయకత్వమున ఈ ఉత్త మోత్తమమైన మానవైక్యతను సాధించి మానవజీవితమును దివ్యజీవితముగ పరిణమించునట్లు చేయుగాక!

———

# ఈ భూమి మన తల్లి

మూలం : శ్రీ నళినీకాంతగుప్త      భావానువాదం : నరసింహం

తనపై ఇతరులకు సంక్రమింపజేయబడని మానవుని ఆస్తి ఆత్మ. అది అతని ప్రత్యేక ధనము. సృష్టింపబడిన సత్త్వాలలో ఆ ఆత్మకలవాడు మానవు డొక్కడే. ఈ ప్రపంచమందుగాని, ఇతర ప్రపంచములందుగాని, స్థితియందలి ఏ ఇతర లక్ష్యములందుగాని లభింపని భౌతిక బహుమానమే ఆత్మ. ఈ భూమి ఒక అద్భుత పదార్థము. దానికి దాని స్వంతము, ప్రత్యేకము ఐన గుణము ఉన్నవి. ఒక ముఖ్యమైన గుణము, అది అభివృద్ధి చెందుట. అది స్థిరమైనది కాక పరిణతి చెందునదికూడ. అంకురింప చేయుటకు, మొలకలెత్తుటకు భూమి కారణమగుచున్నది. ప్రకృతము కనబడు బాహ్య సృష్టిలోనికి, నూతన వస్తువులను గుణములను అది తెచ్చుచున్నది. ఇంతకు ముందుండని స్థితులను నూతనముగా ఎక్కడనుండో తెచ్చినట్లు కన్పింప జేయుచున్నది; నిశ్చేతనముగ నుండు అచలమృత్తికనుండి పచ్చని మొలకలు క్రమేణ పెరిగి, కొమ్మలు, ఆకులతో వికాసమునొంది, సుందరతమమై ఫలవంతములగుచున్నవి.

భూమాత మట్టినుండి ఆత్మ పెరుగుచున్నది, "అన్నాద్ పురుషః", ఆత్మ భూమియొక్క సృష్టిగాని, ఉత్పత్తిగాని కాదు. అది భూమి ద్వారా వచ్చిన బహుమతి. స్వర్గము భూమికిచ్చిన బహుమతినే, అది బహిర్గత మొనర్చినది. భౌతిక స్థితియందు వర్తింప అలవికావివిధమున ఆత్మ అంతర్లీనమైయున్నది. చైతన్య అణువు విశ్వచైతన్యమునందు అంతస్థితముగా, అంకురమువలె, భౌతికమునకు వెనుకనున్నది. అట్లు వెనుకనుండి ఉల్లాసపరచి, చలనమును పొందించి ఆకర్షించుచూ, కడకు చూచుటకు ప్రాణము లేనట్లుండు భూపదార్థమును వికాస మొసగి జాజ్వల్యమానమైన గమ్యమునకు గొనిపోవును.

వృద్ధి చెందుచున్న అంతర్లీన చేతన, భూమియొక్క ఆస్తి, వృద్ధి, పరిణామము. నూతనమును తెలియజేయు స్థితులు భూమివే. భౌతిక విశ్వమందెచ్చటను ఈ మార్పును చూడము ఇతర విశ్వములు మూలము (పరమాత్మ — దైవము) యొక్క లీలే; భౌతికభూతములు మాత్రమే. విశ్వము యొక్కయు

మరియు ఇతర కనబడని కిరణములు, ప్రకృతము, అసందిగ్ధముగా నున్ననూ, వాటి బహుముఖ పరిమాణముతో, సృష్ట్యాదినుండి ఉంటూనే యున్నవి. విశ్వమందు వేరే మరి ఒక భూమిలేదు. ఏలన అచట నీరుకాని, నీటి ఆవిరి కాని లేదు. నీరు జీవితమునిచ్చును, నీరు జీవితరసముకూడ. ఇంకను సృజనాత్మక ఘాతముకూడ. మనమిప్పుడు చంద్రధూళిని కనుగొనియున్నాము. అది నీరు లేకుండ ఎండి ధూళిగా యున్నది. ఎండిపోయి పెళుసుగా కూడయున్నది. నిజమునకు ఇతర స్వర్గములకు చెందిన వస్తువులయందు భూవాతావరణమునకు సంబంధించినదేదియులేదు.

స్వర్గమునకు చెందిన సర్వసృష్టిజాలము, ఇతరములైన సత్త్వాలు గాలిని పీల్చవు. సర్వఊర్ధ్వలోకముల యందు భూవాతావరణము లేదు. వృద్ధి మార్పులు అందులేవు. మచ్చుకు పురాణములందు చెప్పబడిన సూక్ష్మ ప్రపంచమునకు చెందిన సత్త్వాలు, అనగా గంధర్వులు, పిశాచములు, దెయ్యములు మొదలగునవన్నియు, వివిధములైన ఖచ్చితమైన, విధానములలోనే యున్నవి. వాటికి మార్పులేదు. వాటి ప్రకృతియందుగాని, స్వభావమునందుగాని, ఎలాటి మార్పులేకయున్నవి. అవి అవిగానేయున్నవి. ఆది నుండి ఇప్పటివరకు ఒకే విధముగాయున్నవి. పూర్వము వాటిని గురించి ఏమిచెప్పబడినదో, నేటికిని అవి అట్లేయున్నవి. దేవతలుకూడ ఈ మార్పు లేని తెగకు చెందినవారే. వారినంతమునందు ఒకే సత్య విధానములోనున్నారు. వేరు మాటలలో చెప్పవలెనన్న, రాయివలె మార్పులేకున్నారు. మానవులవలె, మార్పు, అస్థిరము, చంచల స్వభావముతో నుండకయున్నారు. అసురులుకూడ ఇట్టి మార్పులేని స్వభావము కలవారే. పై స్థిరస్వభావము కలవారందరు మార్పుచెందవలెనన్న, వారీ భూ ప్రపంచమునకు దిగివచ్చి, మానవాకృతిని దాల్చి, స్వభావమందు మారుటకు, పరిణామము చెందుటకు ప్రయత్నించవలసినదే.

2

ఆత్మ ఎంతైననూ పరమాత్మకాదు. లౌకికవిశ్వము, అచేతనము మరియు నిశ్చేతనముగా కూడ యున్నది. ప్రాణము లేనిది, అని కూడ తలంచితిమి. కాని నిజమునకు దాని వెనుక మూలచేతనయున్నది. అందుచేతనే అది నిలబడుచున్నది. మూలచేతనచే సర్వము పాలింపబడుచున్నది. అదే పరమాత్మ— సచ్చిదానందము — బ్రహ్మము. దేశకాలాతీతమై, అన్నిటివెనుక నున్న శక్తి

చేతన, అదిభూమియందు చలనము కలిగి యున్నట్లగు పడుచున్నది కాని, నిజ స్థితిలో అది అచలము. వృద్ధి, పరిణామములులేనిది. 'తత్' నుండి సృష్టి క్రమమున, భౌతిక సృష్టిపరిణామమున, కడపటి విభజనమున, ఆత్మ బయలు వెడలుచున్నది.

కడపటి పదార్థసర్వఅణువులు, ఒకే విధముగా, వైవిధ్య ప్రత్యేకతలు లేక, ప్రవర్తించుచునున్నవి. ఇది సామాన్య విశ్వ చలనము. జీవితము ప్రత్యేక వ్యక్తిత్వము, జీవకణములతో మొదలిడును. ప్రతి జీవ ఆకారము దాని ప్రత్యేక విధానమున నడచును. సర్వోత్కృష్టచేతన, సచ్చిదానందము — ఇక్కడ ప్రాణ కక్ష్యయందు — అన్నిటి వెనుకనుండి, ఒక కేంద్రము లేక కేంద్రములపైపుకు చేరి, వైవిధ్యముచెంది, అనేక కేంద్రములయందు ఏకోన్ముఖమగుచున్నది ఈ ఏకోన్ముఖత అధికమై, విశాలతచెందుటకు బదులు, తన స్వభావమున సంకు చితమగుచున్నది. ఇట్లు జరుగుటచే, ఒక తేజస్సు లేక అగ్నిభూతము, భౌతిక పదార్థ సృష్టియందు ప్రవేశించి వృదిపొంది, బహుళములుగా, ప్రత్యేక ప్రత్యేక గుణములతో, నొప్పారుచున్నది. అప్పుడు భూభూతము సాధారణ భూభూతము కాక, ఒకే విధమైనగుణములతో ఏర్పడినది కాక, ప్రత్యేక ప్రత్యేక గుణము లతో నిండియుంటూ, ప్రత్యేకవ్యక్తిత్వమును పొంది యున్నది. వ్యక్తిత్వము ప్రత్యేకత యందలి మొదటిమెట్టు - పృథ్వీపై జీవితమేర్పడినప్పుడు, అందు బీజ రూపాత్మకచేతన లేక చేతనాతత్వము చేరుచున్నది. ఆ చేతనాతత్వము వృద్ధి క్రమమున క్షుద్ర జంతువులలోవలె ప్రత్యేక వ్యక్తిత్వ భావమును పొందును. తదుపరి క్రమముగా ఉత్తమ జంతువుల వ్యక్తిత్వభావమున కూడ పొందును. మానవునియందు చేతన. ఇచ్ఛ. ఆవిర్భవించిన తర్వాత, స్వవిమర్శ, అహంభావము మొలకెత్తును. అప్పుడీ వ్యక్తిత్వ చేతనాభావము ఇంకనూ వృద్ధి పొంది. పూర్ణవ్యక్తిత్వ సత్తాయై, ప్రత్యేక మానవత్వముతో ఆత్మయై, కడపటికి ప్రత్యేక పూర్ణ మానవతతో, లేక వ్యక్తిత్వముతో, ఒక దైవసమానతను పొంది. ఆత్మే దైవమగుచున్నది.

ఇట్టిదే పదార్థముల అంతరపరిణామము. అంతరవృద్ధితోకూడ, పదార్థ బాహ్యకక్ష్యయందు అభివృద్ధి ఏర్పడును. ఆత్మాభివృద్ధి లేక చైత్యసత్తా అభి వృద్ధి ప్రభావము, మనోప్రాణ శరీరములపై ప్రసరించుటచే, వివరించుటకది

తగిన పనిముట్టగును. మనో్రపాణ శరీరములుకూడ వికాసవంతమై ఆత్మ ప్రకృతియందు పాల్గొని, దానితో సన్నిహితత్వము తాదాత్మ్యముపొంది, పరిపూర్ణసమగ్రతకు చాఁతీయును.

3

యుగయుగాలుగా. విసుగుచెందించు విశ్వముయొక్క ఉనికిని, దాని అనంతస్థిరతను, కంఠ్ఠకు కట్టినట్లు వేదములు చాటుచున్నవి. మరియు అనంత సూర్య ఉదయాస్తమయముల, నక్షత్రముల తెల్పుచున్నవి. అంతేకాక అనుల్లంఘనీయమైన, మార్పులేని వరుణుని ధర్మమును, వేదములు తెల్పుచున్నవి. కాని మనము కొంత సునిసిత విచక్షణతో, తండ్రియగు స్వర్గమునుండి మాతయగు భూమిని గమనించిన, వేరుదృక్పథము లేక భావము కలుగును. ఏలన భూప్రపంచము వేదప్రతిపాదిత పురోగమన యజ్ఞమునకు రంగము.

వేదఋషి ఇట్లు చెప్పియున్నాడు. " యవ్వనముతోనుండిన తల్లి తన బిడ్డను తన కడుపులో దృఢముగా పట్టుకొని తండ్రికి సమర్పించకున్నది. ఆమె తాను నిశ్చేతన పదార్థముగానున్నంతవరకు అట్లే చేయును. ఆమె చైతన్యవంతమైన తర్వాత అర్పణ చేయుటకు ప్రారంభించును. అప్పుడా బిడ్డ తండ్రి చైతన్యముతో అభివృద్ధిచెందును. అంతేకాక తల్లినికూడ అధికాధిక చైతన్యమునకు వృద్ధిని కలిగించును.

వేద ఋక్కుకు శ్రీ అరవిందుల ఆంగ్ల తర్జుమా :

**"The young Mother bears the boy pressed down in her secret being and gives him not to the Father".**

భూమి దాని భార ఆకర్షణశక్తికి పేరుపడియున్నది. ఆ శక్తివలన పదార్థములను తనవైపుకు ఆకర్షించి, కడపటికి ఊర్ధ్వమునకుకాక. అడ్డముగా విస్తరించుటను కంటికి చూపును. కాని భూమి విచక్షణ స్వాతంత్ర్య జ్ఞానము లతో నిండియున్నది. అనుశ్రృతము, అలవాట్లు, పాత పద్ధతిఆమనవే అనుసరణీయములను కట్టుబాట్లకు లొంగక, పురోభివృద్ధిని కలుగజేయువాటిని కనుగొని అనుసరించుటకు మానవుడు విజ్ఞానమును పొందియున్నాడు. ఒక మాతవ అభిప్రాయము లేక జ్ఞానము, ఈ స్వాతంత్ర్యోద్దేశము వెనుకనుండుటచే, ఇది

అతిక్రమణ లేక పాపము గావించబడుచున్నది. ఈ వెనుకనుండు జ్ఞానమునే, మానవచేతన తన ఆలోచనలో పెట్టుకొనియున్నది. సత్తాచేతనలు నూతన పరిణామముల చెందుటకు, పురోభివృద్ధినొందుటకు ఇది ఒక అవకాశము తరుణము కూడ.

పురోభివృద్ధిని, వైవిధ్యమునందే అనగా రెండు విరోధ కారణముల మందే. ఎన్నుకొనవలెను. స్థిరపరచబడి, సమరసతతతో ఒకే రీతికలిగి, మార్పురానిదై పరుషముగనుండుటచే; దాని నుండి ఉత్తమము, సారవంతము, అగు నూతన సమతకు మార్పుచెందవలెనన్న; పాత అలవాట్లను ధ్వంసము చేయువలయును. మానవచేతనయందు మార్పు జనించినయడల, స్వాతంత్రేచ్ఛ జనించి పాత అలవాట్లను, పద్ధతులను ఉల్లఘించవీలగును. ఇదే బుల్లను నవిగాను చెప్పిన ఉత్తమ ఉల్లంఘన, క్రిష్టియన్ మతములోని కేంద్ర సూత్రము. ఇది ఒక సంభవము_ అనగా వేరుపడు భావము అనవచ్చును. సర్వమునకు కడకు దైవమునకుకూడ వేరుగా నిలుచు భావమే అహంకారము. అంది అనుకరణల మార్పు. స్వతంత్రసత్తాను అనుసరించుటకు, కావలసినదీ యహంకారమే. అనగా చైతపురుషుడు, తన స్వంత లేక స్వతంత్రకోరికతో, ఎన్నికొనినది అని అర్థము ఉపనిషత్తులు చెప్పినట్లే ఎన్నిక " శ్రేయస్ " "ప్రేయస్" లలోనున్నది. చైత్యపురుషుని " శ్రేయస్ " ఎన్నిక, పరిణామ మందొక మలుపు. అందుచే చేతన ముందుకు నడచి, ఉత్తమమునసుండు ఉత్కృష్టసత్యముపైపుకు, పురోగమించుటకు వీలున్నది. అంతిమగమ్యము చేరుటకు, స్వతంత్రముకొరకు, సమగ్ర దైవపరిపూర్ణ సఫలతకొరకు, వ్యక్తిత్వము గలమానవుడు. ప్రథమమున, వేరుభావము వ్యతిరేకత, లేక పాపము, అనువాటికి విలువను చెల్లించవలసినదే అహంకారమే పాపమునకు మూలము. అంతేకాక వ్యక్తిత్వమును, దైవముఖమును, సరిగా చూడనివ్వని ఆచ్ఛాదన కూడ.

4

భూమాతయందు మొలకెత్తించెడి ఒక ఉత్తమగుణమున్నది. ఆ గుణము భూమియందు కూడ వేరు భావమునున్నది. ఏలన భూమాత ఉత్తమ బిడ్డ నాతను, భూతవి మరియును అందుకొనవలసినవాడు. ఉత్తమమునకు తీసి కొని పోవుశక్తి లేక భూమియొక్క ఊర్ధ్వగమన వర్తిరిశక్తి. అగ్నిదేవునిదే.

అగ్నిదేవుడు ఆత్మయొక్క చేతనాశక్తి. ఆ శక్తి భూమియందును సర్వమందు ఇమిడియున్నది. వేదములు భూమిని అగ్నిధామమనుచున్నవి. ఇంద్రుడు స్వర్గమునకెట్లు ప్రభువో (దైవమో) అగ్ని భూమికట్లు దైవము., "అప్" భూతము భూమియందు సర్వములో ఇమిడియున్నది. మొలకెత్తు గుణమునకు నీరు తోడ్పడును. అగ్ని అందుకు ప్రతినిధి. ప్రారంభించెడు, పరిపాలించెడుశక్తి, కేంద్రీకరించిన చేతనాశక్తే. మానవునియందిది వ్యక్తిత్వము పొందిన ఆధ్యాత్మికభావము. అందుచే అగ్ని, అభివృద్ధికర యజ్ఞమునకు పురోగామి. "అధ్వాజ్ఞ" ఉత్తమమునకు పురోగమనము, లేక అంత్యగమ్యమునకు పరిణామము అని యనవచ్చును.

పరమాత్మ — సచ్చితానందము — అత్యుత్తమ స్థితియగు సర్వోత్కృష్టత. అవతారమెత్తి, ఉత్తమమును స్థాపించుటకు; ఇక్కడ భూమి తన భౌతిక పదార్థమును. అవతారదేహముకొరకు ఇచ్చుచున్నది. వ్యక్తీకరణము కొరకు, జీవప్రాణములద్వారా తెలుపుటకు, భూమాత. తన గుప్త చేతనాశక్తిని. తేజశ్శక్తిని ఉత్తమచిత్తపస్సుతో మేళవించుచున్నది. కాని ఉత్తమము యొక్క ఆనందమును, నూతనమైన రసానందమును కలిగించు విధానమును పొందుచున్నది. భూమి ఇచ్ఛ. ఆనందములు. ఒక నూతనవిధానముగా యున్నవి.

రుచి చూచుట, త్రాగుట, భుజించుట దేహము యొక్క ముఖ్య గుణములు. అవి ఆత్మకు వర్తించునవికావు. మానవుడు భుజించు సమయమందు, త్రాగుసమయమందు. దేవతలను జ్ఞాపకముంచుకొనవలసియుండును. "అత్రేయులు" అను ఒక ఋషివంశమున్నది. అనగా భుజించువారు అనిచెప్ప వచ్చును. ఈ భౌతిక గుణములన్నియు ఆధ్యాత్మిక విధానమున, ఉపమానములు, లేక సాంకేతికముగానున్నవి. నిజమునకు ఆధ్యాత్మిక భావమునందవి అట్లే వాడబడుచున్నవి. ఏలన పై భావములు తెల్పుటకు భాషచాలదు. భాష భౌతికచిహ్నములు లేక సాంకేతికములపై ఆధారపడియున్నది. భూవిషయమట్లు సాంకేతికముకానిచిహ్నముగానికాదు. భూమి ఒక "సత్" మాత్రమే కాక "చిత్" మరియు "ఆనందములతో" ఒక ప్రత్యేక కలయికగానున్నది.

భూమిలోని ఆత్మ దానితోసంబంధించినది. భూ బహుమతులనవమభవించి, వృద్ధిపరచి పరమాత్మకు అర్పించుచున్నది. ఆత్మ భూమియొక్క సారము.

అందువలన భూమి. సచ్చిదానందము లేక పరమాత్మ పరిపూర్ణతకు, ఒక నూతన గుణముకల, పూరకమును కలుపుచున్నది.

అన్నమనగా ఆహారము మరియు పదార్థము కూడ. పరమాత్మకు భౌతికాహారము పదార్థము. ఆ పరమాత్మే అన్నమై అందు తనను తాను పోగొట్టుకొనును. తిరిగి పరమాత్మ, భూమియందలి తన ప్రతినిధియగు మానవాత్మద్వారా మరలా దానినిపొంది అనుభవించుచున్నాడు.

ఈవిధముగా తిరోగమనము కొరకు, పరమాత్మ, పై నుండి దిగివచ్చి, సృష్టికి వెనుకనిలిచి, చాలా కాలముగానుంటూయున్నాడు. అట్లుండి అభివృద్ధి చెందిన తర్వాత, ముందుకువచ్చి, భూమిపై వెలసినాడు, ప్రాణమేర్పడిన తర్వాత, పదార్థ అణువులు క్రమబద్ధములైన కణములుగా ఏర్పడుచున్నవి. ఇట్లు చేతనేచ్ఛ వృద్ధిపొంది, మనస్సేర్పడినప్పుడు చైత్యపురుషభావమేర్పడును. అప్పుడు ఉత్తమ జంతు జాలమందు వ్యక్తిత్వము మొలకెత్తును. ఈ చైత్య పురుషభావము, జ్ఞానము ఇచ్ఛ మరియు మానవుని యందలి వ్యక్తిత్వభావములచే, చైత్యసత్తాగా అభివృద్ధిచెందును. ఆ చైత్యసత్తాయే భూమిపై దైవప్రతినిధియగుచున్నది. ఇదే భూపుత్రుడైన మానవుని ద్వారా భూమియందు దైవ పరిపూర్ణతను కలిగించుచున్నవి. మానవునిలో వృద్ధిపొందిన చైత్యపురుష జ్ఞానముతో, భూమి దైవచేతనను కలియుచున్నది. అనగా భూమి పరమాత్మను తన యధినాథునిగా చేసికొని, తనవ్యక్తిత్వ ఆకృతులయందు ఆయన అంశలను, విభూతులను చేర్చికొని, సర్వము దైవలీలయని యనిపించుచున్నది.

---

# శ్రీమాతారవిందుల పృథ్వీచేతస్సుకొఱకు ప్రపంచ రూపాంతరయోగం

## చతుర్థదశ (1968-72)

— సి. నారాయణ రెడ్డి

తమ సమస్తభాగములందును (శరీర, ప్రాణ, మనసు, ఆత్మలు) దేనిని కొఱత నుంచక దైవమున కర్పించుకొనువారికి దైవము తనను దానిచ్చుకొనును. వారికే శాంతి, ప్రకాశము, శక్తి, ఆనందము, స్వాతంత్ర్యము. విస్తృతి — జ్ఞాన శిఖరములు, ఆనంద సముద్రములు.

— శ్రీ అరవిందులు

పై సందేశమునుబట్టి ఏ మానవుడైనను తన సమస్తభాగములయిన శరీర, ప్రాణ, మనసు, ఆత్మలను, వీనికి సంబంధించిన ప్రతి విషయమును అహంకారము లేకుండ దైవమున కర్పించుకొనునో అట్టి మానవునికి దైవము కూడ తనసర్వస్వము నిచ్చుకొనునని అర్థమగును. ఇట్టి ఉదాహరణము ప్రపంచ చరిత్రలో యిప్పటివరకు మనము తెలిసికొని ఉండలేదు. మనకు తెలిసిన దంతయు ఏ నిర్వికల్పసమాధియో లేక ఏ శ్రేష్ట పరలోకప్రాప్తియో మాత్రమే. మనము యీ గ్రంథములో శ్రీ మాతారవిందుల జీవితచరిత్రను చదివినదానిని బట్టి వీరు తమకుగల సర్వస్వమును మరియు తమకు దైవమొసంగిన సర్వస్వమును గూడ అదే దైవమున కర్పించుచు తామే దైవమై దైవముతోపాటు సమానముగ ప్రపంచమును పరిపాలించుచు, ప్రతి మానవుని దైవ దిశకు కొనిపోవుచున్నట్లు అర్థమగుచున్నది.

1968 జనవరి 1వ తేదీ సందేశమునాటినుండి శ్రీ మాతారవిందులు ప్రపంచమునందలి మానవుని దైవ దిశకు ఏ విధముగ కొనిపోవుచున్నది విశదీకరింతుము.

1—1—1968 నాటి సందేశము

"సదా యువ్వనుడుగ నుండుము. పరిపూర్ణత కేసి ప్రయత్నించుట ఎప్పటికిని విరమించకుము."

పరిపూర్ణత యనగా విశ్వమంతటి విస్తృతి, విశ్వాతునంతటి ఉన్నతి కలిగి విశ్వమునందును విశ్వాతుని తానే ఆవిర్భవించుట. ఇట్టి పరిపూర్ణత సదా యువ్వనుడుగ నుండిననే సాధ్యము. అట్లు చేయుమని మనలను శ్రీ మాత ఉద్బోధించినది. అంతేకాదు, మనఃపూర్వకముగ పనిచేయువారి కందరికి సహాయపడుచున్నది.

21—2—1968 నాటి సందేశము

దివ్యప్రేమావిర్భావమును త్వరపరచుటకు శ్రేష్ఠమార్గమేమన, సత్య విజయమునకు పరస్పరము సహకరించుట. —శ్రీ మాత

24—4—1968 నాటి సందేశము

విషయముల అధ్యాత్మ జీవితవిధానమున మన దృష్టని, ఉత్కాంక్షను, ఉన్నతతరమొనర్చినట్లెల్ల మనయందవతరించుట కన్వేషించు 'దివ్యసత్యము' కూడ అట్లట్లు ఉత్కృష్టతరముగ నుండును. ఏలయన అభివ్యక్త ప్రకృతి యందు దానిని దాచియుంచిన హిరణ్మయపాత్రనుండి విడుదలగావించుటకు ఆ సత్యము కోరును. అది మనయందిదివరికే యున్నది.

—శ్రీ అరవిందులు

15—8—1968 నాటి సందేశము

ఇట్టి నిజమగు విశ్వమయ విలయసమయములందు విశ్వాతీతునియందు సతతము దృష్టి నిలిపి నిర్భయముగ వసించుటయు, శాంతహృదయమును, దృఢసంకల్పమును, పరిపూర్ణ ఆత్మార్పణను కలిగియుండుట అత్యవసరము.

—శ్రీ అరవిందులు

24—11—1968 నాటి సందేశము

మనము ప్రపంచమునందీనాడు చూచు మార్పులు బౌద్ధికము, నైతికము నైన ఆదర్శమును, ఉద్దేశ్యమును గలిగియున్నవి. ఆధ్యాత్మిక విప్లవము దాని

ఘడియకు వేచి, అంతవరకు, అక్కడక్కడ దాని తరంగములను వ్యక్తపర చును. అది వచ్చువరకు, యితర వివిధ విప్లవములకు గల అర్థము గ్రహింప బడజాలదు. అంతవరకు, వీనిని గురించి చేయు వ్యాఖ్యానములు మానవుని భవిష్యత్తు గూర్చి సూచనలు వ్యర్థము. ఏలయన వీని స్వభావము, శక్తి, సంఘటనలు మానవజాతియొక్క రానున్న యుగధర్మమునుగూర్చి నిశ్చ యించును. —శ్రీ అరవిందులు

పై సందేశములలో తెలిపినట్లు ప్రపంచములోని అన్ని దేశములలోను, ఒక్కొక్కప్పుడు నెలనెలకును, ఒక్కొక్కప్పుడు దినదినమునకును ఏవో కొన్ని మార్పులు — రాజకీయముగ, సాంఘికముగ, ఆర్థికముగ, సాంస్కృతిక ముగ — జరుగుచుండుట దినపత్రికలలోను, రేడియోలోను తెలిసికొనుచున్నాము. మరియు ఆధ్యాత్మిక విప్లవముకూడ మనకు తెలియకనే పరాత్పర పురుషుడు, పరాత్పర ప్రకృతి పనిచేయుచున్నట్లును, రానున్న యుగచక్రములో ఏర్పడ నున్న నూతన నాగరికతకు మిగత విప్లవములన్నియు సహకారిగ పనిచేయు చుండునట్లు యీ విషయమును శ్రీ అరవిందులు, దివ్యదృష్టితో చూచి తెలుపు టయేగాక ఆ దివ్యకార్యమునందు తానును సహకరించుచున్నట్లు అర్థమగు చున్నది.

1—1—1969 నాటి సందేశము

మాటలు వలదు; క్రియలు మాత్రమే. సత్య ధర్మము నీ యందు పని చేయుచున్నది. నీ హృదయమును తెరచుము. మరి నీవు దానిని స్పృశించ గలవు. ....శ్రీ మాత

ఈ సందేశమును బట్టి దివ్యావేశము పొందిన మనుజుడు తన ఆదేశము ప్రకటించుకొనకనే కార్యమును ఆచరించి చూపవలెనని విశదమగుచున్నది

21—2—1969 నాటి సందేశము

సత్తయొక్క శాశ్వతత్త్వమును సాక్ష్య [illegible] మార్పు రహిత శాంతము మాత్రమే. —శ్రీ [illegible]

## 24—4—1969 నాటి సందేశము

శ్రేష్ఠసాధ్యమార్గమేమన దివ్యకృపను నీయందు పనిచేయనిచ్చుట, దాని నెప్పుడును అభ్యంతర పరచకుండుట, దానిని వ్యతిరేకించి, కృతఘ్నత నెప్పుడును వహించకుండుట.—కాని శాంతి ఐక్యానంద ప్రకాశముల దిశకు దానిని సర్వదా వెంబడించుట. —శ్రీ అరవిందులు

ఈ సందేశమునుబట్టి పరాత్పర దైవము సర్వులయందును వారికి తెలిసియో, తెలియకయో పనిచేయుచున్నదని శ్రీ అరవిందులు దానితో తాదాత్మ్యము పొంది చెప్పినట్లు అర్థమగుచున్నది. ఈ విషయము తెలియనివారు తమ అంతరమున ప్రవేశించి అహంకారమును వదలి తమ్ముదా పరీక్షించుకొన్నచో దివ్యశక్తి తమయందు ఎట్లుపనిచేయుచున్నది బహూశా తెలుసుకొనగలరు. ప్రపంచమునందు భయము, అపాయము, కష్టములనుండి తప్పించుకొనుటకు యిది ప్రతియొక్కరికి శరణ్యము.

## 15—8—1969 నాటి సందేశము

మన దృష్టి సర్వదా పృథ్విపై నుంచవలెను. ఏలయన మనకార్యమిక్కడనే యున్నది. అంతేగాక యితర లోకములన్నియు పృథ్వియందు ఏకాగ్రతనొంది యున్నవి. మరి, వానికి సంబంధించిన సత్యమును పార్థివ వాతావరణమునందు స్పృశించవచ్చును. —శ్రీ అరవిందులు

సర్వమతములందును కొందరు కొందరు ఇహలోకజీవితమును వదలి పరలోకమునందు నివశించ సాధన చేయుచుందురు. కాని, యీ సందేశమును బట్టి సమస్త పరలోకజీవితము కూడ యిహలోకమునందే సాధించవచ్చునని స్పష్టమగుచున్నది. ఇది శ్రీ మాతారవిందుల విశిష్టతయని ప్రత్యేకముగ చెప్పనవసరములేదు.

## 24—11—1969 నాటి సందేశము

ప్రతినిత్యము యితర సత్యములతో కలసి పనిచేసినపుడే అది దాని పరిమితిని, పరిపూర్తిని పొందును. ఇతర సత్యములనుండి దానిని విడదీసినపుడు అది బుద్ధికి ఒక పాశముగను, తప్పుదారికి తీసికొనిపోవు మూఢమతముగను

నేర్పడును. ఏలయన ప్రతిసత్యము నేత పడుగులో వేయబడు అడ్డపేకలోని ఒక్క దారము మాత్రమే. మరి ఏ ఒక్కదారమును విడిగా తీసి యిదియే పేక అని చెప్పజాలము. —శ్రీ అరవిందులు

1—1—1970 నాటి సందేశము

ప్రపంచమొక గొప్పమార్పునకు సిద్ధపడుచున్నది.

నీవు సహాయ పడుదువా ? —శ్రీ మాత

ప్రతి మానవునిలోను ఆత్మయు, దైవమును గలరు — అను విషయమును ప్రతిమానవుడును తెలుసుకొనుటకు ప్రయత్నించుటయే గొప్ప మార్పు. ఈ విషయమునుగురించి ఒకేసారి శ్రీ మాత ప్రపంచములోను, దైవముతోను ఐక్యతపొంది ప్రపంచమును గురించి ప్రతి మానవునిలోను ఉన్న దైవముతో యిట్టిప్రశ్న వేసినది. శ్రీ మాతారవిందుల ప్రపంచ రూపాంతర యోగసాధన ప్రపంచమునకును, దైవమునకును మధ్య యీ విధముగనే జరుగుచుండును.

21—2—1970 నాటి సందేశము

సత్యధర్మము ప్రయాసకర విజయముతో కూడిన కష్టకార్యము. సర్వులకును, అనుకూలముగనో లేక ప్రతికూలముగనో, శరీరము కలిగియో, కలుగకయో, శత్రువులకును, మృత్యువుకును, దేనికిని భయపడక అంతర్యమున విజయమును పొందువరకు పోరాడవలసిన నిజమైన వీడుదై యుండవలెను.

—శ్రీ మాత

ప్రపంచమునందు సర్వులు పరిపూర్ణసత్య ధర్మమును ఆచరించినపుడు ఘర్షణ ఎంతమాత్రము ఉండదు. ఏ ఒక్కరో యిద్దరో మాత్రమే సత్య ధర్మమును ఆచరించినపుడు యితరులతో వారికి ఘర్షణ కలుగవచ్చును. కాని వారందరిని వ్యతిరేకించి అయినను, శరీరమును విడిచి అయినను తమ సూక్ష్మ శరీరములందు కూడ తమ కార్యములను తామే పునర్జన్మ లేకయే దైవ సహాయమున సాధించుకొనవచ్చును.

## 24—4—1970 నాటి సందేశము

ఉన్నతమయి సత్యమును తెలుసుకొని దానితో సామరస్యముగానుండుట ఋజుసత్తయొక్క నియమము. మన మేదైె యున్నామో, అనుభవింతుమో, చేయుదుమో—వీని యన్నింటియందు దానిని వ్యక్తపరచుట ఋజు జీవన నియమము. —శ్రీ అరవిందులు

## 29—7—1970 నాటి సందేశము

## శ్రీ అరవింద కర్మధార

బాగుగా మాట్లాడుట మంచిదే. బాగుగా పనిచేయుట అంతకంటె మంచిదే. నీమాటలకు తీసిపోక నీకార్యములుండనిమ్ము.

ఆశీర్వాదములు — శ్రీమాత

శ్రీ అరవిందులు 1916-20 సం.ల మధ్య 'ఆర్య' అను మాసపత్రిక యందు వారికి కలిగిన ఆధ్యాత్మికదృష్టిచే వేదములు, ఉపనిషత్తులు, గీత, భారతీయ సంస్కృతి, భాగవత జీవన దార్శనికసిద్ధాంతము, యోగ సమన్వయము అను విషయములు మాత్రమేగాక మానవజాతియొక్క భవిష్యత్తును గురించి కూడ 'మానవైక్యతాదర్శము', 'మానవ వికాస చక్రము' అను రెండు గ్రంథములను సోపానక్రమమున ఎట్లు జరుగనున్నది తెలిసియున్నారు.

మానవుడు పృథ్విపై పరిణమించినప్పటినుండి అతడు పశుప్రాణిక చేతనలనుండి, మానసిక మానవచేతస్సు ద్వారా ఆధ్యాత్మిక చేతస్సుకు పరిణమించుటకే ప్రయత్నించుచున్నాడు. వ్యష్టిమానవునియందు వ్యష్టిగతాత్మవలెనే సమిష్టి మానవుని యందును సమష్టిగతాత్మ, అది కుటుంబమేకాని, వంశమేకాని, పట్టణనివాసమేకాని, ప్రాంతీయపు సమూహమేకాని, లేదా ఒక దేశమేకాని, కడకు-సమస్తమానవజాతియేకాని, కలదు. ఒక్కొక్క వ్యష్టిగతాత్మయు, ఒక్కొక్క సమిష్టిగతాత్మతో, సంపూర్ణసామరస్యతను కలిగియుండునపుడే నూతనజీవితమునకు సార్థకతకలుగును. వ్యష్టిగతాత్మను, విస్తరించుకొను సమష్ట్యాత్మలద్వారా, సమస్తమానవజాతి సమష్ట్యాత్మకు, అట్టి సామరస్యత—ఐక్యతలకు ఎట్లు ప్రకృతిమతల్లి, రాజకీయ సాంఘిక ఆర్థిక జీవితములద్వారా, సోపానక్రమమున కొనిపోవుచున్నది. శ్రీ అరవిందులీ "మానవ ఐక్యతాదర్శము" అను గ్రంథమునందు వచించినారు.

మానవుని జీవిత వికాసము సత్యత్రేతాద్వాపర కలియుగములనెడి యుగచక్రముద్వారా, ఒక యుగచక్రమునుండి, మఱియొక యుగచక్రమునకు-నిమ్న-అధ్యాత్మసిద్ధినుండి ఉన్నతతర_అధ్యాత్మసిద్ధికి సదా పురోగమించుచుండును. ఒక యుగచక్రమునుండి మఱియొక యుగచక్రమునకు సిద్ధపరచుకొనుటకు వీనిమధ్య సంధికాలము ఆవశ్యకమైయుండును. గత యుగచక్రమునుండి నూతనయుగచక్రమునకు ఎట్టి సంధికాల మార్పులతో మానవజాతి పురోగమించుచుండునది, 24_అధ్యాయములుగల ఈ గ్రంథమునందు, సోపానక్రమమున శ్రీ అరవిందులు వివరించియున్నారు. మన మీనాడేసోపానమునందునది, ముందురానున్న సోపానములేవి యని ఈ గ్రంథమును చదివినవారికి స్పష్టముగా తెలియగలదు.

1914-1920 మధ్య వ్రాసిన ఈగ్రంథములోని విషయములు ఆచరణలోనికి దైవము యేవిధముగా తేగలటనునది ఆనాడు వ్రాసియుండియు, అవి ఆచరణలోనికిరావచ్చునట్లు చేయగల దివ్యజ్ఞాన శక్త్యానందములకు 1920 నుండి, 29-7-70 తేదీ వఱకు శ్రీ అరవిందులు సంపాదించి, ఈనాటినుండి ఆ విషయములను ఆచరింపజేయు దివ్యశక్తియే శ్రీ అరవిందకర్మధార. శ్రీ అరవిందుల ఈశక్తి, కర్మధారయై ప్రవహించుచు వ్యక్తులపైనను, సమిష్టిపైనను ప్రకృతిపైనను పనిచేయుచున్నదని తెలుపుటకే శ్రీ మాత దీనికీ పేరు నిడిరి.

29-7-70 తేదీనాడు భారతదేశమును నెదుర్కొను సమస్యలకు శ్రీ అరవిందుల దృష్ట్యా ఇచ్చిన పరిష్కారములు ఈక్రింద వివరింపబడినవి.

## భారతదేశము

## కొన్ని సమస్యలు — పరిష్కారములు

### తొలిపలుకులు

భారతదేశమున్ను, ప్రపంచమున్ను ఒక క్లిష్టపరిస్థితియందున్నవి. శ్రీ అరవిందులు ఈ విషయమును ముందుగావే గ్రహించి మనల నెదుర్కొను క్లిష్టసమస్యలకు పరిష్కారము నిచ్చియున్నారు.

ఈ సమస్యలు వీనికిగల కొన్ని పరిష్కారములు శ్రీ అరవిందుల దృష్ట్యా ఈ చిన్న గ్రంథమునందివ్వబడినవి.

1. అపాయమును ఎదుర్కొను టెట్లు?

2. ఈ దేశమునందును, బయటి దేశములందునుకూడ ప్రస్తుత సంక్షోభమునకు గల కారణమేమి?

3. ప్రస్తుత యువకుల అశాంతికిగల కారణమేమి? అందుకుగల పరిష్కారమార్గమేమి?

4. ప్రస్తుత విద్యావిధానము భారతదేశమునందు చాల అసంతృప్తికరముగ నున్నదని సర్వులు తలంచుచున్నారు. ఈవిద్యావిధానమును బాగుపఱుచుటకు చేయవలసినదేమి?

4. ఎ) విద్యా విషయమున భారతదేశము అవలంబించవలసిన ముఖ్య విధాన మేది?

4. బి) భారతదేశమునకు విద్యాబోధనాభాష యేది జాతీయభాష యేది, అంతర్జాతీయభాష యేది?

5. మతములమధ్య పరస్పర విరోధములకుగల కారణమేమి? వీనిని పరిష్కరించు టెట్లు?

6. భారతీయ సంస్కృతి యొక్క గమ్యమేమై యుండవలెను?

7. భారత దేశావశ్యకతకు, ప్రజ్ఞకు తగిన ప్రభుత్వముయొక్క ఆదర్శ రూపమేది?

8. పరిసర దేశములతో భారతదేశ సంబంధ మెట్లుండవలెను?

9. జాతీయ జీవితమునందు దేశభక్తికిగల స్థానమేది? అభివృద్ధి కాంచుచున్న అంతర్జాతీయతా, మానవైక్యతా ధర్మముల సందర్భమున, భారతజాతీయతతో దేశభక్తికిగల స్థానమేది?

10. ఆర్థిక విషయమున, ముఖ్యముగ ఆదాయము నిరుద్యోగముల మధ్య గల భేదము గురించి, ఎట్టి ఉద్దేశ్యమును లక్ష్యముగా భావించవలెను?

11. వ్యక్తిగత కష్టములు దాటు టెట్లు?

12. పరమ దివ్య చేతస్సు.

ఈ సమస్యల కన్నింటికి శ్రీ అరవిందుల కర్మధార శక్త్యా పరిష్కారములు శ్రీ అరవింద కర్మధారా సంఘము ప్రచురించినది. దాని వెల 0 50 పె. మాత్రమే. తక్షణమే యీ పరిష్కారములు ప్రజలకు తెలియక అంగీకరించకొని ఉండకున్నను, ప్రజలకు తెలిసినంతనే వానిని అంగీకరించుకొని ఆచరింతురు.

15—8—1970

శరీరముకూడ దైవమును స్మరించవలెను. —శ్రీ అరవిందులు

శ్రీ మాతారవిందుల ప్రపంచ రూపాంతర యోగకారణముగ మానవుని ప్రాణము. మనసు, ఆత్మలతోపాటు శరీరముకూడ చేతస్సునుకలిగి దైవమును స్మరించగలదు.

21—11—1970

దివ్యప్రకాశము దిశకు ధృతితో మరలి యుండుటకు అధికముగా కోరబడితిరి. మనము తలంచు దానికన్న దివ్య ప్రకాశము సమీపతరముగ నున్నది. మరెప్పుడైనను దాని ఆవిర్భావ ఘడియ రావచ్చును. —శ్రీ అరవిందులు

మానవుని పృథ్వీజీవిత పరిణామదశయందు మానవునిద్వారా దైవము తన్నుదా ఆవిర్భవించుకొను సమయము ఆసన్నమైనదనియు, అహంకారముచే దైవమును వ్యతిరేకించక దైవమునకు తోడ్పడుటే మానవుని కర్తవ్యమని స్పష్టమగుచున్నది.

1—1—1971

భవిష్యత్తు దిశకు ముందంజ వేయువారందరు యిప్పటికే ఆశీర్వదింపబడియున్నారు. —శ్రీ మాత

ప్రపంచమునందలి సమస్త మానవులు విశ్వ సామరస్యత దిశకు దైవముచే కొనిపోబడుచున్నారనియు. అందుచే ఒక్కొక్కరి స్థానము అందు నిర్ణయింపబడి, భవిష్యత్తు దిశకు కొనిపోబడుచున్నారు. కనుక యీ విషయమును

నమ్మిన ప్రతియొక్కరు ముందంజవేసి భవిష్యత్తు దిశకు ముందుకుముందుకుగా పురోగమించవచ్చును.

21—2—1971

దైవముతో తాదాత్మ్యమునకు అర్పితమైన జీవితమే అర్హజీవితము.

—శ్రీ మాత

ఎందుకన యిట్టి జీవితము కొరతలేని ఆనందమును కలిగించును.

24—4—1971

సత్యధర్మమును ఆకాంక్షించువారు అబద్ధములు చెప్పకూడదనుట చెప్పనవసరములేదు. —శ్రీ మాత

జూన్, 1971

ప్రస్తుత క్లిష్ట పరిస్థితిని దాటుటకు భారతీయులందరికి నివ్వబడిన శ్రీ మాతృ మంత్రము :

పరమప్రభూ, శాశ్వత సత్యధర్మమూ, మేము నీకు మాత్రమే విధేయులమై సత్య ధర్మము ననుసరింతముగాక. —శ్రీ మాత

సమస్త లోకములతోను భూలోకము శ్రేష్ఠము. ఏలయన సమస్త లోకములుభూలోకమునందు అంతర్నిహితమైయున్నవి. పరిపూర్ణ దైవమును ఆకాంక్షించుదైవమునకు సంపూర్ణముగా అర్పించుకొను మానవుడు మిగతలోకములను, భూలోకమునుదాటి అట్టి పరిపూర్ణతతో ఏకము కాగలడు. మరిట్టి భూలోకములో గల సమస్త దేశములలో భారతదేశము శ్రేష్ఠము. ఏలయన భారతదేశపు సమస్త ప్రజలుకూడ తమ హృదయ మనస్సులను దైవము దిశకు మరలించగలిగియున్నారు. అందుచే అట్టి భారతదేశమును రక్షించిననే యీ దేశముద్వారా యితర దేశములన్నింటిని రక్షించుటకు వీలగును. ఈ విషయము మన సనాతన ధర్మము బోధించినది. అట్లే శ్రీ మాతారవిందులు బోధించుచున్నారు.

జూన్, 71 నాటికి భారతదేశము బంగ్లాదేశ్ కారణముగ పాకిస్తాను, చైనా, అమెరికా దేశములవల్ల అత్యంత క్లిష్ట పరిస్థితికి వచ్చి యుండెను.

భారతదేశము బంగ్లాదేశమును రక్షించుటకు మానవశక్తి చాలలేదు. కొందరు భక్తులు శ్రీమాతను కోరుటచే ఆమె యీ మంత్రమును యిచ్చినది. ప్రపంచ సంఘటనలపైనను, వ్యక్తులపైనను శ్రీ మాతారవిందుల శక్తి మార్చిన ఉదాహరణములు యీ గ్రంథమునందే అనేకములు కలవు. కనుక యీ మంత్రమునకు అట్టి శక్తి కలదనుటలో సందేహము లేదు.

15_12_71 వ తేదీనాడు భారతదేశముపై దండెత్తుటకు అమెరికావారి సప్తమ నౌకాదళము బంగాళాఖాతము ప్రవేశించినట్లును, అట్లే చైనావారుకూడ యుద్ధమునకు సిద్ధపడినట్లును సర్వులకు తెలిసిన విషయమే. 3, 4 రోజులు ఆలసించియుండిన భారతదేశమునకు మహోపద్రవము సంభవించెడిది. కాని భారతదేశపు నాయకులు తమకు తెలియకనే శ్రీ మాతృశక్తికిలోనై యుద్ధమును చాలించుటచే ఆ ఉపద్రవము గడచిపోయినది.

15—8—71

హృదయము వెనుక నొకముసుగు, మనసుపైనొకమూత మనలదైవము నుండి వేరు పరచినవి. దైవభక్తియు. ప్రేమయు ముసుగును చీల్చును. మనసుయొక్క శాంతియందు మూత పలుచనై అదృశ్యమగును.

—శ్రీ అరవిందులు

21—11—1971

ఎవ్వరైనా సామర్థ్యమునొసంగు సాధన చేయుచు దైవముపై నాధారపడవలెను. సాధన పరిమాణమును బట్టిగాక, ఆత్మయొక్కయు దాని ఆకాంక్షయొక్కయు పరిమాణమును బట్టి దైవము ఫలమునొసంగును. మరియు కలత నొందుటవలన నేనిదియగుదునా, అది యగుదునా. నేనేది యగుదును అనుట వలన ప్రయోజనము కలుగదు. "నేను కోరుదానివిగాక, దైవము నేనేదియై యుండతలంచునో అదియే యై నేనుందును" అని చెప్పుము. మరి మగత దంతయు దీనిపైనే ఆధారపడియుండును.

—శ్రీ అరవిందులు

ఈ సందేశములోని వాక్యములు "నేనిటు చేయుదునా. అటు చేయుదునా ఎటు చేయుదును అనిగాక సర్వులు దైవవిజ్ఞయా ప్రకాశమే నడచుకొనవలయునని

యుండుటచేత" ప్రపంచమునంతటిని దైవము వివిధ సామరస్యతా దిశలకు గాక వైవిధ్యముతోకూడిన ఒకే సామరస్యతకు కొనిపోవుచున్నదని అర్థమగు చున్నది. ప్రపంచమంతయు వైవిధ్యముతోకూడిన ఒకే సామరస్యతకు కొని పోబడుచుండుట వారి గ్రంథములు చదివియు, ప్రపంచ సంఘటనలను ఆ దృష్టితో పరికించియు తెలుసుకోవచ్చును. మరియు ప్రపంచమును పాలించు అమర దివ్యశక్తికి ఉన్మీలితులు కాగలవారు స్వానుభవముచే యీ విషయమును మరింత స్పష్టముగ తెలుసుకోగలరు.

25—12—1971

అనృతముయొక్క పాలన అంత్యమగుకాల మాసన్నమైనది.
సత్యధర్మమునందు మాత్రమే విమోచన కలదు. —శ్రీ మాత

1—1—1972

శ్రీ అరవిందుల శతజయంతికి అర్హులుగా నుండుటకు మనమందరము ప్రయత్నింతముగాక. —శ్రీమాత

1947 ఆగష్టు 15వ తేదీన అనగా శ్రీ అరవిందుల 75వ జయంతినాడు వారాశించిన అవిభాజిత సంపూర్ణ స్వాతంత్ర్యముగాక విభాజిత రాజకీయ స్వాతంత్ర్యము మాత్రమే భారతదేశము పొందినది. ఇట్లు జరుగుట వారికి యిష్టముండి యుండలేదు. అవిభాజిత సంపూర్ణ స్వాతంత్ర్యమునకు అనాటి నుండి యిప్పటికీ ప్రయత్నించుచునేయున్నారు. వారి ఆ ప్రయత్నమునే శ్రీ అరవింద 'కర్మధార' యని శ్రీ మాత పేరిడిరి. వారి శతజయంతినాటికి వారి ప్రయత్న ఫలితమును మనము చూడగలము.

15—8—1947 నాడు శ్రీ అరవిందులు తమ ఐదు ఆదర్శములను ప్రపంచ మును గూర్చి అవి యెట్లు అనాటికి నెరవేరియుండినది, యిక మీదట యెట్లు నెరవేర బోవునది విశదీకరించి యుండిరనుట సర్వులకు విదితమే.

ఆ 5 ఆదర్శములను జ్ఞాన శక్త్యానందములచే ఆ సందేశమునందు శ్రీ అరవిందులు ఎట్లు పూరించినది ఆనాడే వారు తెలపియుండిరి. 15-8—1972

నాటికి ఆ పంచాదర్శములు ఎట్లు సిద్ధిగాంచినది, ఎట్లు సిద్ధిగాంచనున్నది ప్రతి మానవుడు సులభముగ తెలిసికొనవచ్చును. ఆ ఆదర్శములుతప్ప ప్రపంచ మానవునికి మరే ఆదర్శములులేవు. పరాత్పర శక్తి ఆదర్శములను ప్రతి మానవుడు తనయందు యీ నాటినుండి పూరించుకోవలెనని శ్రీ మాత సందేశమునకు అర్థము.

21—2—1972

చైత్య పురుషకేంద్రముచుట్టు నమస్త సత్తను సమైక్య పరచుటయే పరిపూర్ణ రుజుత్వమును సిద్ధిగాంచుట కావశ్యక నియమము. —శ్రీ మాత

మానవుడు కేవలము తన శరీర ప్రాణమనస్సులచే తన సంకల్పమును సిద్ధింపజేసుకొనలేడు. అతని ఆత్మ లేక, చైత్యపురుషుడు కూడ అతని సంకల్పమును దృఢపరచినపుడే అతనియందు సంపూర్ణ రుజుత్వము ఏర్పడును.

29—2—1972

శారీరక మనస్సునందు అతిమానసికము అవిర్భవించినపుడు మాత్రమే దాని సాన్నిధ్యము స్థిరముగ నుండగలదు. —శ్రీ మాత

కేవల మనస్సు, ప్రాణిక మనస్సు, శారీరక మనస్సు — అని మనస్సు మూడు విధములు. ఏ కార్యమునైన కేవల మనస్సుతో మాత్రమే అర్థము చేసుకొని ప్రాణిక, శారీరక మనస్సులను ఆ కార్యముపై ఏకాగ్రత నుంచనిచో అది నెరవేరుట కష్టము. ప్రాణిక శారీరక మనస్సులుకూడ ఆ విషయముపై శ్రద్ధవహించినపుడే ఆ కార్యము సులభముగ నెరవేరును. ఇది సర్వులకును అనుభవమే. అందుచే అతిమానసిక సత్యము కేవలము మనస్సునందును, ప్రాణిక మనస్సునందును అవతరించి, శారీరకమనస్సునందు అవతరించనిచో దాని ఫలితము శాశ్వతముగ నుండదు.

24—4—1972

మన అంధతర అవయవములలోనికి మనకు తెలియకనే అతడు ప్రవేశించును.

అంధతెరవెనుక తన కార్యముల నతడు చేసి మనల సిద్ధపరచును.

అధినేతయు, అతిథియునగు సూక్ష్మ సర్వజ్ఞుడతడు.

మన అంధావయవములు కూడ మార్పునకు ఆవశ్యకతను, సంకల్పమును తెలియవలెను.

ఇక్కడ సర్వము, ఉన్నతతరధర్మమునకు విధేయమై నుండ తెలియవలెను.

మన శారీరక జీవకణములుకూడ అమృతాగ్నిని భరించవలెను.

—శ్రీ అరవిందులు

శ్రీ మాతారవిందులు తమ వ్యక్తిగత ముక్తికిగాను యోగసాధన చేయు చుండుటలేదు. జడము, ప్రాణము, మనస్సు, ఆత్మలతో కూడిన భూమాత సంతతి కొరకు ప్రపంచ రూపాంతరయోగమును 1910లో ప్రారంభించి, మతి యొక ఉన్నతతర ఆధ్యాత్మిక చేతస్సు పృథ్వీ చేతస్సునందు ప్రవేశించునంత వరకు వారీ కార్యమును కొనసాగించుచునేయుందురు. అది ఫలించుటకు వారు చేయు ప్రయత్నము వలననే సర్వజ్ఞుడగు సూక్ష్మ అతిథియు, అధినేతయునగు దైవము మనకు తెలియకనే మన అంధావయవములలో ప్రవేశించి దైవావిర్భావ జీవితమునకు మనల సిద్ధపరచుచున్నాడు. ఈ విషయమును మనమెట్లు తెలుసుకొనగలమని కొందరు ప్రశ్నించవచ్చును.

సాధనయందు పురోగమించిన కొందరు వ్యక్తులు పగలంతయు తమ కార్యములందు నిమగ్నులై రాత్రి నిద్రించుటకుముందు, మరునటి దినము తాము తలపెట్టిన కార్యములు సాధ్యమాయని సందేహించుచు దైవముపై భారమువేసి నిద్రింతురు రాత్రి నిద్రలో జరిగినపని కారణముగ తెల్లవారిలేచి ఆ అసాధ్య కార్యములు వాటంతఅవి నెరవేరుచుండుట తెలుసుకొందురు. ఇట్టి వ్యక్తులు క్రమేణ అధికమైనపుడు యీ కార్య ఫలితములు సమస్త సంఘమునకు అన్వయించును.

———

# శ్రీ మాత

మూలం : శ్రీ రవీంద్ర    అనువాదం : అబ్దుల్ అజీజ్

శ్రీ అరవిందులు స్వయంగా తనను గురించి యిలా చెప్పిఉన్నారు. 'నా జీవితంపైకి కనబడునట్లు అడుగు భాగమున లేదు. కేవలం పైకికనిపించు సంఘటనలను లెక్కించుకొన్నందువలన దానిని తెలుసుకొనగలుగుట అసంభవం.' ఆయన నిజమైన జీవితచరిత్ర వ్రాయబడదు. ఆయనలోని పాతాళలోకమంతటి లోతులలోనికి పోగలిగిన వాడెవడు? అక్కడి రహస్యాలుతెచ్చి మన ముందు ఉంచగలిగే వాడెవడు? ఒకవేళ వాటినితీసి మనముందు ఉంచినాకూడా అలవాటులేని కండ్లు వాటిని చూచికూడా బహుశా గుర్తుపట్టలేవేమో, శ్రీ అరవిందుని గురించి చెప్పబడిన మాట శ్రీమాత విషయంలో యింకా ఎక్కువగా వర్తిస్తుంది. శ్రీ అరవిందులు తమరాజకీయ కార్యకలాపాలవల్ల కొంచెం ముందుకువచ్చి ఉండినారు; కాని శ్రీమాత ఎప్పటికీ తెరవెనుకే ఉన్నారు. ఆమెనుగూర్చి ఏమి చెప్పినా సముద్రం ఒడ్డున కూర్చొని నత్తగుల్లలు ఏరుకొంటూ సముద్రపులోతుల విషయం మాట్లాడినట్లే ఉంటుంది.

శ్రీమాతతో తమ జీవితం గురించి ఏదైనా చెప్పమనగా ఆమె జవాబు యిలా ఉండినది. 'నేను శ్రీఅరవిందుని సందర్శించుటకు భారతదేశమునకు వచ్చినాను. శ్రీఅరవిందునితో నివసించుటకు భారతదేశములో ఉండినాను. ఆయన తమ శరీరమును విడిచినపుడు నేను ఆయన పనిచేయుటకు సిద్ధమైనాను. సత్యమును సేవించి, మానవజాతిని మేల్కొలుపుచు భూమిపై భగవంతుని ప్రేమరాజ్యమును త్వరగా తెచ్చుట ఆపని.

శ్రీఅరవిందులు ఒకప్రశ్నకు యిచ్చిన జవాబులో యిలా వ్రాసిఉన్నారు. 'ప్రపంచంలో పనిచేసేది, వ్యక్తులలోనేకాక వ్యక్తికీ, సృష్టికీ అవల ఉన్నదీ కూడా కేవలం ఒకేఒక దివ్యశక్తి. శ్రీమాత వీటన్నిటికి ప్రతినిధి. కాని ఆమె యిక్కడ శరీరంలో ఉండి — యింతవరకూ యీస్థూల జగత్తులో యిక్కడి జీవితమును రూపాంతర మొందించగలిగే విధంగా అభివ్యక్తం కానటువంటి ఒకానొక విషయమును అవతరింపజేయుటకు పనిచేస్తున్నారు. కాబట్టి మీరు

ఆమెను యీ ఉద్దేశంతో యిక్కడ పనిచేసే శక్తి అని తెలుసుకోవాలి. ఆమె తమ శరీరంలోనే కాక తమసంపూర్ణ చేతనలోను, భగవంతుని అన్ని స్వరూపాలలోకూడా లీనమై ఉన్నారు.'

శ్రీ అరవిందులు మరొక ఉత్తరానికి యిచ్చిన జవాబులో యిలా అన్నారు. 'శ్రీమాత అతిమానసమును క్రిందికి తెచ్చుటకే వస్తారు. అతిమానసము అవతరించగానే ఆమె పూర్ణరూపాన యిక్కడ అభివ్యక్తమగుట సంభవం.... దానికోసం తమలో అతిమానసమును గ్రహించుటకును, దానిని సంభవింపజేయుటకును, అందుకు అవసరమైన రూపాంతరమును పొందుటకును ఆమె శరీరం దాల్చినారు. అట్టిరూపాంతరమును పొందుటకు ఒక మంచిసమయం ఉన్నది.'

ఇప్పుడు — శ్రీమాతతో మన సంబంధమేమి? ఈ సంబంధం యొక్క ఉద్దేశమేమి? ఇది మనలను ఎటువైపు తీసుకొని పోతుంది? —— అనే ప్రశ్నలు ఉదయిస్తాయి, ఇక్కడకూడా శ్రీఅరవిందులనే అడుగుదాము. ఆయన యిలా అంటారు: 'శ్రీమాతకు, ఆమెను స్వీకరించే వాళ్లకుగల సంబంధం చైత్యమునకు, ఆధ్యాత్మిక మాతృత్వమునకుగల సంబంధం వంటిది. ఇహలోకపు తల్లికి తన బిడ్డతో ఉండే సంబంధంకంటె యిది చాలాచాలా గొప్పది. మానవ మాతృత్వం యిచ్చుగల దానినంతటిని — చాలా ఉన్నతమైన విధంగా — యీ సంబంధం యిస్తుంది; అంతేకాక మనం ఊహించలేనంత ఎక్కువగా యిస్తుంది.

శ్రీ అరవిందులు మనకు యిలా చెప్పిఉన్నారు 'శ్రీమాత మనకు కష్టాలు కలిగినపుడు మనలను రక్షిస్తారు. మనలను పైకి ఎక్కించుటకు స్వయంగా క్రిందికి దిగివారు. మనలో వ్యాపించిఉన్న అంధకారమును తొలగించి జ్యోతిర్మయ ఉదయం చిమ్మిస్తారు'. మనం శ్రీ అరవిందుని యోగమును స్వీకరించాలనుకొంటె శ్రీమాత యెడల ఆత్మసమర్పణ మొట్టమొదటి అడుగు. ఈ సమర్పణ ఒకరోజులో పూర్తిఅయ్యేపనికాదు. దీనికోసం సాధకుడు క్షణంక్షణం జాగ్రత్తగా ఉండవలసి ఉన్నది. మనం శ్రీమాత యెడల ఉన్ముఖులమై (తెరచుకొని) ఉంటె ఆమె దివ్యశక్తి మనలోపల తనపని చేయగలదు; మనలను తమ సన్నిధికి దగ్గరగా తీసుకొనిపోగలదు,

ఇక్కడ ఒకవిషయం గురించి మెలకువకలిగి వుండుట అవసరం. సమర్పణయొక్క సంకల్పం లేక దానికొరకు కోరిక మాత్రంచేత పనిజరుగదు. పూర్ణరూపంలో సమర్పించుట అవసరం. ఈపనిలో ఎన్ని యిబ్బందులు ఎదురవుతాయి లేక ఎంతకాలం పట్టుతుంది — అనేమాటకు విశేషమైన గొప్పతనం ఏమీలేదు. ఒకసారి యీవైపుసాగుటకు దృఢంగా నిశ్చయించుకొనుట, ఎల్లప్పుడు ప్రయత్నశీలంగా ఉండుట అవసరం. సమర్పణ భావం పెద్దపెద్దపనులలో మాత్రమేగాక పనికిరాని, లెక్కకురాని పనులలోకూడా ఉండాలి. ఈ భావం సిద్ధంగా ఉంటె మనం చాలా చెడ్డపనులనుండి, చాలా మూర్ఖతలనుండి, జీవిత మార్గంలోవచ్చే చాలా గోతులనుండి తప్పించుకొంటాము. మనం శ్రీమాతవైపు ఎలా సాగిపోతామో అలాగే మన చేతన పైకిలేస్తూ పోతుంది. శ్రీ అరవిందులు యిలా చెప్పివున్నారు: 'ఎల్లప్పుడు శ్రీమాత మిమ్ములను చూస్తున్నట్లు ప్రవర్తించండి. నిజానికి ఆమె ఎల్లప్పుడు హాజరుగా ఉన్నారు.'

(పురోధా డైరీనుండి)

---

# శ్రీ అరవింద కర్మధార అంటే?

— చక్కా సత్యనారాయణ

శ్రీ అరవిందుల యోగమార్గము కర్మసన్యాసమొనర్చి లోకమును విడిచి పలాయనమొనర్చు నట్టి సిద్ధాంతమును బోధించుట కాదు. కర్మను ఆధ్యాత్మిక జీవితమునందలి భాగముగా పరిణామమొనర్చుటయే దాని యుద్దేశము. జీవితము యొక్క దివ్యత్వము పరిపూర్తియే ఇందుల లక్ష్యముగానున్నది. ఈయోగము ప్రపంచమునుండి జీవితమునుండి స్వర్గమునకో నిర్వాణమునకో పలాయనమగుట గాక జీవితముయొక్క ఉనికియొక్క మార్పునే కాంక్షించుచున్నది. మానవుడు ఏ పరమాత్మ జ్ఞానమునుండి పతనమై ఈ స్థితికి వచ్చెనో అట్టి పరమాత్మ జ్ఞానమును మరలపొందుటకు అతడు చేయుసాధనమే యోగము.

భౌతిక ప్రపంచాన్ని దాని దురదృష్టానికి శాశ్వతంగావదలి తప్పించు కొనిపోయే ప్రయత్నము యోగముకాదు. నిర్దిష్టమైనమార్పును పరిణామాన్ని ఆశించే అవకాశంలేదని భౌతికజీవనసిద్ధాంతాన్ని ఒప్పుకోవడం, దైవశక్తికి ప్రత్యక్షరూపంగా ప్రపంచాన్ని అంగీకరించడంగూడ సమగ్రయోగంకాదు.

ఏదో, ఆత్మజ్ఞానము, దూరదృష్టిలేక ఊపిరాడదని 'కర్మ' చేయు చున్నామని తద్వారాదేశమును, ప్రపంచమును మరమ్మతు చేయగలమని ప్రచారం విరివిగాసాగుతున్న, ఈ సమయమున, యోగమునకు కర్మ కౌశల మునకు గల సన్నిహిత సంబంధమును, లేదా, కృత్స్నదృష్టితో చేయగల కర్మకౌశలమే యోగమను సత్యమును వివరముగా తెలుసుకొనుట అవసరము. పరస్పరము సంఘర్షించుచున్న శక్తులనేకములు మానవునందుకలవు. వీనినన్నింటి నొక సంకల్పమునకు లోగట్టుట ముఖ్యావసరము. ఆపిమ్మట ప్రతిశక్తిని పరీక్షించి పరిశుద్ధముచేయవలెను. ఇందు ఎవరికివారు సమర్థులుగారు. దీనిని వడిపింపదగినది యోగశక్తి. దైవానుగ్రహమైన యీ యోగశక్తిని అన్ని కోశములకు అవరోహింపజేసికొనుట యోగసాఫల్యము.

శ్రీ అరవిందులు చెప్పినదెల్ల నూతనముగాదు. ప్రాచీనమహర్షులు ప్రకటించిన దివ్యదర్శనమునే, సనాతనమునే, వీరును ఇక్కాలమున మనపరి

భాషలో ప్రకటించినారు. భౌమస్వర్గము స్వర్ణయుగము అందుబాటులోనున్నదని శ్రీ అరవిందులు తమ యునికివలననే మనకు ప్రత్యక్షముగానుపదేశించుచున్నారు.

ఆత్మ సమర్పణమనగా చేతులు ముడుచుకొని కూర్చొనుటగాదు. యోగి నిర్వ్యాపారికాడు. అతడు సర్వమును సహించి మిన్నకున్నవాడుగా కనుపట్టును. కాని అది నిరాదరముచేతగాదు అంతర్ముఖముగా తీవ్రమైనకృషి అతడు సలుపుచునేయుండును. లోకమునలముకొన్న దుఃఖపు కారుమబ్బుల మధ్య సన్న సన్నగా దివ్యతేజః స్ఫూర్తినిరప్పించు ప్రయత్నములోనుండును. నలుదిక్కులకు పరుగెత్తి మబ్బులను చుట్టబెట్టుట వలనుపడదు. ఒక్కచోట తెరను తొలగించినచో, కిరణము ప్రసరించెనా, చీకటివచ్చును. అందుచేతనే మహానుభావులే హిమాచల కందరముననో జీవాత్మ పరమాత్మల యోగాను సంధానమునకు జేయుకృషిమానవకోటికి తారకమైనట్లు, వివిధ కార్యకలాపము లందు తగుల్కొని కష్టనివారణోద్యుక్తులగు వారి సేతలుకాజాలవు. ఇది భారత భూమి చక్కగా గ్రహించియున్నది.

శ్రీ మాతారవిందులు తపఃప్రభావముచే వారు ఈ లోకమునకు తెచ్చి పెట్టిన అతీతమానసశక్తి. తేజము ఎక్కడోకాదు-ఇక్కడనే ఇప్పుడే ఈ విశాల ప్రపపంచమునందే ఆదర్శముగ మనముందుంచిరి. ఈ తేజోవంతమైన విజ్ఞాన వెలుగుబాటలోనే శ్రీ అరవిందాశ్రమము విధేయతతో నడచుచున్నది. సృజనాత్మక దైవవ్యక్తీకరణముగా స్థిరపరచిరి. సక్రమముగా క్రమపద్ధతిలో సరియైన చేతనలో కర్మలు చేసినచో తపస్సుజేసి సంపాదించినంతటి తపో ఫలము, కర్మయోగమువలనపొందవచ్చును. ఆత్మపరిపూర్ణమువైపునకు ఏర్పర చిన మార్గము. ఏలనన వ్యక్తియందలి అపరిపూర్ణతలను పరిపూర్ణమొనర్చి ఆ వ్యక్తిని, మానవచేతనకంటె ఉత్తమమైన స్పష్టపరిపూర్ణ జ్ఞాన శక్త్యానందములవైపుకు తీసికొనిపోవును. సత్యముయొక్క మానవ అభివృద్ధి పరిణామముయొక్క అభ్యర్థనా ప్రతిష్ఠలకు తగువైన ఉన్నతస్థాయి యందు జీవించుటకు కాంక్షించువారందరకు ఆదర్శముగా ఆశ్రమము కనిపించు చున్నది. ఆశ్రమములో చిన్నలు, పెద్దలు రెండువేలమందియున్నారు. కుల తత్వములుగాని గొప్ప బీద అనమాటలు ఏ ప్రత్యేకమలేవు. లక్షలాది ఆస్తి అర్పించినవానికి అదే తిండి. బట్ట. ఏమి యివ్వలేనివానికి అదే తిండి, బట్ట

[illegible] అన్నియు సమానమే. ఈ సమానత్వంవల్ల యిచ్చట పెరుగుచున్న బిడ్డలు, కూడ ఎంతో ఉన్నత ఆశయాలతో జీవించుచున్నారు.

ఈ ఆశ్రమవాసులు "రాజకీయోద్యములతో సంబంధము విసర్జించుట" లోకమందలి సంఘటనములతో వారు సంబంధము ఉంచుకొనకుండుటకు ఇది కారణముకాదు కాని ఇప్పటి రాజకీయముల పోకడలు. నీచములు హేయములై. అసత్యములతో ప్రబలి, మోసములతో, అన్యాయములతో, అధికార దుర్వినియోగములతో, దౌష్ట్యములతో నిండియుండుటయే కారణము. రాజకీయోద్యమములలో విజయము సాధింపగోరువాడు, కృత్రిమబుద్ధిని. మోసమును. నీతి విహితమైన ఆశలను వృద్ధిపఱచుకొనవలసి యుండుటకూడ కారణమే।

మన యోగసాధనకు త్రికరణశుద్ధి. నీతి, స్వార్థరాహిత్యము చేయవలసిన పనులను అనాసక్త అర్పణబుద్ధితో చేయుట, ఉదాత్తశీలము. ఋజువర్తనము. [illegible]నాదులు. కావున మొట్టమొదట మానవ దృక్పథంలోనే, మానసిక చైతన్యంలోనే అనివార్యంగా మార్పురావాలి. రెండవదిగా భౌతిక వాతావరణంలో సమగ్రమైన సంకీర్ణపరిణామంకావాలి. అప్పటికిగాని మానవ జీవితపరిస్థితులలో [illegible] ప్రయోజనకారియైన మార్పురాదు. ఇట్టి ఆత్మపరిణామము చేత [illegible]చైతన్యముచేత మానవుడు మరొక జాతిగా, విరాజిల్లగలడని శ్రీ అరవిందుల యాశయము,

ప్రస్తుత పరిస్థితులు గతముయొక్క పరిణామములు అట్లే భావిపరిస్థితులు మన ఇప్పటి దృక్పధముపైనను. ఆశయములమీదను ఆధారపడియుండును. ప్రతికూలపరిస్థితులను అనుకూలమొనర్చుకొనుట అసాధ్యమైన పనికాదు. మన ఆశయములు మనఃపూర్వకమైనవి తీవ్రమైనవి అగుచో మనకు అనుకూలపరిస్థితులు ఏర్పడగలవనియు ఆధ్యాత్మికగమ్యమును చేరుటకవి సహకరించగలవనియు మనము నిస్సంశయముగా నమ్మవచ్చునని శ్రీ అరవిందులనిరి. అంతేకాక సామాన్యముగా పరిస్థితుల ప్రాతికూల్యతపైకి కనపించునదిమాత్రమే అని తెలియవలెను. సాధారణముగా దానికి మూలము మన అంతరంగములోని విరుద్ధ భావముల మధ్యగలుగు అంతర్యుద్ధమే అనికూడ తెలియవలెను. మనలో మనమే విభిన్నులమై, మన అంతర్యములోని విరోధ భావములవలన అటునిటు ఈడ్వబడు

చుందుము. ఆత్మకాంక్షించునదొకటి, మనస్సు వాంఛించున దింకొకటి, దేహ మభిలషించునది వేరొకటి, అయినప్పుడే జీవితము బాధామయముగను, కంటకావృత పథముగను తోచుచుండును

అన్నిటికి మూలము ఆత్మయని చెప్పుచూ మనము ఆ భగవంతుని యొక మూలకు త్రోసి నీ స్థానమదియే మిగత జీవనమంతయు మాది అని పొరబడక సర్వము ఈమనః ప్రాణ శరీరములనన్నిటి ఆతని కల్పితముజేసి మనః ప్రాణ శరీరములందు వివిధ దివ్యశక్తులు తమ తమ సంపత్తి ప్రభావముల నెలకొల్పి విస్తృతముజేయు కృషియొనర్పవలెను. అప్పుడే దివ్యమైన భాగవత జీవనము, దివ్యజాతి భూలోకమందావిష్కరించగలదు. పరాశక్తి జగన్మాత ఈ యుపకరణముల ననుగ్రహించి, వాని భారమువహించి, పరిశుద్ధమొనరించి, యున్నతశిఖరముల నందించి పరివర్తనమొనరించగలదు.

ఒకవ్యక్తి యొక్క మోక్షము, ఆతడు సర్వాత్మభావమును పొందుటలో కలదు. ఈ పాఠమును జీవితము సర్వదా చెప్ప ప్రయత్నించుచున్నది. కాని మానవుని దురహంకారము ఆ పాఠమును నేర్చుకొన నిరాకరించును. కారణ మేమనగా భగవంతు డొకవర్గముకాడు; రగుల్కొను అహంకారముకాదు; ఒక కుటుంబముకాడు, ఒక కులముకాడు; ఒక జాతికాదు; ఈ అల్పత్వములన్నియు అధిగమించిన అనంతుడు. కాని ప్రతి వ్యక్తియు నిస్స్వతంత్రముగను అసంపూర్ణముగనే జీవించుచున్నాడు. దీని కొకకారణమున్నది. ఆతడు తన జీవనయాత్రను తన కాలమును, తన దేశమును తనకు సమకాలికములగు సర్వవిషయములను సత్యములుగను శాశ్వతములుగను భావించును. తనజన్మ తనవిజ్ఞానము. తన ఇచ్ఛ, తనశక్తి తనకు ప్రపంచముతో గల వివిధ సంబంధములు అన్నియు యదార్థములని, సత్యములని భ్రమించును. ఈదోషము అహంకారజనితము. దీనివలన సత్యమనునది మాటుపడుచున్నది ఏవ్యక్తిగాని తనంతటతాను బ్రతుకజాలడు. సర్వాంతర్యామియు, సర్వజీవమయుడును, సర్వవిజ్ఞాతయు, సర్వసమర్థుడును అగు భగవంతుని ఇచ్ఛకు అనురూపములయిన కార్యములు చేయుటకు వలయు శక్తికంటే ఎవ్వనికిగాని ఎక్కువ శక్తి యుండుటకు వీలులేదు. ఆ భగవచ్ఛక్తి మనకు ఆత్మదర్శనము కలిగించును.

అహంకారము, ఇంద్రియపరిమితత్వముఅనెడు బంధములనుండి విముక్తి గాంచిన ఒకానొక దివ్యసార్వత్రిక ప్రకృతికి తన ఆత్మను తదంగములను శృతి కల్పుటలోనే యోగసాధకుని నైపుణ్యముకలదు. (కర్మలయందెట్టి నైపుణ్యమైనను యోగమనుట పొసగదు.) మనస్సుయొక్కయు, జీవనముయొక్కయు పరిణామమువలన ఒక విశుద్ధమగు ఆంతరస్థితియు శక్తియుకలుగును. ఈ పరివర్తనమే యోగము. ఈ శక్తినుండి యే విత్తునుండి వృక్షము మొలకెత్తినట్లు సత్యవర్తనమును, సత్యమగు నాధ్యాత్మిక దివ్యఫలితమును సహజముగ నుద్భవించుచున్నవి.

---

# శ్రీ అరవింద శతజయంతి
# – భారతీయులకు మేల్కొలుపు

— కె. కూర్మారావు

శ్రీ అరవిందుల జన్మస్థానము భారతదేశము. కనుక భారతీయునిగ వారు అవతరించినారు. కాని వారి తండ్రి తనపుత్రుడు నూటికి నూరుపాళ్ళ ఆంగ్లేయసంస్కృతితో నిండినవాడుగ మారిపోవలెనని సంకల్పించినాడు. అందు వలననే శ్రీఅరవిందుని బాల్యము, విద్యార్థిదశ-రెండును ఇంగ్లండులో పరిపూర్ణ మైన ఆంగ్లవాతావరణములోనే గడచినవి. మాతృభాష బెంగాలీ అయినను అది పరభాషగనె ప్రత్యక్షమైనది.

ఎంత కఠోరదీక్షతో తండ్రి తనను ఆంగ్లేయ వాతావరణములో తీర్చి దిద్ది, పెంచి, పెద్దవానినిజేసి విద్యాబుద్ధులు చెప్పించినను శ్రీ అరవిందులు భారతా వనికివచ్చి స్వచ్ఛమైన భారతీయునిగ ప్రత్యక్షముగాకతప్పలేదు; ఆంగ్ల ప్రభుత్వాన్ని యెదుర్కొని నిద్రాణమైన భారతజాతిని మేల్కొపి జాతీయతత్వమును నూరి పోయకతప్పలేదు. దశరథుడు తన వార్ధక్యములోకలిగిన పుత్రుని–శ్రీరాముని– అతఃపురములో అల్లారుముద్దుగ ఆటలాడుచుండవలెనని కోరినాడు, కాని విశ్వా మిత్రుని వెంట బాల్యములోనే అరణ్యమునకు పంపించక తప్పలేదు. తరువాత సీతా పరిగ్రహీతయై రాముడు అయోధ్యకు తిరిగివచ్చినాడు. అద్యతనములో అతనిని పట్టాభిషిక్తునిగజేయుటకు దశరధుడు సకల ప్రయత్నములుచేసినను అతని సమక్షములోనే భార్యా సహితముగ వల్కలధారియై దండకారణ్యమునకు పయ నించక తప్పలేదు.

రాహులు సహిత నవవధూ యశోధర చెంతనే సర్వలక్షణ కళాసమన్విత పరిసర మధ్యాంతఃపురములో సిద్ధార్థుని శుద్ధోదనుడు బంధించినాడు. ఆధ్యా త్మికచింతనకు అతనికి ఆవంతయైనా అవకాశమీయలేదు. అయినను తథా గతుడు అర్ధరాత్రివేళ అర్ధాంగిపై అనురాగమునువీడి, రాహులుని అతని తల్లి వద్దనే వదలివేసి భయంకరమైన అరణ్యములలోనికి వెళ్ళి 'శాక్యముని'గ మారి

పోకతప్పలేదు నందయశోదలకు కృష్ణుడు రాచబిడ్డయే. కాని యాదవ బాలురతోకలసి వేణుగానముతో ఆలమందలవెంట వెళ్ళు కృష్ణునిజూచి మాతాపితరులు సంతసించకతప్పలేదు.

వీటన్నికి కారణములేకపోలేదు. లోకోద్ధరణకొఱకు కారణ జన్ములైన అవతారపురుషుల జీవితములను భోగభాగ్యములతో భౌతికసుఖముల మధ్య బంధించివుంచవలెనని తలిదండ్రులు యెనలేని ప్రయత్నములుచేసినను వారి అంచనాలకు భిన్నముగ ఆ అవతారపురుషుల జీవితములు ప్రత్యక్షమగుచుండెను; లేనిచో భూమిపై అవతరించిన ఉద్దేశ్యమునెరవేరదు.

శ్రీ అరవిందులవలె శ్రీ మాత అవతరణకుకూడ ఒక ఉద్దేశ్యము (aim)లేకపోలేదు. ఆమె ఫ్రాన్సు దేశములో సంపన్న కుటుంబములో జన్మించినది. విద్యావ్యాసంగములకు, భౌతికసుఖములకు యెట్టికొఱతయులేదు. కాని బాల్యావస్థలో ఆమె అంకురించి, విప్పారి దినదిన ప్రవర్ధమానమగుచున్న 'మానవ లోకమును ఉద్ధరించుటయెట్లు?"—అను జిజ్ఞాసనుతలిదండ్రులుగాని, ఫ్రాన్సుదేశముగాని తీర్చలేదు. గృహిణియైనపిమ్మట ఆ జిజ్ఞాసవిస్తృతమైనది. వయస్సుతోబాటు 'జన్మజాత నిగూఢయౌగికశక్తి' వృద్ధిఅయినది. ఎందరో యోగిపుంగవులతో మాట్లాడినను ఆమె ముందు ప్రత్యక్షమగుచున్న ప్రశ్నార్థకమునకు సమాధానములేదు. అచ్చట జరుగుచుండు ధార్మికసమావేశములు (religious congregations) శుష్క ప్రసంగ నిలయములుగ ఆమెకు భాసించినవి. ఇక భారతీయవాఙ్మయములోని గీత, ఉపనిషత్తులు, ధమ్మపదము-వీనిని క్షుణ్ణముగ పఠించుట జరిగినది; భారతీయతత్త్వశాస్త్రములోని అత్యున్నతస్థితి శ్రీ మాతకు కనుపించినది. కాని బాల్యమునుండియువారికి ప్రత్యక్షమగుచున్న ప్రశ్నార్థకమునకు తృప్తికరమగు సమాధానము లభించలేదు. ఈ విషయమేగాక, ఆధ్యాత్మికసాధన బలవత్తరమైనకొలదీ ఊహాజగత్తులో భాసిల్లుచున్న దివ్యపురుషునిరూపము ఆమె బాహ్యచక్షువులకు గోచరముకాలేదు. యాదృచ్ఛికముగ తన పతివెంట ఆమె భారతదేశమునకు వచ్చుటయు, పుదుచ్చేరిలో శ్రీ అరవిందుని దర్శించుటయు జరిగినది ఆమెలోని నిగూఢయౌగికశక్తి శ్రీ అరవిందులకు కనుపించగ తన ఊహాజగత్తులో అనుక్షణము భాసిల్లు 'దివ్యపురుషుడు శ్రీ అరవిందులేనని ఆమెకు రూఢియైనది; తాను

'మీరా'గను, అరవిందులు 'వాసుదేవుడు'గను ఆమెకు బాసిల్లినది, ఇక శ్రీ అరవిందులకు ఆమె 'శ్రీ మాత' The mother— రూపములో కనుపించసాగెను. ఉభయములలోని దివ్యమైన యోగశక్తి, యోగదృష్టి సమ్మిళితమై దివ్యసాధనకు ఉపక్రమించుట జరిగినది. మానవలోకోద్ధరణకై ఆమె భారతీయనారియై భారతదేశమునే ప్రయోగశాలగ యెంచుకొని శ్రీ అరవిందులచెంతనే స్థిరనివాసిని యైనది.

## భారతదేశము మహాయోగిద్వయమునకు ప్రయోగశాల

భారతదేశమే యీ మహాయోగి ద్వయమునకు ప్రయోగశాలగ, సాధనాక్షేత్రముగ యెన్నికయగుటకు కారణములేకపోలేదు. సర్వమానవాళికి శాశ్వతానందప్రాప్తికై దివ్యతపమాచరించిన ఋషులు, మునులు భారతదేశమునందే అవతరించినారు. క్రమవికాసపథములో జీవులకు అడ్డంకులు తొలగించి చేయూతనిచ్చి దివ్యపథముపైపునకు తీసుకొనివెళ్ళిన భగవదవతారములు (Divine Incarnations) ఆ యా యుగములలో యెక్కువ భాగము యిక్కడనే అవతరించినవి. సాంఘిక (social) నైతిక (ethical) మత (religious) స్థాయిలన్నిటికంటెను ఉచ్ఛతమమైన అంతస్థునకు ఆత్మగమనమును తీసుకొనివెళ్ళు వేదములు, ఉపనిషత్తులు, దర్శనములు యిక్కడనే ఉద్భవించినవి.

## రాజకీయవేత్తలో మహాయోగి లక్షణములు

మహాభారతములో ఉద్ధండమైన రాజకీయవేత్తగను, మహాయోగీశ్వరునిగను మనకు కనుపించునది శ్రీకృష్ణుని రూపము. అట్లే భారత జాతీయ కాంగ్రెసు చరిత్రలో శ్రీ అరవిందులు శాశ్వత దూరదృష్టిగల మహోన్నత రాజకీయవేత్తగను, మహాయోగీశ్వరునిగను ప్రత్యక్షమగుచుండును.

1872 ఆగస్టు 15వ తేదీన శ్రీ అరవిందులు అవతరించినారు. నాటి ఇంగ్లాండులో విద్యార్థిదశ పూర్తి చేసుకొని భారతదేశములో అడుగిడినారు. నాటి దేశీయులస్థితి శోచనీయము: భారతమాత అన్నివైపుల బంధింపబడినది. జాతీయ మహాసభ (National Congress) బ్రిటిషు ప్రభుత్వమును మెప్పించి యేవో కొన్ని వసతులను భారతీయులకు కలిగించుటకై అర్థించు మేధావులసభ

సమావేశముగ మాత్రమే వారికి కనుపించినది. ఇది కేవలము శుష్కప్రసంగము లకు, శూన్యవాస్త్రప్రయోజనమును పొందుటకు రంగస్థలమేకాని వేరొకటి కాదని వారు భావించినారు

ఆ క్షణములో భారతమాతను రాజకీయ దాస్య విముక్తనుగ చేయుటయే శ్రీ అరవిందులకు కనుపించిన ప్రత్యక్ష కర్తవ్యము. అందుకే జాతీయ కాంగ్రెసులో చేరినారు: మహానాయకులైనారు. "ఎట్టి మినహాయింపులు లేని సర్వ సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతజాతి కోరునది"— ఇది అరవిందులు చేసిన నినాదము. ఈ నినాదము భారతదేశము నలువైపులా మారుమ్రోగినది. నిద్రాణమైన జాతి మేల్కొనినది. 'వందేమాతరం' ఉద్యమం విజృంభించినది. తెల్లదొరతనమునకు 'అరవిందఘోష్' ఆకారము అతి భయంకరమైనది. ఒకవైపు జాతీయవిద్యాప్రచారము, మరొకవైపు వందేమాతరం, స్వదేశీ ఉద్యమం—యివి ఆ నాడు శ్రీ అరవిందులు చేపట్టిన ఆయుధములు. వారి రచనలు, వారి ఉపన్యాసములు, వీనివలన దేశమంతట యువకులు, విద్యార్థులు మేల్కాంచినారు. భారతీయులకు స్వాతంత్ర్యము అనతిదూరములో కనుపించినది.

కాని అదే సమయములో అతివాదులు, మితవాదుల భేదాభిప్రాయముల ఫలితముగ కాంగ్రెసు సంస్థలో కలకలము ప్రవేశించినది. ఉభయులమధ్య ఐక్యత మృగ్యమైనది. అప్పటికే శ్రీ అరవిందునిలో ఆధ్యాత్మిక చేతన ఉన్నత స్థాయిని అందుకున్నది. యాదృచ్ఛికముగ 'శ్రీ లేలే' వద్ద యోగాభ్యాసము చేయుట జరిగినది. "లేలే" నిమిత్త మాత్రమే. అప్పటికే అంతకరణములో పెల్లుబికివచ్చుచున్న యోగబలము కార్యరూపము ధరించినది. జీవితపర్యంతము సాధన చేసినను యెందరో యోగులకు సిద్ధించని నిశ్చల నీరవ మానసికస్థితి (mental quietness) రెండు మూడు రోజులలోనే శ్రీ అరవిందునికి సిద్ధించినది. 'భారతీయులు ఆధ్యాత్మికముగ శక్తిమంతులైనప్పుడే దేశమునకు సరియైన స్వాతంత్ర్యము సిద్ధించగలదు."— యీ భావము వారిలో క్రమముగ బలపడినది.

మితవాద, అతివాద భేదములు బ్రిటిషువారికి మంచి అదనును కలిగించినవి. శ్రీ అరవిందుని ప్రభుత్వము బంధించదలచినది. వారిని భయంకరమైన విప్లవకారుని (terrorist) చిత్రించి అలీపూరు బాంబుకేసులో అకారణముగ

వారిపేరును యిరికించి రాజద్రోహనేరము ఆపాదించినది. న్యాయస్థానములో చిత్తరంజన్‌దాసు 'అరవిందఘోష నిర్దోషి' అని వాదించి వారిని విడుదల చేయించువరకు కఠోర కారాగారములో శ్రీ అరవిందులు బంధింపబడియే యుండుట జరిగినది.

ఇక్కడే తనలోని దివ్యత్వము (divinity) శ్రీ అరవిందునికి ప్రత్యక్ష మైనది. దేవకి వసుదేవులు కారాగారములో వున్నప్పుడే శ్రీకృష్ణుడు అవత రించాడు; కారాగారములోనే అరవిందునికి శ్రీకృష్ణుడు ప్రత్యక్షమైనాడు. జైలులో అన్ని వస్తువులు కృష్ణమయముగ కనుపించినవి, పరశురాముని అంత శ్చేతనము శ్రీరామునిలో లీనమైనట్లు జైలునుండి విడుదలైన పిమ్మట శ్రీ అర విందుని అంతశ్చేతనములో రామమోహన్‌రాయ్, వివేకానందుల అంతశ్చేతన ములు విలీనము కాజొచ్చెను. రానున్న భవిష్యత్కార్య సాధనకు యివిఅన్నియు పూర్వభూమికలైనవి. శ్రీ అరవిందుని దృష్టి ఊర్ధ్వమైనది.

సర్వేశ్వరుని ప్రేరణతో తాను చేసినపని ఈశ్వరకార్యమేననియు, అందుచే స్వరాజ్యమునకై భారతీయులను ప్రేరేపించుట ఈశ్వరప్రేరితమైన పనియనియు, న్యాయాధీశుడు న్యాయస్థానము అంతయు తనకు శ్రీకృష్ణమయముగ కనుపించు చున్నదనియు న్యాయస్థానములో శ్రీ అరవిందులు వాఙ్మూలమిచ్చుట న్యాయా ధీశులకు ఆశ్చర్యము కలిగించినది,

## శ్రీ అరవిందులు పుదుచ్చేరి వచ్చుటలో ఆంతర్యము

బ్రిటిషు ప్రభుత్వము అరవిందుని నిర్దోషియని విడుదల చేయక తప్ప లేదు. అయితే వెంటనే ఉత్తరపారాలోని వారి ఉపన్యాసము, తరువాత పత్రి కలలో వెలువడిన వారి రచనలు, భారతీయులను పునః ఉత్తేజితులను చేసినవి.

స్వరాజ్యము, స్వారాజ్యమును పొందుటకై భారతీయులు సమాయత్త మగుటకు కావలసిన సామగ్రి అంతయు వానిలో నిండియుండుట తెల్లదొర తనము కనిపెట్టినది. అరవిందులు బయట స్వేచ్ఛగ వుండుట తనకు ప్రమాద కరమని భావించినది. ఏదో ఒక నెపముతో వారిని తిరిగి అరెస్టు చేయుటకు ప్లానులు వేయసాగినది.

ఈ విషయము శ్రీ అరవిందునికి తెలిసినది. వారి కార్యాచరణ పథకము ఒక మలుపునకు తిరిగినది. చెడిచెప్పుడు లేకుండ ఫ్రెంచి స్థావరమైన పుదుచ్చేరికి వారు వచ్చినారు.

ఈ మలుపులోని ఆంతర్యము యిట్టిదని నాడు శ్రీ అరవిందులకు మాత్రమే తెలుసును. కాని యితరులెవ్వరు తెలుసుకొనజాలరని చెప్పుట సాహసముగ కనుపించినను అది వాస్తవమేనని పాండిచ్చేరి చేరిననాటి నుండి వారు సాగించుచు వచ్చిన కార్యక్రమము, చేయసాగిన సాధన స్పష్టము చేయుచున్నది.

## శ్రీ అరవిందుని పూర్ణయోగము, నవ్యతంత్రము

శ్రీ అరవిందులు అవతరించువరకు ఆధ్యాత్మిక సాధన విభిన్న దృక్పథములతో నడచినది. శాశ్వత దుఃఖ నివృత్తి లేక మోక్షము — దీనిని ఆధ్యాత్మిక సాధనకు గమ్యముగ భావించుట జరిగినది. ప్రాచ్య ప్రాశ్చాత్య ఆధ్యాత్మ సాధనా స్రవంతులన్నియు దాదాపుగ జీవితము దుఃఖమయమని భావించుట జరిగినది. సంసారము ఆత్మవికాసమునకు, దైవ సాక్షాత్కారమునకు అటంకముగ భావించుటకూడ జరిగినది.

భారతదేశములో వేదాంత శాఖ 'బ్రహ్మ సత్యము' అని భావించుచు, 'జగత్తు మిథ్య' అనుటలో జగత్తు అనగా అనుక్షణము మార్పును పొందునట్టి జగత్తుయొక్క మారుచుండు రూపము 'మిథ్య' అని భావించి పరిణామ జగత్తునకు మూలమైన బ్రహ్మత్వమును, 'శాశ్వతము, స్థిరము' అని భావించుట యుక్తము. అట్లుగాక జన్మదుఃఖ, — " జాయా దుఃఖం— —సంసార సాగరం దుఃఖం' —— యీ భావము బలపడినప్పుడే వేదాంతమార్గములో సాధకునికి యోగ్యత వున్నట్లు పరిగణించబడుతూవచ్చినది. 'చిత్త' ము యొక్క ఊర్ధ్వ గమనమును మాత్రమే కాంక్షించిన యోగ మార్గములన్నియు దేహమును, ప్రకృతిని ఆనందపథమునకు అడ్డంకులుగనే భావించినవి. కాని శ్రీకృష్ణ పరమాత్మ 'మా మేవయే ప్రపద్యంతే, మాయామేతాంతరంతితే' — పురుషోత్తముడైన పరమాత్మను ఆరాధించి ఆశ్రయించినవారే యీ భ్రమా జ్ఞానమును

(మాయను) దాటగలరు — అని నిశ్చయముగ చెప్పుటకు భ్రమాజ్ఞానము బల వత్తరమైనది - 'మమమాయాదురత్యయా' అని చెప్పినను దివ్యత్వములోనికి రూపాంతరము (transformation) నొందుటకు జీవాత్మ చేయవలసిన సాధనకు 'ఇదం శరీరం కౌంతేయక్షేత్రమిత్యభిధీయతే' అని — శరీరమును క్షేత్రముగ నిర్ణయించినారు. ఇదే విధముగ శ్రీ అరవిందులు 'All life is yoga' అని అన్నారు. అంతేగాక 'Life Divine' అన్నారు. అతీత మానసిక స్థితిలోనికి రూపాంతరము నొందిన శుద్ధ, సత్యజీవితమంతయు దైవమయమే అని స్పష్టముచేయుటవలన శ్రీ అరవిందులు చూపిన మార్గము నూతన మార్గమైనది. అయితే అది 'పూర్ణమైన' యోగమార్గమైనది.

అన్ని స్థాయిలలోను పరమాత్మతో జీవాత్మ తాదాత్మ్యమును పొందుట 'యోగము' యొక్క పరమావధి. 'సమాధి' దానికి పర్యాయపదము. ఇక్కడ సమాధిలో — సహస్రారమునందు నిత్య, సత్య, శుద్ధ, బుద్ధ నిశ్చల స్థితిలో వుండి చేతనములేక జీవాత్మ 'conciousness' శాశ్వతానందమును — అమృతమును అనుభవించుచు జాగ్రత, స్వప్నములకు పైనదగు 'తురీయ' ము నందు వుండును. 'ఎరుక' అవినాశియైన దైవము - Divine - నందు కేంద్రీకృతమై యుండును; ఈ సమాధి సవికల్పము, నిర్వికల్పము అని రెండు విధములుగ వుండునని పతంజలి యోగదర్శనము తెలుపుచున్నది. యోగమునందు కలిగిన విభూతిని యోగి సవికల్పసమాధిలో ఊర్ధ్వగమనమునకై వినియోగించునట్లు యీ దర్శనము స్పష్టము చేయుచున్నది.

పతంజలితోబాటు పూర్వమార్గములన్నియు యోగమునకు 'చిత్తవృత్తి నిరోధము'ను ప్రథమ సోపానముగ నిర్ణయించినవని చెప్పవచ్చును. ఇందుకు రెండు భావములు మూలకారణమైనవి. ప్రాచీన మార్గములలో జీవాత్మ 'అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములను అతిక్రమించి విజ్ఞానమయకోశము ప్రవేశించి అక్కడనుండి ఆనందమయ కోశములో చేరి అక్కడనే శాశ్వత సమాధిని పొందుటయే లక్ష్యముగ భావించుట జరిగినది. ఇది మొదటి కారణము చరాచరసృష్టి అంతయు దుఃఖమయము; దానికి ఆవలనుండుట ఆధ్యాత్మిక సాధనకు అవసరము అను భావము రెండవకారణమైనది. ఈ రెండింటిని శ్రీ అరవిందులు త్రోసిపుచ్చుటవలన వీరి యోగమునందు చిత్తవృత్తి నిరోధము

కనుపించదు. చిత్తవృత్తి ఉన్మీలము జగురుటయు, అంతశ్చేతనము పరివర్తన చెందుటయు యిందులో జరుగును.

'ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్'—సృష్టిలో అణువణువుకూడ ఈశ్వరవాసమై యున్నది. ఆ పరబ్రహ్మలోని మహాశక్తి చేతనే జగత్తు. అందులోని కార్యకలాపములు జరుగుచున్నవి, చరాచరముల గతి విధులు ఆమె సంకల్ప వికల్పములపైన ఆధారపడియున్నవి. ఇక 'జన్మ' — జీవులపుట్టుకయు అందులోని అంతర్భాగమేయగును. దాని ద్వారా జన్మయొక్క లక్ష్యము సచ్చిదానందానుభూతి మాత్రమే. కనుక శ్రీ మాతారవిందులు చూపిన యోగ మార్గములో మనము ముఖ్యముగ మున్ముందుగ గుర్తించవలసిన విషయము ఒకటి కలదు. 'జన్మ అనునది దుఃఖమునకు హేతువు కాదు : కాజాలదు' అని. జీవిదైవోన్ముఖముగ చేయు ప్రయాణములో లేదా మరొక మాటలో చెప్పవలెనన్నచో జీవియొక్క క్రమవికాస (Evolution) గమనములో 'జన్మ' అనునది అనివార్యమైన అంతస్తు లేదా ఒకమెట్టు — step — అగుచున్నది. కనుక జనన మరణములు దైవలీలలో అంతర్భాగములగుచున్నవి. కనుక శ్రీ అరవిందుని పూర్ణయోగములో జనన మరణములనుగూర్చి నిరసన భావమునకు చోటులేదు. ఈ యోగములో యోగి యీ విషయమునందు మహాభక్తుడగుచుండును. ప్రహ్లాదుడు, జనకుడు మొదలు నేటి వరకుగల మహాభక్తులందరు జనన మరణములను లీలనుగనే భావించినారు. ఆ భావనలో వారికి (దుష్ట) అహంకార ప్రవృత్తియు నశించినది. అనుక్షణము చేతలలోను, మాటలలోను, భావమునందును దైవానుభూతిని పొందుటద్వారా సచ్చిదానందము సిద్ధమగును. అయితే యీ యోగమునందు సాధకుడు తప్పనిసరిగ తనను తాను దైవమునకు (total surrender) పూర్తిగ అర్పించుకొనవలెను. అప్పుడే తనలో 'అహం' అనంతమైన అహంలో అంతర్ధానమగును.

సద సద్వివేకము, ఇహాముత్రఫలభోగత్యాగము జ్ఞానిలక్షణములుగ చెప్పబడినవి. భ్రమను విసర్జించి 'ప్రమా' జ్ఞానమును అనగవాస్తవిక సత్యమును- 'Eternal Truth'ను జ్ఞాని గుర్తించుటకు నిర్విరామకృషి చేయుచుండును. శ్రీ అరవిందుని పూర్ణయోగములో సాధకుడు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములను, వాటి అంతర్భాగములను,

చేతనము ప్రాణిక (vital) మానసిక (mental)జగత్తులలో పొందుమార్పులను. అతి జాగరూకతతో గుర్తించవలెను. ధ్యానములో కలిగెడి అనేకఅనుభూతులలో భ్రమామూలకమైనవానిని గుర్తించి వాటిని విసర్జించి వాస్తవికమైనవానిని గ్రహించి శాశ్వతసత్యమును (eternal truth)ను ఆరాధించవలెను.

భక్తి, జ్ఞానమార్గములుగాక కర్మయోగము లేక రాజయోగము అను మార్గము ఒకటివున్నది. "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతగ్ సమాః" అనియు "న కర్మలిప్యతే నరే" అనియు కర్మయొక్క ప్రశస్తినిగూర్చిన వాక్యములు ఈశోపనిషత్తులోవున్నవి. 'యజ్ఞ కర్మ సముద్భవమ్".— —"యజ్ఞశిష్టాశినఃసంతో ముచ్యంతే సర్వకిల్బిషైః"అనియు, "కర్మణ్యేవాధికారస్తే, మాఫలేషు కదాచన" అనియు గీతలో చెప్పబడినది. కేవలము కర్మను అనుసరించినప్పుడు ఫలాపేక్షతో సాధకుడు ఆవరించబడు ప్రమాదముకలుగును. నిష్కామముతో కర్మను ఆచరించినప్పుడు, తాను కర్మలో లిప్తుడైపోకుండ అతని కర్మ శోభాయమానమై(కౌశలం)తాను యోగి అగుచున్నాడు. కామ్య కర్మలను విసర్జించుటయే వాస్తవికసన్యాసమగును. శ్రీ అరవిందులు, శ్రీ మాత ప్రతిసాధకుడు విధిగ కర్మను ఆచరించవలెనని బోధించినారు. సాధకుడు తాను చేయుపని తనకొరకుగాని. లేక మానవులకొరకుగాని చేయుచున్నట్లు భావించరాదనియు, కేవలము 'దైవము' కొరకు 'దైవార్పణ' భావముతో చేయవలెననియు బోధించినారు. అప్పుడు పరిపూర్ణమైన 'సన్యాసము' కాగలదు. కనుక శ్రీ అరవిందుల యోగమునందు భక్తి, జ్ఞాన, కర్మయోగములు సమన్వయముచేయబడి 'యోగః కర్మసుకౌశలమ్'—ప్రతిచేష్టయు యోగమయమై,కౌశలమై'ప్రకాశించుటచే అన్ని యోగమార్గముల సమన్వయము (synthesis) యిక్కడ కనుపించును. 'పూర్ణమదః' పూర్ణమిదం—గమ్యములో ఉద్దేశించిన పూర్ణత్వము లేక సచ్చితానందము-అఖండ సత్యము గమనములోను సైతము అనుక్షణము అనుభవమగుటవలన యిది పూర్ణయోగమైనది.

ఈ యోగమునందు సాధకులు నైతికమార్గములను. సాంఘికవిలువలను, ఆయా మతానుష్ఠానములను ఒక్కుమ్మడిగ వదలివేయవలసినది శ్రీ అరవిందులు ఆదేశించినట్లు కనుపించదు. కాని వానియందే బంధింపబడరాదనియు, వాటి లక్ష్యమైన ఆత్మోన్నతిని మరువరాదనియు ఆదేశించినారు. పైన తెలిపిననైతిక

మార్గములు మొదలైన దేశకాలములచే ఆవృతమైనది. దేశకాలాతీతమైన అఖండజ్యోతి లేక అఖండసత్యమునైన 'దివ్యచేతనము' విరాజిల్లుచుండును. ఆ సత్యమువైపునకు పయనించక ఆయా మత సంప్రదాయములలోనే బంధింపబడుటను యే యోగమార్గము ఆమోదించదు. ఇక శ్రీ అరవిందునిపూర్ణయోగమునందు యిది సాధకునికి ప్రబలమైన ఆటంకమగును.

శరీరముమీద కఠినాతికఠిన ప్రయోగములుసలిపి. శ్వాసప్రశ్వాసలయొక్క గతులను వశపరచుకొని శరీరమును తన వశమందుండు పని ముట్టుగ మార్చుకొని హఠయోగి అనుక్షణము సమాధిలోవుండ గోరును. జగత్తుతో అతనికి పనిలేదు; దానిలో అతడు దైవలీలను దర్శించగోరడు; అది అతనికి, 'శివం' సుందరంగ భాసించదు

'జగత్తు మిధ్య; బ్రహ్మమాత్రమే సత్యము. కర్మబంధన హేతువు; జన్మ దుఃఖమయము. 'ఏకమేవ న ద్వితీయం'—యీ భావము జ్ఞానయోగికి దృఢమైయుండును. ఇక్కడ జన్మరాహిత్యమనునది మోక్షమునకు ఒక గుర్తు. దీనికొరకే జపతపాదులను ఆచరించును. శుద్ధ సత్వచేతనమైన 'అహం' మాత్రమే 'బ్రహ్మ' అగును అనగ 'అహం బ్రహ్మాస్మి' అగును. అంతర్దృష్టి లేక 'లోచూపు మాత్రమే ఆద్యోపాంతము నడచుచుండును; బాహ్యము అంతయు బంధనహేతువుకనుక బాహ్యదృష్టి వర్జనీయము. 'అహం' ఊర్ధ్వగామియై 'బ్రహ్మ'లో 'divine conciousness'లో తాదాత్మ్యమునుపొందుట పరాకాష్ఠయై అక్కడనే శాశ్వతముగ లీనమైయుండుట జ్ఞానయోగికి ఆనందమగును. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములను దాటిపోవుటనే యీ మార్గములో యోగికాంక్షించుచుండును.

'సాంఖ్య యోగౌ పృధక్ బాలాః ప్రవదంతి, నపండితాః' అని శ్రీకృష్ణుడు తెలిపినందున జ్ఞానయోగమువలెనే కర్మయోగముకూడ ఒకే లక్ష్యమును కలిగియుండును. అయితే కేవల జ్ఞానయోగమునకు 'కర్మ' వర్జనీయమైనచో కేవలకర్మయోగికి కర్మఫలాపేక్షితమైన స్వర్గగమనము వాంఛితమైయుండును.

భక్తియోగములో ఆరాధ్యదైవము పితగను, భర్తగను, సఖునిగను భక్తునికి భాసిల్లుచుండును. కేవల భక్తిమార్గములో ఆరాధ్యదైవము చెంతనే

తానుండుటకై భక్తుడు జపించును; గానముచేయును; నృత్యముచేయును. బయటి జగత్తులో అతనికి మాధుర్యము కనుపించదు. పైగా ఏవగింపుసైతము కలుగవచ్చును. అయితే జ్ఞానయోగములోని సన్న్యాసక్రమము యిక్కడ కనుపించదు.

ఈ యోగములన్నిటిని భగవద్గీతదాదాపు సమన్వయముజేసి చూపెట్టినది. అక్షరబ్రహ్మలో క్షరమైన జీవాత్మ లీనమైపోవుటను, క్రిందినుండి పైకివెళ్ళి అక్కడనే అంతర్లీనమైయుండుటను చూపెట్టినది. జాగ్రత, స్వప్న, సుషుప్తులలో జీవాత్మపైకెగసి తురీయమునందు చేరి, తురీయాతీతములో పరబ్రహ్మతో తాదాత్మ్యము నొందుటను యింతవరకు యోగము చూపెట్టినది.

ఇక తంత్రముకూడ క్రిందినుండి పైకివెడలు మార్గమును చూపించును. జీవి అంతశ్చేతనములో తన యెరుకను రూపాంతరము (transform) జేసుకొని ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ చక్రములవరకు కుండలినిని ఉద్దీప్తమొనరించి, ఆపైన ఆజ్ఞానచక్రములో అంతర్దృష్టిని కేంద్రీకరించి తంత్ర మార్గానుగామియైన సాధకుడు 'ఆద్యాశక్తి' అనుగ్రహించు అమృతరసాన్ని ఆస్వాదించుచుండును. యోగమునకు 'పరబ్రహ్మ' (నిశ్చలమైన) ఏకైకలక్ష్యము కాగా, తంత్రమునకు ఆద్యాశక్తి మాత్రమే ఏకైక లక్ష్యమగును.

'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతా నిజాయన్తే' (బృహ. ఉ) ఆనందము నుండియే యీ చరాచర సృష్టి జరుగుచున్నది—అనునది శ్రీమాతారవిందుల పూర్ణయోగములో ముఖ్యమైన విషయము. జీవి ఆనందమయుడు; ఆనంద భాగము అధికము. దుఃఖభాగము చాలతక్కువ. అందు వలననే దుఃఖమునుండి బయటపడుటకై జీవి పరితపించు చుండును. దుఃఖరూపములో మనకు కనుపించునది భ్రమాజ్ఞానసంజనితమైనదని యీ యోగములో భావించబడును. ఈ దుఃఖము ఆసురీ ప్రవృత్తుల (hostile forces) ప్రభావము. కనుక యీ యోగమునందు సాధకుని సర్వము సుందరముగను, శివస్వరూపముగను భాసించును. సత్య, శివ, సుందరమయమై ప్రకాశించును. ప్రత్యేకముగా సన్న్యాస మనునది అనావశ్యకము. అంతఃకరణను దైవముమీద మరల్చి అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములకు చేరవలెను. ఈ మనోమయ కోశమును దాటుటయే కఠినాతికఠినమైనసాధన. అనేకులు కఠినతపశ్చర్యచేత ఆకోశమును

దాటియుండి అక్కడనే స్థిరపడిపోవుటకు సంకల్పించిరి. మనస్సునకు ఆవల విజ్ఞానమయ ఆవరణలో దివ్యపురుషుని నిలయము. ఆ దివ్యపురుషుని ప్రకృతియే ఆద్యాశక్తి. ఆశక్తి మనస్సునకు దివ్యపురుషునికి మధ్య విరాజిల్లుచుండును. ఆశక్తిని క్రిందికి – భూమిపైకి – ప్రాణమయ, అన్నమయ కోశములలోనికి తీసికొనివచ్చి సాధకుడు యీకోశములను రూపాంతమొనరించవలసి యుండును. అప్పుడు సృష్టిలక్షణమే విలక్షణమై భాసిల్లును. కనుకనే దీనిని నవ్యతంత్రము, నవ్యయోగము అని చెప్పవలెను.

## వేదోపనిషత్తులు – శ్రీ అరవిందులు

వేదములు ఋషిశ్రుతములు. అపౌరుషేయములు అవి ఛందోబద్ధములు; దివ్యవాణి ప్రతిస్పందితములు: శాశ్వతములు. వేదముల జ్ఞానము – 'అనంతా వై హి వేదాః' అనంతము. వైదికతత్వము దివ్యమైనది. దివ్యత్వమును పొందుటకు కావలసిన మార్గము వేదములలో చూపబడినది.

వేదములలో అనేకదేవతల పేర్లుకనుపించును. అగ్ని, ఇంద్ర, మరుత్, ఉషా, మిత్ర, వరుణ, పర్జన్య యిత్యాది అనేక దేవతల ప్రసంగము వచ్చుచుండును. ఈ దేవతలను ఋషులు స్తుతించినారు; వర్ణించినారు; ఆరాధించినారు; అనుసరించినారు.

వేదములందు ప్రధానముగ ఉద్దేశించి చెప్పబడిన విరాట్పురుషుడు పరబ్రహ్మము లేక పురుషోత్తముడు. 'సహస్రశీర్షః పురుషః సహస్రాక్షః సహస్రపాత్' అనియు, 'తదేజతి తన్నైజతి తద్దూరేతద్వన్తికే' అనియు యీ విరాట్పురుషుడు వర్ణింపబడినాడు. ఇటివేదముల ఉపనిషత్తులనుగూర్చి శ్రీఅరవిందుల అభిప్రాయము మిగిలిన వ్యాఖ్యాతల భాష్యకారుల అభిప్రాయములకు భిన్నమైనది. వేదములందలి దేవతలను గూర్చియు, ఆదేవతల పనులను గూర్చియు, వైదిక కర్మలను గూర్చియు శ్రీఅరవిందులు సహేతుకముగ చర్చించినారు.

వేదములలోని దేవతలు ప్రకృతి పరమైనవనియు వానినే వైదిక ఋషులు ఆరాధించిరనియు కొందరు భావించుచు వచ్చిరి. ఆదేవతలు స్వర్గస్థమైయుందు

రనియు, యజ్ఞయాగములు, కర్మకాండ-వీనిద్వారా దేవతలను తృప్తిపరచి స్వర్గ సుఖమును అనుభవించుటయే వైదికఋషుల ధ్యేయమనియు మరికొందరు భావించుచువచ్చిరి.

వేదములలోని చివరి భాగము వేదాంతము. వేదసారము వేదాంతమగును. అది ఆధ్యాత్మికమైన విషయమే. వేదములందు ఆధిభౌతిక, ఆధిదైవిక, విషయ ప్రస్తావనలు కనుపించినను వాటన్నిటియొక్క అంతర్యము ఆధ్యాత్మికమేనని శ్రీ అరవిందులు స్పష్టము చేసినారు. ఆధ్యాత్మిక విచారణ అనగా శాశ్వతసత్య (eternal truth) విచారణ. కనుక వేదములలోని జ్ఞానము శాశ్వతమైనది. కనుక వేదములలో ప్రస్తావనకు వచ్చుచుండు దేవతలు ఆధ్యాత్మికమైనవి కావలెను. ఈ విషయములో శ్రీ అరవిందులు యిట్లు తెలిపినారు.

"Vedic gods are a parable of human life emerging, mounting, lifting, itself towards The Godhead."

"Agni, enjoying and devouring the things of Life, generates the Maruts, nervous forces of life that become forces of thonght; they upheld by Agni prepare the action of Indra, the luminous Mind, who is for our life powers their Rishi or finder of the truth and Right. Indra Vritra, the coverer dispels the darkness, causes Surya to rise upon our being and go abroad over its whole field with the rays of the Truth. Surya is The Creator or manifester, Savitri."

వైదిక ఋషులు వైదిక మంత్రద్రష్టలు. దివ్యవాణిని విని వారుపలికినారు. ఇక ఆ దివ్యత్వమును బోధించి సచ్చిదానందప్రాప్తికి బాటను చూపినారు. మంత్రములు భావగర్భితమైనవి. అందలి విషయములు రహస్య గర్భితములు (mystics) అని చెప్పవలెను. వైదిక ఋషులు దర్శించిన దివ్యత్వమునెల్ల నూ మహాయోగీశ్వరులైన శ్రీఅరవిందులు తమయోగశక్తిద్వారా వేదములలో దర్శించి మానవాళికి 'Life Divine' అను గ్రంథములో మానవాళికి బోధించి నారు. 'On the Veda' అను గ్రంథము యీ విషయమును యింకను విపులముగ బోధించుచున్నది.

నిగమాగమ తంత్రశాస్త్ర పారీణులును, శ్రీఅరవిందులకు అత్యంత సన్నిహిత శిష్యులలో ఒకరును అయిన శ్రీ కపాలిశాస్త్రిగారు సంస్కృతములో రచించిన 'సిద్ధాంజనము' అను గ్రంథము వైదికతత్త్వమును స్పష్టముగ బోధించు చున్నది. ఋగ్వేదమంత్రములకు భాష్యరూపమైన యీ గ్రంథము శ్రీమాతార విందుల ఆధ్యాత్మిక తత్త్వమును విశదముగ తెలుపుచున్నది.

## నూతన సమాజ నిర్మాణము

క్రమవికాస పథములో మానవులు పైకెగసి తమతమ ఆహార నిద్రా మైథునాలను కుటుంబ (family) ము యొక్క పరిధిలోనికి బంధించుకొన గలిగినారు. ఇక వ్యవసాయముద్వారా ఆహారోత్పత్తి అవసరమైనకొలదీ వారు తమతమ ఈప్సితాలను సమాజముద్వారా నెరవేర్చుకొనుటను నేర్చుకొన సాగినారు. సమాజ పరిరక్షణకు ప్రభుత్వముయొక్క అవసరమును గుర్తించుట జరిగినది. వ్యక్తి, కుటుంబము, సమాజము-యీమూడింటి క్రమవికాస గమనము అవిచ్ఛిన్నముగ సాగుటకు అవసరమైన నైతిక నిబంధనలు (Ethics) ప్రభుత్వ వ్యవస్థలలోనికి పరిణతిచెంది రాజకీయ (Political) రూపమును ధరించినవి.

శాంతి సుఖములను ప్రతిజీవియు అవసరమైనంతగ అనుభవించుటయే కౌటుంబిక, సామాజిక, రాజకీయ జీవితముల లక్ష్యము. ఇందుకొరకే భారత దేశములో వర్ణవ్యవస్థయు, ఇతర దేశములలో వర్గవ్యవసయు యేర్పడినవి. కాని కాలక్రమమున సమిష్టిదృష్టి లోపించుటవలన భారతదేశలో వర్ణవ్యవస్థ వెర్రి తలలు వేసినది. ఇతర దేశాలలో వర్గవ్యవస్థలో కలహములు పెరిగినవి. సమాజ పరిరక్షణకొఱకుగా యేర్పడిన రాజరికపు ప్రభుత్వము, సైనిక నియంతృత్వము, వ్యక్తి నియంతృత్వము, ప్రజాస్వామ్యము-యివి రానురాను మానవశ్రేయస్సునకై గుత్తఅప్పగించి వూరుకొనుటతో ఒకవిధమైన నూతన పరిణామము యేర్పడినది. సమాజములో యెక్కువ శ్రమజేసి తక్కువ ఫలితమును అనుభవించు శ్రామికులదే పాలన అయినచో సమాజ కళ్యాణమునకు దోహదకారి అగును అనుభావముతో శ్రామిక నియంతృత్వపు పునాదిపై (Proletarian dictatorship) యేర్పడిన సామ్యవాద (Communist) వ్యవస్థయు అందుకై సంపద అంతయు సమాజపరము కావలెను అనెడి సమాజవాద (Socialist) వ్యవస్థయు

యేర్పడినవి. ప్రపంచములో ప్రస్తుతము ప్రజాస్వామ్యము (democracy) మరియు సమాజవాద వ్యవస్థ (Socialism)_యివి రెండును ప్రధానముగ చెప్పబడుచున్నవి.

కాని చరిత్రగతిని, ప్రత్యక్ష పరిస్థితులను పరిశీలించినచో యీరెండిటి ద్వారా ప్రపంచములో శాంతి సౌఖ్యములు సుస్థిరములు కాగలవు అను ఆశ సన్నగిల్లుచున్నది. వెనుకబడిన దేశములపైన సంపన్న దేశములు, దుర్బల వర్గములపైన బలిష్టమైనవర్గములు ఆర్థికమైన దోపిడితోను, సైనిక పైశాచిక కృత్యములతోను స్వైరవిహారము సలుపుచుండుటను మనము చూచుచున్నాము. ప్రపంచశాంతి, సామాజికశాంతి అనునవి అనుమానాస్పదమగు చున్నవి. ప్రళయకాలములోవలె నేడు మానవలోకము ఆందోళనలో మ్రగ్గుచున్నది. శాంతి కొరకు ఆకసమువంక చూచుచున్నది.

శ్రీ మాతారవిందుల యోగదృష్టిలో యీ స్థితి సమాజమునకు కలుగుట సహజమనియు, మానవుని క్రమవికాసగమనములో యిది ఒక విధమైన_step-మెట్టుఅనియు మనకు తెలియగలదు. నూరింట యేభై ఒక్క మంది నిర్ణయమును నలభై తొమ్మిదిమంది యిష్టమున్నను లేకున్నను ఆమోదించుట నేటి ప్రజాస్వామ్యపు పద్ధతి. సామ్యవాద సమాజవాద పద్ధతులలో శ్రామికుల నిర్ణయములను మిగిలిన వర్గములు బలవంతముగనైన అంగీకరించవలెను. ఇక ప్రజాస్వామ్యపు తెరమరుగున మసలుతున్న పెట్టుబడిదారీ (capitalist) వ్యవస్థలో సమిష్టి శ్రేయస్సునకంటె వ్యక్తిగత శ్రేయస్సునకే ప్రధానస్థానమున్నది. కనుక ఒకవైపున వ్యక్తిగత ఆత్మస్వాతంత్ర్యమునకు వ్యక్తిగత అభిప్రాయమునకు స్థానములేకపోగా మరొక వైపున సమిష్టిదృష్టికి, సమిష్టి శ్రేయోభావమునకు స్థానములేకుండపోయినది. వ్యక్తిస్వేచ్ఛ, సమిష్టిదృష్టి_రెండిటిని మేళవించగల నూతన సమాజవిధానము యిప్పుడు అవసరమైనది. ఇందుకొఱకే శ్రీ మాతారవిందులు పాండిచ్చేరిలో అరవిందాశ్రమమును ప్రయోగశాలగ పెట్టికొని కృషిసలుపుతూవచ్చిరి. ఇక్కడ జరుగుచున్న కార్యక్రమములు ఆయా 'ఇజము'ల పరిధులకులోబడిగాని ఆయా మతవిశ్వాసములకు మాత్రమే కట్టుబడి జరుగుటలేదు. ఆశ్రమములకు సంబంధించినడచుచున్న విద్యావిధానము, వ్యావసాయిక పారిశ్రామిక విధానము మొదలైన పనులన్నియు ప్రపంచమేధావుల

దృష్టిని ఆకర్షింపుటకు కారణము. శ్రీ మాతారవిందులు ప్రతిసాధకుడు లేక ప్రతి మానవుడు తానుదైవముకొరకు లేదా విశ్వముకొరకు పనిచేయవలెనని బోధించినారు. అప్పుడే సమాజకల్యాణము జాతిశ్రేయస్సు, విశ్వసమైక్యత, విశ్వశాంతి యేర్పడగలవు. నిజమైన శ్రమవిలువ-dignity of labour-అప్పుడే గణనకు రాగలదు. అయితే ప్రతిపనినీ మనస్సుపరిధిలోనేగాక అతీతమానసిక అవతరణ కాంక్షతో జరుపవలసిన అవసరమును గుర్తించవలెనని శ్రీ అరవిందులు బోధించినారు.

ఇప్పటివరకు సామాజిక సూత్రములు, ఆర్థికసూత్రములు, రాజకీయ సిద్ధాంతములు కేవల భౌతికదృష్టియొక్క పునాదులపైననే నిర్మాణమైనవి. 'విశ్వములో నేను, నాలో విశ్వము అను universal దృష్టి అవసరమని అందరు భావించినను ఆధ్యాత్మికదృష్టినికూడ భౌతికభావనలో మేళవించనిచో ఆ universal దృష్టి ఆచరణలో అదృశ్యము గాకతప్పదు. ఎందుకనగా ఐక్యరాజ్యసమితి యేర్పడి యెంతకాలమైనను నేటికిని ఆయా దేశములమధ్య, రాష్ట్రములమధ్య ఘర్షణలు పెరిగిపోవుచునే వున్నవి. నిరుద్యోగము, సాంఘిక దురన్యాయము, ఆర్థికమైన దోపిడి — వీటి హద్దుపద్దులు కనుపించుటలేదు. లెక్కకు మిక్కిలి సంస్కరణలు వచ్చినను శాంతి సౌఖ్యములకు మానవాళి అర్రులు చాచుచున్నది.

మేధాశక్తిద్వారా వైజ్ఞానికోన్నతిని సాధించిన మేధావులు మనస్సుకంటె పైన మరొకశక్తికలదను విషయమును యింతవరకు పరిశీలించలేదు. శ్రీ అరవిందులే యీమహత్తరసత్యమును లోకమునకు వెల్లడించినారు. ఈ విషయమును గుర్తించినచో మానవవిధ్వంసమునకు అణుశక్తి ఉపయోగించబడక మానవకళ్యాణమునకే ఉపయోగించబడును.

మనస్సుపై భాగములోనున్న అతీతమనస్సు శుద్ధసత్త బుద్ధతత్త్వముగలది. ఆనందమయకోశమునుండి స్రవించు ఆనందరసామృతము అక్కడ శోభిల్లుచుండును. అది విజ్ఞానమయమైయుండునని ప్రాచీనఋషులు తెలిపినారు. శ్రీ అరవిందులు తమ దివ్యయోగబలముతో కనుగొనిన 'supermind' అక్కడనే వున్నదని వారి ప్రబోధములద్వారా తెలియుచున్నది. ఆత్మపరిశుద్ధమై పైపైకి పయనించునప్పుడు మనస్సు ఆవరణనుండి అతిమానసిక

(supramental) ఆవరణలో అది ప్రవేశించుచును. అనగ విజ్ఞానమయ కోశములోనికి చేరును. అక్కడనుండి తయారైన ప్రణాళికలు, విధానములు, స్కీములు విశ్వశాంతిదాయకము గాక తప్పదు. వర్గవైషమ్యములు, జాతిద్వేషములు అంతరించి నేటి సమాజరూపమే మారిపోవును.

రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్య సైనిక రాజకీయశక్తికి ఎదురు నిలిచి పోరాడుటకు కోటానుకోట్ల భారతీయులకు ధైర్యసాహసములను పురికొల్పి శిక్షణయిచ్చి సామాన్య మానవుని శ్రేయస్సునకై కృషిసలిపినట్టియు, వర్ణసమైక్యతకై అహర్నిశలు కృషిసలిపిప్రేమతత్వ ప్రచారములో అసువులుబాసిన పూజ్యబాపుజీ శతజయంతిని భారతజాతి 1969 సంవత్సరములో జరుపుకున్నది. అనతికాలములోనే శ్రీ అరవిందుల శతజయంతి అనగా 15 అగస్టు 1972న భారతజాతి ఉత్సవముగ జరుపుకొనుట మనజాతికి అదృష్ట మనకతప్పదు. 1904వ సంవత్సరములోనే 'వందేమాతరం' శంఖారావమునుపూని భారతజాతిని మేల్కొలిపి, జాతీయవిద్య, జాతీయఉద్యమము, స్వరాజ్యాందోళనను నిర్వహించి మహత్తరదైవీశక్తిఅవతరణకై అకుంఠితదీక్షతో పూర్ణయోగమునుసలిపి 'సావిత్రి' వంటి మహాకావ్యములను 'The Life Divine' వంటి ఉత్తమోత్తమ గ్రంథములను లోకమునకుఅందించి దివ్యదేహముతో దివ్యమునుపొంది మహాసమాధి చెందిన శ్రీ అరవిందుల శతజయంతి 15 అగస్టు 1972 తేదీన జరుపుకొనుట భారతజాతికి మహద్భాగ్యము. అయితే 1947 సంవత్సరము అగస్టు 15వ తేదీన భారతదేశము స్వతంత్రమైనది. అది రాజకీయ స్వాతంత్ర్యము మాత్రమే. సరిగ్గా అగస్టు 15 తేదీ 1972 నాడు స్వతంత్రభారతదేశము రజితోత్సవము జరుపుకొనుచున్నది. శ్రీ అరవిందుల శతజయంతియు, స్వతంత్ర భారతదేశముయొక్క రజతోత్సవము—రెండును ఒకేరోజున జరుపబడుటవలన భారతజాతి యీ యిరువది అయిదు సంవత్సరములలోసాధించిన ప్రగతిని పునఃపరిశీలన చేసుకొనవలసి యున్నది. కనుక శ్రీ అరవిందుల శతజయంతి భారతజాతికి మేల్కొలుపు కాగలదు. భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించిన తరుణములో వారిచ్చిన సందేశములలో ఒకటైన "India will become the Guru of the world" అను వాక్యము నేడు భారతజాతిపైన గురుతర బాధ్యతను పెట్టియున్నదను విషయమును మనము మరువరాదు.

———

# మహాయోగి శ్రీ అరవిందుల దివ్యోపదేశము

— రత్నాకర బాలరాజు

"తతః పరం బ్రహ్మపరం బృహంతం
యథానికాయం సర్వభూతేషు గూఢమ్.
విశ్వస్యైకం పరివేష్టితారమీశం,
తం జ్ఞాత్వా అమృతా భవంతి ॥

## వేదఋషుల దర్శనం

పురాతన వేదఋషులు దృశ్యమానమూ, పరివర్తనాత్మకమూ, అయిన ఈ విశ్వానికి వెనుక, నిత్యమై పరిణామరహితమైన సచ్చిదానంద రూపం, పర తత్త్వం ఉందని దర్శించి, బోధించారు. శ్రీ అరవిందుల ఉపదేశం ఈ వేదర్షుల బోధమండి ప్రారంభమౌతుంది. ఆ పరతత్త్వంలో సకలభూతకోటీ, ఏకమే అయినా, మనస్సూ, ప్రాణమూ, శరీరమూ, వీనిలోని ఒకానొక భేదజ్ఞానంవలన. ఆత్మను గురించిన అజ్ఞానంవలన, అది పరస్పరం భిన్నంగా కన్పిస్తూ ఉన్నది. కాని, భేదజ్ఞానకారణమైన ఈ ఆవరణాన్ని తొలగించుకొని మనలోనూ, అందర లోనూ. అంతటాఉన్న సర్వాత్మని పరమేశ్వరుని సాక్షాత్కారం పొందడం సాధ్యమే. ఒకానొక మానసికశిక్షణ (Psychological discipline) వలన ఇది సిద్ధిస్తుంది.

## పరిణామ పద విన్యాసం

అద్వయమై, స్వయంప్రభారూపమైన, ఈ సంవిత్తత్త్వం భౌతిక ప్రకృతి యందు అంతర్గర్భితమై ఉందని శ్రీ అరవిందుల ఉపదేశం చెపుతుంది. పరిణామం దీని విముక్తికి సాధనమౌతుంది. జడ పదార్థాలుగా కన్పించే వానిలో కూడా, చైతన్యం అభివ్యక్తమౌతున్నది: స్వయంచోదితమై ఉన్నతోన్నతంగా వృద్ధిని పొందుతూ, అధికాధికమైన పరిపూర్ణతకు అభిముఖంగా పెరుగుతున్నది.

పరిణామక్రమంలో ప్రాణం. ఈ చేతనా విముక్తికి మొదటి మెట్టు. మనస్సు రెండవది. కాని మనస్సుయొక్క ఆవిర్భావంతో పరిణామం ఆగిపోదు; మనస్సు కంటే ఉన్నతమై ఆధ్యాత్మికమూ, అతిమానసకమూ, (Spiritual and supra-mental) అయిన ఒకానొక భూమికలోని విముక్తిని ప్రతీక్షిస్తుంది. పరిణామం లోని తరువాతి మెట్టు, "చేతనసత్త" — Conscious being – లోని ప్రధాన శక్తియైన అతిమానసమున (Supermind) కు అభిముఖంగా సాగి పోవాలి. అపుడు మాత్రమే వస్తుజాతంలో అంతర్గర్భితమైన దివ్యతత్త్వం పూర్ణవిముక్తిని పొంది, జీవితం, సిద్ధినీ, పూర్ణతనూ, అభివ్యక్తమొనరించడం సాధ్యమౌతుంది.

## మానవుని యందు ప్రకృతి పరిణామం ఇచ్ఛాత్మకం

జ్ఞానాత్మకమైన సంకల్పం, ఇచ్ఛ లేకుండగనే, పరిణామపథంలో ప్రకృతి, మొదటి (ప్రాణము, మనస్సు అను) రెండు మెట్లను, వ్యక్తిజీవితంలో, జంతు జీవితంలో సాధించింది. సాధనంలో ఎరుకతోడి ఇచ్ఛాశక్తి (conscious will) తో ప్రకృతి మానవునిలో పరిణమించడం సాధ్యమైనది. ఏమైనా, మానవుని యందు కేవలం మానసిక సంకల్పము (mental will) తోనే ఇది పూర్తిగా సాగదు. ఏలయన, మనస్సు ఒకానొక అవధి వరకు మాత్రమే వెళ్ళగలదు; అటు తరువాత ముందుకు సాగక, చక్రం వలె తిరుగుతూ ఉంటుంది. ఒక పరివర్తన అవసరం. మనస్సు తనకంటే ఉన్నతమైన తత్త్వంలోనికి పరి వర్తన పొందడానికి కారణమైన ఒకానొక చేతనయొక్క ఆవృత్తి (a turning of consciousness) కావాలి. పురాతన మానసిక శిక్షణలో, యోగాభ్యాసంలో ఈ సాధన మార్గముంది.

## అతిమానస తత్త్వావతరణం వలన ప్రకృతియందు విముక్తి

కాని, పూర్వం సంసారాన్ని దూరంగా, పరిత్యజించడం తిత్తి [illegible] అదృశ్యం కావడానికి ప్రయత్నాలు సాగాయి. మనస్సు కంటే అతీతమైన తత్త్వంయొక్క అవతరణ (descent) సాధ్యమేనని, అది [illegible] బాహిరంగా, ఆధ్యాత్మ విముక్తిని కల్గించడ మాత్రమే కాక, [illegible] సంసారస్థితిలోకూడా, ఆ విముక్తిని కల్గిస్తుందనీ. మానసికమైన అవిద్య, లేదా

మనస్సుయొక్క సోపాధిక జ్ఞానాన్ని తొలగించి, ఒక అతిమానస సత్యచేతన (a supramental truth consciousness) ను ప్రసాదిస్తుందనీ, శ్రీ అరవిందులు బోధించారు. ఈ అతిమానసిక సత్యచేతన ప్రత్యగాత్మ (inner self) కు సముచిత సాధనమై, అంతర్ముఖంగానూ, క్రియాత్మకంగానూ, మానవుని ఆత్మసాక్షాత్కారానికి హేతువౌతుంది.

## జాత్యంతర పరిణామం

దీనివలన మానవుడు తన పాశవిక మానవత్వాన్ని (animal humanity) అతిక్రమించి దివ్యజాతి (Divine Race) గా పరిణమిస్తాడు. యోగము యొక్క చిత్తశిక్షణను ఈ లక్ష్యసాధనకు ఉపయోగించవచ్చు. ఇంతవఱకు, గుప్తమైఉన్న అతిమానసికతత్త్వం యొక్క అవతరణ వలననూ, దాని క్రియ వలననూ, పరివర్తన పొందుటకు వ్యక్తి తన సత్తయొక్క భాగముల నన్నిటినీ తెఱచి ఉంచుకోవాలి.

కానీ, ఇది ఇప్పుడే-స్వల్పకాలంలో, జరిగేదికాదు. త్వరితమూ, ఇంద్రజాలాత్మకమూఅయిన పరివర్తనకాదు. అతిమానసిక తత్త్వావతరణానికి ముందు సాధకుడు ఎన్నో చేతనా భూమికలను దాటవలసి ఉంది.

## మార్గం

మానవుడు చాలవఱకు తనమనస్సులోని కేవల ఉపరిభాగం (surface mind)లోనూ, ప్రాణశరీరములలోనూ, నివసిస్తూ ఉంటాడు. అధికతర సాధ్యతలుగల మానవునిలోని అంతర పురుషుడు (inner being) మేల్కొనాలి. ప్రస్తుతం అంతరపురుషునినుండి కేవల పరిమిత ప్రభావాన్ని మాత్రమే మానవుడు పొందుతున్నాడు. ఈప్రభావమే (influence) అధికతర సౌందర్యాన్నీ అధికతర సామరస్యాన్ని అధికతర జ్ఞానశక్తుల్నీ అతణ్ణి అన్వేషింపజేస్తున్నది. కాన, తన అంతరపురుషుని యొక్క ద్వారాలను తెఱచి, అందు నివసిస్తూ బాహ్యారంగాన ప్రవర్తించాలి. అంతర్జ్యోతితో, అంతశ్శక్తితో బాహ్యజీవితం పరిపాలితం కావాలి. ఇదే యోగం యొక్క ప్రథమప్రక్రియ ఇలాచేయడం వలన, బాహ్యమనః, ప్రాణ, అన్న, తత్త్వముల సంఘాతరూపంకాక, వీనికాధారభూతమైన తన సత్యాత్మ (True soul) యొక్క సాక్షాత్కారం సిద్ధిస్తుంది.

ఈఆత్మ దివ్యాగ్నియొక్క విస్ఫులింగం (spark) ఈ ఆత్మస్థితియందు ప్రవేశిస్తే సాధకుడు పరతత్త్వాభిముఖమైన, దీని చోదన (drive) వలన మిగిలిన ప్రకృతిని పవిత్రీకరించుటకు, దివ్యమొనరించుటకు నేర్చుకోవాలి.

తరువాత, ఊర్ధ్వమైన అపావృతి (upward opening) వలన ఉన్నత తత్త్వంయొక్క అవతరణం అనుసరిస్తుంది. కానీ, ఇది అప్పుడే సంపూర్ణమైన అతి మానసికజ్యోతీ, దాని శక్తీకాదు; ఏలయన, సామాన్య మానవ మానసమునకూ, అతిమానసిక సత్యచేతనకూ, మధ్య చాల చేతనాభూమికలు (several ranges of consciousness) ఉన్నాయి. ఈచేతనాభూమికల ద్వారాయి తెలుపబడి వానిశక్తి, మనః, ప్రాణ, శరీరాలలోనికి అవతరించాలి. ఆ తరవాతనే, సత్య చేతన (Truth consciousness) యొక్క పూర్ణశక్తి ప్రకృతిలో పనిచేయ గలదు. కాన, ఈ ఆత్మశిక్షణాప్రక్రియ, లేక, సాధన, సుదీర్ఘమై కష్టతరంగా ఉంది. కానీ, ఇందు ఏ అత్యల్ప సాధన అయినా,—స్వల్పమప్యస్య ధర్మస్య— చరమవిముక్తి (Ultimate release) ని, పరిపూర్ణతనూ, మరింత సాధ్య తరంగా చేయగలదు.

## ప్రాచీన యోగ సంయోజనం

మార్గగమనంలో, ప్రాచీన దర్శనాలకు సంబంధించిన అనేక విషయాల అవసరం వస్తుంది. మనస్సును విశాలతరంగా చేసికోవడం, అనంతాత్మభావమ సర్వాత్మభావన (cosmic consciousness) కామరాగాదుల నిరోధం. ఇవన్నీ అవసరం. బాహ్యసన్యాసం అనవసరమైనా, కామరాగవిజయమూ, శరీరమూ, దాని అవసరములూ, ప్రలోభములూ, సహజాతములూ, వీనిపై అదుపూ, ఇవి అపరిహార్యములు. కాన ప్రాచీనదర్శనముల సంయోజనం ఇందు కలదు. మనస్సుయొక్క నిత్యానిత్యవస్తువివేకంతోడి జ్ఞానమార్గమూ, ప్రేమప్రపత్తులతోడి భక్తిమార్గమూ, స్వార్థచింతలనుండీ, అహంకృతినుండి వెలువడిన పరమునకే సేవించడానికి ఉన్ముఖమైన సంకల్పముతోడి కర్మమార్గమూ, ఇవన్నీ ఇందు ఉపయుక్తాలే. వ్యక్తియొక్క సత్తు, అంతా సుశిక్షితమైనప్పుడే, పరమ జ్యోతిశ్శక్తులు ప్రకృతియందు పనిచేయజాలినప్పుడు, అతడు ప్రాచీనమైన పరివర్తన పొందగలదు.

## గురువు, బోధాదర్శ ప్రభావాలు

ఈయోగసాధనలో, గురువుయొక్క ప్రబోధమూ, క్లేశావస్థలయందు అతని విగ్రహమూ (control) సాన్నిధ్యమూ (presence) ఇవి అపరిహార్యాలు. ఇవి లేకపోతే, ఎక్కువ పతనాలూ, ప్రమాదాలూ కల్గవచ్చు. విజయావకాశాలు పన్నగిల్లిపోవచ్చు. మహోన్నతచేతన (higher consciousness) నూ, సత్తాస్థితినీ, పొందిన మహాత్ముడే గురువు. అతడు ఆపరమచేతనా భూమిక యొక్క ఆవిర్భావం; దానికి ప్రతినిధి. అతడు తన బోధ (Teaching) తోనూ ఇంకా అధికంగా తనప్రభావంతో (influence)నూ, తన ఆదర్శం (example)తోనూ, మాత్రమే సాయపడడంకాక, తన అనుభూతిని సాధకులకు అందజేయగల శక్తికాలి.

## సిద్ధి

ఇదే శ్రీఅరవిందుల బోధసారం; సాధనావిధానం. ఏదోఒక మతాభివృద్ధి కానీ, పురాతమతాల సమ్మేళనం కానీ, నూతన మతస్థాపనకానీ, అతని ఆశయం కాదు. ఇవిఏవైనా, అతని ముఖ్యప్రయోజనానికి దూరంగా తీసుకొని పోతాయి. శ్రీఅరవిందుల యోగలక్ష్యం అంతరాత్మవికాసం (inner self development) ఈ ఆత్మవికాసాన్ని అనుసరించే ప్రతివ్యక్తి, కాలక్రమాన, అన్నిటిలోనూ అద్వయమైన పరమాత్మను సాక్షాత్కరించుకుని, మానసిక, ఆధ్యాత్మిక, అతి మానసిక చేతనలకంటే మించిన పరతర చేతనాభూమికను పొందగలడు. అదే ఈ యోగలక్ష్యం. ఈ పరమచేతనా సిద్ధివలన మానవప్రకృతి పరివర్తనపొంది దివ్యమౌతుంది.

## పూర్ణయోగ వైశిష్ట్యం

ప్రాచీనయోగాలేవీ, ఈ అతిమానసిక తత్త్వవతరణకూ, ప్రకృతియొక్క దివ్యపరివర్తనకూ ప్రయత్నింపలేదని శ్రీఅరవిందులంటారు.

శ్రీ కృష్ణుడూ, బుద్ధుడూ, శంకరుడూ, శ్రీరామకృష్ణుడూ, వీరికి శరీరాన్ని దివ్యంగా పరివర్తింపజేయాలనే భావంలేదు వారిలక్ష్యం కేవలం ఆధ్యాత్మిక ముక్తి (Spiritual Mukti), కర్మలో ముక్తస్థితిని మాత్రమే శ్రీకృష్ణుడర్జును

నకు బోధించాడు; భౌతికతత్త్వ పరివర్తన (Physical Transformation)ను బోధించలేదు (చూడు : Letters on Yoga-Part I Page 93). మాయావాద స్థాపకుడైన శంకరుని దృష్టిలో పరిణామం మిథ్య.

## మౌలికభేదం

దివ్యపరివర్తన సిద్ధికై ప్రయత్నాన్ని కొందరు యోగులు చేసినా, ఆ ప్రయత్నం శ్రీ అరవిందులు కాంక్షించిన రీతిలోకాదు. ఆ యోగులు దాన్ని వైయక్తికమైన యోగసిద్ధిగా మాత్రమే సాధించారు; ప్రకృతి ధర్మంగా మాత్రం కాదు. అతిమానసిక పరివర్తన, ఆధ్యాత్మిక, మానసిక, పరివర్తన లాంటిదికాదు. అది మనః ప్రాణశరీరాల పరివర్తన. మానసిక, అధిమానసిక, ఆధ్యాత్మికములైన పరివర్తనలేవీ, మనః ప్రాణశరీరముల దైవీకరణ రూపమైన ఈ సిద్ధిని కలిగించలేవని శ్రీ అరవిందులు చెప్పారు. ప్రాచీనయోగోపదేశానికీ, శ్రీ అరవిందుల యోగోపదేశానికీ మౌలికమైన భేదమిది. క్రియాత్మకమైన దివ్యసత్యము [అతిమానసము] ఉన్నది. అది ప్రస్తుత అవిద్యా జగత్తులోనికి అవతరించగలదు: నూతన సత్యచేతననూ, దివ్యజీవనాన్నీ ఈ పృథ్వియందు సృజింపగలదు. ప్రాచీనయోగులు మనస్సునుండి ఎగసి సూటిగా పరబ్రహ్మా[illegible] మునుపొంది క్రియాత్మకమైన అస్తిత్వాన్నంతా అవిద్యగా, మాయగా, లేక, ఈశ్వరలీలగా భావించారు. నిష్క్రియము, నిశ్చలము, అయిన [illegible] తత్త్వాన్ని పొందినతరువాత, విశ్వావస్థకు బాహిరంగా నీవు వెళ్లజాలని ప్రాచీన యోగులంటారు అని శ్రీ అరవిందులు తన పూర్ణయోగానికీ, ప్రాచీన [illegible] దర్శనాలకూ భేదాన్ని నిరూపించారు.

ఆ మహాయోగి శతతమజయంతి జరిగే ఈ పుణ్యసమయంలో [illegible] చిత్తంతో ఆయన చూపిన మార్గంలో సాధనచేసి దివ్యపరివర్తనపొంది [illegible]యందు దివ్యజీవనాన్ని సాధించడానికి పరమాకాంక్షనూ దీక్షనూ [illegible]

తతః స్వాంతం శాంతం కథమపిభవేత్ సిద్ధము విశమ్।
శుచిజ్వాలా నిత్యా పరమ పదకాంక్షాచ హృదయే।
అఖండార్తా దృష్టిర్విషయ ధిషణావృత్తిషు జయేత్।
సతి శ్రీసాన్నిధ్యే త్రిభువన గురోః కిం న సులభమ్॥

---

## గురువు, బోధాదర్శ ప్రభావాలు

ఈ యోగసాధనలో, గురువుయొక్క ప్రబోధమూ, క్లేశావస్థలయందు అతని నిగ్రహమూ (control) సాన్నిధ్యమూ (presence) ఇవి అపరిహార్యాలు. ఇవి లేకపోతే, ఎక్కువ పతనాలూ, ప్రమాదాలూ కల్గవచ్చు. విజయావకాశాలు సన్నగిల్లిపోవచ్చు. మహోన్నతచేతన (higher consciousness) నూ, సత్తా స్థితినీ, పొందిన మహాత్ముడే గురువు. అతడు ఆపరమచేతనా భూమిక యొక్క ఆవిర్భావం; దానికి ప్రతినిధి. అతడు తన బోధ (Teaching) తోనూ ఇంకా అధికంగా తనప్రభావంతో (influence)నూ, తన ఆదర్శం (example)తోనూ, మాత్రమే సాయపడడంకాక, తన అనుభూతిని సాధకులకు అందజేయగల శక్తిశాలి.

## సిద్ధి

ఇదే శ్రీఅరవిందుల బోధసారం; సాధనావిధానం. ఏదో ఒక మతాభివృద్ధి కానీ, పురాతనమతాల సమ్మేళనం కానీ, నూతన మతస్థాపనకానీ, అతని ఆశయం కాదు. ఇవేవైనా, అతని ముఖ్యప్రయోజనానికి దూరంగా తీసుకొని పోతాయి. శ్రీఅరవిందుల యోగలక్ష్యం అంతరాత్మవికాసం (inner self development) ఈ ఆత్మవికాసాన్ని అనుసరించే ప్రతివ్యక్తి, కాలక్రమాన, అన్నిటిలోనూ అద్వయమైన పరమాత్మను సాక్షాత్కరించుకుని, మానసిక, ఆధ్యాత్మిక, అతిమానసిక చేతనలకంటే మించిన పరతర చేతనాభూమికను పొందగలడు. అదే ఈ యోగలక్ష్యం. ఈ పరమచేతనా సిద్ధివలన మానవప్రకృతి పరివర్తనపొంది దివ్యమౌతుంది.

## పూర్ణయోగ వైశిష్ట్యం

ప్రాచీనయోగాలేవీ, ఈ అతిమానసిక తత్త్వావతరణకూ, ప్రకృతియొక్క దివ్యపరివర్తనకూ ప్రయత్నింపలేదని శ్రీఅరవిందులంటారు.

శ్రీకృష్ణుడూ, బుద్ధుడూ, శంకరుడూ, శ్రీరామకృష్ణుడూ, వీరికి శరీరాన్ని దివ్యంగా పరివర్తింపజేయాలనే భావనలేదు వారిలక్ష్యం కేవలం ఆధ్యాత్మిక ముక్తి (Spiritual Mukti), కర్మలో ముక్తస్థితిని మాత్రమే శ్రీకృష్ణుడర్జును

నకు బోధించాడు; భౌతికతత్త్వ పరివర్తన (Physical Transformation)ను బోధించలేదు (చూడు : Letters on Yoga-Part I Page 93). మాయావాద స్థాపకుడైన శంకరుని దృష్టిలో పరిణామం మిథ్య.

## మౌలికభేదం

దివ్యపరివర్తన సిద్ధికై ప్రయత్నాన్ని కొందరు యోగులు చేసినా, ఆ ప్రయత్నం శ్రీ అరవిందులు కాంక్షించిన రీతిలోకాదు. ఆ యోగులు దాన్ని వైయక్తికమైన యోగసిద్ధిగా మాత్రమే సాధించారు; ప్రకృతి ధర్మంగా మాత్రం కాదు. అతిమానసిక పరివర్తన, ఆధ్యాత్మిక, మానసిక, పరివర్తన లాంటిదికాదు. అది మనః ప్రాణశరీరాల పరివర్తన. మానసిక, అధిమానసిక, ఆధ్యాత్మికములైన పరివర్తనలేవీ, మనః ప్రాణశరీరముల దైవీకరణ రూపమైన ఈ సిద్ధిని కలిగించలేవని శ్రీ అరవిందులు చెప్పారు. ప్రాచీనయోగోపదేశానికీ, శ్రీ అరవిందుల యోగోపదేశానికీ మౌలికమైన భేదమిది. క్రియాత్మకమైవ దివ్యసత్యము [అతిమానసము] ఉన్నది. అది ప్రస్తుత అవిద్యా జగత్తులోనికి అవతరించగలదు: నూతన సత్యచేతననూ, దివ్యజీవనాన్నీ ఈ పృథ్వియందు సృజింపగలదు. ప్రాచీనయోగులు మనస్సునుండి ఎగసి సూటిగా పరబ్రహ్మ మును పొంది క్రియాత్మకమైన అస్తిత్వాన్నంతా అవిద్యగా, మాయగా, లేక, ఈశ్వరలీలగా భావించారు. నిష్క్రియమూ, నిశ్చలమూ, అయిన దివ్య తత్త్వాన్ని పొందినతరువాత, విశ్వావస్థకు బాహిరంగా నీవు వెళ్లతావని ప్రాచీన యోగులంటారు అని శ్రీ అరవిందులు తన పూర్ణయోగానికీ, ప్రాచీన యోగ దర్శనాలకూ భేదాన్ని నిరూపించారు.

ఆమహాయోగి శతతమజయంతి జరిగే ఈ పుణ్యసమయంలో భక్తినిర్భర చిత్తంతో ఆయన చూపిన మార్గంలో సాధనచేసి దివ్యపరివర్తనపొంది పృథ్వి యందు దివ్యజీవనాన్ని సాధించడానికి పరమాకాంక్షనూ దీక్షనూ వహింతుముగాక!

తతః స్వాంతం శాంతం కథమపిభవేత్ సిద్ధమ నిశమ్।
శుచిజ్వాలా నిత్యా పరమ పదకాంక్షాచ హృదయే।
అఖండార్థా దృష్టిర్విషయ ధిషణావృత్తిషు జయేత్।
సతి శ్రీసాన్నిధ్యే త్రిభువన గురోః కిం న సులభమ్॥

———



# శ్రీ మాతా పతాకము

— ఏ. జి. కేశవరెడ్డి

శ్రీ మాతా పతాకమందలి విశిష్ఠతను మనము కొంచెము తెలుసుకొన ప్రయత్నింతము. ఏనాడో ఒకనాడు యీ మాతా జండా మన భారతదేశమునకే **Spiritual** జండాగ పరిగణింపబడవచ్చును అని ఆశించుచున్నాను.

మాతాపతాకము మీరందరు తిలకించియే యుందురు. నీలమేఘచ్ఛాయ వస్త్రముపైన వలయాకారముగా. రెండు వరుసలు పత్రదళములతో నిర్మితమై మధ్య బిందువు ఒకటి కలదు. వలయాకారముగనున్న మొదటి వరుసనందు నాలుగు దళములును. రెండవ వరుసయందు పండ్రెండు దళములును గలవు. ఈ సాంకేతికముల యొక్క నిగూఢార్థ మేమి? ఆ దివ్యమాత మానవుని ఆధ్యాత్మిక జీవితాశయముల నన్నింటిని యిందు పొందుపరచినదా ఏమి అని తోచుచున్నది

ఈ పతాకము పూర్వరంగము అనగా సాంకేతికములకు వెనుక భాగమంతయు విశాల నీలి మేఘఛాయతో కూడుకొని యున్నది. నీలి ఛాయ అంతయు ఆకాశమునదేకదా! ఆకాశమునకు అంత్యము కలదా! దాని పరిణామము ఊహాతీతముకాదా! అటువలె బ్రహ్మము ఊహాతీతము. అనంతము. కాని అట్టి అనంత బ్రహ్మము ఆకాశమువలె శూన్యముకాదు. అత్యద్భుత తేజోవంతమైన కళలతోనిండి పిండీకృతమైన — ఆ బ్రహ్మముయొక్క అవ్యక్త స్వరూపము శూన్యముగానె గోచరించుచుండును. ఇక్కడదాక విచిత్రము గమనింపుము. ఎన్నియో కళలతోను, మహాశక్తులతోను నిండిన ఆ బ్రహ్మము అవ్యక్తముగా నుండగలదా! అది ఏరికేని సాధ్యమా, మానవులలో ఎందరినో చూచుచున్నాము. ఏ కొద్ది కళనో ఏ కొద్ది శక్తియో అబ్బినను అతనిని మహాపురుషునిగా భావించుచున్నాము. సంగీత గాన కళ అబ్బిన శ్రీ త్యాగరాజు యీ నాడు త్యాగరాజస్వామిగను, త్యాగ బ్రహ్మముగను నెంచి వారికి గుళ్ళు, గోపురములు కట్టించి, ఆరాధనలు జరిపి దైవముగ పూజించుచున్నాము. అట్టి వారే ఎందరో శాస్త్రజ్ఞులు కలరు' కవులుగలరు. చిత్ర నైపుణ్య శిల్పి అధి

నేతలు కలరు. నాట్యకళాదర్శకులు గలరు. సభాసదులందు ఉద్ఘాతలూగించు భాష కళానైపుణ్యముగల వక్తలు గలరు. తమ సర్వస్వమును దేశముకొరకై త్యాగముచేసిన త్యాగ ప్రవీణులెందరో కలరు. వీరినందరిని మనము మహా పురుషులుగ పూజించుచున్నాము. అట్టి యెడ సర్వశక్తి, సర్వ విజ్ఞాన సంపన్నుడైన ఆ దేవదేవుడు, ఆ సచ్చిదానందస్వరూపుడు ఎంతకాలము అవ్యక్తముగ నుండగలడో యోచింపుడు.

ఏ మానవుడుకాని, లేక మానవేతరుడుకాని వానిలో కొంత శక్తి ఆవిర్భవించినపుడు తాను నిశ్చింతుడై ఊరక ఉండనోపడు. ఏ కొద్ది ధనశక్తియో లేక భూ ఆస్తియో గలవారే ఆ శక్తి దాడికి తట్టుకొనలేక మంచియో, చెడ్డయో ఏదియో ఒకటి చేయుచు ప్రపంచమున విరామము లేక నడయాడుచు పొరాడు చుండుట మనము సర్వసాధారణముగ చూచుచునే యున్నాము. అట్టియెడ సర్వజ్ఞాన సంపన్నుడును, సర్వశక్తి సంపన్నుండును, సర్వకళాప్రపూర్ణుండునునగు ఆ సచ్చితానంద పరబ్రహ్మ స్వరూపంబు ఎలా నిర్మలముగ, అవ్యక్త స్వరూపుడై ఎంతకాలము నిశ్చింతగ నిద్రించగలడు ? తనశక్తిని, తన జ్ఞానాన్ని, తన కళలను వ్యక్తపరుప తనలో ఆశ జనించుట సహజమేకదా। ఇట్టి ఆశాజనితుడై తన అవ్యక్త స్వరూపమును వ్యక్తముచేయ యీ సృష్టినంతయు ఏర్పరచెను. అట్టి కార్యక్రమమున నిమగ్నుడైన ఆ వ్యక్తి బ్రహ్మము మొదటిసారిగా మూల బీజమును నాటెను. అట్టి సృజనాత్మకమైన ఆ మూలబీజ సాంకేతికమే మన శ్రీ మాత పతాకమునందలి మధ్య బిందువు.

తర్వాత సృష్టి క్రమమేర్పడి ఆ మూలబీజమునుండి ప్రపంచములు ఏర్పడెను. అందులోని జడ పదార్థములు ఎంతయో కాలమునకు మార్పుచెంది పంచభూతము లేర్పడెను. పంచభూత పంచీకరణము ద్వారా చెట్లు చేమలు నెలకొని ప్రాణి అంకురించెను. ఎన్నియో యుగముల తర్వాత పరిణామము చెందుచు ఆ పరిణామ క్రమమున జీవరాసులుదయించెను, పశుపక్ష్యాదులు పరిణామముచెంది మానవులేర్పడిరి. తొలి మానవులకును, పశువులను ఎక్కువ భేద ముండెడిది కాదు. కాలక్రమముల జ్ఞాన విజ్ఞానములు చేకూరి యీ నాటి మానవుడైనాడు. ఎన్నియో శక్తులను బడయ మానవుడు ప్రయత్నించుచునే యున్నాడు. అట్టి ప్రయత్న ఫలితముగ భువియందు మొదటిసారిగ మహేశ్వరీశక్తి నెలకొనినది.

వాని ప్రభావమున మానవుడు కొంతకాలము శాంతి సహనములతో మనగలిగి నాడు. తర్వాత తన ఆనంద అవసరనిమిత్తము ఐశ్వర్య సంపదలు కావలసి వచ్చెను. అందులకై ప్రయత్నించుట వలన మహాలక్ష్మి యీ లోకమున నెల కొనెను. మానవుడు ఐశ్వర్యభోగములందు తులదూగుచు మత్తెక్కి మద మెక్కెను "ధనమెక్కిన మదమెక్కును. మదమెక్కిన దుర్గుణంబు మానక హెచ్చును." అను లోకోక్తి మనము వినియున్నాము. దీనితో ఈర్ష్యాద్వేషాలు [illegible] పగతలు రాజ్యాంత్రాలు బయలుదేరెను. వీటిని రూపుమాప మహాకాళి ప్రపంచమున నెలకొనవలసివచ్చెను. సర్వనాశనకారి ప్రాబల్యమున మానవునికి తెలివిహెచ్చి తన జీవితోద్దేశ్యముల తెలుసుకొన ప్రయత్నించి, జ్ఞానవిజ్ఞానముల [illegible] నేర్చెను. తత్ఫలితముగ మహా సరస్వతి యీ భూలోకమున నెల కొనెను. ఆ రీతి మహేశ్వరి, మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతి శక్తులు భూలోకమున నెలకొనెను. ఇది సూచకముగా మన మాతా పతాకమునందు [illegible] మధ్యను వలయాకారములో 4 దళములు చిత్రింపబడినవి. ఆ నాలుగు దళములే మహేశ్వరి, మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతి శక్తులను సూచించును. ఇంతటితో మానవలక్ష్యము మొదటిమెట్టునకుమాత్రమే సాగినది.

మానవునికి ఇంకను ఎంతయోకలదు సాధింప. బ్రహ్మము అంతము లేనిది. పరిపూర్ణత్వము అనంతముకదా! అవ్యక్త బ్రహ్మము మానవాకార మును సృష్టించి తన అనంతశక్తులను అందులోనుంచి వ్యక్తపరుప యోచించు చున్నది. మానవునికి కావలసిన దేహావసతులను వానగూర్చి, బుద్ధి మన స్సిచ్చి, వాని సహాయముతో త్వరితగతిని పరిణామముచెంది ఇంకను తన లోని [illegible] నిగూఢశక్తులను వ్యక్తింపజేసినవాడు మానవుడు దైవకార్యమును చేసినవాడగును. తన జన్మసాఫల్యముచెందును కాని ఉద్దేశించిన యిట్టి దైవ కార్యమును మరచి మానవుడు తన దేహసుఖములకొరకే యత్నించుచు అదే తన లక్ష్యమని యెంచి పొరబడుచున్నాడు. ఆహా! ఇది మన్నింపరాని పొరపాటు కాదా! మన యీ వైపరీత్యము తుచ్ఛ సుఖములకులోనై శాశ్వతమైన బ్రహ్మా నందమును [illegible] పోగొట్టుకొనువారుకలరా! అయ్యో! మానవుడు ఎంత [illegible] పాలవడినాడు! మలినమునందు పొర్లాడు పురుగువలె తన నిత్య జీవితమునందలి [illegible]నే బ్రహ్మానందముగా భావించి ఆ మహాసత్య నిత్యానందమును మరచిపోయినాడే! మానవుని యీ అధోగతినుండి లేపువారెవరు! శ్రీ మాతా రక్షించుట తప్ప!

ఓ మానవుడా! నీ నిత్యజీవిత సుఖములను వీడనవసరములేదు. నీవు వాటిని త్యజించనవసరములేదు. నీ ప్రపంచమును సంసారసుఖములను వీడనాడి ఆ బ్రహ్మానందాన్ని వెతుకుచు ఎక్కడికో పోనవసరములేదు నీ విందుండియే నీ లక్ష్యమును సాధింపవలెను. నీ జీవిత సుఖములన్నియు నీకు దైవము చేకూర్చినవియే. కాన నీవు వాటిని తొలగద్రోయనవసరములేదు. వాటిని ఈశ్వర ప్రసాదములుగనెంచి హితమిత పవిత్ర వర్తకుడవై దైవముచేకూర్చిన దానిని అనుభవించుచు నీ లక్ష్యమువైపు నీ దృష్టిని సాధించుమా!

అహంకార మమతలనువీడి ఈశ్వరదృష్టితో ననుభవించుచు ఆ దైవ శక్తిని నీయందు నింపుకొనుము. మనపూర్వులు సాధించినది ఎంతయినను ఇంకను మనము సాధింపసలసినది ఎంతయోకలదు. తృప్తిజెందకుమోయి మన పూర్వులు సాధించిన వేదవేదాంగములతోడి అట్లు తృప్తిజెందితివా నీ పురోగమనము తప్పకఆగును. మానవులందరు వొనరించు పొరపాటింతయు యిచటనే గలదు. మూఢభక్తి విశ్వాసములు ఇచట అద్భుతగులుము. నిన్నుపైకి పోనీయవు. జాగ్రత్త సుమా! తరతరములుగా ఇచటి సాంప్రదాయసిద్ధమై ఏతెంచిన యీ మూఢనమ్మకములను ఛేదించుమా! ఇచటనే సర్వులు సతమత మగుదురు. వేద వేదాంగములు, గీతాఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు మొదలగాగల మన వేదాంతసారమంతయు మనపూర్వపు మహాఋషుల అనుభవములను చక్కగా తెల్పినవి. అవి మహాగొప్ప అనుభవములే! అవి దైవవాక్కులే అని కూడ చెప్పవచ్చును. వాటిని తృణీకరింప ఏ మాత్రమును వీలుకాదు. వాటి యందు తగినగౌరవమును కూడ ఉంచవలసినదే. అయితే ఇచట ఒక చిక్కు విషాద ప్రశ్న. మానవుడు సాధించవలసినది ఇక ఏమియునులేదా? మనపూర్వపు ఋషిపుంగవులు సాధించిన దానితోనే అంతయు ఆగిపోవలసినదేనా? అటులైనచో మానవజన్మ ఇక ఎందులకు?

ఇట్టి ప్రశ్న పరంపరసమస్యలను ఎదుర్కొన ధైర్యములేక మానవుడు తన పూర్వీకులు సాధించిన దానితోడనే తృప్తిజెంది నానాటికి వృద్ధిలేక హీన స్థితికి రాగలిగినాడు. ఈనాడు మానవుడు దినమున కొకతూరి గీతాపారాయణము చేసినచాలును తనదైవకార్యము నెరవేరినట్లెయని తలంచుచున్నాడు. ఇంకొక మానవుడు గీతలోని 701 శ్లోకములను వల్లెవేయ సమయములేక ఒక్క అధ్యా

యము పారాయణము చేసిననుచాలునని తృప్తిజెందుచున్నాడు. ఇంకొకడు అధ్యాయమంతయు చదువవీలులేక ఒక్క శ్లోకమును పఠించిన గంగాస్నానము చేసినంత పుణ్యము తనకు లభ్యమగునని తృప్తిజెందుచున్నాడు. ఈ తృప్తి యనునది ఎంతకు దిగజారినదో ఎంతటి విషాదకరమో యోచింపుడు. ఇదేనా మానవుడు చేయవలసిన కార్యములు యీ లోకమందు ఎన్నిసార్లు గీతాపారాయణముచేసిన ఏమి లాభము? లక్ష్యము వృత్తివ్యాప్తిలేకచేయు పారాయణము అది పారాయణమగునా! ఇది హాస్యాస్పదముకాదా!

ఓ అన్నలారా! నేను గీత ఉపనిషత్తులను చులకనగాచూడమని వచించుటలేదు. వాటిలోని సారమంతయు తొందరలో అవగాహనచేసుకొని ముందుకు పొగమని చెప్పుచున్నాను. ఆడినఆటే ఆడి పాడినపాటే పాడిన ఏమి లాభము. "ఎక్కడున్నావు గొంగళిఅంటే వేసినచోటేవున్నాను గొంగళి"అన్నట్లు అగును. అందువలన ఫలితము ఏమియుపుండబోదు. మానవుడు క్షణక్షణమును పురోగమించవలెను. మానవుడు సాధించవలసినది ఎంతయోకలదు. కాన అలక్ష్యము, అశ్రద్ధ లాభములేదు. ముందు చెప్పినట్లు మానవునిలోన లెక్కకుమించిన శక్తులు కలవు. వాటినన్నింటిని విజృంభింపజేయవలెను. వాటిని వెలుపలికి లాగవలెను.

న్యూటన్ అనుశాస్త్రజ్ఞుడు మున్ముందు భూమి ఆకర్షణసూత్రములను కనుగొనెను. అనాడు అవి మహాగొప్ప సూత్రములుగ పరిగణింపబడెను. యీ సూత్రములవలన ఆయనకు మానవులలో ఎనలేని గౌరవమేర్పడెను. అయితే ఆ సూత్రములు గొప్పవని వాటినే వర్ణించుచు వాటినే జపించుచుండిన యీనాడు మానవుడు చంద్రలోకయాత్ర తలపెట్టియుండెడివాడుకాడు. న్యూటను సూత్రములను శీఘ్రముగా అవగాహనచేసుకొని ఇంకను పైసూత్రములను కనుగొన శాస్త్రజ్ఞులు ప్రయత్నించినారు. తమ ప్రయత్నము సఫలమై యీనాడు చంద్రలోకానికి పోగలిగినారు.

అదేరీతి ఆత్మోన్నతి చెందవలెనన్న పూర్వపు అనుభవములన్నింటిని శీఘ్రముగా అవగాహనచేసుకొని క్రొత్త కళలను, శక్తులను సాధించుటకు ముందుకుపొగవలెను. అట్టి ప్రయత్నముచేకూర్చుటకే శ్రీ మాతా అరవిందులు మానవాళికే ఎనలేని శ్రమలొందుచున్నారు. ఆ పరాప్రకృతిలో ఎనలేని శక్తులు, కళలుగలవు. వాటినన్నిటిని మానవుడు త్వరితగతిని సాధించుటకు దైవమునకు

తోడ్పడవలెను. ఇది దైవకార్యముగాని మానవుని కార్యముకాదని తెలుసుకొనవలెను. మానవుని జన్మకు కారణమిదియె. తనమూలమున అవ్యక్త బ్రహ్మము వ్యక్తము కావలసియున్నది. అదైవీశక్తులెన్నియో యీ లోకమున మున్ముందు రూపొందవలెను దీనిని సూచించుచూ మాతాపతాకమున 12 దళము లతో నిండి వలయాకారముగనున్న రెండవ వరుస తెలుపుచున్నది. అనగా మొదటి రూపములో నున్ననాలుగు శక్తులు ఒక్కొక్కటి వేర్వేరు మూడు శక్తు లను యీలోకమున ప్రభవింపజేయవలెను. ఆ రీతాగా మొదటి నాలుగుశక్తులు మరల 12 శక్తులను తయారుచేయవలెను ఇందుకై మానవుడు దైవమునకు తోడ్పడవలెను. ఏనాడు మానవుడు యీదైవకార్యమున నిమ్నగ్నుడగునో అప్పుడే అతని జన్మసార్థకమగును. మాతాపకములో ఇంతవరకు సూచింపబడి నది. ఇవియేకాక యింకను ఎంతయో పురోగమింపవలసియుండును. దైవము అనంతము. ఆ పరిపూర్ణత్వమును సాధింప అసాధ్యము. ఈ పూర్ణత్వముకొరకు యీ పురోగమనము యీ రీతిగా సాగుచునేయుండవలెను. పూర్ణత్వమునకు అంతములేదు. పరిణామ పురోగమనమునకు అంతములేదు ఇవి యీరీతిగా సాగు చునేయుండవలెను. ఆ పండ్రెడు శక్తులు సాధించిన తర్వాత మరల ఇంకొక శక్తివలయమేర్పడునేమొ దీనికి అంతువుండదుగదా।

ఈ రీతిగా మానవుడు తన పశుప్రవృత్తినిపీడి, దైవీప్రకృతిని తన యందు నింపుకొనుచు ఎనలేని కళలతో సర్వశక్తులు సర్వానందములతో క్రొత్త జాతియొకటి యీ భూలోకమున ఏనాడో ఒకనాడు ఆవిర్భవింపవలసియుండును. మానవుడు అమరుడుగా మారవలెను. ఆనాడు యీభూలోకము స్వర్గలోకముగా మారకతప్పదు. శ్రీమాతా పతాకమున యీరీతిగా సర్వవేదాంతసారమంతయు ఇమిడ్చిసాంకేతికములతో అత్యద్భుతముగా తెల్పబడినది. ఇట్టి భావగర్భిత ముతో పునీతమైన శ్రీమాతాపతాకమును ఎల్లప్పుడు స్మరించుచు వందనములు అర్పింతముగాక ।

---

# ఏకాంతపు ఇంద్రనీలాలు

మూలం :
పి. మధుసూదన్ రెడ్డి

అనువాదం :
మల్లవరపు విశ్వేశ్వరరావు

సడిచేయక కడకంట కారు బాష్పకణమ్ముల
అపుడపుడే విచ్చిన కుసుమ పేశలత బింబించును.
ప్రియుల హృదయవేదనల వహించునవి ;
వాటి అంతరమ్మున అనంతతను విషాద సంకోచమ్ముల
బంధితమొనర్చునవి.

ఏవో ఇంద్రజాల జలదమ్ముల వర్షింపగ ఆహూతమ్మొనరుచు నయ్యేవి ;
ఒక గీతము తమలో నిండిసిబిడమగునట్లే
ఒక గీతము తమ చరమాచ్ఛాదనమై నశించునయ్యేవి.
ప్రతి అశ్రువు ఒక పులకిత విశ్వాసము ఘనీభూతమగు రత్నము.
ప్రతి బాష్పము ఒక అవ్యక్తావేదన మూర్తిమంతమగు గాత్రము.

## II

గులాబిలోని జీవనవాహిని ఆరిపోవు.
దాని ప్రాణదానము ఏవేవో వ్యర్థపదప్రయోగముల పాలై జారిపోవు.
చీకటి కోణమ్మున నీడలపై నీడలు పోగవు.
అక్కడ గులాబి తనరూపము నెక్కడైన పోల్చజాలునా ?

ఎడారిలో ఏడుపు వినివించును.
అందున ఆవేదన, ఒంటరి ఆక్రందన,
విశ్వాసఘాతుకత్వము ధ్వనియించును.
మునీశ్వరులు ఏకాంతమ్మును కలతపెట్టు
పీడకలలపోలిక, బుల్బులు గీతము రీతిని.

## III

ఎరుగవాకో, ఓ మధురప్రియ ?, _
వేసవి వేడిమి తగ్గుమొగము పట్టెడు సాయంసమయావంతరమున,
సూర్యుడు క్రుంకిన సుక్షణికమ్మున,
నేటి విశాలగ్నమ్మున పూవులకును కేలికలకు _
సేమంతీ కల్హార మల్లికలకును
పీతారుణ ధవళ వర్ణములకును _
జరుగనున్న పరిణయ వార్తను,

మన మిది అంతయు ఉత్తరిత్త మాటలుగా త్రోసివేసినను,
అవి మనలో తెలియని ఏదో తెలివికి
ముందే తెలిసినట్లు తోచజేసి, మనలను
అచ్చెరువున ముంచెత్తును ఒక్కొమ్మడి
ఈ రేయిని ప్రకృతి అశ్రుసక్తమ్మై తడిసిన చీకటిలో
పరచిన రహస్యవేదికపై
రూపములన్నియు నామమ్ముల ముడివడి.
వేకువ ముగిబుల విలీనమై, ప్రథమకాంతి
పారవశ్య సంస్పర్శనమున వివిధ వర్ణముల దా ధరించనున్నవి.

ఎరుగవాకో, మధురప్రియ ? _
నేటి విశాలగ్నమ్మున పూవులకును కేలికలకు
జరుగనున్న పరిణయవార్తను.

# IV

మన ఉషో వికసితములగు లక్షకమలములు
ఏకైక మొక అరుణకమల ప్రతిబింబములు;
మన అసంఖ్యాక మానవరోదన ధ్వనులు
ఆ పరాత్పరు ప్రశాంతతకు ఛాయాగతులు.

మన అనిత్యపు జీవితానంతర స్థితివి,
మన మొనర్చినది ప్రతి పుణ్యమ్ము పాపమ్ము
మిలనమై ఏకరూపముపొంది నిశ్శబ్ద
భజన కీర్తనముగా పరివర్తితమ్మగును.

అన్ని కీర్తనలు తా మందుకొనగా దివురు
పరమము పవిత్ర మేకైకమగు కీర్తనను.
అన్ని కిలలును తా మభివర్ణిత మొనర్చు
ఏకైకము నిత్యమగు నొక్క కిలవే.

---

# పరమ పవిత్ర కర్మధార

— అరవిందానందహరిజన్

పాఠక మహాశయులారా! మనమందరమును పరమ ధన్యులము! ఇదే! శ్రీ అరవింద మహా యోగేశ్వరేశ్వర వాణీ నిర్ఝర నిస్యంద కర్మధారా ప్రవాహము. పరమ పవిత్ర గంగాధారయై యికసాగినది. మనమందరమిందు చిందులు త్రొక్కుచు నానందముగ నోలలాడుచు నుండెదము. ఆలసింపకే రండు! శ్రీమాతారవింద యోగభావము లెంతగ వేగవంతములు! మనమిందు దేలియాడుచు చనుచుందుము. విశ్వము నీ "కర్మధార" యెంతెంతగ విశుద్ధ మొనర్పగలదు. ఇందుల కింక సందియమా? 4-4-72న శ్రీ. అరవిందపుర మహాసభాధ్యక్షులు శ్రీ మన్మోహనరెడ్డిగారి మహోపన్యాస కరపత్రమును మీరందరును సందర్శించియే తీరవలయును. సాగి చనుచున్నది! శ్రీ అరవింద కర్మధార! జయము! జయము! విశ్వమునకే యిక విజయము! శ్రీ అరవిందుని పవిత్ర ప్రవచనములు. మహా ప్రవక్తలగు శ్రీ మాతారవిందుల భవిష్యద్దర్శనము! భవిష్యద్వాణి!

కలరెందరో యోగులు! "ఎందరో మహానుభావులు అందరికి వందనములు" అనుచు శ్రీ త్యాగరాజస్వామి వచించినట్టుల! కాని శ్రీ అరవిందులవంటి విద్యావంతులుండుట, విశ్వ విఖ్యాతులగుట. ఎందరో విదేశ విద్వన్మణులచే గూడ గుర్తింపబడుట! ఇదెందరో భక్తి జ్ఞాన వృద్ధుల కందని మహా భాగ్యము! విదేశీయ, స్వదేశీయ భౌతిక విజ్ఞాన మెంతగనో వర్ధిల్లిన యీ దినములలో ఆ పండితులనేకులకు శ్రీ మాతారవింద సిద్ధాంతము లెంతో హృద్యము లయ్యెను. సహేతుకము లయ్యెను. స్వీకరణీయములయ్యెను. ఇట్లెందరో యొకరిద్దరు ప్రశంసించుటగాక శ్రీ అరవిందుల పలువురు కొని యాడిరి. అమెరికా మొదలగు పలుతావుల శ్రీ అరవిందగ్రంథము, లాయా విశ్వ విద్యాలయములందు పాఠ్యగ్రంథములును నయ్యెను. ఇందుచే శ్రీ అరవింద కీర్తియు, సూక్తులును విశ్వవిఖ్యాతములయ్యెను. అన్నింటికన్న మిన్నగ నెన్నబడెను. వాంఛింపబడెను. ఏనాటికేని విశ్వమునకొక ఆధ్యాత్మికాది భౌతిక సామరస్యము, సర్వ సమన్వయము సాధ్యమగునేని — సాధ్యమే యగును —

అయ్యది శ్రీ అరవింద సిద్ధాంత మొకేయొక దానివలననే! ఈ నిస్సందిగ్ధ విశ్వాస మీ విశ్వమున నిప్పటికే వేరూనెను — వివృద్ధ మయ్యెను.

ఔను! ప్రపంచమందలి యీ అణ్వాయుధ భయంకర పరిస్థితులందు భౌతికాధ్యాత్మిక సామరస్యము — అట్టియేకవాక్యత అవసరము గాదా? అట్టి సార్వజనీన, సామరస్యము — జ్ఞాన సామరస్యము ఏనాటికేని నొనగూడినగాని యీ యణుయుగ ప్రళయమునుండి ప్రపంచము బయట పడగల్గుటెట్లు? బయట బడకున్న మనము మనగల్గుటెట్లు?

శ్రీ మాతారవిందుల సర్వసమన్వయ సంపూర్ణ సామరస్య ప్రపూర్ణ ఆధ్యాత్మిక విజ్ఞానమే — కేవల భౌతిక విజ్ఞాన ప్రళయ సముద్రమునకు చెలియలి కట్ట, జగద్రక్ష. లేదో యిక మహా ఘోర మారణశిక్షయే! సర్వంసహా సర్వ సంహారమే! కాన నో కరుణామూర్తీ! సకల క్షోణీసంరక్షకా, శ్రీ అరవిందుని సర్వ సమరస విజ్ఞానము నీ సకల విశ్వమునకును బ్రసాదింపవా? ఈ ప్రపంచ ప్రళయమునుండి మముగాపాడవా?

కాన నోసోదరులారా! ఈ సమిష్టి విజ్ఞానమునే మన మారాధించి, సాధించి, ఆహ్వానించి, అనుభవించి, యీ మహా ఘోర మారణహోమము నుండి, యీసమిష్టి ఆత్మహత్యనుండి, మనల మనము కాపాడుకొందుము. ఇందులకే త్వరితులు గండు. "శ్రీ కర్మధారా" పత్రికా పాంచజన్యమును మీరాలింపుడు; చందాదారులై చదువు చుండుడు. సంఘటితులై మీరంద రేకీభవింపుడు. శ్రీ అరవిందసంఘ (Sri Aurobindo Society) సభ్యులు గండు. అంత వికసఖిల దుష్ట విరుద్ధ శక్తులను తమంత తామంతరించును. ఇట్లెట్లో దైవకృపను మనకు మన సమిష్ట్యాత్మ రక్షణ సమకూరును "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అనునట్లు శరణాగతి నాచరింతుముగాక. పాకిస్తాను యుద్ధమున పరమేశ్వరరక్షణ మనకైనట్లే సర్వ సమిష్టి క్షేమమును మనము సాధింతుము గాక!

ఐన నోపాఠక మహోదయులారా! ఈ శరణాగతి తత్త్వము నొకించుక విచారించెదము. శరణాగతి యనునది కేవల భక్తియా? ముమ్మాటికినిగాదు. పూర్ణభక్తి జ్ఞాన కర్మముల పూర్ణ సమరస స్వరూపమే శరణాగతి. కావుననే

అయ్యది శ్రీ అరవింద సిద్ధాంత మొకేయొక దానివలననే! ఈ నిస్సందిగ్ధ విశ్వాస మీ విశ్వమున నిప్పటికే వేరూనెను — వివృద్ధ మయ్యెను.

ఔను! ప్రపంచమందలి యీ అణ్వాయుధ భయంకర పరిస్థితులందు భౌతికాధ్యాత్మిక సామరస్యము — అట్టియేకవాక్యత అవసరము గాదా? అట్టి సార్వజనీన, సామరస్యము — జ్ఞాన సామరస్యము ఏనాటికేని నొనగూడినగాని యీ యణుయుగ ప్రళయమునుండి ప్రపంచము బయట పడగల్గుటెట్లు? బయట బడకున్న మనము మనగల్గుటెట్లు?

శ్రీ మాతారవిందుల సర్వసమన్వయ సంపూర్ణ సామరస్య ప్రపూర్ణ ఆధ్యాత్మిక విజ్ఞానమే — కేవల భౌతిక విజ్ఞాన ప్రళయ సముద్రమునకు చెలియలి కట్ట, జగద్రక్ష. లేదో యిక మహా ఘోర మారణశిక్షయే! సర్వంసహా సర్వ సంహారమే! కాన నో కరుణామూర్తీ! సకల క్షోణీసంరక్షకా, శ్రీ అరవిందుని సర్వ సమరస విజ్ఞానము నీ సకల విశ్వమునకును బ్రసాదింపవా? ఈ ప్రపంచ ప్రళయమునుండి మముగాపాడవా?

కాన నో సోదరులారా! ఈ సమిష్టి విజ్ఞానమునే మన మారాధించి. సాధించి, ఆహ్వానించి, అనుభవించి, యీ మహా ఘోర మారణహోమము నుండి, యీసమిష్టి ఆత్మహత్యనుండి, మనల మనము కాపాడుకొందుము. ఇందులకే త్వరితులు గండు. "శ్రీ కర్మధారా" పత్రికా పాంచజన్యమును మీరాలింపుడు; చందాదారులై చదువు చుండుడు. సంఘటితులై మీరంద రేకీభవింపుడు. శ్రీ అరవిందసంఘ (Sri Aurobindo Society) సభ్యులు గండు. అంత నికనఖిల దుష్ట విరుద్ధ శక్తులను తమంత తామంతరించును. ఇట్లెట్లో దైవకృపను మనకు మన సమిష్ట్యాత్మ రక్షణ సమకూరును "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అనునట్లు శరణాగతి నాచరింతుముగాక. పాకిస్తాను యుద్ధమున పరమేశ్వరక్షణ మనకైనట్లే సర్వ సమిష్టి క్షేమమును మనము సాధింతుము గాక!

ఐన నో పాఠక మహోదయులారా! ఈ శరణాగతి తత్త్వము నొకించుక విచారించెదము. శరణాగతి యనునది కేవల భక్తియా? ముమ్మాటికినిగాదు. పూర్ణభక్తి జ్ఞాన కర్మముల పూర్ణ సమరస స్వరూపమే శరణాగతి. కావుననే

శరణాగతి కేవలము పూర్ణయోగమే. పూర్ణబోధయే. పూర్ణాద్వైతమే (Integral monism) "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అన్నటుల నీరీతి పూర్ణముగాని శరణాగతి, శరణాగతియేకాక కేవల మధోగతియే. అజ్ఞానభ్రాంతియే; అసత్య అసంపూర్ణ భక్తియే. అందిక ముక్తిలేదు. బంధమే దానిగతి. ముక్తిలేని భక్తి — మోక్షమీయని శక్తి, వెండి యనుచు నేల-వెంట బడుట? భక్తి ముక్తి శక్తి — రక్తియే పూర్ణమ్ము. పూర్ణయోగ మెరిగి-పూర్ణుడగుము. ముక్తి, జ్ఞాన మగును- శక్తి కర్మయె యగు, భక్తి ముక్తి శక్తి-పరగు బూర్ణ మగుచు, గాన వీని నన్ని-మానసమ్మున నెంతో, బూని మనదు నడత-గాన వలయు: అన్నచో నిందసత్యమే లేదు గదా?

జ్ఞానికే భక్తి గల్గును గాని అజ్ఞానికి గల్గునా? కల్గునన్నచో భక్తు లజ్ఞానులే యన్నట్లగు గాదా? ఐనను భక్తి తగినంత పూర్ణమైయుండక తప్పదు. మధుర వీరన్న దొంగల దేవుడందురు. ఈ కైతవులకును నాతనిపై భక్తికలదు, నిరాటంకముగ నవసరమునుబట్టి హత్యలు మూటినేని జేయుటకై వీరన్నను మ్రొక్కి దొరుకు దొంగసొత్తులో నీతొత్తులుగూడ వీరన్నకు భాగము బంచి, హత్యల ముగించ గల్గినందులకు, మంచి లంచముల నాతనిమ్రోల నుంచెదరు. దీనిని తగినంతటి పూర్ణ బక్తియనియో, జ్ఞాన భక్తియనియో, యన నగునా? ఐనను నెట్టి భక్తియేని కొంచమైనను లేకయే. హత్యల ముగించుటే, యన్నిట మించిన మంచి యని మనమెంచ నగునా? కేవల హంతకులై యుండుట మాత్రమే గాక వారిలో నొకించుక భక్తిగూడ భగవంతు డుంచుట మంచిదే కాదని మన మెంచవచ్చునా? ఐనను ఈ భక్తియే చాలునా? కావున, జ్ఞాన భక్తియే పూర్ణభక్తి ఇదియే వాంఛనీయము.

నిత్యానందస్థితియే ముక్తి, ముక్తినికోరకుండుటే మూఢత్వము. పూర్ణ భక్తి, పూర్ణజ్ఞానములకు అభేదమే. ఇట్టి వాటికిక యే పేరుపెట్టినను పరస్పర మొకటియే. కొద్దిదో పెద్దదో యే నదియైనను పూర్ణమగు అర్ణవమునుజేరి పూర్ణత్వమునేకదా పొందునది. కాన పూర్ణత్వముగలభక్తి జ్ఞానకర్మలలోదేని కైనను పూర్ణత్వమేగదా! పూజ్యపాదులు శ్రీ రమణదేవుల యీక్రింది యుదాహరణమైనను యీ సత్యమునె ప్రతిపాదించుచున్నది. "క్రింద, వసుంధర

యంమన్నపుడే మిట్టపల్లముల. కొద్ది గొప్పల భేదభావనలు. పై నంతరిక్షము నుండి "వీక్షించుచో ధరాతలమెల్లయు సమతలమేగదా!" ఇదియే శ్రీ శంకరాచార్యులచేగూడ, నిట్లు సూచింపబడెను. శ్రీ శకునిజ్ఞానమునకును జకకుని కర్మమునకును నభేదముగ నొకే జ్ఞానశబ్దమే ప్రయోగింపబడెను. ఈ భక్తిజ్ఞానకర్మలు మూడును, వాని వాని పరమోన్నతస్థాయి నవియందుకొని యందుననే యొకటి మరియొకటితో సమమై, పూర్ణతనొంది, తుదకు ఏకమైన, యొకే యొక స్థితియే శరణాగతి. పూర్ణుడగు పురుషోత్తమునికన్నను అన్యమునే కనలేనియొక మహత్తరస్థాయి. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "వాసుదేవస్సర్వం" ఈశావాస్య మిదంసర్వం" సర్వంశివమయం" అనియే, కనిన రీతిగ, ఎట్లును, ఎందును, ఎన్నడును, నతని కన్ననన్యమేలేదని దృఢముగ భావించిన, గుర్తించిన ప్రేమించిన, అనుభవించిన-భక్తి జ్ఞానకర్మ సమన్వయ, సామరస్య, భావైక్యస్థానమే శరణాగతి. "నీవే తప్ప నితః పరం బెరుగ" ననినయొక పరమపదము. పరంధామము, కైలాసము, వైకుంఠము, బ్రహ్మపట్టము. ఇది అజ్ఞానులకు అసాధ్యము! సాధ్యముగాక సాదింపజాలని జనులందరును జ్ఞానులా? వీరి భ్రమ భక్తియనునది క్రిందిదే యనియా? దానిని దాముదాటి, జ్ఞానము కడకుజనితిమే, యనియా వీరల మఱియొక తీవ్రభ్రాంతి! నిజముగనే జ్ఞానులైన యనంతరమును. పూర్ణుడైన పురుషోత్తమునిప్రాప్తి తమకు సంప్రాప్తించియును, సర్వశక్తి యుక్తుడైన సర్వేశ్వరుని యెడ, భక్తినలుపవలసిన యొక పూర్ణభక్తిలీల ఆ పూర్ణజ్ఞానులకును మిగిలియే యుండునే! ఈ పూర్ణయోగలీలను _ పూర్ణబోధాలీలను నెట్లని వర్ణింపగలము. ఎంతని వర్ణింపగలము. ఇదంతయు ననంపూర్ణ అజ్ఞానవాంగ్మానస గోచరముకానేకాదు. ఏకైక అతిమానసమునకే Supermind గదా అనుభవైకవేద్యము. అనుభవమైనను, మరలనిదివాచామ గోచరమే! అవాఙ్మానస గోచరమే! పూర్ణస్థితినెట్లు వచించుట? అయ్యును నొకించక బ్రయత్నించెదమా?

శ్రీ మాతారవిందుల పూర్ణసిద్ధాంతమునుగూర్చిన పూర్ణతత్త్వజ్ఞానభక్తికర్మలతోపూర్ణైక్యమునొందుచే శ్రీవారియెడ మనమొనర్చు పూర్ణశరణాగతి. ఈశరణాగతిని మన మెవరినుద్దేశించియైనను చేయనగును. కాని పూర్ణవేదాంత సిద్ధాంత జ్ఞానభక్తికర్మల పూర్ణసమన్వయమై, సామరస్యమై మాత్రమే మనయైక్యము సమకూడవలయును. కాని శ్రీ అరవింద పూర్ణసిద్ధాంత కర్మధారయే శ్రీ మాతార

విందుల భక్తిజ్ఞాన కర్మధార, దానిని ప్రకటించు పత్రికామతల్లియే "శ్రీ [illegible] కర్మధారా" మాస పత్రిక.

పాఠకమహాశయులారా. మన మన వ్యష్టిసాధన [illegible] వత్తరమైయుండునో అంతంతగనే మన సమష్టి సిద్ధియునుండును. [illegible] బాల్గొనువ్యక్తుల వ్యష్టిసాధన యొకింత బలహీనముగుచో [illegible] నంతగనే బలహీనమగునను మాట. బలహీనమేయైనను సమష్టిసిద్ధి [illegible] దగినసమష్టిసిద్ధియే. ఇదెక్కడికక్కడికికే వాంఛనీయము. [illegible] భారతీయులలో వ్యక్తులు, వ్యష్టులు ఎందరెందరో, ఎంతెంతగనో [illegible] ష్టులే యయ్యును, సమష్టిగ సాధించిన ప్రస్తుత పాకిస్తాను యుద్ధము [illegible] కొంతవరకు భగవంతునిగ్రుపచే సంతోషింపదగినదే కాదా! [illegible] నైన మనము శ్రీ అరవింద సిద్ధాంత జ్ఞానభక్తికర్మలలో వింకింకను [illegible] యున్నచో, మన యీ సమష్టి సిద్ధియు నింకెంతగ శుద్ధమై, బలిష్టమై, [illegible] రక్షాదక్షమై విశ్వవిమోచక మార్గదర్శకమై, విరాజిల్లునో!

ఉదారహృదయులగు పాఠకమహోదయులారా, [illegible] పౌరులారా! సమష్టిప్రేమస్వరూపులగు శ్రీ మాతారవిందుల సిద్ధాంత [illegible] ధారా పత్రికాముఖమున మనమింకింకను ననుభవించెదముగాక! [illegible] గాక! ఇట్లే స్వదేశకల్యాణమును, పిదపవిశ్వకల్యాణమును [illegible] ముగ సమకూరును. సందేహమేవలదు. [illegible] కర్తైదముగాక! మన మన వ్యక్తిసాధనా బలములకొలదియు [illegible] స్పదమగు భారతమాతృసేవనేగాక, సమష్టి విశ్వమునకును [illegible] గాక, ఇటుల మన సాధనలలో మనము సిద్ధులమగుటయేగాక [illegible] లగు శ్రీ మాతారవిందుల మహాప్రతిభనుగూడ [illegible] చెదముగాక!

.... .... నిశ్చయముగనే మనలో నొక ప్రగతి [illegible] యుండనే యున్నది. బుద్ధి ప్రభా ప్రయుక్త [illegible] మనము నటింపగలము. ప్రకాశ సమేతులమై దేనినైనాని [illegible] పరీక్ష గావించుచు వెంట్రుకను వేయి చీలికల గావింపగలము [illegible]

యించినప్పుడే చిట్టిపల్లముల. కొద్ది గొప్పల భేదభావనలు. పై నంతరిక్షము నుండి "వీక్షించుచో పిరాతల మెల్లయు సమతల మేగదా!" ఇదియే శ్రీ శంకరాచార్యులవేసారాచ, సిల్లి సూచింపబడెను. శ్రీ శకునిజ్ఞానమునకును జకకుని కర్మమునకును నిభేదముగ నొకే జ్ఞానశబ్దమే ప్రయోగింపబడెను. ఈ భక్తిజ్ఞానకర్మలు మూడును. వాని వాని పరమోన్నతస్థాయి నవియందుకొని యందుననే. యొకటి మరియొకటితో సమమై. పూర్ణతనొంది, తుదకు ఏకమైన, యొకే యొక స్థితియే శరణాగతి. పూర్ణుడగు పురుషోత్తమునికన్నను అన్యమునే కనలేనియొక మహత్తరస్థాయి. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "వాసుదేవస్సర్వం" ఈశావాస్య మిదంసర్వం" సర్వంశివమయం" అనియే, కనిన రీతిగ, ఎట్లును, ఎందును, ఎప్పుడును నతని కన్న నన్యమేలేదని దృఢముగ భావించిన, గుర్తించిన ప్రేమించిన, అనుభవించిన-భక్తి జ్ఞానకర్మ సమన్వయ, సామరస్య, భావైక్యస్థానమే శరణాగతి. "నీవే తప్ప నితః పరం బెరుగ" ననినయొక పరమపదము. వరంధామము, కైలాసము, వైకుంఠము, బ్రహ్మపట్టము. ఇది అజ్ఞానులకు అసాధ్యము! సాధ్యముగాక సాధింపజాలని జనులందరును జ్ఞానులా? వీరి భ్రమ భక్తియనునది క్రిందిదే యనియా? దానిని దాముదాటి, జ్ఞానము కడకుజనితిమే, యనియా వీరి మరియొక తీవ్రభ్రాంతి! నిజముగనే జ్ఞానులైన యనంతరమును. పూర్ణుడైన పురుషోత్తమునిప్రాప్తి తమకు సంప్రాప్తించియును, సర్వశక్తి యుక్తుడైన పర్మేశ్వరుని యెడ, భక్తిసలుపవలసిన యొక పూర్ణభక్తిలీల ఆ పూర్ణజ్ఞానులకును మిగిలియే యుండునే! ఈ పూర్ణయోగలీలను – పూర్ణబోధాలీలను నెట్లని వర్ణింపగలము, ఎంతని వర్ణింపగలము. ఇదంతయు ననంపూర్ణ అజ్ఞానవాంగ్మానస గోచరముకావేరాదు. ఏకైక అతిమానసమునకే Supermind గదా అనుభవైకవేద్యము. అనుభవమైనను, మరలవిదివాచామ గోచరమే! అవాంగ్మానస గోచరమే! పూర్ణస్థితినెట్లు వచించుట? అయ్యును నొకించక ప్రయత్నించెదమా?

శ్రీ మాతారవిందుల పూర్ణసిద్ధాంతమునుగూర్చిన పూర్ణతత్త్వజ్ఞానభక్తికర్మలతో మహత్కార్యమునొందుచే శ్రీవారియెడ మనమొనర్చు పూర్ణశరణాగతి. ఈశరణాగతిని మన మెంచినుద్దేశించియైనను చేయవగును. కాని పూర్ణవేదాంత సిద్ధాంత జ్ఞానభక్తికర్మల పూర్ణసమన్వయమై, సామరస్యమై మాత్రమే మనయైక్యము సమకూడవలయును. కాని శ్రీ అరవింద పూర్ణసిద్ధాంత కర్మధారయే శ్రీ మాతార

విందుల భక్తిజ్ఞాన కర్మధార, దానిని ప్రకటించు పత్రికామతల్లియే "శ్రీ అరవింద కర్మధారా" మాస పత్రిక.

పాఠకమహాశయులారా. మన మన వ్యష్టిసాధన యెంతెంతగ బల వత్తరమైయుండునో అంతంతగనే మన సమష్టి సిద్ధియునుండును. ఈ సమష్టిలో బాల్గొనువ్యక్తుల వ్యష్టిసాధన యొకింత బలహీనమగుచో ఈ సమష్టి సిద్ధియు నంతగనే బలహీనమగునను మాట. బలహీనమేయైనను సమష్టిసిద్ధి, వాంఛింప దగినసమష్టిసిద్ధియే. ఇదెక్కడికక్కడికికే వాంఛనీయము. ఎట్లన ప్రస్తుతముమన భారతీయులలో వ్యక్తులు, వ్యష్టులు ఎందరెందరో, యెంతెంతగనో దోషభూయి ష్ఠులే యయ్యును, సమష్టిగ సాధించిన ప్రస్తుత పాకిస్తాను యుద్ధము ఎంతో కొంతవరకు భగవంతునిగృపచే సంతోషింపదగినదేకాదా! అయ్యును వ్యక్తుల మైన మనము శ్రీ అరవింద సిద్ధాంత జ్ఞానభక్తికర్మలలో నింకింకను శుద్ధులమై యున్నచో, మన యీ సమష్టి సిద్ధియు నింకెంతగ శుద్ధమై, బలిష్టమై, దేశ రక్షాదక్షమై విశ్వవిమోచక మార్గదర్మకమై, విరాజిల్లునో!

ఉదారహృదయులగు పాఠకమహోదయులారా, భారతీయులారా! ప్రపంచ పౌరులారా! సమష్టిప్రేమస్వరూపులగు శ్రీ మాతారవిందుల సిద్ధాంతము నీ కర్మ ధారా పత్రికాముఖమున మనమింకింకను ననుభవించెదముగాక! సాధించెదము గాక! ఇట్లే స్వదేశకల్యాణమును, పిదపవిశ్వకల్యాణముగూడను, విజయవంత ముగ సమకూరును. సందేహమేవలదు. నడుముగట్టి, మనమిందులకు సమ కట్టెదముగాక! మన మన వ్యక్తిసాధనా బలములకొలదియు మనలపరమ ప్రేమా స్పదమగు భారతమాతృసేవనేగాక, సమష్టి విశ్వమునకును సత్సేవలజేయుదుము గాక. ఇటుల మన సాధనలలో మనము సిద్ధులమగుటయేగాక, అవతార మూర్తు లగు శ్రీ మాతారవిందుల మహాప్రతిభనుగూడ జయప్రదముగ జగమున ప్రకటిం చెదముగాక!

.... .... నిశ్చయముగనే మనలో నొక ప్రగతిశీలత, సూక్ష్మబుద్ధి యుండనే యున్నది. బుద్ధి ప్రభా ప్రయుక్త మేధా దక్షిణామూర్తులముగా మనము నటింపగలము. ప్రకాశ సమేతులమై దేనినిగాని సూక్ష్మాతి సూక్ష్మ శల్య పరీక్ష గావించుచు వెంట్రుకను వేయి చీలికల గావింపగలము. కాని, ప్రయోజన

హాసియుగా చింతన జేయుటలో మాత్రము దిగజారిపడి, జయమునొందక జాల నే పోతిమి. మనమును నొకజాతియే, యనుచు మహిపై మనుటకై ఆశించుచో మాత్రము — సజీవులమై యింకను మిగిలియే యుండుటకే ఆశించుచో మాత్రము — జీవితముపై — జీవించుటలో నాధిపత్యమును జయప్రదముగ వహింపక తప్పదు. విషయములయొక్క అత్యంత సత్య హృదయముపై విజయవంతముగ నాధిపత్యము వహింపక తప్పదు.

పోగొట్టుకొనిన మనబుద్ధి స్వాతంత్ర్యమును మరల నెట్లు మనము సంపాదింపగలము ? ఎంతగ ఓగించినను తెగకయే మన బుద్ధి నారలు సాగు మన నేర్పును మరల నెట్లు మనము సాధింపగలము ? మనము ఏ మార్గమున వీనిని పోగొట్టుకొంటిమో, అదే మార్గమున యరల వెనుదిరిగి జనుట మూలముననే, వానిని మనము మరల చేజిక్కించుకొనగలము. ఈ తిరోగమనము కొంతకాలము వరకేని యవశ్యమే. సకల విషయ విజ్ఞానమున మనము సాధింపవలసిన సార్వభౌమాధికారమునకు మారుగ మన మిపుడు పొందియున్న దాస్య బంధమునుండి మన మనస్సులకు విమోచనమును కలిగించుకొనవలయును. దీని మూలముననే ఆ కోల్పోయిన వానిని మరల మనము చేజిక్కించుకొనగలము. కాని యీనాటి సంస్కర్తలు — ఆంగ్లభావదాసులు మనల గోరునదిదిగాదు. నిజముగ మనము మన ఆధిపత్యమును విడనాడుటకై వారలు గోరుచున్నారలు, మన సాంప్రదాయముపై, మూఢవిశ్వాసముపై మనము ఎదురుదిరుగగోరుచున్నారలు. స్వేచ్ఛాపూరిత విశాల విజ్ఞాన మనస్సుల మనము పూనవలెననుచున్నారలు. ఈ పెద్ద పెద్ద శబ్దములంచే వారలు ఉద్దేశించునది ఏమనగా, మాక్సుముల్లరునకు మాత్రమే యధికారము కట్టబెట్టుటకై, మన శాయనునీ (విద్యారణ్యుని) అధికారమును మనము త్రోసి రాజనగోరుచున్నారు. శంకరాద్వైతమునకు మారుగ హెగెలు అద్వైతమును, విరచిత శాస్త్రమునకుమారుగ, అవిరచిత ఐరోపీయ సాంఘిక భావవర్గమును, బ్రాహ్మణపండితుల మతసిద్ధాంతములకు మారుగ, యైరోపా భౌతికశాస్త్రవేత్తల—విచారణశీలుర—పండితుల—సిద్ధాంతములనే, మనము తలదాల్చి, మనలను వారలు కోరుచున్నారలు ఈ మార్పిడి—యిదింకొక విధపుబుద్ధి హీన మగుదాస్యము మాత్రమే. ఆత్మగౌరవముగలయే అంతఃకరణ (మనసు) యైనను ఇట్టి యీలపోహణమును నంగీకరింపదు.

హిందూదేశమింకను సజీవమైయుండవలెననిన, విశ్వమున దాని విధినది యింకను నిర్వహింపవలెననిన, మనదు ప్రపథము విధియేదనగా-భారతయువకులు ఆలోచనా భరితులైయుండుటను నేర్వవలయును. సర్వస్వతంత్రముగ, ఫలవంతముగ చింతింపగలుగవలయును. సత్యముల సత్యహృదయములోనకు, చొరుచుకొని, పోగలుగవలయును. పైపై సత్యములమాత్రమే గ్రహించుటగాదు. తొందరపడి, త్వరపడి మున్ముందుగనే సిద్ధాంతీకరించుటయుగాదు. పదునగు కత్తితో ఛేదించి పారవేసినట్లుల అభాస అసత్యసిద్ధాంతముల దూరీకృతముల నొనర్చుకొనవలయును. సమస్తసత్యవాద విరుద్ధ సిద్ధాంతమును, మనము భీమగదచే మోదిపైచిన విధమున, చూర్ణీకృత మొనర్చవలయును. ఐరోపియను శిశువుల శిరములు గుడ్డపేలికలతో చుట్టబడ్డట్లుగాగాక ఇక మన మెదడులు దేనితోడను బంధింపబడకుండునుగాక. మన నవభారత యువకులికను దేవతలవలె బంధరహితులై స్వతంత్రముగ సంచరించెదరుగాక। ఇట్టి యీ స్వతంత్రమును మరల మనము సంపాదించుకొనెదముగాక। భారతీయుని-భారతుని బుద్ధికి సహజమైన కుశాగ్రతను మనముబడయుటేగాక ఆ సూక్ష్మబుద్ధికిగల విశాలయాజమాన్యమును, సార్వభౌమత్వమునుగూడ మనము చేబట్టెదముగాక. ఈ భారతమేధకు-ఈ భారతబుద్ధికి, తనదు ఆ బలమును, స్వీయయోగ్యతను, సరిగ నొకపరియేని భావించుటయు, విశ్వసించుటయు నలవడెనో. యిక నీ నష్టద్రవ్యసంపాదన మదెంతో సులభసాధ్యము. ఈ యువ భారతమింక తనదు ఆ పురాతన శృంఖలముల పటాపంచ లొనర్చుకొనవలయును. అటుల నంతగనొనర్పజాలదో తుదకో బాలకృష్ణునివలెనైనదాను. ప్రవర్తించునుగాక। పాపమాతని రొంటికొకరోలా। దానినేగాక, అడ్డుపడునే దాని నైనను తనతో నీడ్చుకొనుచునే ఆతడు ముందునకు చనుటయా! ఇట్లే అడ్డుపడ్డ యామళవృక్షములపాలిటికది యొక గొడ్డలిపెట్టా। ఆ జంట ఆటంకములకటులే. ఆత్మపరిపూర్తియా। ఇట్లే మనకుగూడ అడ్డుపడు మధ్యయుగ మూఢాంధనిర్ణయములను, అహంకారపూరిత అధునాతన సిద్ధాంతములను. మనము గూడ నిర్మూలింపవలసి యున్నారము. పాదుకొని యున్న ఆ ప్రాతకాలపు పునాదులు పెకిలింపనేబడెను. మహత్తరమైన యొక పెద్ద మార్పనెడి, యుప్పెన కెరటపు పొంగు నీటిలో తలమునకలై మనమిపుడు తల్లడిల్లుచున్నారము. తేలిచను నా ప్రాతకాలపు మంచుకొండలు పట్టుకొని ప్రాకులాడిన మనకికనే ప్రయోజనమును లేనేలేదు. అవి అచిరకాల

మంచే కరిగినిస్తై. శరణార్థుల — మనలనుఅపాయమున ముంచెత్తగలవు. అట గింజులాట, మన కింకను నపాయకరమే. కాదో రోగాలపుట్టయగు నొక బురద దయ్యాలో దిగినను, ప్రయోజనము సున్నయే. అదియో సముద్రమునుగాదు, మంచి మెండు నేలమైనను గాదు. ఎరువు తెచ్చుకొన్న బరువుల చేటు ఐరోపా భావదాస్యమే అది ! అట మనము కేవలమొక పాపిష్ఠిచావు చచ్చెదమే గాని వేరంకేమియుగాదు, కాదు, కాదు ! మన మీత నేర్చియే తీరవలెను. ఈ శక్తితో మనము నిర్వికార, అక్షరసత్యమను ఆ సురక్షిత నౌకను — చేరియే తీరవలయును, యుగయుగాలకును చెదరని ఆ శాశ్వత సత్య శిఖరముననే మనము మరల కాలూని తీరవలయును.

ఇంతేగాని, ఏదో అందినదెల్ల చేబూని, తుదకొక అనామకపు దైవాధీనపు, పెద్ద కలగూరగంప నొక దానిని మనము సిద్ధము చేయజనదు చేసిన ఆ దానికే మరల "తూర్పు పడమరల ఏకీకరణ జీర్ణ" మనియో, యేదేదో పెద్ద నామకరణముల జేయను జనదు. ఏదో నమ్మకముపై మనము దేనినిగాని స్వీకరింప వలదు. అది దేనినుండి గాని యవతరింపనిందు. ఆ ప్రతి దానిని మనము ప్రశ్నించియేతీరవలయును. తుదకు మనస్వీయనిర్ణయములతో మాత్రమే మన మారంభింతము. ఇట్లొనర్చుచో మనము భారతీయులము గాకుండ బోయెదమను భయమును వలదు.............ఎపుడు కాకయే బోయెద మన.... యూరపు ఖండపు వికృతపు, బుద్ధిహీనపు, ప్రతిరూపమగుటకే ప్రయత్నించు నాపదలో హిందూదేశమున్నదని ఐరోపియనులు మనల ననునాడే, అటులనుటకు వారల మన మనుమతించునాడే, మనము భారతీయులము కాకయేబోయెదము. కావుననే మనము ఏక పక్షీయులము కారాదు ; అటు లారంభింపరాదు స్వయంచింతనాశీలుర మగుటకై మన మొనరింపవలసిన మొదటి పని — మనదిగాని దానిని మూగలుగ మన మంగీకరింపకుండుటే — ప్రతి దానిని మనము ప్రశ్నించుచుండుటే ! అనగా పురాతనములో, అధునాతనములో — యే భావములగాని పరీక్షింపకే మనమంగీకరింపకుండుట—అపరీక్షితముల నావలకు నెట్టివైచుట. ఇట్లే కేవలము అలవాటుచేనైన సకల సంస్కారములను మన మనసునుండి దూరీకృతముల నొనర్చుకొనుట. త్వరపడి. పొరపడి ముమ్ముందుగనే యే నిర్ణయములకును మొనయకుందుముగాక !

---

# వేద విద్యా : శ్రీ అరవిందుల కృషి

— వేలూరి సదానంద్

వేదము అపౌరుషేయము : అనగా మనుష్యమాత్రులు మానవచేతనతో వ్రాసినదికాదు. యస్య నిశ్వసితం వేదాః — ఆయన ఊపిరియే వేదాలు అయినవి. ఎవరాయన? పరబ్రహ్మము; సత్యం జ్ఞానం అనంతబ్రహ్మ; సత్యం ఋతం బ్రహ్మ. సచ్చిదానందము. ఆయనది దివ్యచైతన్యము. అందుకై తపించి యోగ నిష్ఠతో తాదాత్మ్యము నందినపుడు ఆ ఊర్ధ్వ మూలమునుండి ప్రవహించిన చైతన్యము ఆయావ్యక్తుల నోట మంత్రముగా వెలువడెను. వెలువడకముందే వారికి మంత్రములు వినబడెను, కనబడెను. అందువలన వారు మంత్రద్రష్టలు. అత్రి, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, అగస్త్యుడు వామదేవుడు మొదలగు ఋషులు విని పలికినందున శ్రుతి అనికూడ చెప్పుదురు. మననముచేసిన తరింపజేయ గలవి, పరమేశ్వరుని సాక్షాత్కరింపజేసికొనుటకు అనువైనవి మంత్రములు. సిద్ధిగొలది ఆత్మనిష్ఠలో కనబడి వినబడి తరింపజేసినవియును మంత్రములే. మంత్రద్రష్టలు అంతర్ముఖులై సాధనకు పూనుకొనుటకు ముందు మనుష్యులై యైనను అటుతర్వాత వారు మనుష్యత్వపు మూడుప్రహారీలను ఛేదించుకొని పోయినందున భిన్నులై అతీతులై ఋషులైరి. కనుక మంత్రములు అపౌరు షేయములు, కనుకనే అనాది. 'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం' — ఏది తెలిసిన అంతయు తెలియునో ఇక తెలియవలసినది ఉండదో అది అధ్యాత్మ విద్య. మనము చూచి, విని, ఆలోచించి తెలిసికొను తెలివి మనకు తెలిసినదే, అది మనస్సువలన కలిగేది. ఇపుడు మనకు తెలియక ఉన్నది, ఇప్పటి మనతెలివికి మించినది, ఈ తెలివికి తెలియని అందగా ఉన్నది. ఇపుడు మనస్సుకు అందిన ఆలోచనా పద్ధతులవలనగాక అంతర్ముఖత్వ పరిణతిలో కలుగు సంసిద్ధి యీ అధ్యాత్మవిద్య. అజ్ఞానమనగా యీ అధ్యాత్మజ్ఞానము లేకపోవుటే. మనుష్యుడు శరీరము ప్రాణము మనస్సు ఇవే సర్వస్వమనుకొని, తమస్సు, రజస్సు, సత్త్వము అనే గుణములకులోనై ఉన్నాడుగదా! వీటికి అతీతముగాను అవలంబముగానుఉన్న ఆత్మజ్ఞానము మనుష్యునకు ఎట్లుకలుగును అంటే ఆత్మ జ్ఞానము కావలయుననే ఆర్తివలననే, ఉత్కాంక్షవలననే కల్గును. ప్రకృతి లేక సృష్టి యావత్తు అంతర్లీనమైన అగ్నితత్త్వ విలసనమైనట్లుగా హృదయస్థమగు

త్రికరణశుద్ధమైన ఆస్తయను అగ్నియొక్క జ్వలనము ఆత్మజ్ఞానమునందు పర్యావ సించును. మనముచూచు అగ్నియొక్క జ్వలనము ఆత్మజ్ఞానమునందు పర్యావ సించును. మనముచూచు అగ్నిదేవుని స్థూలరూపము. మనుష్యునిలో ఊర్ధ్వ ముఖమై అంతర్ముఖమై రగిలిన ఆస్థను అగ్నిదేవుడు. అందుకొని ముందుకు తీసికొని పోవును; ఆస్థ చల్లారకుండ నిలిపి ముందుకు నడుపుకొని పోవును. ఆస్థగల మనిషికి అగ్నియే పురోహితుడు. మనిషి సంకల్పించిన ఆత్మ యజ్ఞమునకు దేవత అగ్ని ఆవాహనచేయగా అగ్నివచ్చి ఆధారమును చక్కచేసి నమిదటగాని ఇతర దేవతలు మనిషిలో ప్రవేశింపరు మనస్సులోనికి ఇంద్రుని. ప్రాణములోనికి సూర్యుని, శరీరములోనికి సోముని పిలిచికొనివచ్చి ఇదిగో ఇవి మృణ్మయాధారములుగావు, హృదయమున రగిలిన ఆస్థ వలన ఇవి వాటి ప్రాకృతావస్థను వీడిపైకెగయ నుత్సహించుచున్నవి. మీరు ప్రవేశించి హిరణ్మయము చేయుడు అనిచెప్పి ఆనందింపజేయువాడు అగ్ని. మనిషికి ఆత్మజ్ఞానము కలిగినదన్న ఆనందము మనిషి పైకివచ్చు చున్నాడన్న ఆనందము దేవతలకు కల్గును. ఋగ్వేదమున మొదటిమంత్రము అగ్నిమంత్రము.

* * * *

## వేదముల విభాగము—1

1. ఋగ్వేదము ఋక్సంహిత అతిప్రాచీనము. 8 అష్టకములు, అష్టకమునకు 8 అధ్యాయములు లేక 10 మండలములు. 1000 అనువాకములు, 1017 సూక్తులు. ఋగ్వేదములోని మంత్రములు ఋక్కులు. ఋక్కు అనగా చందోబద్ధమైన స్తోత్రము. బిగ్గరగా ఉచ్చరించవలసిన అర్చన. తేజస్సు అనియును, ఋగ్వేదము అగ్నిలో నుండి వచ్చినది.

2. యజుర్వేదము : యజుస్సంహిత కృష్ణయజుర్వేదము, తైత్తిరీయమనియును, శుక్లయజుర్వేదము, వాజసనేయ మనియు రెండు యజుర్వేదాలున్నాయి. యజస్ అనగా యజుర్వేదములోని మంత్రవచనము. మెల్లగా చదువ వలసినది, యజ్ఞసంబంధమైనది. ప్రక్రియతోకూడిన దేవతార్చన యజ్ఞము.

3. సామవేదము : సామము అనగా సాంత్వన, ఊరటశాంతి కల్గించునది. పాటగా పాడుస్తోత్రము. సామవేద మంత్రమును సామవేదమును సామ మందురు. చందోబద్ధము, పాడదగినది.

4. అధర్వణవేదము : 9 శాఖలు, 5 కల్పములు, 20 ఖండములు. దేవతలను స్తోత్రముచేయు మంత్రములతోడు ఈతిబాధల నివర్తకమైన మంత్రము లున్నవి.

ప్రతివేదములో మూడు భాగములుండును మంత్రము, బ్రాహ్మణము, ఆరణ్యకము — ఉపనిషత్తులు. మంత్రము మూలము. దానినాశ్రయించి రెండవది. ప్రతిసూక్తమునకును మంత్రద్రష్టయైన ఋషి, దేవత, ఛందస్సు, స్వరము విధిగానుండును.

## వేదముల విభాగము—2

1. మంత్రము : అగ్ని, ఇంద్రుడు, సూర్యుడు, సోముడు మొదలగు దేవతలను ఆవాహన అర్చనచేయు మంత్రములు.

2. బ్రాహ్మణ : మంత్రముల వ్యుత్పత్తిని, అరవిరూపము కథల గాథల రూపమున వ్యాఖ్యానము, వివిధయజ్ఞ రూపములలో ప్రయోగింపదగిన మంత్రములను గూర్చిన విధానము బ్రాహ్మణములలో కలదు. ఐతరేయ, శతపథ, పంచవింశ, గోపథ బ్రాహ్మణములు వరుసగా ఋక్ యజు, సామ అధర్వవేదముల్లో ఉండును.

3. ఆరణ్యక ; ఉపనిషత్ వేదమంత్రముల గూడార్థములను తెలిపి-అజ్ఞానమును పోగొట్టి పరమాత్మను పొందజేయునవి 108 లేక 128 ఉన్నవి. వీటి షడ్దర్శనములకు ఆధారము. ముఖ్యమైనవి 10. బ్రహ్మసూత్రములు, గీత, ఉపనిషత్తులు — ఈ మూడింటికి ప్రస్థాన త్రయమనెదరు. ఐతరేయ ఆరణ్యక ఋగ్వేదములో, తైత్తిరీయ ఆరణ్యక యజుర్వేదములో ఉండును.

ఐతరేయ ఉపనిషత్తు ఋగ్వేదములో, తైత్తిరీయ, ఈశ, కఠ, బృహదారణ్యక యజుర్వేదములో; కేన, ఛాందోగ్య సామవేదములో; ముండక మాండూక్య అధర్వ వేదములో ఉండును.

మనదేశములో వేదము అందరకును పెద్దప్రమాణము. పామరులు పండితులు అందరకును. వేదము తెలిసినవారికిని తెలియనివారికిని వేదము తర్వాతనే ఏదైనను లెక్కకువచ్చును. వేదమునకు ఇట్టి పలుకుబడి యెప్పుడువచ్చినది తెలి

యము. ఇది అనాది సంప్రదాయము, లిపి ఏర్పడకమునుపు. లిపియేర్పడి తాళ పత్రములందు లిఖితముకాకమునుపు, వేదము కంఠస్థముగానుండి-అనుశ్రుతముగా పరంపరగావచ్చి నిలిచియుండుట పరమాశ్చర్యము. కంఠస్థముచేసినవారి జ్ఞాప కశక్తియు వారికందుగల శ్రద్ధయు అతిలోకమైనవి. జట, ఘన, పనస ద్వారా వేదము నుపాసించినవారు స్వరముపోకుండ మంత్రములుపోకుండ శత శతాబ్దములమీదుగా ఒక తరమువారు తరువాతితరమువారికి అందించుచు సంరక్షిం చుకొనుచు వచ్చుట ప్రపంచేతిహాసములో మహద్విశేషము.

గతశతాబ్దములో విజయనగర మహారాజులగు ఆనందగజపతిగారి తోడ్పా టుతో ఈస్టిండియాకంపెనీవారి సహాయముతో మాక్సుముల్లరు పండితులు పూను కొని తాళపత్రప్రతులనేకాక వేదము కంఠతః వచ్చినవారినిగూడ ఆధారముగా పెట్టుకొని ఋగ్వేదము అచ్చువేయించినది మొదలు వేదముల ముద్రితప్రతులు లభ్యమై పరిశోధనచాల జరిగినది.

సాయణాచార్యులుగ వాసికెక్కిన విద్యారణస్వామి అయిదారువందల యేండ్లకు పూర్వము వ్రాసిన భాష్యము, ఎపుడు వ్రాసినదో తెలియని యాస్కుని నిరుక్తము. వేదము చదివి అర్థముచేసికొనుటకు శరణ్యగ్రంథములు.

ఇపుడు నిలిచియున్న వేదములు అసలువేదములలో కొంతభాగమే ననియు, ఖిలమైపోయిన వేదము చాలఉండియుంటవలెననియు ప్రతీతి.

గతించిన నూరేండ్లపైగా పాశ్చాత్య విద్వాంసులును మన విద్వాంసులును చాలపరిశోధనకావించి ఉపనిషత్తులే గొప్పవిఅనియును, ఎప్పుడో పూర్వకాల ములో పంచభూతములకు ఝడిసిన మనుష్యులు అగ్ని, వాయువు మొదలైన దేవతామూర్తులను కల్పనచేసికొని తమయోగక్షేమము కొఱకు అర్చన ప్రార్థన చేసిరనియు, ప్రకృతిని ఈవిధముగా ప్రసన్నముచేసికొనుటకు చదివిన స్తోత్రపాఠములే వేదములనియు అక్కడక్కడ కొన్ని మంత్రములలో ఉదాత్తభావ ములు లేకపోలేదనియు ఐనను వేదములో విశేషించి ఏమీలేదనియు చెప్పుచూ వచ్చిరి ఇదే ఇపుడు ప్రబలియున్న భావము. పాశ్చాత్యులు పరిశోధన లెప్పుగాచేసినను వారి మనోవృత్తినిబట్టి ముందుగాపెట్టుకొన్న సూటినిబట్టి వేదార్థమునకు వచ్చుసరికి ఇట్టే తేల్చివేసిరి.

సంప్రదాయసిద్ధముగా వేదమునకు మూడువిధములగు అర్థమున్నది—ఆధిభౌతికము. ఆధిదైవికము. ఆధ్యాత్మికమునని ప్రతీతి. కేవలము ఆధిభౌతికముగా అర్థముచెప్పినవారున్నారు. కేవలము భూమిపరముగా భూగర్భశాస్త్రవిషయికముగా ఒకరర్థము చెప్పుటకు ప్రయత్నించిరి. దయానందసరస్వతిగారు వేదములకు గుప్తార్థముఉన్నదనియు, సంస్కృతధాతువులకు అనేక అర్థములున్నవనియు, మంత్రార్థము సంజ్ఞాశీలమనియును దేవతలు ప్రకృతిలో గోచరించు శక్తియుక్తుల మూర్తులలేకాక అంతకుమించిన లక్ష్యలక్ష్యణములతో కూడినవారనియునిరూపించిరి. అధ్యాత్మపరముగా అర్థము చెప్ప ప్రయత్నము పూర్వము కూడకొంతవరకు జరిగెను. అది తెలిసినవారు ఉండియుందురు. అధ్యాత్మవిద్య, గుహ్యవిద్య అగుటచే ప్రకటితముకాక క్రమశః ఖిలమైయుండును.

*  *  *  *

ఉపనిషత్తులు వేదశిరస్సు అన్నను_వేదములే ఉపనిషత్తులకు మూలములై మంత్రముల గూఢార్థమును ఉపనిషత్తులు వ్యక్తమొనర్చుచున్నందునను, మన జాతిమనుగడకంతకును, వేదమే మూలాధారముగా కన్పించుచున్నందునను వేదమునకు స్థూలార్థముమాత్రముచెప్పి అంతకన్నమిన్నవి ఉపనిషత్తులని కొట్టివేయుట సబబుకాదు. మంత్రద్రష్టములగు ఋషుల ఆత్మానుభూతినిపొందగల్గిన యెడల మంత్రార్థము బోధకాగలదని భావించుట ఈజిజ్ఞాసకు మొదటిమెట్టగును.

వేదమునకు నిగూఢమైన అర్థముఉన్నదనియు, వేదములోనే 'నిణ్యావచాంసి' 'గుహ్యవచనములు' అని పేర్కొనిరనియు. ఆంతరమైన అనుభూతితో శ్రీ అరవిందులు అనేక ఋక్కులకు అర్థవివరణచేసి వేదరహస్యమును కొంత తెలిపియున్నారు. ఆధ్యాత్మపరముగా అర్థముచెప్పుటకు వలయుసాధన సామగ్రిని వదలివెళ్లినారు మున్ముందు వేదార్థమును మూలమట్టుగా తెలియగోరువారికి దారిచేసివెళ్లినారు—శ్రీ అరవిందుల ఒరవడిననుసరించి శాస్త్రపద్ధతిని శ్రీ తి. కపాల శాస్త్రిగారు ఋగ్వేద ప్రథమ మండలమునకు సంస్కృతములో భాష్యరచనచేసిరి. ఇందలి భూమిక ఇంగ్లీషులోనికి అనువదింపబడి ప్రచురితమైనది. మిగిలినదియును ఇంగ్లీషులోరాగలదు. శ్రీ అరవిందులు వేదమును గురించి ఇంగ్లీషులో వ్రాసినది. ఇంగ్లీషులో వ్రాసిన వేదార్థమును జగన్నాథపండితులు సంస్కృతములోనికి కొంతవరకు అనువదించి ప్రచురించిరి. మిగిలినదికూడ అనువదింప సమకట్టినారు.

*  *  *  *

ఇపుడు లాంఛనముగా చేయుచున్న నమస్కారములోని భావము గమనించినచో అంతరార్థము బాహ్యప్రక్రియలో ఎట్లు స్ఫురించునదియు మరుగుపడిపోవునదియుగూడ గ్రహించగలము. నమస్కారము అనుమాటలోనే, వంగుట, అణగియుండుట, సమర్పించుకొనుట యను భావము ఇమిడియున్నది. నమః శివాయ లేక నమోభగవతే వాసుదేవాయ అన్నపుడు 'నమః'కు అర్థముచేతులెత్తి దణ్ణముపెట్టుట మాత్రమేకాదు; వ్యక్తిసర్వము సమర్పితముఅగుట నమస్కృతి. లోని భావమునకు బాహ్యప్రక్రియ; భావమువినా లాంఛనప్రాయము.

ఇట్లే అగ్ని నిప్పుమాత్రమే కాదు, ఊర్ధ్వముఖమైన మన అంతర్ముఖమైన ఆస్థకును, సంకల్పమునకును మూర్తిగా, సంసిద్ధికి సోపానములగు ఈశ్వర లక్షణములను మన మనఃప్రాణశరీరములందు ప్రతిష్ఠాపనచేయగల్గిన దైవముగా అగ్ని మనకు భాసమైనపుడు మన భావనయు తాత్పర్యము వేరుగా నుండదు. యాస్కుని కాలము నాటికే వేదముల అర్థము మరుగుపడిపోయినపుడు ఈ నాడు ఆ క్లేశము ఇంకను ఎక్కువేయగును. అర్థము కాని దానిని అర్థముచేసు కొనుటకు బదులు అర్థము కానిది అర్థము లేనిదిగా భావింపబడు ఈ కాలమున వేదమునకు ఆధ్యాత్మపరమైన అర్థము ఉండవచ్చునని ఒప్పుకొనుటకు కూడ మంచి మనస్సు అవసరమగును.

*    *    *    *

సృష్టిలో మనిషి ఊర్ధ్వముఖుడును అంతర్ముఖుడును అయి సృష్టికి అతీతమైన సచ్చిదానందమును ఆవాహనచేయును. శుద్ధమైన నీటిలో శుద్ధమైననీరు కలిసినట్లుగా మనిషియందు సచ్చిదానందము ప్రవహించుటకు దేవతా శక్తులను మనిషి ఆవాహన చేయును, అట్టి ఆవాహనమే వేదము. మనుష్యత్వమును దివ్యత్వముగా మార్చగలుగుటకు మనిషియందుకలుగుఆస్థతో అగ్ని ఆవాహన యగును. చైత్యపురుషుడు. అంగుష్ఠమాత్ర పురుషుడు. అంతర్యామి మేల్కొనును. ఆ తెలివితో ప్రవర్తించు బుద్ధి లోనికి అగ్ని ఇంద్రుని తీసికొనువచ్చును. అట్లు ప్రభావితమైన బుద్ధికి వశములైన ఇంద్రియములతో నడచు ప్రాణిలోనికి సూర్యుని తేజస్సును తీసికొనివచ్చును. అగ్నిగా, — ఆస్థనురగిల్చి ఇంద్రుడుగా,— ఇంద్రియములను శాసించుబుద్ధిని తేజరిలజేసి, సూర్యుడుగా, — బుద్ధికిలోనైన ఇంద్రియములతో సంచరించు ప్రాణమును జ్యోతిర్మయముచేసి

సోముడుగా, — శరీరిని, అగ్నిని, ఇంద్రుని, సూర్యుని భరించు శక్తిని అనంద పరచును. ఆపైన నీటిలో కలిసిన ఉప్పును పట్టి చూపలేనట్లు తనకన్న వేరు లేదనిపించినవానికి లేక తాను తెలియనివానికి తాను, యితడను అని తెలియని తర్కమునకు అందని విధముగా మనుష్యచైతన్యము సచ్చిదానందమే కాగా బహుధాగోచరమైన దైవము ఏకంసత్ అగును. అగ్నియే ఇంద్రుడు, సూర్యుడు సోముడు. ఒకే దేవతలో అందరు దేవతలును — ఒక్కొక్కరి యందు ఒక్కొక్క దైవీశక్తి ముందుకు వచ్చును. కాని వేదములోని యీ దేవతలు పురాణములోని ... తాదాత్మ్యజ్ఞానముచే వేదమున ఒకట్టికారు. వేదార్థము, శబ్దార్థమువలన సిద్ధించదు. మంత్రముచే ద్యోతకమైన అనుభవమును మంత్రమునకు అర్థముచెప్పుట అవగా ఋషియగును. తమకన్న పూర్వులగు ఋషుల సంసిద్ధినే... కనుకనే ఋషి ఋషులు చేసిన ప్రస్తావన కలదు. అనగా ఇపుడు వేదములో సూక్తములో నిలిచియున్న సిద్ధికి మించిన సంసిద్ధి అంతకు పూర్వకాలమున ఉండియుండును। వేదములు మనిషి అజ్ఞానదశను కాక జ్ఞాన పరాకాష్ఠను తెలుపుచున్నవి. అ తరు వాతవి ఉపనిషత్తులు. ఉపనిషత్తుల కాలమునాటికే వేదార్థము గహనము కాజొచ్చెను.

* * * *

అజ్ఞానమునుండి జ్ఞానమునకు అనేక సోపానములు, జ్ఞానములో అనేక అంతరములు. బాహ్య జగత్తుకు సంబంధించిన విషయములే తెలిసినకొద్ది తెలిసినకొద్ది తెలియవలసియున్నప్పుడు వేదమువంటి అతీంద్రియజ్ఞానము కర తలామలకము కాకపోవుటలో ఆశ్చర్యములేదు. వేదభాష అతిప్రాచీనమైన సంస్కృతమగుటయు, అదంతయు బహువిధ సంజ్ఞారూపమున ద్వంద్వార్థముతో నుండుటయు శబ్దపరమైన అర్థగ్రహణకు కూడ అంతరాయములుగనున్నవి.

* * * *

మహిమాన్వితమైన గాయత్రీ మంత్రము వేదములోనిదే. ఈ మంత్రము లోని సూర్యుడు ఆకాశములో కనబడు సూర్యుడు మాత్రమేకాదు. వేదములో ఆవాహనచేయు దేవతలు, 'హృదయం పరమేశితుః' అయిన అదితి ఒడిలోనికి మనిషిని చేర్చు ఆత్మ — బంధువులు ; ఉషస్సు, మరుత్తులు, అగ్ని, ఇంద్రుడు సూర్యుడు, సోముడు—వీరందరు అనావాతములో ఆర్త అను అగ్ని ...

మనిషిని మనః ప్రాణశరీరములను ముప్పేట చెఱలోనుండి విడిపించి ఉద్ధ
రించుటకు ఉద్యుక్తులై అనుక్షణము సంసిద్ధముగానున్న ఆత్మీయులు. గాయత్రీ
జపములో మనలను అదిమియుంచు కోశములను అతిక్రమించుటకు సంకల్పించు
కొనుచున్నాము. సృష్టి అంతటితోను, సృష్టికి పైనున్న సర్వముతోను, మనము
ఒకటియైనట్లు భావన చేయుచున్నాము. "ఊర్ధ్వమూలమును" తెలిసికోగోరు
చున్నాము. కొమ్మలలో చిక్కుకొని అధోముఖులము కాకుండ సూర్యముఖుల
మగుచున్నాము. జ్ఞాన భాస్కరుని మనబుద్ధిలోనికి ఆహ్వానించి [illegible] బుద్ధి
ఇంద్రియములకు లోబడికాక జ్ఞాన సూర్యుని కిరణ[illegible]చే విలసిల్లునట్లు
సంకల్పించుచు, అర్చించుచు మన ధ్యాస[illegible]యునిపైననే నిలుపుచున్నాము.
ఉషోదయముతోనే చిమ్మ[illegible]వాలినట్లు ఆ జ్ఞానసూర్యునిరశ్మిచే మనబుద్ధి
త ప్తమున[illegible]వృడు సూర్యభగవానుడు హిరణ్మయ పాత్రను తీసి
[illegible]న్యము కలిగినకాలది సిద్ధి. అపుడు "స్వేదమే" స్వంత యింటిలో ప్రవేశింతుము.

*    *    *    *

## అరవింద గాయత్రి

అసలు గాయత్రిని పురస్కరించుకొని అనేక గాయత్రీ మంత్రములు వచ్చినవి గాయత్రీ మంత్రములో గుప్తపాదమున్నది. ఉపాసనచే కల్గు చైతన్యమునకు మంత్రమును గురించి చదివినదేదియు సాటికాదు. మంత్రసిద్ధిగలవారిచే ఉపదేశము పొందినపుడు కలుగు ప్రబోదన వేఱు. శ్రీ అరవిందులచు శ్రుతమైన అనేక మంత్రములలో ఒకటి అరవిందగాయత్రి అను పేరున ఉపాసితమగుచున్నది.

తత్సవితు ర్వరం రూపం జ్యోతిః పరస్య,
ధీమహి యన్నః సత్యేన దీపయేత్.

ఋగ్వేదములో ఒకేఒక సూక్తము 8 ఋక్కులది దేవీసూక్తముగా ప్రసిద్ధమైనది. మంత్రద్రష్ట అంభృణి. అందఱు ఋషులలో ఈమె ఒకతెయే ఋషిక. అంభృణ ఋషికుమార్తె. ఈ ఋక్కులకు దేవత ఆదిశక్తి. తంత్ర శాస్త్రమంతయును ఈ ఒక్కసూక్తముపైన ప్రతిష్ఠితమై యున్నదని చెప్ప

వచ్చును. ఇవొక దివ్యానుభవచోదితమైన మంత్రము. [illegible] ఆదిశక్తితో తాదాత్మ్యము, అట్టి తాదాత్మ్యముచే [illegible] చైతన్యము చేనైన శక్తిపాలనము సిద్ధించును.

ఒక్కొక్క సూక్తములో ఒక్కొక్క అనుభూతి ప్రకటమై [illegible] అన్నిటిలోను అన్నిసంజ్ఞలు, ప్రతీకములు, ప్రకేతములు; ఒకే [illegible] సంజ్ఞల [illegible]ము. మనకు అనుదినము పరిచితమైన ఉషోదయము [illegible] వేఱుసంజ్ఞ గోచరించు[illegible] [illegible]ర్యోదయమునకు ముందు [illegible] కల్యాణ తమ రూపము మనలో[illegible] [illegible] కలుగు అనుభూతికి తార్కాణముగా అభయమిచ్చు[illegible] [illegible] వేకువజాము వర్ణనతప్ప వేఱేమియు ఉండదను ఊహకు [illegible] శబ్దార్థమునకే కట్టుబడినచో మనము కావ్యశక్తినిగూడ గ్రహింపలేము. [illegible] ఈసూక్తములో వట్టిఆవేశముతప్ప వేరేమియు లేదనుకొన్నచో [illegible] వాక్కుకు పరవశింపలేము.

పరా, అపరా ప్రకృతులను యిద్దరు తల్లులచే [illegible] రెక్కలు విప్పుకొని విరాట్ రూపముతో ఒకటై మనమెఱిగిన [illegible] సోఽహం పరాకాష్ఠనుండి సచ్చిదానందులముగా [illegible] సూక్తము మహత్తమ మంత్రరాజము. అంత్యాని [illegible] అమోఘము.

ఋగ్వేదము 10వ మండలము 125వ సూక్తము [illegible] సూక్తభావము తెలుపుటకు యీ తెనిగింపు కొంచెము ఉపకరించగలదు.

## దేవీసూక్తము

1. నా సంచారము రుద్రులతో, వసువులతో, ఆంతేకాదు: ఆదిత్యులతోను విశ్వదేవులతోను. మిత్రుని, వరుణుని, ఇంద్రుని, అగ్నిని అశ్వినులను నేను భరించుచున్నాను.
2. దేవతలకు ఆనందము చేకూర్చు సోమమును [illegible] [illegible] పూష, భగ దేవతలను భరించి నిలుపుచున్నాను యజమాని [illegible] హవిస్సును, యజ్ఞఫలముగా పొందు ద్రవిణమును నేనే [illegible]

మనిషిని మనః ప్రాణశరీరములను ముప్పేట చెఱలోనుండి విడిపించి ఉద్ధరించుటకు ఉద్యుక్తులై అనుక్షణము సంసిద్ధముగానున్న ఆత్మీయులు. గాయత్రీ జపములో మనలను ఆదిమియుంచు కోశములను అతిక్రమించుటకు సంకల్పించుకొనుచున్నాము. సృష్టి అంతటితోను, సృష్టికి పైనున్న సర్వముతోను, మనము ఒకటియైనట్లు భావన చేయుచున్నాము. "ఊర్ధ్వమూలమును" తెలిసికోగోరుచున్నాము. కొమ్మలలో చిక్కుకొని అధోముఖులము కాకుండ సూర్యముఖులమగుచున్నాము. జ్ఞాన భాస్కరుని మనబుద్ధిలోనికి ఆహ్వానించి [illegible] బుద్ధి ఇంద్రియములకు లోబడికాక జ్ఞాన సూర్యుని కిరణ[illegible]చే విలసిల్లునట్లు సంకల్పించుచు, అ[illegible]ంచుచు మన ధ్యా[illegible]ర్యునిపైననే నిలుపుచున్నాము. ఉషోదయముతోనే చిమ్మ[illegible]వారినట్లు ఆ జ్ఞానసూర్యునిరశ్మిచే మనబుద్ధి త[illegible]ప్పుడు సూర్యభగవానుడు హిరణ్మయ పాత్రను తీసి తత్త్వమును [illegible]నుకనున్న సత్యనారాయణుని దర్శింప జేయును. మంత్ర చైతన్యము కల్గినకొలది సద్ధి అపుడు "స్వేదమే" స్వంత యింటిలో ప్రవేశింతుము.

* * * *

## అరవింద గాయత్రి

ఆసలు గాయత్రిని పురస్కరించుకొని అనేక గాయత్రీ మంత్రములు వచ్చినవి గాయత్రీ మంత్రములో గుప్తపాదమున్నది. ఉపాసనచేకల్గు చైతన్యమును మంత్రమును గురించి చదివినదేదియు సాటికాదు. మంత్రసిద్ధిగలవారిచే ఉపదేశము పొందినపుడు కలుగు ప్రబోధన వేఱు. శ్రీ అరవిందులచే శ్రుతమైన అనేక మంత్రములలో ఒకటి అరవిందగాయత్రి అను పేరున ఉపాసితమగుచున్నది.

తత్సవితు ర్వరం రూపం జ్యోతిః పరస్య,
ధీమహి యన్నః సత్యేన దీపయేత్.

ఋగ్వేదములో ఒకేఒక సూక్తము 8 ఋక్కులది దేవీసూక్తముగా ప్రసిద్ధమైనది. మంత్రద్రష్ట అంభృణి. అందఱు ఋషులలో ఈమె ఒకతెయే ఋషిక. అంభృణ ఋషికుమార్తె. ఈ ఋక్కులకు దేవత ఆదిశక్తి. తంత్రశాస్త్రమంతయును ఈ ఒక్కసూక్తముపైన ప్రతిష్ఠితమై యున్నదని చెప్ప

వచ్చును. ఇదొక దివ్యానుభవచోదితమైన మంత్రము. దేనివలన సాధకునకు ఆదిశక్తితో తాదాత్మ్యము. అట్టి తాదాత్మ్యముచే కలిగిన చైతన్యము, ఆ చైతన్యముచేనైన శక్తిచాలనము సిద్ధించును.

ఒక్కొక్క సూక్తములో ఒక్కొక్క అనుభూతి ప్రకటమై ప్రసరించును అన్నిటిలోను అన్నిసంజ్ఞలు, ప్రతీకములు, ప్రకేతములు; ఒకే సంజ్ఞలో అన్ని సంజ్ఞల [illegible]ను. మనకు అనుదినము పరిచితమైన ఉషోదయములో సాధకునకు వేఱుసంజ్ఞ గోచరించు[illegible] [illegible]ర్యోదయమునకు ముందు వేకువ. జ్ఞానసూర్యుని కల్యాణతమ రూపము మనలోప[illegible]నకు సాక్షాత్కరించక మునుపు కలుగు అనుభూతికి తార్కాణముగా అభయమిచ్చు. వేకువజాము వర్ణనతప్ప వేఱేమియు ఉండదను ఊహకు అంతేవత వచ్చును. శబ్దార్థమునకే కట్టుబడినచో మనము కావ్యశక్తినిగూడ గ్రహింపలేము. అట్లే దేవీసూక్తములో పట్టిఆవేశముతప్ప వేరేమియు లేదనుకొన్నచో అంభృణి వాక్కుకు పరిపశింపలేము.

పరా, అపరా ప్రకృతులను యిద్దరు తల్లులచే కన్నబిడ్డలమగు మనము లెక్కలు ఒప్పుకొని విరాట్ రూపముతో ఒకటై మనమెఱిగిన 'నేను' నశించి సోఽహం పరాకాష్ఠనుండి సచ్చిదానందులముగా ప్రవర్తిల గల్గుటకు దేవీ సూక్తము మహత్తమ మంత్రరాజము. అంభృణి పేరు వాక్. ఆమె వాక్కు అమోఘము.

ఋగ్వేదము 10వ మండలము 125వ సూక్తము. దేవీసూక్తము సూక్తభావము తెలుపుటకు యీ తెనిగింపు కొంచెము ఉపకరించగలదు.

## దేవీసూక్తము

1. నా సంచారము రుద్రులతో, వసువులతో, అంతేకాదు: ఆదిత్యులతోను విశ్వదేవులతోను. మిత్రుని, వరుణుని, ఇంద్రుని, అగ్నిని, అశ్వినులను నేను భరించుచున్నాను.
2. దేవతలకు ఆనందము చేకూర్చు సోమమును చేపట్టియున్నాను. త్వష్ట, పూష, భగ దేవతలను భరించి నిలుపుచున్నాను యజమాని యజ్ఞార్థమిచ్చు హవిస్సును, యజ్ఞఫలముగా పొందుద్రవిణమును నేనే ఇచ్చుచున్నాను.

3. రాష్ట్రి (జ్ఞి) ని నేను. వసువుల నిచ్చుదానను నేను. చికితుషిని — (చైతన్యము కల్గించు చైతన్యను). దేవతలకుముందు నేను. బహుళత్వము నంది బహుళత్వము నావేశించిన పూర్వపుదానినని దేవతలు నన్ను ముందుంచుకొనుచున్నారు.

4. నా వలననే అన్నము, చూపు, ప్రాణము. వినుకలి. నన్ను తలచనివారు క్షయమగుదురు. విను, శ్రద్ధగావిను, శ్రద్ధయేమో చెప్పుచున్నాను. [illegible]

5. నేనే స్వయముగా తెలుపుచున్నాను—దేవతలను మ[illegible]ను పొందగోరునది (సత్యమును) తెలుపుచున్నాను. నా [illegible]ద ఉగ్రత్వము. బ్రహ్మత్వము ఋషిత్వము, శుద్ధ[illegible]నయత్తును.

6. [illegible] శరముతో మట్టుపెట్టుటకు రుద్రధనువును ఎక్కుపెట్టుదును. [illegible]లను నింగిని కమ్మి జనులకు సమరోత్సాహము కల్గింతును.

7. సృష్టి శిరస్సున నున్న తండ్రిని (స్వర్గమును) నేను ప్రసవించితిని అంతః సముద్ర సలిలములలో నా జన్మ. అందుండి సకల భువనములను వ్యాపించి యున్నాను. అదిగో ఆస్వర్గమును వెల్లివిరిసి ప్రవహించు నాజ్యోతిః కాయముతో — వర్ష్మణముతో — స్పృశించి అంతటను వ్యాపించు చున్నాను.

8. గాలివలె ప్రచండముగా వీతును. సకల భువనములను ఆరంభించుదాననై పీచెదను. భూతలమును దాటిపోయి; స్వర్గమును దూసికొనిపోయి నావిస్తారము వలన నేనింత దాననైతిని.

## శ్రీ అరవిందుల శక్తి మంత్రము

వేదమువలన ఋతము తెలియును - ఋతము అనగా ఉనికియొక్క తీరు తెన్నులను తీర్చి దిద్దు దివ్యఛందము, రీతి, దివ్యచిత్తి. వేదమువలన సత్యము తెలియును. — సత్యము అనగా ఉనికియొక్క యాథాతథ్యము, కల చూపు. వేదము వలన అనంతము తెలియును. అంతవంతమైన ఉనికి, ఊహకు అందని అనంతము తెలియును. సత్యం ఋతం బ్రహ్మ! సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ. వేదమిచ్చు అనుభూతితో అర్భకుడగు మనిషి బ్రహ్మత్వమును పొందును. అగ్నిని పురోహితుడుగా ఆహ్వానించును. అగ్నిదేవుడు ఇంద్రుని,

సూర్యుని, సోముని, దేవతలందరను ఉపాసకునిలో అవతరింపజేసి అదితి ఒడిలోనికి చేర్చును. అదితి బిడ్డలము మనము మనః ప్రాణశరీరములలోపడి నిజముతెలియక ఉన్నాము; అదితిని తల్లిగా పరమేశుని హృదయముగా తెలిసి కొని ఈ యిరుకులోనుండి ఆనంత్యములోనికి ఎగిరి, మర్త్యలోకములో అమృతపుత్రులముగా అనుభూతినంది సంచరించెదము. మన ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులను ఊర్ధ్వమూలమున ప్రతిష్ఠించి, సచ్చిదానందము నవతరింపజేసి తరింపజేయు (పీయూషధారులగు వేదముల అర్థతాత్పర్యానుభవసిద్ధులు) శ్రీఅరవిందుల వలన పునరుద్ధరింపబడినవి. గాయత్రికి తోడు అదితి నుపాసించి పురుషోత్తముని జేరుటకు శ్రీఅరవిందు లోక శక్తి మంత్రము చెప్పిరి: ఆనందమయి, చైతన్యమయి, సత్యమయి పరమే ఓం.

వేదమంత్రార్థము నుద్ధరించి మంత్రదానముచేసిన శ్రీఅరవిందుల సిద్ధిని అనుసరించి విద్యయే అయిన అదితిని అమ్మను అర్చించి పరమమైన సంసిద్ధిని ఆర్జింతుముగాక.

———

# శ్రీ అరవిందులు

—— కలిదిండి నారాయణరాజు

ఆర్య ఋషులయొక్క పుట్టిల్లు మన భారతదేశము. ఆర్యఋషుల జీవితా శయములను, జీవనఔన్నత్య గౌరవములను, ముందుకు తేవలసిన బాధ్యత భారతీయుల ధర్మమై యున్నది.

భారతీయుల సంప్రదాయములలో ముక్త జీవనము అత్యున్నత దశగా, ఎంచబడియుండెను. సాధారణ మానవుడు, సత్వ రజ స్తమోగుణములతో కూడుకొని ఉండుటవల్ల అతని ఆదర్శములు దేశ, కాల, వస్తు పరిస్థితులబట్టి వివిధమార్గములుగా వుంటూవచ్చాయి. సామాన్య మానవుడు పుట్టినది లగాయతు మరణించేవరకూ, జీవించుటకొరకు, నివసించుటకు గృహము, కట్టుకొనుటకు గుడ్డ. శరీర పోషణకు అవసరమగు సామగ్రి, సేకరించుకొనుచూ, తదుపరి ఇతర అనేక కోరికలతో ప్రాకులాడుతూ, కాలముగడుపుచున్నాడు. ఈ కోరి కలను తీర్చుకొనుటకు ధనము అత్యవసరము. ద్రవ్యసేకరణలేనిదే జీవన యాత్ర గడుపుకొనుట దుర్లభము.

మానవకోటియందేమి, పశుపక్ష్యాదులయందేమి. ఈ ప్రాకృత జీవనోపా ధికి రేయింబవళ్లు తాపత్రయాలతో కాలము గడచిపోవుచున్నది.

దారేషణ, ధనేషణ. పుత్రేషణ అనునవి. మనుష్యులకును, పశు, పక్షి. మృగాదులకును. సమానమే. వాటివలెనే మనుష్యులుకూడా దివారాత్రములు, ఈషణత్రయాములయందు మగ్నులై కాలము గడుపుకొనుచున్నారు.

మనుష్యులకు, పశు, పక్షి, జంతువులకంటె అధికమైన తెలివెకాకుండా, జ్ఞానమునుకూడా పొందు అవకాశము దైవముచే ప్రసాదింపబడినది. ఆ జ్ఞాన సంపదవల్ల బ్రహ్మజ్ఞానమునుపొందు మహాద్భాగ్యము కూడా సంప్రాప్తమగు చున్నది.

జీవునికి బుద్ధి వికాసము కలుగుకొలది, ఉన్నత చైతన్యము కలుగుచూ వచ్చింది. ఆర్య ఋషులు సూచించిన ఆర్యధర్మములోగల ఆదర్శముల నమస

రించి, ప్రాజ్ఞులు కేవలము కామార్థములే ప్రధానముకాదని గ్రహించి నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక మార్గములకు దృష్టిమరల్చి మనః, ప్రాణ. శరీరముల పూర్ణ వికాసమునకు, లోక కల్యాణమునకు, ముక్తజీవనమునకు దారితీయు యోగసాధన ప్రారంభించియన్నారు.

ఆర్యధర్మమనగా। పరబ్రహ్మయొక్క సృష్టియె జగత్తనియు మానవుడు మనః, ప్రాణ, శరీరములనుపయోగించునట్టి ప్రకృతికి దాసుడుకాని ఆత్మ యనియు, భగవానుని సమగ్రముగా కనుగొని, సర్వగతుడగు అతనితో నిత్యైక్యత పొందుటయే, జీవితముయొక్క పరమధర్మమనియు. కామార్థ ధర్మ మార్గముల నవలంబించి, తుదిమెట్టయిన మోక్షమునుపొంది తద్వారా, ముక్త జీవనము సల్పవలెనని ఆర్యసిద్ధాంతమై యున్నది.

ముక్త జీవనమన్న జగత్తును విడిచి, మరే లోకములోనో వర్తించుట కాదు. జగత్తంతయు భగవన్మయమనియు, తాను భగవానునికి భిన్నుడు కాడను ఉపలబ్ధి పొందిన ముక్తజీవి ప్రపంచమును వీడిపోడు. అందుండియే పృథ్విని దివ్యముగా మార్చనుపక్రమించును. అతడు సంఘములోనుండి, సంఘముయొక్క బాహ్యనియమావళిని పాటించుచున్ననూ. అతనిని నడపునది, అంతఃస్థిత ఆత్మయే. అతడు తలచినది, చేయునది, చెప్పునది, అంతరాత్మ నుండియే. స్వలాభమనునది ఏమియు లేక లోకకల్యాణము కొరకే అతడు కర్మ చేస్తూవుండును అటువంటి ముక్తజీవులలో అగ్రగణ్యులు శ్రీ అరవిందులు.

శ్రీ అరవిందులు తమ యోగసాధనకు పూర్ణయోగమని పేరిడి మన కందజేసిన మహత్తర సందేశమేమన ?

యోగ సాధనలో మనము ఒక మహత్తరమైనదివ్యచేతనము అందుకొని వెలుగు ఆనందమును చేరుకొని, తన అత్మను గుర్తెరిగి, ఆ అతిమానసశక్తిని మనస్సుయొక్క, జీవనముయొక్క, శరీరముయొక్క పరివర్తనకు క్రిందకు తేవడము, పూర్ణయోగముయొక్క లక్ష్యమని, వక్కాణించియున్నారు.

మానవునిలో అత్మ నిగూఢంగా వున్నది దానిని గ్రహించి. అనంతమైన ఆత్మ వికాసానికి మార్గము ఏర్పరచాలి. బాహ్యప్రవృత్తికంటె భిన్నమైన

అంతః ప్రవృత్తిద్వారా జీవితం పునీతం చేసుకోవాలి. సత్యాన్వేషణ సాగించాలి. క్రక్రమముగా, అంతఃప్రవృత్తి ఊర్ధ్వాభిముఖమై పయనిస్తుంది. మానవాతీత మైన సత్యచైతన్యం క్రిందకుదిగి ఆత్మను ఆవహిస్తుంది.

ఆత్మారోహణా, విశ్వాత్మ అవరోహణా రెండూ జరుగుతాయి. ఇది అనేక దశలలో జరుగుతుంది. ఇందులకు సాధన నిగ్రహం అత్యవసరము అనిన్నీ మానసిక, అధ్యాత్మిక శక్తులను ఈ భౌతిక జీవనంలో వికసింప జేయుటయే, పూర్ణ యోగసాధవ లక్ష్యమని శ్రీ అరవిందులవారి దివ్య సందేశము.

శ్రీ మాతారవిందులు మనలను సర్వదా రక్షించుగాక.

---

# మహాయోగి

— రాయప్రోలు సుబ్బారావు

శ్రీ అరవిందుడు ఒక అవతారము. సృష్టియందుఉన్న జీవకోటిలో మానవుడై పుట్టుట, పురుషుడగుట, పిదప వైదోక్తములయిన విధినిషేధము లెఱిగిన నైష్ఠికుడగుట-ఈమూడును ఒకదానికంటె ఒకటి ఉత్తమోత్తమములు. నూఱుకోట్ల జన్మములలోచేసిన పుణ్యపరిపాకముచేత తప్ప ఇవి సంభవింప వంటారు. ఇంకా మేధావీ, విద్వాంసుడూ ఉహాపోహవిచక్షణుడూ అయితే కాని బ్రహ్మతత్త్వ విచారమునకు లక్షణములని చెప్పెను. మఱిన్నీ, మోక్షమే పరమావధిగా నిర్ణయించెను. ఆమోక్షసిద్ధి సన్యాసికిగాని లభించదని స్పష్టముగా నిశ్చయించెను.

శ్రీ అరవిందునియందు పైలక్షణములన్నీఉన్నవి. మొలకరించిన మహాక్షణమున కొమ్మలూ ఆకులూ, పూలూ, పండ్లూ, పూర్ణముగా రాశీభవించినట్లు, శ్రీ అరవిందునియందు ప్రకాశించినవి. మనకాలములో ప్రత్యక్షముగాచూచిన సత్యమిది. ఇంతేకాదు శ్రీ అరవిందునియందు అపూర్వమయిన మఱియొక విశేషము, స్ఫోటమయినది. దానిచే ఆయన సనాతన దార్శనికులకన్న విలక్షణుడయినాడు.

మనకాలముపఱకూ, మోక్షమే మానవునికి పరమప్రాప్యమనే సిద్ధాంతము బ్రహ్మవిద్యలోనిలిచింది. వ్యాసవశిష్ఠాదులూ, పాణినీపతంజలులు జనకాది ఉపనిషద్వాదులూ, శంకరరామానుజులూ, రామకృష్ణ రమణ పరమహంసలూ, యింకా ఎందరో మహానుభావులు మోక్షసిద్ధిపొందియుందురని నమ్మెదను.

బ్రహ్మవాదులు లోకము మిథ్యఅనీ, జన్మముబంధమనీ, సంసారము దుఃఖహేతువనీ విశ్వసింతురు. వీటినుంచివిడబడడమే మోక్షము. అంతేకాదు, మోక్షసిద్ధిపొందినవారు నిత్యసుఖములనుపొందుదురని ఫలితముచెప్పిరి.

అయితే, ఈమోక్షసిద్ధాంతమును బాగాపరిశీలిస్తే సంపూర్ణమని ప్రత్యయంకుదురదు. మోక్షమంటే 'యత్ నిర్గుణం నిష్క్రియంతత్' అని నిర్దేశిం

చారు. అంటే, మోక్షసిద్ధి అయిన పరమవ్యవస్థలో 'కర్మలుండవు, చేతనములో గుణధర్మములుండవు. కాగా, చేయదగిన కర్మలేక, అనుభవించుటకు కావలసిన గుణధర్మములులేని వ్యవస్థలో ఇక సుఖమేమిటి? సుఖంకూడా గుణమేకదా!

మోక్షదీక్షితుడైనవాడు విరక్తుడై తనకుతాను సాధనచేస్తాడు. ఇతరుల ప్రసక్తి ఏమీ అతనికి అవసరంలేదు. ఎవరికివారే యమునాతీరే ! అగుతుంది. అరిషడ్వర్గమును జయించి మోక్షసామ్రాజ్యమును అధిష్ఠించినవాడు, ఆబలముతో ఆమహత్వముతో ఇతరులను తరింపచేయుట ఉదాత్తమయిన మార్గము బంధములు త్రెంచుకొనిబయటపడ్డ పురుషుడు, బందెలోనున్నవారిని తప్పించవలెను. ఇది ధర్మము, కాకపోతే. మోక్షదీక్షితులసిద్ధి కేవలం స్వార్థంగా పరిణమిస్తుంది ! 'చిన్న నాపొట్టకు శ్రీరామరక్ష' అనే జననిందకు దృష్టాంతమవుతుంది. 'సర్వం ఖలు ఇదంబ్రహ్మ' అవే ధర్మసూత్రంతెగుపోతుంది. ఈ శంక ప్రాచీనకాలమందేఉన్నదని ఊహింతును.

మొట్టమొదట ఈ శంక గౌతమబుద్ధునకు తగిలింది. ఆయన ఇతరుల మరణపీడనంచూచి. విరక్తుడైనాడు. అప్పటికి గౌతమునకు ఏ విధమయిన దుఃఖమునులేదు. 'లోకములో దుఃఖములేకుండ చేయవలెను' అనే దుఃఖమొకటే ఆయనను ఆవహించింది. అందువల్లనే బౌద్ధులు 'బుద్ధంశరణం గచ్ఛామి'అని వెంటనే 'సంఘం శరణం గచ్ఛామి'అని,అభివాదనంచేస్తారు. కాగా సర్వసమత్వన్యాయం బ్రహ్మవాదులలో ప్రవేశించిదని భావము దానిసిద్ధి యోగులకుసాధ్యమని గీతలుపదేశించినవి. తరువాత, రామకృష్ణపరమహంసలో ఈ పరమధర్మజ్ఞానముసాక్షాత్కారమయింది. ఆయన వివేకానందును మోక్షసాధనముఉపదేశించుటకునిరాకరించెను. మేధావి, నిష్ఠాబలిష్ఠుడు, అంతరంగికుడు అయిన శిష్యునకు,అన్నివిధములా మోక్షమునకు అధికారియైన వివేకానందునకు చరమపరమోపదేశమును నిరాకరించుటకు ఇదేకారణమని, నేను భావించుచున్నాను. కాగాఎవరికివారు మోక్షము సాధించుకొనుటకన్న, లోకమోక్షమునకు శ్రమించడంమహోత్తమ ధర్మమనే నిశ్చితం ప్రకటితమయింది.

మేధావీ సాధనానిష్ఠుడూఅయిన అరవిందునకు ఈ వైషమ్యము గోచరించింది. సర్వసమత్వము సిద్ధిస్తేకాని సర్వజన సంతాపమును చల్లార్చడం

సాధ్యముకాదని గుర్తించాడు. అందుకు, పూర్వమున్న సాధనలుకూడా చాలవని తెలుసుకొన్నాడు. క్రొత్తమార్గమును అన్వేషింప నమకట్టెను.

భగవద్గీతలలో

సర్వభూతస్థమాత్మానం,
సర్వ భూతాని చాత్మనః
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః

అనే బోధఉన్నది. యోగయుక్తమైతేకాని ఆత్మసర్వమును సమానము మరణ మారణకర్మతో రణగుణధ్వనిలో భగవద్గీతలుపాడినవాడు శ్రీకృష్ణుడు. ఆయన యోగీశ్వరుడని—యత్రయోగీశ్వరఃకృష్ణః—ఆస్తికులు స్మరిస్తారు. అందలి పదు నెనిమిది అధ్యాయములకు యోగసంకేతము కనబడుతున్నది. అందువల్లనే శ్రీ అరవిందుడు యోగమార్గమును అవలంబించెను.

యోగమంటే కలయిక· ఈ కలయిక పార్వతీపరమేశ్వరులలో, లక్ష్మీనారా యణులలో, వాణివిధాతలలోనే ఉన్నది. ఈ యోగస్వభావమెలాంటిదంటే, వాగ ర్థములకలయికవంటిదని వర్ణించినాడు మహాకవికాళిదాసు. శబ్దము ఒక్కటే. కాని, వాక్కు అర్థముఅను రెంటికలయిక, తెలివితో మననంచేస్తే ఈ వాగర్థ యోగమహత్వం గోచరిస్తుంది.

చిత్తనిరోధము యోగమని సూత్రకారుడు. యోగకర్మ సుకౌశలం అని భగవద్గీత ఈ రెండునూ పరస్పర విరుద్ధములుగా ఉన్నట్లు తోచును. ఎందు కంటే చిత్తనిరోధము అంతరింద్రియ వ్యాపారము. కర్మ అంటే కాయికమయిన లౌకికకార్యము. కాని, విచారిస్తే రెంటికినీ యోగసాధములోగల సంబంధము తేటతెల్లమవుతుంది. ఇక్కడ చిత్తమంటే మనోబుద్ధ్యహంకారముల పరిణ తావస్థఅని భావము. నిరోధించడమంటే అడ్డగించడం—నిలువరించి, కూడగట్టి, రాశీభూతముచేయడం. ప్రతినిరోధమని భావింపకూడదు. ఏ పదార్థమునయినా రాశిచేస్తే బలిష్టమవుతుంది. దానిని కౌశలంతో వినియోగించడం కార్యం. ఈ రెంటినీ ఇలా భావించితే ఫలితార్థం విశదమవుతుంది.

కృష్ణానదిలో ప్రవహించిపోతున్న జలమును నిరోధించి, ఆగబట్టి నాగార్జునసాగరము చేసితిమి. ఈ మహాసాగరములోనున్న జలమును ఆనకట్ట మీదుగా క్రిందికి దించి యంత్రములలోనికి మళిపితే, ఆ సామగ్రి స్పందిస్తుంది. ఘూర్ణిల్లి ప్రచండ మవుతుంది. ఆ భ్రమణవేగములో విద్యుచ్ఛక్తి ఉత్పన్న మవుతుంది. ఆ శక్తిని తంతులలోనడిపితే, దూరదూరాంతములు ప్రసరించి దీపావళి పండుగచేస్తున్నది. అలాగే, చిత్తమును నిరోధించి, దాని తేజో_జవసత్త్వములను ఏకముగా రాశీకరించి, ఆ మహాప్రవాహశక్తిని, భూలోకమున మానవఘటములలో ప్రసరింపచేసినచో, మానుషము సుమానుషమవుతుంది. నరుడు పురుషోత్తముడుకాగలడు. ఇది శ్రీ అరవిందుల పరిపూర్ణయోగ ప్రస్థానము. దీనిమూలసారమును వేమనయోగివలె జనబాషలో చెప్పగల అభినవ కవి కోసము ఎదురుచూస్తూ విరమించుచున్నాను.

———

# శ్రీ అరవింద సాన్నిధ్య మధురస్మృతులు

— టి. కోదండరామరావు

శ్రీ అరవిందాశ్రమంలో స్వర్గీయ శ్రీఅమృతగారిని తెలియనివారుండరు. వారు గతించుటకు మునుపు శ్రీ అరవిందుల సాన్నిధ్యములో గడచిన కాల విశేషములను గురించి నన్నువ్రాయమనగా ఆతని కోరికపై ఒక చిన్న పుస్తకమును 'గురుసాన్నిధ్యము' (At the feet of the Master) అన్న పుస్తకమును రచించి ప్రచురించితిని. అందులోలేని కొన్నివిషయములను గురించి ప్రస్తుతము వ్రాయనియ్యకొంటిని.

నేను మద్రాసులోని రాజధాని కళాశాలలో చదువుచున్నప్పుడే అనగా 1920వ సంవత్సరము, డిశంబరు మాసమున శ్రీఅరవిందుల ప్రథమ సందర్శన భాగ్యము నాకబ్బినది. తరువాత పట్టభద్రుడనైన పిమ్మట ఒకసారి వారిని దర్శించి కొన్నిదినములు వారితోనుండి తుదకు 1921వ సంవత్సరం జూలై మాసము నుండి మూడుసంవత్సరములవరకు గురు సాన్నిధ్యమున గడిపితిని. 1921 సంవత్సరములో శ్రీఅరవిందసాన్నిధ్యమున పదుగురు మాత్రమే యుండిరి. వారిలో ఆంధ్రుడను నేనొక్కడనే! ఆనాటి వారలలో నేటికి కూడ ఆశ్రమవాసిగా నుండునది. శ్రీనళినీకాంతగుప్తగారు! తరువాత వచ్చిన వారలలో అప్పటినుండి ఇప్పటివరకు ఆశ్రమవాసులుగానుండు సాధకులు శ్రీచంపకలాల్, శ్రీపూజాలాల్, శ్రీకన్నయ్‌లాల్ గంగూలి. 1924వ సంవత్సరమున కొంతమంది సాధకులు ఆశ్రమవాసులై నేటికిని ఆశ్రమవాసులుగా యుంటు ధన్యచరితులగు చున్నారు.

శ్రీఅరవిందులు నిరంతర ధ్యాననిష్టలో నిమగ్నులై, అంతర్ముఖులగుట వలన వారి సాధనా సంపత్తిని గూర్చిగాని, వారుండు మహోన్నత స్థితిని గూర్చిగాని యెవరికిని వ్రాయుట సాధ్యము కానేరదు. కాని, బాహ్యవిషయములు సంఘటనలు వారి దినచర్యను గురించి మాత్రము కొంత వ్రాయుటకు వీలగును. శ్రీవారి శక్తి సామర్థ్యము లనంతము, అమోఘములు కాన వాటిని తెలిసికొనుటకుగాని, నిర్ణయించుటకుగాని వీలుపడదు.

శ్రీవారు నిరాడంబరులు ఆయన ప్రపంచ సుఖముల కతీతుడు. ఆయన యేకాంతవాస ప్రియుడు యేక వస్త్రధారులై, వారి హిరణ్మయ శరీరమున విరియబోసిన శిరోజము లలరారు చుండ మౌనాలంకృతులై దేదీప్యమానముగ ప్రకాశించు చుండిరి. వారిని సందర్శించినప్పుడు నాకు మహేశ్వరుడు జ్ఞాపకము వచ్చుచుండెను. శ్రీవారి సాన్నిధ్యమానందదాయకము. తేజోవంతమైన నయనములతో, సింహానడకగల్గి తమచుట్టు కాంతిని వెదజల్లు చుండువారు. శ్రీఅరవిందుల కాహారవిషయమై యేకాతరతలేదు. ఆయన రుచుల కతీతుడు. యేమి వడ్డించినను తినుచుండిరి. వారు భుజించున దతి స్వల్పము. అనతి కాలములో వడ్డించిన దానిని సమత్వముతో భుజించి సంతోషపడెడి వారు. భోజనము విషయములో యేదిభుజించినను దాని రసమును మాత్రమే సేవించవలెననియు, తాము మిక్కుటముగా ప్రాణశక్తిని తమలోనికి తీసికొని దానిద్వారా శరీరమును పోషించుచుండిరనియు, ఆహారముపై ఆధారపడుట లేదని చెప్పెడివారు. బ్రహ్మచర్యనిరతులై, అహర్నిశముల చదువుటయందు వ్రాయుటయందును సాధనలో విమగ్నులైయుండెడివారు.

శ్రీఅరవిందులు కోపగించుకొనునది నేను చూడలేదు. ఈ విషయమును గురించిన ఒక సంఘటన వివరించెదను.—

ఒకసారి నేను శ్రీవారి అనుమతి పొందకను. వారికి చెప్పకనుసత్తదిన నిరాహారదీక్షను బూనితిని. కడపటి దినములో కొంత బడలిక కలిగి నేను మామూలుగా స్నానముచేయు కాలమున గాక, మధ్యాహ్న 12 ఘంటల ప్రాంతమున స్నానపుగదిలోనికి పోయితిని. అట్టితరి మేమెల్లరము ప్రస్తుతపు అతిథి గృహములో **(Guest House)** కాపురము చేయుచుంటిమి. నేను స్నానపుగది ప్రక్కగదిలోనే యుంటిని. శ్రీ అరవిందులు ప్రతిదినము మధ్యాహ్నము 12 ఘంటలకు అనగా భోజనము చేయుటకు ముందు స్నానమాచరించుచుండిరి, వారు 5 నిముషములలో స్నానము ముగించుచుండిరి వారు స్నానముచేయు కాలములో నేను స్నానపుగదిలో స్నానముచేయ బొడగితిని. వారు మేడ పైనుండి దిగివచ్చి క్రిందివసారాలో పచారుచేయు చుండిరి. విజయకుమార్ నాగ్ అను శిష్యుడది గమనించి స్నానపుగదిలో యెవరో యున్నారని తెలిసికొనితలుపుతట్టెను. నేనింకను స్నానమాచరించుచుంటిని కాననేను వెంటనే

తలుపు తెరవలేదు. మరల బిగ్గరగా తట్టగా, నేను స్నానమాచరించుచున్నానని బదులు చెప్పితిని అతడు కోపముతో మరలమరల తట్టుచు శ్రీఅరవిందులు స్నానమునకై వెలుపల వేచియున్నారనియు వెంటనే స్నానము ముగించుకొని రావలసినదిగా చెప్పగా నే నతిశీఘ్రముగా స్నానమాచరించి వెలుపలికివచ్చి మాస్నేహితుని మందలింపులకు గురయితిని, శ్రీవారు నాపై ఆగ్రహమూనెదరేమో అని మిగుల భయము జెందితిని, కాని ఆమహనీయుడు మందస్మిత వదనుడై దయార్ద్ర భావముతో 'అంతా కుశలమే కదా!' అని అనుచు నన్ననుగ్రహించి స్నానపుగది లోనికి వెడలిపోయిరి. సహనములో శ్రీవారికి వారే సాటి.

శ్రీఅరవిందు లేలాటి సుగంధ ద్రవ్యములను కాని కేవలము పరిమళ భరితమైన తైలమునుకూడ వాడెడివారు కారు. కాని, వారి శిరోజములు నిగనిగ లాడుచుండెడివి. ఆధ్యాత్మికముగా పరివర్తనమగుకాలది కొన్నిభౌతక పరివర్త నములాయన యందు గానవచ్చు చుండెడివి. వారి సాన్నిధ్యమున నుండునపుడు తామరపుష్పపు సువాసన వచ్చుచుండెడిది. అచ్చట ఒక తామరపుష్పముకూడ యుండకపోయి. ఆపుష్పసౌరభమా ప్రదేశమెల్ల వ్యాపించుట నాకత్యంతాశ్చర్యము కలిగించెడిది. ఈ దివ్యపరిమళమును గురించి నామిత్రులకు నివేదించితిని; కాని వారునమ్మరైరి. కాని అది నాఅనుభవైక వేద్యము గనుక వారిని నమ్మింపనేను మరల ప్రయత్నించలేదు. గురుకటాక్ష వీక్షణమువలన కొంతకాలములో సర్వము వారికే విదితమగునని భావించితిని. యోగశక్తి నార్జించువారికపూర్వానుభవములు కలుగునని 'రాజయోగము' అనుగ్రంథమును చదివి తెలిసుకొంటిని.

శ్రీఅరవిందులేకాంత వాసప్రియుడేకాదు హాస్యప్రియుడుకూడ—— శ్రీఅర విందులు సాయంకాల సమయమున 4—30 ఘంటల ప్రాంతమున మాతో నవ్వుచు, అప్పుడప్పుడు హాస్యముచేయుచు సంభాషించెడివారు. మేమడిగిన వివిధప్రశ్నలకు సరియైన సమాధానము లొసగి మమ్మానందింప జేసెడివారు. ఆయననంత గురుభావముతో కొందరు చూడకపోయినను, దానిని గురించి ఆయన యేలాటి ఆక్షేపణ చేయక అందరితోను మక్కువతో మెలిగెడివారు. సాయంకాల కార్యక్రమము ముగిసిన తరువాత అరఘంటసేపు ధ్యానము చేసెడి వారము. తల్లిగారు కోకో పానీయము నందరికి కొసగుచుండిరి.

గురుసాన్నిధ్యమున నేనొక సంవత్సరకాలము గడపిన పిమ్మట నా సహపాఠియు కాకినాడ వాస్తవ్యులైన పి.వి. కృష్ణారావుగారు గురుసాన్నిధ్యమున జేరిరి. కొంతకాలమున కాయన తల్లిగారువచ్చి ఆయనను పిలుచుకొని పోయిరి, స్వాతంత్రియమునకై పోరాటము శ్రీగాంధీమహాత్మ నాధిపత్యమున తీవ్రముగా కొనసాగుచుండెను. ఆంధ్రదేశభక్తులు, తమిళ దేశభక్తులు పలువురు స్వాతంత్ర సమరమునకై పోరాడిన ఫలితముగా వారికి శిక్ష విధింపబడెను. శిక్ష ననుభవించుటకై పుదుచ్చేరి వద్దనున్న కడలూరు కారాగారమునకు తేబడిరి. తరువాత వారు విడుదలై శ్రీఅరవింద దర్శనార్థమేతెంచు చుండిరి. కాని, శ్రీఅరవిందులు ముఖ్యనాయకులకు మాత్రము దర్శన మిచ్చుచుండిరి. వీరుగాక, తదితరులు కూడ వారిదర్శనార్థము వచ్చినను శ్రీవారు సాధారణముగ దర్శన మొసగెడివారు కారు. ఇందుపై కొంత విమర్శన జరిగెను. ఈ విషయముగూర్చి సాధకులు ప్రశ్నించగా తమశక్తిని గ్రహించి సద్వినియోగపరచువారికి మాత్రము దర్శనమొసగినచో లాభదాయకమనియు లేనిచో వారిదర్శన ఫలితము నిరర్థక మగునని వ్రాకుచ్చిరి. ఈసమయముననే గాంధీమహాత్ముని పుత్రుడు దేవదాసు గాంధీగారు విచ్చేసి తమతండ్రిగారు శ్రీవారిని దేశనాయకత్వము వహింపమని తెలుపమన్నారని శ్రీఅరవిందులకు నివేదించగా వారు తమకార్యము ఆధ్యాత్మిక రంగములో నున్నదనియు గాంధీగారి నాయకత్వమున స్వరాజ్యము సిద్ధించు ననియు వారినాశీర్వదించి పంపిరి.

నేను దాదాపు ఒకటిన్నర సంవత్సరమాశ్రమ వాసము చేసిన తరువాత నా సతీమణికూడ పుదుచ్చేరి కేతెంచెను. ఆకాలమున స్త్రీలకాశ్రమములో ప్రవేశములేదు. ఐనను నా పరిస్థితులనుబట్టి నా సతీమణి నాతోయుండుటకును సాధనజేయుటకు శ్రీఅరవిందులనుమతించిరి. కాని, ఆరుమాసముల వరకు ఆమెకు శ్రీవారు దర్శనమొసగలేదు. తరువాత ఆమెకు ప్రతి శుక్రవారము శ్రీవారు దర్శనమొసగు చుండిరి. ఆయన సాన్నిధ్యములో పదునొకండు ఘంటల సమయమున నేను నాభార్య కూర్చొని ఒకఅరఘంటసేపు ధ్యానముజేయు చుంటిమి. ధ్యానానంతరము ప్రణమిల్లుచుంటిమి. సాధనజేయుచు వారి అనుగ్రహముచే ఆమె కొన్ని అపూర్వానుభవములను పొందుచుండెను; తల్లిగారిలో మహేశ్వరి, మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతి శక్తులావిర్భవించుటను ఆమె ధ్యానములో దర్శించెను. ఈ విషయమితరులకు చెప్పినను వారు విశ్వ

సించరైరి. తల్లిగారిని సామాన్య సాధకిగా యెంచుచుండిరి. తల్లిగారు అంతర్ముఖియై. మితభాషితయై నివురుగప్పిన నిప్పువోలె ఆంతరంగిక సాధన జేయుచు ఆధ్యాత్మికశక్తి నార్జించుచుండిరి. అందువలన ఆమెలో కలుగు మార్పులు సాధకులకు తెలియకుండెను.

శ్రీవారి ఆర్థికపరిస్థితి బహు కష్టతరముగనుండెను. అట్లుండినను ఇత రుల నడుగక దైవముపై ఆధారపడుచు కాలము గడుపుచుండిరి. అపరాధ పరి శోధనాశాఖవారు శ్రీవారి యింటి పరిసరముల వేచియుండి శ్రీవారివద్ద కేతెంచు వారిని ప్రశ్నించుచు వారిని పోలీసుఠాణాకు పిలుచుకొనిపోయి వారితో వివరము లన్నియు పుస్తకమున వ్రాయించి మిగుల బాధపెట్టుచుండిరి. శాసనసభ్యులైన ప్రఖ్యాతిగాంచిన వెంకటరమణయ్యం గారొక పర్యాయము శ్రీవారి దర్శనమునకై రాగా అపరాధపరిశోధనాశాఖవారు వారి వ్రేలి ముద్రలనుతీసికొని వారి నవమాన పరచగా వారీ విషయమై మద్రాసు శాసనసభ వారికి తెలిపి విమర్శించిరి. అందు వలన ఫలితమేమియు లేకపోయెను. ఆ అపరాధ పరిశోధనా శాఖవారు నన్ను సహితము విడువలేదు. నేను తరచుగా ఉదయము – సాయంకాలము సము ద్రము గట్టున షికారు చేయుచు యోగసాధన మొనర్చుచుంటిని. ఆ సమయమున ఒక అపరాధపరిశోధనా శాఖకు చెందిన ఆంధ్రుడు (C. I. D Inspector) నన్ను సమీపించి ఆశ్రమ విషయములను గూర్చి తెలుసుకొనప్రయత్నించెను. ఆయన అపరాధ పరిశోధకుడని నాకు తెలియక మమ్ము గురించి ఆయన కెఱింగించితిని. రాజకీయ విప్లవోద్యమ విషయములు – ఆయన వద్దకు వచ్చి విప్లవకారుల విషయములను గురించి తెలుసుకొన ప్రయత్నించగా ప్రస్తుతము యోగసాధన తప్ప శ్రీ అరవిందులకు రాజకీయ ప్రసక్తియే లేదని నుడివితిని. ప్రప్రథమమున అతడు విశ్వసించక పోయినను, తరువాత నా మాటలయందు మిగుల విశ్వాస మేర్పడి నాకు మిత్రుడాయెను. తమ శాఖవారు కొందరు తప్పుడు రిపోర్ట్సు (False reports) పంపించు చుండిరనియు దానిని తా నరి కట్టుటకు యత్నించుచున్నానని బదులుచెప్పెను. కాని, పోలీసుకాపలా మాత్రము చాలాకాలమున్నందున శ్రీ అరవిందులను దర్శించుటకై ప్రభుత్వ ఉద్యోగస్తు లొచ్చుటకు భయపడుచుండిరి. ద్రవ్యలేమివలన మాకు వలయు సదుపాయముల నాయన సమకూర్చలేకపోయెను. ఆయన దేశభక్తుడని అనేకులాయనతో రాజకీయ విషయములనుగూర్చి చర్చించుటకై వచ్చుచుండిరి కాని, ఆయన మహాయోగి

యని తెలుసుకొన్న వారరుదు. యోగపిపాసకు నచ్చట నుండవలయునని ఆపేక్షించినను శ్రీవారు అంతరంగిక దృష్టితో వారర్హులుకాదా అని తెలిసికొని తమ సాధనామార్గము చాల కష్టతరమనియు వారికిచెప్పి, అనర్హుల నితర మార్గముల నెంచుకొనమని సలహా యొసగి పంపుచుండిరి. తాము కనుగొన్న పూర్ణయోగ మార్గమునకు మనో, ప్రాణ, శరీరములు, దృఢముగా యుండవల యుననియు. సాధనలో విజయము పొందుటకు తీవ్రకాంక్ష, ఆత్మసమర్పణ ఇత్యాదులుండవలయుననియు, యెన్ని కష్టములు సంభవించినను దృఢవ్రతులై సాధనను కొనసాగించవలయుననియు, ఇందులో విజయము పొందుటకు దీర్ఘ కాలము పట్టుననియు చెప్పుచుండిరి. అందరికి ఈ మార్గము సుఖకరము కాదనియు వారు పలుమారు చెప్పుచుండెడివారు.

శ్రీ వారి దినచర్య :— శ్రీవారు ఉదయము కొంత ఆలస్యముగ నిద్ర నుండి మేల్కొనుచుండిరి. కాలకృత్యములను తీర్చుకొని తేనీరు సేవించిన తరువాత గదియందిటుఅటు తిరుగుచుండిరి. తరువాత 9-30 నుండి 10-30 వరకు వెలుపల వసారాలో ఆసీనులై వారికి వివిధ రాష్ట్రముల నుండి వచ్చిన వార్తాపత్రిక లన్నిటిని ఒక అంగ టలో చదివి ముగించుచుండిరి. తరువాత దర్శ నార్థమేతెంచినవారికి దర్శన మొసగుచుండిరి. మేము వారిని దర్శించుచు సాధన విషయములను గూర్చి వారికి నివేదించి తగిన సమాధానములను వారి నుండి పొందుచుంటిమి. 11-30 గంటల సమయమున వారు మేడమీదనుండి క్రిందకు వచ్చి స్నానమాచరించి అటుపిమ్మట భోజనము చేయుటకై భోజనపు గదికి తల్లిగారు ముందురాగా, ఆయన ఆమె వెనుక వచ్చుచుండిరి. భోజనానంతరము విశ్రాంతి గైకొని మరల సాయంకాలమున గది ముంగిట వసారాలో ఇటునటు తిరుగుచుండిరి. 4-30 గంటల సమయమున మరల పెద్దవసారాలో అందరితో కలసి సంభాషించుచుండిరి. అటుపిమ్మట మేమంతయు కలసి సమష్టిధ్యానము కుర్చీలలో కూర్చొని ఆయన సాన్నిధ్యమున యొనర్చుచుంటిమి.

శ్రీవారు సంభాషించు తరి, కుడి హస్తము, కదలించుచు మాటాడు చుండిరి, అట్టితరి, అరచేతిలోని ముఖ్యరేఖలు బాగుగా అగుపడెడివి. చీరో రచించిన హస్తసాముద్రిక శాస్త్రప్రకారము వారిలో ఈ క్రింది ముఖ్యరేఖలు స్పష్టముగ తెలియుచుండెను.

హృదయరేఖ (Heart Line)
మనోరేఖ (Line of Mind)
జీవితరేఖ (Line of Life)

విధిరేఖ, అరచేయి క్రిందిభాగమునుండి సూటిగా స్పష్టముగా మూడు - నాలుగు వ్రేళ్ళ మధ్యవరకు పోవుట విదిత మగుచుండెను. ఈ రేఖ విజయము కీర్తిప్రతిష్టలను, మహోన్నత కార్యకలాపశక్తిని సూచించుచుండును. హృదయ రేఖ అతి స్పష్టముగ నుండినది. మనోరేఖ సున్నితముగ నుండి జీవిత రేఖకు కలియకుండ యుండినది. ఉన్నత మానసమును సూచించు మనోరేఖ అగుపించు చుండినది. నిగనిగలాడెడు నఖములతోను. సుందరమైన చేతి వ్రేళ్ళు కలిగి శ్రీవారి హస్తమభయ హస్తముగా విరాజిల్లుచుండినది.

నేను శ్రీ అరవిందుల సాన్నిధ్యమున యున్నతరి, శ్రీ అరవిందుల కనిష్ఠ సోదరుడైన బరీంద్రకుమార ఘోషు శ్రీవారితో సహా యుండుట కేతెంచిరి. వారు ఇంగ్లండునందు జన్మించి, అచ్చటనే బాల్యము గడిపినవారై నప్పటికిని ధూమపానము చేసెడివారుకాదు. వారితో నాకు పరిచయము కలిగినది. ఉదయమున వారు నన్ను పిలువగా మేమిరువురము కలసి వ్యాహ్యాళికేగు చుండెడివారము. వృక్షములక్రింద అప్పుడే రాలిన పుష్పములను సేకరించి తెచ్చిడివారము. కొన్ని పుష్పములను శ్రీవారి గదిలో బరీంద్రుడలంకరించెడి వారు. ద్వీపాంతరవాసములో ఆయన పడ్డపాట్లను గూర్చియు విప్లవోద్యమున ఆయన పడ్డ బాధలనుగూర్చి నాకు విశదముగ చెప్పెడివారు. బరీంద్రకుమారుడు, ఉపేంద్రనాథబెనర్జీ మొనలగువారు శ్రీవారిని మరల రాజకీయ రంగమున ప్రవేశించి దేశనాయకత్వమును వహించమని ప్రోత్సహించెడివారు. కాని, శ్రీ వారిష్టపడనందున బరీంద్రు డచ్చటనుండి వెడలిపోయి, మరల వచ్చి యోగ ధ్యాన మొనర్ప మొదలిడిరి.

ఒకటిన్నర సంవత్సర కాలము శ్రీవారితో యుండిన తరువాత నేనును నాభార్య ఆశ్రమ సమీపమున నున్న ప్రత్యేక గృహములో యుంటిమి. అప్పుడు నాకార్థికముగ సహాయపడువారు లేనందున, మమ్ము పోషించుటకు శ్రీవారికడ ద్రవ్యము లేనందున, నాకు ఉద్యోగము దొరకనందున — ఇత్యాది

కారణములవలన నేను వారి అనుమతితో అతి కష్టముతో వారి శెలవు గైకొని గుత్తికి వచ్చితిని. నేను శ్రీవారిని వీడి వచ్చుటకు ముందు నా సహపాఠియైన ఆంధ్రుడైన తిరుపతి కొంతకాలము గాంధీమహాత్ముని సేవించి, కారాగార వాసముచేసి మరల శ్రీవారి సాన్నిధ్యమున జేరెను.

ఆ కాలమున బాహ్య పరిస్థితుల వాతావరణము సౌమ్యముగ లేకపోయినను, ఆంతరంగిక సాధనా పథమానంద దాయకముగ యుండినందున మేమెల్లరము శ్రీవారి సన్నిధిలో సుఖశాంతులతో కాలము గడపితిమి. వారి సాన్నిధ్యమునకు దూరమైనను వారి కృపాకటాక్షములు నాకు నిరంతరము కలుగుచునే యున్నవి.

———

# గడ్డిపల్లి వింత

మూలం :
ఉదార్ పింటో

అనువాదం :
బి. నరసింహయ్య

ఈ శీర్షిక ఆర్భాటముగా గోచరించునేమో! కాని ఆంధ్రప్రదేశ్‌లోని యీ గ్రామమున సంభవించిన అద్భుతవిషయములకు న్యాయము చేకూర్చునట్లు మరొకవిధముగా వర్ణించుటెట్లు!

గడ్డిపల్లి ఆంధ్రప్రదేశ్‌లోని నల్లగొండజిల్లా యందలి హుజూర్‌నగర్ సూర్యాపేట తాలూకాలలోని ఆరుగ్రామాల మధ్యనున్నది. ఇది హైదరాబాద్‌కు 110 మైళ్ళదూరమున నున్నది, మూడుసంత్సరాలకు పూర్వము యీ ప్రాంతము పూర్తిగా వెనుకబడిన ప్రాంతముగా నుండెడిది. ఇచట పాఠశాలలుగాని, బాటలు గాని జల, విద్యుత్ సౌకర్యములుగాని లేకుండెడివి. ఈ ప్రాంతమున మూడవ భాగము మాత్రము సాగులోనుండెడిది. అందుకూడ ఎకరమునకు ఏబది రూపాయల ఆదాయమునిచ్చు వర్షాధారపు పంటలు మాత్రమే పండుచుండెడివి. ఈ పరిస్థితులలో అచటి ప్రజలు దుర్భరమైన కష్టములతో శోచనీయమైన జీవితము ననుభవించుచుండిరి

కృష్ణానదిపై నాగార్జునసాగరమువద్ద ఆనకట్ట కట్టబడి వ్యవసాయానుకూలమైన కాల్వలు నిర్మింపబడినవి. లాల్‌బహదూర్‌శాస్త్రీ పేర నిర్మితమైన గొప్ప కాల్వ గడ్డిపల్లికి కొంతదగ్గరగా ప్రవహించినను అది చాలలోతున నుండుటచే ఆ ప్రాంతపు పేదప్రజల క్షుత్పిపాసలదీర్చుటకది అందుబాటులో లేనిదయ్యెను. 7130 ఎకరములు గల్గియున్న 720 మంది కర్షకులకు ఆ కాల్వయుండియు లేనట్లులై వారి పాలిటి క్రూరశిక్షగా తయారైనది.

అట్టి సమయమున ఒకవింత సంభవించినది. ఆవింత శ్రీ మాత అనంత కృపవలనను, శ్రీ అరవిందుల మహత్తరకార్యాచరణ శక్తివలనను, వారికి ఉన్మీలితులై వారిశక్తిని చక్కగా గ్రహించి తగిన విధముగా వినియోగించు కొనగల వ్యక్తులద్వారా సంభవించినది. ఆవ్యక్తులెవరు? వారేమియొనర్చిరి? రెండవదానిని తొలుత పరికింతము.

రెండు సంవత్సరాలకాలముననే గడ్డిపల్లిలో నూతన వ్యవస్థ వెలసినది. ఈనాడచట 6000 ఎకరములు ఒక్క వ్యవసాయక్షేత్రముగా రూపొంది సాగు చేయబడుచున్నది. ఆ కొలదికాలముననే ఆ 720 మంది కర్షకులు దారిద్ర్యము నుండి గట్టెక్కి ఐశ్వర్యమునకు చేరుపైనారు. ఈ సంవత్సరము వారి ఆదాయము 50 లక్షల రూపాయలు. మరి అది వింతకాదా!

ఇపుడు అందుకు కారణభూతులైన వ్యక్తులగూర్చి పరికింతము. డాక్టర్ గోపాలరెడ్డి గడ్డిపల్లి వాస్తవ్యుడు. ఆయన అమెరికాసంయుక్తరాష్ట్రము లలో ఆరు సంవత్సరములుండి "హవాయ్ విశ్వవిద్యాలయము"న "డాక్టరేట్" పొందెను. తర్వాత ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయమున గ్రామీణ ఆర్థికవిధానవిషయమును బోధించు సహాయ ఆచార్యుడుగా నుండెను. అందుచే గ్రామపునర్నిర్మాణ కార్యమున ఆయన నిపుణతగలవాడుగా నుండెను. అందుకు తోడు తనలో దైవశక్తి పనిచేయుటకై ఉన్మీలితుడై యుండెను. చాల సంవత్స రములు ఆయన శ్రీ మాత అనుగ్రహమునకు పాత్రుడై ఆమెచే నడుపబడు చుండెను. అంతట శ్రీ అరవిందుల కార్యాచరణమును విని వెంటనే ఆశక్తి యొక్క అనుభూతిని బొందెను. విశ్వాసమున్నవారిని ప్రతిబంధకములనుండి రక్షింపగల శక్తివంతమైనది ఆశక్తి. ఇట్టి నమ్మకము డాక్టర్ గోపాలరెడ్డికి చేకూరినది. అందువలన అతని పురోగమనమును యేదియు అడ్డగింపజాల దయ్యెను.

శ్రీ ఎస్. కె. దత్తగారి శక్తివంతమైన నిర్వహణమున "స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్" నడుపబడుచున్నది. శ్రీయుతులు గోపాలరెడ్డి, దత్తగార్లు పరస్పర విశ్వాసముతోడను, దైవసహాయముపై నమ్మికతోడను, కలిపి ఒక బృహత్పథకమును చేపట్టిరి. దాని కవసరమగు ధనము స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ నుండి లభించెను. ఆ పథకముయొక్క అమలునకు 97 లక్షల రూపాయలు అవసరమని అంచనా వేయబడెను. గ్రామీణ ఆర్థిక విధాన నిపుణు డైన గోపాలరెడ్డి బ్యాంక్ నిపుణులయొక్కయు, ప్రభుత్వ నిపుణులయొక్కయు సహకారముతో నిర్మాణాత్మకముగను, మితవ్యయ సూత్రానుగుణముగను ఆ పథకమును రూపొందించగల్గెను. కాని 720 మంది రైతుల విశ్వాసమును చూరగొనుట ప్రధానాంశము. ఇది అసాధ్యమైన కార్యమని పలువురు పలికిరి.

అంతేగాక విభిన్నాభిప్రాయములుగల వివిధ రాజకీయ పార్టీల ఒత్తిడుల నెదుర్కొని దాటవలసి యుండెను. ఆ తర్వాత రైతులు తమ వైషమ్యముల విస్మరించి కలిసికట్టుగా సహకార సంఘముగా నేర్పడుటకు అంగీకరించవలసి యుండెను. అప్పుడే ఆ పథకము అమలు జరుపబడగలదు.

తొలుత లోతుగానున్న కాల్వనీటిని పైకి తేవలసియుండెను. అంతకన్నను ప్రధానముగ, ఆ భయంకరపరిస్థితి నెదుర్కొనుటకై 80 × 10′ × 30′ కొలతలుగల లోతైన బావుల త్రవ్వవలెను. ఆ రైతులు వీరావేశముతో ఏడు దినములు నిర్విరామముగా శ్రమించి అట్టి ఒక బావిని త్రవ్వి గడ్డు పరిస్థితి నెదుర్కొనగల్గిరి.

విద్యుచ్ఛక్తి సరఫరా సమస్య యెదురయ్యెను. ఈ ప్రాంతానికి 33 కె.వి. మార్గమున విద్యుత్తును దెచ్చుటకు 12 లక్షల ఖర్చు అంచనా వేయబడెను. సామాన్యస్థితిలో ఆ కార్యమునకు కొన్నినెలలు పట్టును. అయినను చింతగా అనతికాలముననే ఒక "సబ్ స్టేషన్" నిర్మితమై బావి పంపులకు విద్యుత్తు అందించబడెను. మొదటిస్థాయిలో 300 హెచ్. పి. గల మూడు పంపులును, 200 హెచ్. పి. గల రెండు పంపులును ఆ బావినీటిని 45 అడుగుల ఎత్తునకు తేగల్గెను. రెండవ స్థాయిలో 170 హెచ్. పి. గల మూడు పంపులు అచటి నుండి 41 అడుగుల ఎత్తునకు నీటిని దెచ్చెను. ఈ ఎత్తునుండి పొలములు సాగు చేయబడుచున్నవి.

ఆ నీరు అచటి కర్షక కార్మికుల అవిరళకృషి ఫలితముగా త్రవ్వబడిన రెండు ప్రధానమైన కాల్వలకందించబడెను. అచట 45 మైళ్ళమేరకు పిల్ల కాల్వలంతకుముందే కట్టబడియుండెను. అంతేగాక మరి 15 మైళ్ళ ముందు వరకుకూడ కాల్వత్రవ్వకము కొనసాగుచుండెను.

తద్వారా ఆ ప్రాంతము సస్యశ్యామలమై ఆ ప్రజలు ఆనందభరితులైరి.

ఆ ప్రజలకు కేవలము భౌతికసంపదమాత్రమేగాక అంతకు సమానమైన ఆధ్యాత్మికసంపదకూడ లభ్యినదను విషయము గమనార్హము. ఆ ప్రాంతమున నెల్లెడల ఆధ్యాత్మికతృష్ణ గోచరించినది. వారు కృతజ్ఞతా సూచకముగా ఒకమంటపమును నిర్మించి అందు శ్రీ అరవిందుల అవశేషముల ప్రతిష్ఠింప నిశ్చయించిరి.

ఏప్రిల్ 4వ తేదీపై ప్రతిష్ఠాపనము శ్రీ కిరీట్ గారిచే సలుపబడినది. ఆ మహోత్సవమునకు చుట్టుపట్ల గ్రామీణులు 10,000 మంది హాజరైరి. వారు వచ్చిన యెడ్లబండ్ల అలంకరణముచూడముచ్చటొదవెను. వివిధ వర్ణముల పతాకములు, ఆ జనసందోహపు మందస్మిత వదనములు ఆ ఉత్సవమునకొక నూత్నశోభచేకూర్చినవి. శ్రీ అరవిందులు నిరంతరము ఆనందకరమైన "ప్రభాకర తేజోమార్గము" ననుసరింప ప్రబోధించిరి. గడ్డిపల్లి చుట్టుపట్ల ప్రజలట్టి పథముననుసరించిరి.

డాక్టర్ గోపాలరెడ్డిచే నడుపబడిన ఆకర్షకులు తాముపొందిన సంపదను సక్రమపద్ధతిలో వినియోగపరుపనాయత్తమగుచున్నారు.

ఆ సంస్థ అనేకట్రాక్టర్లను, లారీలను. కార్లనుకల్గియున్నది. అది ట్రాక్టర్ సేవాకేంద్రమును, వ్యవసాయ తర్ఫీదు కేంద్రమును స్థాపించినది. అది ఐశ్వర్యవంతమై పరిపూర్ణ జీవనవికాసానుగుణమైన "ఆదర్శగ్రామము"ను నిర్మింపనుద్దేశించుచున్నది. ఆదర్శగృహములు, ఆరోగ్యకేంద్రములు, పాఠశాలలు, కర్మాగారములు, ఆటస్థలములు, నాటకరంగములు, లాండ్రీలు, వంటగదులు, చేతిపనులు, ఐస్‌క్రీం ఉత్పత్తికేంద్రములు, శీతకొలనులు, మొదలగు ప్రజావసరముల తీర్పగల గ్రామనిర్మాణము వారిధ్యేయము. అట్టి గ్రామమున నివసించుట, పనిచేయుట ఆనందకరముగానుండును. అప్పుడు నగరములకు వెళ్ళవలెననెడి తలంపుకలుగనేరదు. నగరములనుండి అచటికిమరల వలెననెడి యిచ్ఛగల్గించి అదియే పలువురనాకర్షించును.

అచట పనిచేయుచున్న గొప్ప దివ్యశక్తివలననే యిదంతయు సాధ్యమగుచున్నది. భవిష్యత్ పథకములుగూడ సుసాధ్యమగును. ఇదేవింతమార్పు యొక్క అర్థము. ఇదే శ్రీ అరవిందుల కార్యాచరణము దేశస్వరూపమునెట్లు మార్చుననుటకు నిదర్శనము. ఆ దివ్యశక్తిఉనికిచేత ప్రజలు ఆకస్మికముగా చేకూరిన యీ సంపదద్వారా చెడుదారులపట్టుదురను భయమునకు ఆస్కారము లేదు. ఈపరిస్థితి ముందుగనే గుర్తింపబడి కల్పించబడినది.

భారతదేశమందలి యితరప్రాంతములు యీ ఆదర్శమును పాటింపదలచుచున్నవి. ఒరిస్సాలో అప్పుడే తగినఉత్సాహము గోచరించుచున్నది. దానిని

గూర్చి తర్వాత తెల్పెదము. కాని దేశమంతటగూడ యిట్టి పరిస్థితులున్నవి. అయినను గ్రామాలలో యిట్టి కార్యాచరణము చాలఅవసరము. పేదరికమునుండి మన దేశమునుద్ధరించి అభ్యుదయమును సాధింపదలచినచో నూటికి 85 వంతుల ప్రజలుగల గ్రామములలో యీ శక్తిని ప్రసరింపచేయవలసియున్నది. గ్రామాభ్యుదయము విధినిర్ణయము. గడ్డిపల్లి ఆదర్శముచే ఆవేశపూరితులైనవారు ఉజ్జ్వల భవిష్యత్తుకు మనమెట్లు కలసిమెలసి కృషిసలుపగలమో తెలిసికొనగోరుచో మాకు వ్రాయవలసినదిగా కోరుచున్నాము.

---

# అరోవిల్

రచయిత్రి : అరోవిల్ నివాసి

విశ్వశాంతిని, దివ్యజీవితాన్ని హృదయస్ఫూర్తిగా కోరుకున్న అనేక మంది యువతీయువకుల హృదయాలలో వెలిగే ఆశాజ్యోతిని మరింత ప్రోత్సహిస్తూ శ్రీ అరవింద సొసైటీ ఆధ్వర్యాన అరోవిల్ నగర శంఖుస్థాపన జరిగి నాలుగుసంవత్సరాలు పూర్తయ్యాయి. అప్పటినుంచి ఈ 'భావి నగరానికి' పునాదులు ప్రారంభమైనాయి. వివిధ దేశాలనుంచి వచ్చిన స్త్రీ, పురుషులు అనేక కష్టనష్టాలకు ఓర్చుకొని శ్రీ మాత ఆదేశానుగుణంగా ఈ నూతన జీవిత విధానానికి తమను తాము సరిదిద్దుకొనడానికి ప్రయత్నిస్తున్నారు.

అరోవిల్‌ను చూడడానికి వచ్చిన వారిలో, శ్రీ మాతారవిందుల దివ్య సంకల్పబలం తెలిసినవారికి తప్ప, మిగతా కొంతమందికి, ముఖ్యంగా వినోదార్థం చూడవచ్చిన వారికి కొంచెం నిరాశ కలుగవచ్చును. కాని ఇది 'భావి నగరం' అని మనం గుర్తుపెట్టుకోవాలి. ఈ ప్రపంచంతోటి, దాని జీవన విధానంతోటే తృప్తి పడినవారికి అరోవిల్ ఏమంత గొప్పదిగా కనుపించదు.

అరోవిల్ ఏ ఒక్క దేశానికీ సొంతంకాదు. ఇది అన్ని ఆధునిక సదుపాయాలతో కట్టబడే నగరం కాబోదు. ఇది సత్య నగరం. సత్యమనేది బహుముఖమైనది. అనాదినుంచీ మానవులు — మానవసంఘాలు దేహబలం, బుద్ధిబలం ,మనోబలం, వీటి ప్రాతిపదికతో క్రమేణా మారుతూవచ్చారు. అయితే భారతదేశంలాటి కర్మభూమిలో ఆధ్యాత్మికబలం, దాని ప్రభావం, ఆవశ్యకత వీటిని గురించి వేదఋషులు ఆ కాలమందే చెప్పినప్పటికీ, వారు గ్రహించిన విజ్ఞాలు సామాన్య మానవసంఘం వరకూవచ్చేటప్పటికి ఏదోఒక మతం, పేరిట స్థిరపడి, ఆచారాలుగా మారిపోయాయి. మనం 'హిందూమతం' అనేది నిజానికి మతం కాదని, అది సర్వప్రపంచాన్ని ఏకం చెయ్యగల శక్తిగల సనాతనధర్మమని చాలామంది విజ్ఞులు చెపుతూనేవున్నారు. ఏ దివ్యశక్తిని అన్ని మతాలవారు అన్ని దేశాలవారు, అనేక రూపాలలో భగవంతునిగా స్మరిస్తున్నారో, కొంత మంది భగవంతుడేకాదని నిందిస్తున్నారో, ఆ దివ్యచైతన్యశక్తి తన ఉత్కృష్ట

మైన సత్యశక్తితో భౌతికంగా తనను తాను ప్రస్ఫుటం చేసుకొనగల వాతావరణం కలిగినప్పుడు భూలోకజీవితం నిత్యసుఖశాంతులతో వర్ధిల్లుతుంది. ఈ నవ్యచైతన్యశక్తిని (పరమానసిక లేక అతిమానసిక శక్తి) భూలోకం లోనికి తీసుకుని రావడానికీ. తదుపరి ఈ వాతావరణంలో దానిని శాశ్వతంగా నిలుపడానికీ శ్రీ మాతారవిందుల యోగసాధన అనుకూలమైనది. ఇక ఆ శక్తిని నిత్యజీవితానుభవంలో గ్రహించి, దాని ప్రకారం తమతమ జీవితములను దిద్దుకొను మానవసముదాయం ఏర్పడగలిగితే అది రాబోవు నూతన మానవ జాతికి ప్రథమ సోపానముగా వుంటుంది. ఈ సంకల్పంతోనే అరోవిల్ నగర శంఖుస్థాపన జరిగింది. ప్రతినిమిషం భగవంతుని కోర్కెను, అనుభూతిని వ్యక్తం చేసే ఒక సాంఘిక జీవితవిధానాన్ని ప్రపంచంలో నెలకొల్పటంకూడా అరోవిల్ లక్ష్యం. అందుకే ఇది 'భావినగరం' అని అనేకసార్లు గుర్తుతెచ్చుకోవాలి. ఈ నాటి మానవజాతికి, రాబోవు నూతన మానవజాతికి, ఇది ఒక వంతెన వంటిది ఇచ్చట నిత్య జీవితావసరాలకి కావలసిన సదుపాయాలన్నీ సమకూర్చటం సొసైటీ ధ్యేయం.

అరోవిల్ నగరంలో పనిచేసేవారు ముఖ్యంగా లక్ష్యసాధకులకు వారి పనిని వారు నిర్ణయించుకొనగల స్వాతంత్రము కల్పించబడినది. ఇతరులు వారి వారి శక్తిసామర్ధ్యాలకు తగినట్లు పనిచెయ్యవచ్చు. ఏపనికీ ఎక్కువ తక్కువ భేదంవుండదు. అది ఏ దృక్పథంతో చేయబడింది, అన్న నిజమే వారి పురోభివృద్ధికి సానుకూలంగానో, ఆటంకంగానో మారుతుంది.

ఇక ప్రస్తుత అరోవిల్‌ను గురించి కొన్ని విషయాలు అరోవిల్ నగరానికి మధ్యన కట్టబడుచున్న మాతృమందిర్. ఇది మానవునికి హృదయం ఎటువంటిదో, అరోవిల్‌కు అటువంటిది. మాతృమందిర్ నిర్మాణానికి, దాని చుట్టూ పెంచవలసిన పూతోటల పెంపకానికీ 'శాంతి' అనేచోట పలువురు కృషి చేస్తున్నారు. ఇది శంఖుస్థాపన జరిగిన ప్రదేశానికి చెందినది. మాతృమందిర్‌కు కొద్దిదూరంలో భారత సాంస్కృతిక నిలయం 'భారత్ నివాస్' ప్రథమ ఘట్టము నిర్మాణంలో వుంది. ఇచ్చట ఇండియాలోని అన్నిరాష్ట్రాలూ తమతమ సంస్కృతి, కళాచారములు తెలిపే 'పవిలియన్లు' నిర్మించబడుతాయి.

పాండి _ మద్రాసు రోడ్డు గుండా మెరట్టాండి చావడి గ్రామంవద్దనున్న స్థావరం ప్రామిస్. ఇచ్చట ప్రసూతి కేంద్రం, ఈ భావినగర నిర్మాతల జన్మ కేంద్రం. ఇచ్చట పుట్టిన పాపలకు శ్రీమాత బర్త్‌సర్టిఫికేటు ఇచ్చి నామ కరణం చేస్తారు. శ్రీఅరవిందుల చిహ్నంగా ప్రతిపేరు. మొదటకానీ, చివరన కానీ 'అరో' వుంటుంది. ప్రయోగ పదతిలో గృహనిర్మాణ పద్ధతులని కను క్కొనుటకు ఇచ్చట వసతులు కల్పించబడ్డాయి.

న్యూఫాం, సర్వీస్‌ఫాం, అరో ఆర్చడ్. ఇవి ముఖ్యమయిన వ్యవసాయ కేంద్రాలు. ఇచ్చట నూతన పద్ధతులలో భూమి సాగుబడిచేసి ఆర్థికంగా మంచి ఫలితాలనివ్వగల విధానాలపై ప్రయోగం సాధించబడుతోంది. ఇక్కడే పాల సరఫరాకేంద్రం _ కోళ్ళ పెంపకం – వీటికి ప్రత్యేక స్థలం కేటాయించబడింది.

అరో మాడల్ అనే స్థావరం అరోవిల్ నగరంలో జీవించగల విధానాలని కనుగొనేటందుకు నిర్మించబడుతోంది. దీని మొదటికొమ్మ ఆశ్పిరేషన్ లేక ఉత్కాంక్ష. ఇచ్చట గ్రామీణ వాతావరణం ముఖ్యమయినది. ఇక్కడ సుమారు 150 మంది వివిధ ప్రాంతాలకు చెందినవారు నివసిస్తున్నారు. ఉమ్మడి వంట శాలలు రెండు. ఒకటి శాఖాహారులకు, రెండవది ముఖ్యంగా తెల్లవారికాణీలో అమర్చ బడినది. ఎవరికి ఎచ్చట ఇష్టమో అచ్చట భోంచేయవచ్చు. అరో స్కూల్‌లో శ్రీమాతారవిందుల ఆదేశానుసారం నూతన విధానంలో విద్యార్థుల విద్యావిధానం తీర్చి దిద్దబడుచున్నది. ఇచ్చట సంస్కృతానికి, లైబ్రరీ, సైన్సు లాబరేటరీలకి ప్రత్యేక భవనాలు నిర్మించబడు చున్నాయి. ఇచ్చటే అరోప్రెస్_ అరోపోలియాస్టర్ యూనిట్ (auro press - auro poly yaster unit పని చేయుచున్నాయి. కాగిత పరిశ్రమ కేంద్రం త్వరలో ఆరంభించ బడుతుంది. భవన నిర్మాణం చివరిఘట్టంలోవుంది ఇదేచోట 'సౌభ్రాతృత్వము' అనేపేరుతో కుటీర పరిశ్రమల కేంద్రంకూడా ఆరంభించబడినది.

అరోవిల్ ప్రాజెక్టులో మరియొక ముఖ్యమైన పథకం గ్రామ పునర్ని ర్మాణం. అరోవిల్ నగరానికి చెందిన సుమారు ఎనిమిది గ్రామాల ప్రజలు అరోవిల్‌లో ఒక భాగంగా గుర్తించ బడ్డారు. దాదాపు అన్నిగ్రామాలు చాలా పేదస్థితిలో ఉన్నాయి. అరోవిల్ కట్టడ నిర్మాణాలలోను, తదితర కార్యకలాపాల

లోనూ ఈ గ్రామ ప్రజలకు ఉద్యోగ వేతనాలు కల్పించబడుతున్నాయి. అరోవిల్ జీవిత విధానాలను అంగీకరించిన కొన్నిగ్రామీణ కుటుంబాలు అరోవిల్‌లో చేర్చుకొనబడ్డారు. వారిని, వారి పిల్లలకు పోషణ, వసతి సౌకర్యాలన్నీ భేదభావాలు లేకుండా కలుగ చెయ్యడంకూడా సొసైటీవారి లక్ష్యం. ప్రస్తుతం కొన్నిగ్రామాలకు మంచినీటి సరఫరా చేయబడింది. ఒక ఉచిత వైద్యశాల పనిచేయుచున్నది. చిన్న పిల్లలకు వుచితంగా పాలసరఫరా – క్రమాహార సదుపాయాలు కలుగచేయబడుతున్నాయి ఈగ్రామ నిర్మాణ పథకంలో-స్త్రీలకు, ముసలివారికి, అంగవిహీనులకు, స్కూలు బాలబాలికలకు సహాయ కార్యక్రమాలు పరిశీలనలో వున్నాయి. వీటిని విజయప్రదంగా అమలు జరుపుటకు ప్రభుత్వం – ఇతరత్రాకూడా చాలా ఆర్థిక సహాయం కావలసివుంది.

ఒక ఉత్కృష్టమయిన ఆశయానికి శంఖుస్థాపన జరిగింది. ఇది ఈ లక్ష్యం నెరవేరడానికి ఎంతకాలం పట్టవచ్చునన్నది ఆయా మానవ దృక్పథాలు మార్పు చెందడంలో వుంది. అరోవిల్ విజయం మానవజాతికి విజయం. భూలోకంలోని నరకాన్నిచూసి భగవంతుని నిందించినా, దివ్యజీవితానికి స్వాగతం పలికే ఈలక్ష్య సాధనకు ఎంతవరకూ మనం తోడ్పడగలం – అన్నవిషయం మన నిజాయితీ నిరూపిస్తుంది.

---

# ప్రార్థన : మంత్రము

— కొత్త శ్రీనివాసబాబు

ప్రార్థన - మంత్రము— వీటికిగల ఆధ్యాత్మిక ప్రాధాన్యతను గురించి శ్రీ మాతారవిందులు అనేక సందర్భములలో విశదీకరించియున్నారు. వారు వెలిబుచ్చిన అభిప్రాయములలో కొన్నిటిని పొందుపరచుటయే ఈ వ్యాసము యొక్క ఉద్దేశ్యము.

మానవజీవితము అనేకమైన అవసరములకు, కోర్కెలకు ఆలవాలమైనది. ఈ అవసరములు, కోర్కెలు మానవుని భౌతికజీవితమునకు మాత్రమే పరిమితిజెందియుండలేదు. అతని మానసిక ఆధ్యాత్మిక జీవితములలోనికి గూడా విస్తరించియున్నది. ఈ విశ్వమును శాసించే మానవాతీత మహత్తర శక్తి ఒకటిగలదనే స్ఫురణగలిగినపుడు మానవుడు ఇహలోకయాత్రలో తాను ఎదుర్కొను కష్టములను అధిగమించుటకును, తన అవసరములను ప్రాప్తింపజేసికొనుటకున్నూ కావలసిన సహాయ, రక్షణలకొరకు ప్రార్థనద్వారా ఆ మహత్తర శక్తివైపు మరలుట సహజమే. ఇట్లు మరలుటలో అనేక మూఢనమ్మకములిమిడియున్నప్పటికినీ—ముఖ్యంగా భగవంతుని లంచము, కానుకలు, స్తోత్ర పాఠములు మొదలైనవాటితో వశపరచుకొనవచ్చుననుభావము— ఇది మానవుని ఆధ్యాత్మిక ప్రవృత్తికి సంబంధించిన ముఖ్యమైన కదలిక.

సాధారణముగా మానవుడు చేసేస్వార్థపూరిత ప్రార్థనతో ప్రమేయము లేకుండా దైవేచ్ఛ దాని ఆశయమును అది నిర్వర్తించుకొనుననుమాట వాస్తవమే. అయితే ప్రార్థనయొక్క ఆవశ్యకత ఏమిటనే ప్రశ్న ఉదయించవచ్చు. నిజమే ; విశ్వసృష్టి, స్థితి, లయములు కేవలము ఈశ్వరసంకల్పాధీనములే. అయిననూ విశ్వనిర్వహణ యంత్రప్రాయమైన సూత్రముపై ఆధారపడియుండలేదు. మానవ జీవితమునకు సంబంధించినంతవరకు మానవుని ఇచ్ఛ, ఆకాంక్ష, విశ్వాసములకు కొంత ప్రాధాన్యతఉన్నది. ప్రార్థనఅనునది ఈ ఇచ్ఛ, ఆకాంక్ష, విశ్వాసములకు మానవుడు యిచ్చిన ఒకానొక రూపకల్పన మాత్రమే. అవి సాధారణంగా మూఢత్వంతోనిండియున్న రూపకల్పనలైనప్పటికీ వాటికీ మానవుని ఇచ్ఛ,

ఆకాంక్ష, విశ్వాసములను దైవేచ్ఛతో దగ్గరి సంబంధమేర్పరచగలశక్తియున్నది. ఆరంభదశలో ప్రార్థన స్వార్థముతోకూడుకున్నదైనప్పటికీ, క్రమక్రమముగా దాని వెనుకనున్న అధ్యాత్మికసత్యము మానవునకు అవగతముకాగలదు. అప్పుడు ప్రార్థన ద్వారా అర్థించినకోర్కె సిద్ధించినదా లేదా యను సమస్యకుగాక మానవ జీవితమునకు దైవమునకు మధ్య ఎఱుకతోగూడిన సంసర్గమేర్పడినదనే అంశమునకే ప్రాధాన్యమునెందు. ఆధ్యాత్మికవిషయములలోను, ఆధ్యాత్మికశక్తిని పెంపొందించుకొనుకృషిలోను ఈఎఱుకతోగూడిన సంసర్గమును ఒక మహత్తర శక్తిగా పరిగణించవచ్చును. ఇది ఆధ్యాత్మికరంగములో మానవుడు స్వశక్తినే నమ్ముకొని చేయుకృషివలన పొందు లాభముకంటె మిక్కిలి పరిపూర్ణమైన (ఆధ్యాత్మిక) అభివృద్ధి అనుభూతులను చేకూర్చును. ఆధ్యాత్మికానుభూతులు పెంపొందినకొలది మానవుడు ప్రార్థనద్వారా నిర్మలమైన ఈశ్వరప్రేమ వినా మరొకటి కాంక్షించని ఉన్నతోన్నతమైన స్థాయికిచేరుకొనును.

కేవలం దైవకృపపైనమాత్రమే ఆధారపడి అన్నిపరిస్థితులలోను సహాయముకొరకు దానికి పిలుపునివ్వటంనేర్చుకొంటే అది (దైవకృప) నిరంతరము మహిమలను చూపించును. ఆకాంక్ష, ప్రార్థన అనునవి మానవునకు దైవకృప ప్రసాదించిన అద్భుతవరములు. వాటిని సద్వినియోగముచేసుకొనగలిగితే మానవుడు దేనినైన మార్చగలశక్తిని తనలోనికి తెచ్చుకొనగలడు. కాని ఇచ్ఛాశక్తి, నమ్రతలు, కలిగియుండుటవసరము. ఈ రెంటిలో ఏదిలోపించిననూ లాభంలేదు. మిక్కిలి నమ్రత, మహోన్నతమైన ఇచ్ఛకలిగిఉంటే కర్మను సైతము మార్చవచ్చును. ప్రార్థన హృదయములోనుండి ఆకాంక్షలేక భక్తిపారవశ్యప్రేరితమై ఉద్భవించవలెను. అట్టి ప్రార్థనను దైవము ఎల్లప్పుడు మన్నించును.

## జపము : మంత్రము

సాధారణముగా జపము రెండు సందర్భములలో ఫలితమునిచ్చును. మంత్రాధిదేవతయొక్క ప్రకృతి, శక్తి, సౌందర్యాకర్షణలపై మనస్సును కేంద్రీకరించి జపించుట—ఇది మానసిక మార్గము. రెండవది—భక్తిపారవశ్య ప్రేరణవలన హృదయస్థానమందు జపించుట—ఇది భక్తి మార్గము. మనస్సు

గాని, ప్రాణశక్తిగాని ఈసాధనలకు సహకరించవలసియుండును. కాని జపము మనస్సునకు నిస్సారతను, ప్రాణశక్తికి వ్యాకులపాటునుకలిగించేయెడల దానికి (జపమునకు) వాటితోడ్పాటు లుప్తమగును. ఈ రెండు మార్గములుగాక కేవలము మంత్రశక్తి పైనగాని లేక నామమాహాత్మ్యముపైనగాని నమ్మకముంచి జపించుటయనునది మూడవపద్ధతి. ఈ పద్ధతి ప్రకారము అంతస్సత్త మంత్రశక్తి మూలమునగాని లేక నామమాహాత్మ్య మూలమునగాని ప్రభావితమై దైవ సాన్నిధ్యమును గుర్తెరుగనేర్చు వరకు జపమును సాగించవలసియుండును,

* * * *

మంత్రమును నియమబద్ధముగా జపించినచో, కొంతకాలమునకు మనలో జపముదానంతటదే జరగటం మొదలగును. అంతఃపురుషుడే జపమునుచేపట్టి నాడని దాని అర్థము. అప్పుడు మంత్రము మరింతశక్తివంతమగును.

* * * *

పూర్ణయోగసాధనలో మంత్రములకు ప్రముఖస్థానములేదు. సాధకుని చేతనలో ప్రగాఢమైన ఆకాంక్ష, అతని సమస్తసత్తలోను( మానసిక, హృదయ, ఇచ్ఛాది స్థానములలో) లక్ష్యసాధనకొరకు ఏకాగ్రత____వీటికి మాత్రమే అధిక ప్రాధాన్యత. వీటిని పెంపొందించుకొనుటకు సహాయకారిగా నుండునవితోచు నెడల సాధకులు వారి కవసరమైనంతకాలము మంత్రజపమును సాగించుకొన వచ్చును.

* * * *

సాధకునిచేతన బాహ్యమునకు (విశ్వచేతనవైపుకు) ఊర్ధ్వమునకు వికసించుటకు, అతనిచేతనలోనికి శక్త్యావతరణ జరుగుటకు శాస్త్రయుక్తమైన (యంత్రప్రాయముగాని) ఓంకారజపము సహాయపడును.

* * * *

పూర్ణయోగసాధనలో వాడబడే ఒకే ఒకమంత్రము శ్రీ మాతానామము లేక శ్రీ మాతారవిందుల నామద్వయముమాత్రమే.

* * * *

శ్రీ మాతారవిందులు సాధకులకు ప్రసాదించిన మంత్రములు:—

1. ఓం శ్రీ అరవింద మీరా.

2. శ్రీ అరవిందః శరణం మమ.

3. శ్రీ మాతా చ శ్రీ అరవిందశ్చ శరణం మమ.

4. ఓం ఆనందమయి చైతన్యమయి సత్యమయి పరమే.

5. 'తత్ సవితుర్వరం రూపం జ్యోతిః
పరస్య ధీమహియన్నః సత్యేన దీపయేత్॥'

(సెంటినరీ బుక్‌లెట్ నెం. 8, శ్రీ అరవింద సొసైటి.పాండిచేరి నుండి)

# శ్రీ అరవిందులు - మూడు లేఖలు

— కాకుమాను తారానాథ్

శ్రీ అరవిందుల రాజకీయ జీవితం చాలావిచిత్రమయింది. విశ్రాంతి ఎరుగని కార్యకర్త ఆయన. 'వందేమాతరం' సంపాదకత్వ బాధ్యతలు, కాంగ్రెస్ కార్యక్రమాలు ఆయనకు నిత్యకృత్యాలయాయి. అనాటివారి కలకత్తా జీవితంలో భార్య మృణాలినీదేవి వారివద్దనే ఉంటుండేది. కాని వారి విశ్రాంతి ఎరుగని జీవితంలో, ఆమె పాలుపంచుకొనే అవకాశం చాలాతక్కువ అని వారికి పూర్తిగా తెలుసు. ఆ కారణంగా ఆమెను ఓదారుస్తూ, ధైర్యంచెపుతూ, సలహాలుచెపుతూ ఆమెకు అరవిందులు వ్రాసిన లేఖలుచాలా ప్రసిద్ధాలు.

శ్రీమతి మృణాలినీదేవి జీవితం విచిత్రమయింది. 14 సంవత్సరాలు బాలికగా వారి జీవితంలో 1901లో ప్రవేశించింది. అరవిందులు పండులాంటి ఉద్యోగాన్ని వదలుకొని బెంగాల్‌జేరి ఉద్యమాలలో మునకలువేయసాగారు. దేశమంతటా విస్తృతంగా పర్యటనలు, ప్రబోధాలు, కాంగ్రెస్ మహాసభలతో కాలం గడిచిపోతుండేది. ఇలా ఏడు సంవత్సరాలు గడిచాయోలేదో, 1908 మే 1న అరెస్టయారు. సంవత్సరం తరువాత విడుదలయారు. తిరిగి పత్రికా ప్రపంచంలో మునిగారు. ఆ జీవితం సాగకుండానే, 1910 ఫిబ్రవరిలో చంద్ర నాగూర్ పోయారు. అదే సంవత్సరం మార్చిలో పాండిచేరి జేరారు. కాని ఆమె వారివద్దకు పోయేందుకు అనుమతి లభించలేదు. వారి అనుమతి లభించినమీదట, కొండంత ఆశతో వారి దర్శనార్థము 1918 డిశెంబరులో బయలుదేరింది. కాని విధి వక్రించింది. దారిలో ఇన్‌ఫ్లుయెంజా జ్వరం ఆమెను పొట్టనపెట్టుకుంది. ఎలాంటి జీవితమిది? మరణించేనాటికి ఆమెవయస్సు కేవలం 30 సంవత్సరాలు మాత్రమే. 17 సంవత్సరాల వైవాహిక జీవితంలో, చివరి సగం జీవితంలో ఆమె భర్తదర్శనానికే నోచుకోలేదు.

ఎలాంటి జీవితమిది? బహుశా ఒకభారతీయ మహిళమాత్రమే ఇలాంటి త్యాగమయ, నిరీక్షణా పూర్ణజీవితాన్ని గడపగలదేమో అంటే అతిశయోక్తి కాదనుకుంటాను.

ప్రాపంచిక దృష్టిలో తానా మెకిస్తున్న సౌఖ్యాన్ని [illegible] అనాదరవిందులాలేఖలు ప్రాణాననిచెపుతాయి. వాటిని [illegible] "పబ్లిసిటీ" ఇవ్వటంకాని వారికిష్టములేదు. కాని [illegible] నిర్దేశింపాడు. ఆ లేఖలే బ్రిటిష్ ప్రభుత్వపు దయవలన [illegible] మయాయి. వాటిని క్లుప్తంగా పరామర్శించటమే ఈ వ్యా[illegible]

మొదటి ఉత్తరం 30 ఆగస్టు 1905న వ్రాయబడింది [illegible] పిచ్చివాడిగా వర్ణించుకొని, తనకుగల మూడు పిచ్చి [illegible] మొదటిది : సర్వం భగవదాధీనము. భగవద్దత్తము అనేకన్నీ [illegible] ఇచ్చేటట్లయితే నీ అవసరాలకు వాడుకుని మిగతావి [illegible] సుమా అనేది దానితోపాటే వచ్చేసిద్ధాంతము. [illegible] భగవంతుని తప్పక పొందితీరాలి అనే భావము. [illegible] ఎక్కువగా నామజపము, అందరిముందు ప్రార్థనలు [illegible] ప్రదర్శనతోకూడి ఉంది. అదికాదు కావలసింది. [illegible] వారికే హృదయగతమవుతుంది అని వర్ణిస్తుంది. [illegible] తెలుసుకున్నాను సుమా అనివ్రాస్తాడు. మూడవది : అతి [illegible] ఈదేశం ప్రాణంలేని విషయంగా మైదానాలుగా, పర్వతాలుగా, [illegible] వారికది మాతృస్వరూపిణిగా గోచరిస్తుంది. దేశంలో [illegible] అంటారు.

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి'. అతి [illegible] మాత్రమే అనిపిస్తుంది. ప్రపంచంలోని ఏదేశ వంస్కృతిలో [illegible] మనంచూడలేమంటే అతిశయోక్తి కాదనుకుంటాను. [illegible] ఈభావం కనపడదేమో!

రెండవ ఉత్తరం కలకత్తానుంచి ఫిబ్రవరి 190[illegible] వ్రాయబడింది. ఇందులో స్పష్టంగా వ్రాస్తారు అరవిందులు. [illegible] ప్రతిచర్యా భగవదాదేశానుసారమే జరుగుతున్నది [illegible] సహధర్మచారిణి కాబట్టి, ఆమే తీవ్రంగా [illegible] భగవంతుడే చూపుతాడంటాను.

మూడవ ఉత్తరం 6 డిశెంబరు 1907న వ్రాయబడింది. అంటే దేశం సూరత్ మహాసభలకోసం తహతహలాడుతున్నది. అట్టుడికినట్లు ఉడుకుతున్నది. ఇందులో తనధర్మమే ఆమె ధర్మమనీ, తనకార్యక్రమాలన్నీ సఫలాలు కావాలని ప్రార్థించమనీ, లేకపోతే ఆమెకు సుఖముండదనీ వ్రాస్తారు.

ఈ ఉత్తరాలలోని భావాలు మహోన్నతాలు. అన్నిటికిమించి అరవిందులలో, తీవ్రరాజకీయ కార్యక్రమాల్లో నిమగ్నమైనా, అంతర్గతంగా ఎలాంటి యోగధోరణి ఉన్నదీ మనకు తెలియచెపుతాయి. అలాగే వారిదృష్టిలో హిందూ ధర్మము, దేశభక్తి, మాతృసేవారాధన, త్యాగమయ జీవితము - ఇవ్వన్నీ ఎలా అరమరికలులేని పర్యాయపదాలో ఈ ఉత్తరాలు సూచిస్తాయి.

అరవిందుల లౌకికమయమనుకునే రాజకీయజీవితం ఎంతటి ఆదర్శపూరితమో నేటియువతరం తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది అనేటందుకు ఈ మూడు ఉత్తరాలు సూచనా ప్రాయములు సుమా!

———

# శ్రీ అరవింద తత్వదర్శనంలో నవ్యసాహిత్య స్థానము

— దేశిరాజు వేంకటకృష్ణశర్మ

ఉత్తమ సాహిత్యమన ఉత్తమ జీవితానికైన దర్శనము. మానవుని ఎడతెగని ఆకాంక్షయే ఉత్తమ జీవితానికైన తపస్సు. ఉత్తమ జీవితమన, నిత్యజాగరితమైన మనఃప్రవృత్తులలోనికి మనస్సులోని ఉన్నతోన్నత భూమికలలోనుంచి ఉదాత్తమూ సముజ్జ్వలమూ అయిన అంతశ్చేతనము. అవరోహణ క్రమంలోచేసే ప్రసరణమువలన నిత్యజీవితంలో అట్టి చేతనమువలన కలిగే ఉన్నతమైన నిలకడ. ఈ అవరోహణక్రమాన్ని లక్షించి అందుకొని, కలుపుకొని, దానినే నిత్యజీవితంలో ప్రతిఫలింపజేయగల ఆరోహణశక్తి. ఉత్తమ సాహిత్యంలోనూ, పూర్ణయోగాభ్యాసంలోనూ కలదు. మనస్సులోని ఉన్నతోన్నత భూమికలలో అనగా ఉన్నతమనస్సు, ప్రదీప్తమనస్సు, ప్రబుద్ధమనస్సు, అధిమనస్సు— అనబడు క్రమోన్నతభూమికలలో క్రమంగా స్థిరంగా, వెలిగే భావప్రసారమే, అచ్చటి జ్ఞాన, తేజశ్శక్తుల ఉన్మీలనమే, ఉత్తమ సాహిత్యానికి మూలమూ, ప్రాతిపదిక. శ్రీ అరవిందుల అతీత మానసదర్శనాపథంలో ప్రప్రథమమైన ఆలంబనంలాంటి పునాది ఒకటి కలదు. అదియే ఉన్నతమైన నిలకడ కలిగిన ఉత్తమ జీవితము దీనిని ప్రతిబింబించునదియే ఉత్తమ సాహిత్యము. నిత్యజీవితపు ఒడుదుడుకులతో సతమతమవుతూ బాహ్యాభ్యంతర ప్రవృత్తులలో ఒక శ్రావ్యమైన సమన్వయాన్ని (Harmony) సాధించుకొనలేని సాధారణ మానవులకు యోగమెటుల ప్రయోజనకారియో ఉత్తమ సాహిత్యము కూడ అట్టి స్థానమును పొందవలసియున్నది.

ఈ దృష్టితో పరిశీలిస్తే, ఉత్తమసాహిత్యానికీ, ఉత్తమ జీవితానికీ, శ్రీ అరవిందుల పూర్ణయోగానికీ మధ్య ఒక విధమైన కార్యకారణ సంబంధమున్నట్లు స్ఫురిస్తున్నది. ఈ దృష్టిలోని పూర్వఋషులు, నానృషిః కురుతే కావ్యమనిరి. ఋషి యనగా ద్రష్ట. కవియు ఒక రసమయమైన జీవితద్రష్ట. రసోవై సః బ్రహ్మ, అందుకనియే కవిని బ్రహ్మ యని గూడ అందురు. మానవు

లను సృష్టించునది బ్రహ్మ. మానవులలో కవి పుడమిలో స్వర్గమును సృష్టించును. ఋగ్వేదం X–124–7లో "కవిః కవిత్వ దివిరూపమ్ ఆసాజత్" అనగా స్వర్గంలో సుందరాతిసుందరములయిన రూపములను తన కవితాశక్తిచే కవి సృజియించును. వేదార్థంలో స్వర్గమనగా — నిత్యతేజస్సుతో కూడిన దివ్యమైన మనస్సు. శ్రీ అరవిందులు రచించిన వేదరహస్యములను గ్రంథంలో హద్దులు లేనట్టిదై, మసగ చీకటి తెరలను పూర్తిగా తొలగించుకొని పరిశుద్ధమైన నిత్య తేజస్సుతో కూడుకొన్న మనస్సే స్వర్గమని స్పష్టం చేసిరి. అనగా ఇంద్రియ ములు పెట్టిన నియమములనూ, హద్దులనూ అతిక్రమించి ఉన్నతోన్నతంగా తేజోవంతమైన అధిమనస్సే — స్వర్గమని స్పష్టమవుతున్నది. ఈ దృష్టిలో ఇంద్రుడన – ఇంద్రియములను తన స్వాధీనంలో వుంచుకొన్న అధిమనో భూమికలోని దేవతగా భావించినారు. శ్రీ నళినీకాంత గుప్తగారు (శ్రీ అర విందుల శిష్యులలో అగ్రగణ్యులు) "వేదదర్శనంలో కవి" అనే వ్యాసంలో ఈ విధంగా చెప్పిరి. వేదములలోని కవి జీవితానికి సంబంధించిన కవియే. మాన వునిలో దైవత్వాన్ని రూపొందించేవాడున్నూ భూమిమీద స్వర్గాన్ని రూపొందించు వాడున్నూ కవి యని స్పష్టం చేసినారు. కనుక శ్రీ అరవింద దర్శనంలో కవి, భూమిమీద స్వర్గాన్ని ప్రతిష్ఠించుశక్తిగలవాడు అని భావించవచ్చును.

రసములు తొమ్మిదియని పూర్వాలంకారికులు, శృంగారము, కరుణము, హాస్యము, వీరము, రౌద్రము, భయానకము, భీభత్సము, అద్భుతము, శాంతము. క్రమముగా వీని స్థాయీ భావములునూ తొమ్మిది. రతి, శోకము, హాసము ఉత్సాహము, క్రోధము, భయము, జుగుప్స, విస్మయము, శమము అని. శృంగారమొక్కటియే సాహిత్యంలో ప్రవేశింప చేయగల్గిన రసమని కాబోలు మన పూర్వ ప్రబంధకవులు దానికే విశేష ప్రాధాన్య మొసంగిరి. కరుణమే రసమని కొందరనిరి, అద్భుతమే రసమని ఒకరనిరి. ఈ తొమ్మిది రసముల సమగ్ర స్వరూపమే మానవత్వమని భావించవచ్చును. నవవిధరస సముల్లాసరంగ మైన మనస్సుకూ, హృదయానికీ, దీప్తినీ, ఉన్నతినీ, ఉత్సాహాన్నీ కలిగించి నడిపించుప్రజ్ఞ—అలౌకికరసస్ఫూర్తిలో నున్నది. ఈఅలౌకికరసస్ఫూర్తి సాధారణ మనోభూమిక లోనిదికాదు. ఇది పరమప్రశాంతస్థితిలో నిత్యతేజస్ఫూర్తిని కలిగిన అధిమనస్సులోగాని ప్రకాశింపదు. దీనినే ప్రజ్ఞాపారమితగా, బౌద్ధనాగార్జునా చార్యులు దర్శించిరి. ఈ విధమైన అపారమైన ప్రజ్ఞను మానవుడు పొందగల్గి

నపుడు మానవాతీతుడు — మానవత్వాన్ని సరిదిద్ది నడిపించుశక్తి గలవాడునూ కాగలడు. శ్రీ అరవిందదర్శనంలోని అతీతమానవుడు, అధిమనస్సును దాటిన తర్వాత అతీత మనోభూమికలోని మహస్సును పొందినవాడు. ఈ మహస్సు అను మహర్లోకము — భూర్భువస్సువర్లోకములకు ఎగువగా అనగా, సృష్టిలోని అపరార్థములోని అన్న, ప్రాణ, మనోభూమికలకు అతీతంగా - పదార్థంలోని భాగములైన సత్తు, చిత్తు, ఆనందములకు (అనగా సత్య, తపోజనలోకములు) దిగువగా అపరార్థపరార్థముల సంధిలోనున్నది మహస్సు వేదములో పేర్కొన బడిన సప్తవ్యాహృతులు అనగా ఓంభూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం — అను ఏడు లోకాలు. భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములకు అందలి చేతనా విశేషములకు సంజ్ఞలు — మహస్సు విజ్ఞానమయ చేతనకు సంకేతం. అపరార్థ సృష్టికి బీజభూతమైనది యీ విజ్ఞానమేయని చెప్పవచ్చు. అవిద్యావరణం లేని అభేదదర్శనం దీని లక్షణం. దీని దిగువ భూమికనుండియే భేదదర్శనం ప్రారంభమైనది కనుకనే, పృథ్విలోనికి మనస్సు అవతరించిన దాని ఫలితంగా భేదదర్శనులైన మానవులు రూపొందినట్లే, విజ్ఞానం అవతరించినపుడు, అభేద దర్శనులైన అతీతమానవులు పృథ్విపై విలసిల్లగలరని శ్రీ అరవిందులు చాటినారు ఈ విధంగా శ్రీ కమలాకర వెంకట్రావుగారు తమ శ్రీ అరవిందుల సూక్తులు అను గ్రంథంలో స్పష్టం చేసినారు. శ్రీ అరవిందుల తత్త్వదర్శనం ప్రకారం అతీతమానసావతరణం జరగటానికి ముందుగా ప్రస్తుత మానవ చైతన్యము తదనుగుణ్యంగా తననుతాను సరిదిద్దుకొనవలసియున్నది. ఈసరిదిద్దు కొనుటలోకూడ మానవత్వపు స్వయంకృషి కొంత వుండవలసినప్పటికీ, అపరార్థ సృష్టికి బీజభూత మనదగిన మహర్లోకమునుంచి, మనస్సులోనికి అవరోహణ ప్రక్రియలో అందగల సూచనల ప్రసారం_ఇప్పటికప్పుడే ప్రారంభమయినది. అతిమానస విజ్ఞానంలోని అవిభాజ్య తేజస్సునూ, శక్తినీ, అందలి అభేద జ్ఞానాన్ని అందిపుచ్చుకొన్న దిగువ భూమికలోని అధిమనస్సు దానిని నానా ప్రకారములుగా విభజించి దిగువమనోభూమికలకు ప్రసరింప చేస్తున్నది. ఈ అధిమనస్సే ఈ జగత్సృష్టిక్రమాన్ని విభజించి పరిపాలించేపద్ధతిలో ఇంతవరకూ నిర్వహిస్తున్నది. అందుకనియే ఇన్ని మతములూ, నాగరికతలూ, జాతులూ, భాషలూ, కల్గిన మానవజాతిలో నిజమైన ఐకమత్యము స్థిరంగా ప్రకాశించలేదు.

ఇకముందు అతీతమానసం — నేరుగా ప్రత్యక్షంగా — అధిమనస్సు ద్వారాగా కాకుండా - ఈ జగత్సృష్టిక్రమాన్ని తన ఆధిపత్యంక్రిందికి తెచ్చుకొనే కాల మాసన్నమైనది గనుక - శ్రీ అరవిందుల పూర్ణయోగసంసిద్ధి ఫలితంగా శ్రీ అరవింద కర్మధార(Sri Aurobindo's Action)తన కార్యక్రమాన్ని ఇది వరకే ప్రారంభించినది దాని ఛాయలే మన దేశంలో — మానవాభ్యుదయ మార్గాలుగా ద్యోతకమవుతున్నవి. అవి మతాతీత ప్రజాస్వామిక సామ్యవాద రాజ్యాంగ వ్యవస్థగానున్నూ, మన పొరుగుదేశమైన బంగ్లాదేశావతరణలో నున్నూ ఆ దేశంలోకూడా ఆదే విధమైన వ్యవస్థగానున్నూ, అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించి ఆచరణలో పెట్టగల విశ్వమానవవ్యక్తిత్వానికి ఆధార భూతములనదగు ఐకమత్య ధోరణులు మన దేశంలోనేగాక ఇతర దేశాలలో నున్నూ, కొన్ని ప్రత్యేక మానవసమాజాలలోనున్నూ, ఆధ్యాత్మికతకే ప్రాధాన్య మిచ్చిన కొన్ని సామూహిక వ్యవస్థలలోనున్నూ, పరిణతి చెందిన కొందరు వ్యక్తులలోనూ, దౌర్జన్యాన్ని విడనాడి సమస్యలనుసామరస్యంగా పరిష్కరించుకో గలమనే అంగీకారాలు — భారత పాకిస్తానులమధ్య కుదరడంలోనూ — ప్రతి ఫలించుచున్నవి. ఇక ముందు ముందు ఈ ఛాయలు వెలుగులై స్పష్టమైన విశ్వ మానవతా దృక్పథము ప్రకాశింపవలసియున్నది. సాంస్కృతిక రంగంలో ప్రధానమైన స్థానాన్ని కలిగిన సాహిత్యంలోకూడ — మానవులమానవులమధ్య— జాతినిబట్టి, మతమునుబట్టి, భాషనుబట్టి, ఇంతవరకూసాగుతూ వచ్చినవిభేదజ్ఞాన మున్నూ దానికి సంబంధించిన విద్వేషపూరితమైన అతిశయ తత్త్వమున్నూ ప్రకోపింపచేసే ఫాసిస్టు ధోరణులను — తొలగించగల — ఒకవిధమైన విశ్వ మానవతా దృక్పథం ఇదివరకే ప్రవేశించి వికసించి అనేకమార్గాలుగా విస్తరిల్లు తున్నది.

మన సాహిత్యంలో 1910 — ఆ ప్రాంతం వరకూ, శృంగారానికీ, దానికి అంగములయిన ఇతర విభావానుభావాలకూ ఇచ్చినంత ప్రాధాన్యత, శాంత రసమునకూ, దానికి స్థాయీభావమయినశమమునకూ దానికి విభానుభావాలన దగిన సత్యమునకూ, తేజమునకూ, ఓజస్సునకూ, స్వతఃస్ఫురణలతోకూడిన ఉన్నతోన్నత ఐక్య జీవితాదర్శములలోని రసస్పందనలకూ — ఇవ్వలేదు.

1910లో శ్రీ అరవిందులు పూర్ణయోగదర్శనాన్ని పొందిఉన్నతోన్నతమనో భూమికలలోని పరమ ప్రశాంతస్థితిని చేరుకొని క్రమముగా ఆపైనిదగు అధి

మనస్సునూ, ఆపైనిదగు అతిమానస పొలిమేరలనూ దర్శించినారు. ఆయా భూమికలలోని సత్యతేజస్ఫూర్తులను శ్రీ అరవిందులు ఇప్పటి ప్రపంచంలో ఎక్కువగా పరివ్యాప్తంలోవున్న ఆంగ్లభాషద్వారా, బహుముఖాలుగా, తత్త్వ. సాహిత్య.నాటక.కవిత్వ ప్రహేళికలలో బహుళంగా అభివ్యక్తం చేసినారు. దాని ప్రతిఫలాలే 'The Life Divine, Savitri' మొదలగునవి. సావిత్రినిగురించి ప్రత్యేకంగా చెప్పవలసియున్నది. ప్రపంచ సాహిత్యాలలోకెల్లా సావిత్రిది ఒక ప్రత్యేకమైన స్థానము. సావిత్రిలో ప్రతిచరణమూ, అందలి భావమూ, భావ, ఊహాచిత్రాలూ, సంకేతాలూ, మొదలగు విశృంఖల కవితావ్యావృత్తులు — ఒక్కొక్కటి, ఒక్కొక్క ఉన్నతయోగ స్పందనంలాగా మనస్సును ఉన్న తోన్నత భూమికలకు తీసుకొనిపోగలవు. ఇక The Life Divine ఇంతవరకు వచ్చిన తత్త్వసాహిత్యాలలో కనిపించని ఒకవిశిష్ట సమన్వయ దృక్పథాన్ని, అతీత మానసావతరణ దర్శనాన్ని కలిగించిన ప్రప్రథమ తత్త్వదర్శనంగా భావించవలసి యున్నది. భావి మానవ నాగరికతాదర్శనంలో శ్రీ అరవిందుల 'The Life Divine' శృతిస్మృతుల స్థానాన్ని పొందినది.

1910లో స్పందించిన శ్రీ అరవిందుల భావవీణ - పలికిన రాగాలు నాటి ఆంధ్రసాహిత్య ప్రపంచంలోకూడ ప్రతిస్పందింపడంలో ఆశ్చర్యపడవలసిన దేమియూలేదు. అయితే నాటి సాహిత్యంలోవున్న చైతన్యశక్తియొక్క స్థాయిని బట్టి, ఆప్రతిస్పందనలు భాషలో అనువదింపబడినవని మాత్రము గట్టిగా చెప్ప వచ్చును. నాటి సాహిత్యమునకు సాహితీ సమితియను సంస్థ తెచ్చిన వికాసము చెప్పుకోదగ్గది. నాటి కవిప్రముఖులలో చాలామంది సాహితీసమితిలోనివారే. శ్రీ విశ్వనాథ. రాయప్రోలు, దేవులపల్లి, వేదుల సత్యనారాయణశాస్త్రి, నాయిని సుబ్బారావు, శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, నండూరి సుబ్బారావు, అడవి బాపిరాజు, ప్రభృతులు అగ్రశ్రేణిలోనివారు. వీరుకాక శ్రీ జాషువా, దువ్వూరి రామిరెడ్డిగార్లు కలరు. వీరందరు ఒక్కొక్కరు ఒక్కొక్క పద్ధతిలో ఆత్మాశ్రయ కవిత్వమను భావప్రధానమైన కవిత్వమును చెప్పినవారే. నాటి భావకవిత్వ ప్రస్తా పనే ఈవ్యాసోద్దేశ్యము వస్త్వాశ్రయమైనకవిత్వానికి భిన్నంగా వచ్చినఆత్మాశ్రయ కవిత్వంలోనే ఎక్కువగా ఉన్నతోన్నతమనోభూమికలలోని సత్యతేజస్ఫూర్తులు ప్రకాశించినవి. ఈ విధమైన ప్రకాశములో ఒక నవ్యమానవతాదర్శనము. కలిగినది. ఒక్కొక్క ప్రముఖకవి ఒక్కొక్కరీతిగా విశ్వమానవ కళ్యాణానికి

వైతాళికులుగా విశ్వమానవత్వ లక్షణాలను వెదజల్లిరి. ఈవిధమైన విశ్వమానవత్వ ప్రస్తావనే దివ్యమానవావతరణకునాంది యనదగినది. ఈ కవులు ప్రదర్శించిన కవితాలావణ్యము ఈ వ్యాసప్రారంభంలో ప్రస్తావించబడినట్లు స్వర్గలోకపు దేవతా సౌందర్యానికి మెరుగులు దిద్దునట్లున్నది. మానవునిలో దైవత్వాన్ని దర్శించుటలో ఈ కవులు కృతకృత్యులైనారని చెప్పవచ్చును. పైగా శ్రీ అరవిందుల దర్శనంలోని వేదకవులువలె మానవునిలో దైవత్వాన్ని రూపొందించడమేగాక భూమిమీద స్వర్గాన్ని (ఊహామాత్రంగా మాత్రమే) రూపొందించడంలో కూడ ఇంచుమించు కృతకృత్యులైనారని చెప్పవచ్చును.

ఆత్మాశ్రయ కవిత్వానికి ప్రధానలక్షణము అంతర్ముఖత్వము. ఈ విధ అంతర్ముఖత్వములో ఒక విశిష్టమైన ఆధ్యాత్మికశక్తి సంపన్నతగలదు. కఠోపనిషత్తులో చెప్పినట్లు,

"పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః
తస్మాత్పరా జ్పశ్యతి నాం తరాత్మన్
కశ్చిద్ధీరః ప్రత్యగా త్మానమైక్షత్
ఆవృత్తచక్షుః అమృతత్వ మిచ్ఛన్".

అనగా బ్రహ్మ ఇంద్రియములను బహిర్ముఖములుగా చేయుటచేత అవి బహిః ప్రపంచమును మాత్రమే చూడగలవు. లోనవున్న అంతరాత్మను చూడలేవు. ఒకానొకధీరుడు ఆ ఇంద్రియమును వెనుకకుత్రిప్పి అంతరాత్మను దర్శించి అమృతత్వమును పొందునని భావము.

నాటి సాహితీ సమితి కవుల అంతర్ముఖత్వలక్షణములో అమృతత్వపు పొలిమేరలు గోచరించును. ఆత్మార్పణతత్త్వము ఆరాధనతత్త్వము పాదులు తన్నుకొన్నవి. అంతశ్చేతనములోని చైతన్యము హద్దులుత్రెంపుకొని వెలువడినదని, ఈ కవుల ఆత్మాశ్రయ కవిత్వాన్ని విశదీకరిస్తూ డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు తమ Ph D. కి కారణమైన ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రస్తావించినారు. మరియు "సామాన్యమైన లౌకిక సంతోషమునకు బదులుగా సర్వేసర్వత్ర అలౌకికానందమంచులు తీర్చికొన్నది. ప్రకృతి వర్ణనలలో బాహ్యవిషయములకు బదులుగా సుకుమారమైన సౌందర్య తత్త్వమును నిర్దేశించుట జరిగినది. అనగా

చర్మచక్షువుకు కనిపించిన ప్రకృతికాక, మనోనేత్రమునకు భాసించిన ప్రకృతియే వర్ణ్యమైనది. జాతికి సర్వాంగ వికాసము కలిగించు సంప్రదాయ సిద్ధమైన సంస్కారదృష్టి కలిగినది. తాను విన్న కన్న ఏచిన్న సంఘటనయైనను తన హృదయ తంత్రులను ఝుమ్మనిపించి, కవిత్వరూపమున వెలిజిమ్ముకొని వచ్చినది. కవి తనవ్యక్తిత్వమును విస్మరించి, ఇతరుల సుఖదుఃఖములలో లీనమైపోయెడిస్థితి ఏర్పడినది." అనికూడా నాటి ఆత్మాశ్రయ కవిత్వమును గూర్చి శ్రీ నారాయణరెడ్డిగారు పరిశోధనచేసి తెలియజేసిన విషయాలు. ఈ పై చెప్పిన లక్షణాలలో ఉన్నత కవితారీతులు శ్రీ అరవిందుల దర్శనంలోని ఉన్నత జీవిత లక్షణాలు ప్రకాశిస్తున్నవి. ఉదాహరణకు — కళాప్రపూర్ణ, పద్మవిభూషణ, కవిసమ్రాట్టు బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్ప వృక్షంలోని స్త్రీ, పురుష పాత్రలవర్ణనలన్నియూ ఆత్మసౌందర్యాన్ని — గుణ సౌందర్యాన్నీ మహోదాత్తంగా అభివ్యక్తము చేసినవి.

"కౌసల్య ముక్తికాంతాసమానాకార నతి సుమిత్ర ఉపాసనా స్వరూప.... సుమిత్ర శాంతగుణపేటిక — కేకయరాజపుత్రీ హేలారతిడాదురేకుల తళత్తళ కాటుక రాజుకంటికిన్".... శ్రీరామచంద్రునికి లభించిన జానకీదేవి ప్రథమ దర్శనాన్ని కవి ఈవిధంగా ఊహించినారు.

"తన సృష్టిలోని ఉత్తమ భావమానందముగపొంగి బింబమై పొడిచినట్లు జన్మజన్మాంతర సంగతంబైన ఆశాబలంబవధికి సాగినట్లు—." వారి రామాయణ మంతటిలో చూపించ తలచిన ఉదాహరణలు ఎన్నోకలవు, కాని ఈ వ్యాసము చాలదు.

శ్రీ వేమల సత్యనారాయణశాస్త్రిగారి "ఆహ్వానము"లో

"నిత్యహింసాదిరంసావి నిద్రరుద్ర
భవనవాటికా ద్వార కవాటములను
తెరచుకొని, యో యమృతశాంతి! దివ్యకాంతి!
నీ సుఖస్వప్నలోక శోభా సమీర
చాలిత విశాల పక్షాంచలాలు సోకి
తూలిపడిపోవు బాధాతి వేల హృదయ

వేదనా జాలముల ద్రోసివేసికొనుచు
అ స్తగిరివాసినీ! జీవితా రసాన శైశిర
తమోభిసారికా! స్వప్నరాజ్ఞీ,
ధిక్కృత ప్రేమ చరమాతిథీ! మహోద్ధి
పార దోర ప్రవాసినీ! ప్రాణశాంతి గాయినీ!"

అమృతశాంతికీ, దివ్యకాంతికీ తన జీవితంలోకి ఆహ్వానించడమున్నది. శ్రీ వేదులవారి ఖండకావ్యము "దీపావళి" యంతటా ఒక సుకుమారమైన ప్రేమమయమూర్తి, దర్శనం కలుగుతుంది. ఆ మూర్తి ప్రయోజనకారిగానటు వంటి నివృత్తిమార్గంలోని సన్యాసికాడు. అతడు గొప్పదేశభక్తుడు—సామ్యవాదీ-తనచుట్టూవున్న సంఘంలోని నికృష్టజీవితానికి అడుగడుగునా కరిగిపోవునట్టి సుకుమార హృదయుడు.

"నీచపు దాస్యవృత్తి మననేరని శూరత, మాతృదేశ సే
వా చరణమ్మనం దసువులర్పణ జేసినవారి పార్థిత
శ్రీ చెలువారు చోట. దదస్ృగుచులన్ వికసించి, వాసనల్
వీచుచు రాలిపోవగ వలెం దదుదాత్త సమాధి మృత్తికన్."

"కామకనై ధరాధిపుల కాళ్లకడం బొరలాడి వాడిపోలేను"

శ్రీ విశ్వనాథవారి "ఆంధ్రప్రశస్తి" లోని జాతీయత, ఒక సునిశిత. విమర్శనా పూర్వకమైన ఆదర్శము గలది. వారి సర్వకావ్య సముచ్చయంలో ఒక విశిష్టమైన నవ్యమానవత్వ దర్శనం కలుగుతుంది. వారి రచనలలో ఒక విశ్వ జనీనతా సౌకుమార్యము. దివ్యత్వపు పొలిమేరలను తాకిన సౌందర్యారాధనము, ఉదాత్త మానవత్వంలోని లోకశ్రేయస్సును పాటించే ధర్మదీక్షను గల్గిన నవ్య మానవ దర్శనం కలుగును. వారి శ్రీరామచంద్రుడు శ్రీ అరవిందుల దర్శనం లోని అధిమనస్సు పొలిమేరలలోని పురుషోత్తముడుగా భాసించినాడు.

తన కవిత్వ లక్షణాన్ని శ్రీ విశ్వనాథ "స్నానసుందరి"లో ఈవిధంగా చెప్పుకొనినారు.

"నా కవితన్ విశాల జఘనా! ఒక యౌచితిలేదు — భాషలే
దాకృతిలేద. యూరక రసాత్మతనే ద్రవియించి పోదు — నీ
వాకృతి అందమాచిన రసాత్మవు. నీకును నీకభిన్నతా
శ్రీకత కల్గినఁ పులకరించెను పొమ్మురస ప్రపంచముల్.

ఆకృతి, అందమాచిన రసాత్మతను దర్శించిన కవి తాను పులకరించడమే కాదు సమకాలిక సాహిత్య ప్రపంచాన్నే పులకరింపచేసినాడు. ఈ అభిన్నతా శ్రీకతయే — అతి మానసావతరణానికి నాందీ ప్రస్తావన చేస్తుంది. ఆంధ్ర సాహిత్యంలో అంతకుముందులేని ఒకవెలుగునూ, ఓజస్సునూ ఒక దర్శనాన్ని కలిగించిన కవియే శ్రీ విశ్వనాధ. శ్రీవిశ్వనాథ ఒక్కడేకాదు. వారి సమకాలికులలో ప్రముఖులు శ్రీరాయప్రోలు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ నాయని సుబ్బారావు. ప్రభృతులు 1910 ఆ ప్రాంతంనుంచి రెండవ ప్రపంచ యుద్ధం ముగిసినదాకా అనగా 1945 ఆప్రాంతందాకా ఆంధ్ర సాహిత్యానికి ఒక వినూత్న మానవత్వ దర్శనాన్ని విశ్వమానవత్వ దృక్పథంలో కలిగించినారు.

శ్రీ అరవిందులు దర్శించిన అతీతమానవత్వాన్ని సాహితీసమితి కవులుగాని ఆ కాలములో ఇతర అత్మాశ్రయరీతులలోవ్రాసిన కవులుగాని. దర్శించలేదనియే చెప్పవచ్చును. కాని శ్రీ అరవిందుల దర్శనంలోని ప్రధావభాగమైన ఉన్నతోన్నత మనోభూమికలలోని భావచిత్రాలనూ, రసస్పందనలనూ, స్పష్టంగా అభివ్యక్తం చేయగల్గినారని మాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చును. వాటి ఉదాహరణలకు ఈ వ్యాసంచాలదు.

శ్రీ నాయని సుబ్బారావుగారి ప్రణయతపస్వినిగురించి ప్రస్తావించకపోతే ఈ వ్యాసం అసంపూర్ణమవుతుంది. శ్రీ నాయనివారి నవ్యమానవుడు—ప్రణయినీ మనోజ్ఞసాచిప్రసారేక్షణంలో కరిగిపోయిన అంతరాత్మకలవాడు- ఇంకా— "మనము మన శరీరమ్ములనుమాట మరచి మనసులనుదాటి ఊహకందని విధాన ఐక్యమైపోయియేగుచున్నప్పుడచట మనమెరుంగని ఎవ్వరో మనలనెపుగు ఇదియొక్క సునిశితతత్వదృష్టి-నా చిరునగవునీవు-నాప్రమాణమ్మునీవు-నాపరము నీవు-నా పరాత్పరము నీవు నిముసనిముసమ్ము నిట సమున్మిషిత, లావకాంఘ్రి వీరేజ దివ్యరేఖాంకమిదియు శబలిత విచిత్రరోచిరుజ్జ్వల మలోక మధుర సౌందర్య

సోపానమండి తమ్మునాదు భాగ్యమ్ము నాలోన నాకెవెఅగు. నీవధిష్ఠించుభద్రపీఠీ విరాజమాన మాణిక్య కాంతులుమలసిమలసి విశ్వవీధుల ప్రణయముల్ వెల్లి విరియు ఈయమృతరాజ్యమున మనమిద్దరమును-నీవు రాజ్ఞివి నేను నీసేవకుడను అంతశ్రమపడి పావనమభ్రగంగధారుణికితెచ్చినాడు భగీరథుండు_అంతమథి యించి కలశరత్నాకరమ్ము అమృతభాండమ్ముపడసినా రమరవరులు. మత్పూ రానేకపుణ్యజన్మములుపండి జాహ్నవీ స్వచ్ఛవును సుధాస్వాదుమూర్తివయిన నీ దివ్యసాన్నిధ్యమందుకొంటి పుడమికిన్ స్వర్గమున కొక్క_ముడిరచించి_" ఈవిధంగా ఈ నవ్యమానవుడు తన ప్రణయినీ ధ్యానములో పుడమికిన్ స్వర్గ మున కొకముడిరచించుటకు రసవంతంగా ప్రయత్నించినాడు. పూర్వకవులచే ప్రసారమయిన సామాన్యమానవులమధ్య ప్రణయాన్ని శ్రీ నాయిని దివ్యప్రణ యంగా పరిణామంచెందించినారు. "వాక్యం రసాత్మకం కావ్యమ్"అన్న విశ్వ నాధుని కవితాలక్షణము భావకవిత్వంలో బహుళంగా ద్యోతకమవుతుంది. కవిత్వంలో రససిద్ధి, యోగంలో సిద్ధినిపోలగలస్థితికి రావలసియేయున్నది, ఉత్తమ కవిత్వంలోని రససిద్ధి ఇంతవరకూవచ్చిన సాహిత్య చరిత్రలో ఎంతగా పరి శీలించిననూ తాత్కాలికమూ లేక తక్షణమూనైన పరివర్తనాన్ని మాత్రమే మానవునిలోసాధించగలిగినదేమోగానిపూర్ణయోగంలోలాగ శాశ్వతపరివర్తనాన్ని లక్షించి సాధించగలిగినప్పుడుగాని అట్టి కవిత్వంలో ఉత్తమ జీవితం ప్రతిబిం బితముకాదు. మొత్తంమీద నాటి ఆత్మాశ్రయ కవిత్వరీతులలో చెప్పుకోదగ్గ ఉత్తమజీవిత లక్ష్యములు రమణీయార్థ ప్రతిపాదికంగా కాంతాసమ్మితంగానే అంతకుముందు సాహిత్యచరిత్రలోలేని ఉన్నతపద్ధతిలో వ్యక్తముకాబడినవి. ఇదంతా శ్రీ అరవిందుని పూర్ణయోగప్రభావంవలనకలిగిన భావపరివర్తనమూ లేక మానసిక పరివర్తనమేనని చెప్పవచ్చును. ఒకచోట త్రవ్వబడి విస్తరింప బడిన పంటకాల్వ ప్రయోజనం పరిసరభూమికీ మానవునికి ఏవిధంగా ప్రాప్తమో- పైనుంచి భూమిపై స్రవించే వర్షధారలు_సర్వమానవులకూ ఏవిధంగా ప్రయోజన కారియో-శ్రీ అరవిందుల పూర్ణయోగసిద్ధివలన సమకాలిక భావప్రపంచము పుల కరించక తప్పలేదు. పైన చెప్పిన ఉదాహరణలలోనేగాక ఇచ్చట ప్రస్తావించ డానికి వీలుగానివెన్నో ఉన్నతభావస్ఫోరకములూ శాంతి రససంధాయకములూ, దీప్త్యుత్సాహకారకములూ అయిన ప్రకృతి వర్ణనలు, భావచిత్రములు, ఊహా చిత్రములు రమణీయములైన సంకేతములు,యోగసిద్ధి క్రమంలోకలిగే చిత్కళా

దర్శనములవలె, నాటి భావకవిత్వంలోనేగాక, కధ, నవల, నాటిక వగైరా అనేక సాహిత్యప్రక్రియలలోగూడ అంతకుముందులేనంతగా పరివ్యాప్తము కావింపబడినవని నాటి కవితాప్రపంచమును నిశితంగా పరిశీలించినవారికి విశదముకాగలదు. ఇట్టి ఉత్తమప్రయోజనము పూర్ణయోగంలో లక్షింపబడిన పరిపూర్ణమూ శాశ్వతమూ కాగల దివ్య పరివర్తనాన్ని కలిగించగల అతిమానసావతరణానికి నాందియనిమాత్రమే-ప్రథమదశ యనిమాత్రమే— చెప్పవచ్చును.

# శ్రీ అరవిందులు - వారి దర్శనము

—— జి. సత్యనారాయణ

శ్రీ అరవిందులు 1872 ఆగష్టు 15న కలకత్తాలో జన్మించిరి. వారి తల్లిదండ్రులు సువర్ణలతాదేవి, కృష్ణధన్ ఘోషులు వారి విద్యాభ్యాసము ఇంగ్లండులో ముక్కుపచ్చలారని 7వ యేటనుండి 14 వత్సరములు జరిగింది. I. C. S. పరీక్షయందు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులగుటయేగాక, పాశ్చాత్య సకల భాషా కోవిదులైరి. 1893లో స్వదేశానికి తిరిగివచ్చిరి. మాతృభూమిపై కాలిడిన తోడనే భావిసత్య – తేజోమయ జీవితానికి నాంది యన్నట్లుగా వారిలో అపార శాంతి అవతరించింది తదుపరి బరోడాలో 13 సంవత్సరాలు ఉద్యోగనిర్వహణ గావించిరి. ఈ కాలంలోనే బెంగాలీ, సంస్కృతాది భారతీయ భాషలలో పాండిత్యసంపాదన చేయడమేగాక యోగసాధన మభ్యసించిరి. తదుపరి రాజకీయరంగంలో దుమికిరి. జాతిని జాగృతంచేసి, దేశంయెడల మాతృభక్తినీ, జాతీయతనునేర్పి, స్వధర్మమును బోధించి అనతికాలంలోనే రాజకీయయోధుడనిపించుకొన్న సునిశితమేధావి శ్రీ అరవిందులు. రాజకీయాలు కారణంగా అలీపూరు జైలుశిక్ష అనుభవించారు. కాని జైలులోనే వారికి సర్వము వాసుదేవమయముగా దర్శనం కల్గింది. దానితో వారికి తమ జీవితధ్యేయం దృగ్గోచరమైంది.

భగవదాదేశానుసారం 1910లో పాండిచేరి చేరి శ్రీ అరవిందులు యోగ సాధనతోపాటు 'ఆర్య' అనే పత్రికాముఖమున ఉత్కృష్టరచనల వెలువరించిరి. ప్రస్థాన త్రయమగు వేద ఉపనిషద్గీతలకు భాష్యములేగాక, 'దివ్యజీవనం', 'యోగ సమన్వయం', 'మానవ సంఘటితాదర్శం', 'భారతీయ సంస్కృతి పునాదులు'. 'సావిత్రి' వాటిలో మకుటాయమానములు.

శ్రీ రామకృష్ణ పరమహంస శిష్యులందరిలో శ్రీ వివేకానందుని తన ప్రతినిధిగా ఎన్నుకొనినట్లుగా, ఆ పరమేశ్వరుడే శ్రీ అరవిందులను తన ప్రతినిధిగా నెన్నుకొని తన సృష్టి రహస్యమును వారిద్వారా చాటెనాయన్నట్లు సృష్టి పరిణామక్రమంలో మానవుని తర్వాత చైతన్యమయ, ఆనందమయ, విజ్ఞానమయ

రూపుడు (Superman) ఉద్భవించునని శ్రీ అరవిందులకు తన యోగసమాధిలో యెరుకపడెను. తత్ఫలసిద్ధికొరకు వారు ప్రవచించిన యోగసాధన మార్గమే శ్రీ అరవిందుల వినూత్న 'పూర్ణయోగము'.

అపరాప్రకృతికి చెందియున్న దేహ మనః ప్రాణములను పరాప్రకృతి కనుగుణముగా రూపాంతరము నొందించి, పృథ్వీజీవనమును దివ్య జీవనముగా పరివర్తనము గావించుటయే దాని లక్ష్యము. అనగా మానవుడు యోగసాధనచే తన పరిధులనుదాటి ఆసురీప్రకృతినిపై తము దివ్యపరివర్తనమొందించి దివ్యజ్ఞాన స్ఫూర్తిచే దివ్యోపకరణముగ రూపొందుట. తదాశయ సిద్ధికొంకే శ్రీ అరవిందాశ్రమమందు శ్రీ మాతృమూర్తి పర్యవేక్షణములో జరుగుచున్న ప్రయోగము. ఈ ప్రయోగ సాఫల్యతను వేగిరము చేయుటకు శ్రీ అరవిందులు 5-12-1950న తన భౌతికకాయమును త్యజించి సూక్ష్మ ప్రపంచంలో యోగక్రియను సాగించు చుండిరి. తత్ఫలితముగా 1956 ఫిబ్రవరి 29 తేదీన అతీత మానసచైతన్యశక్తి (Supramental Consciousness)శ్రీమాత ద్వారా భూకక్ష్యలోనికి అవతరించింది. ఈ శక్తి ప్రభావముచే యిక 'అతీత మానవుడు' (Superman) పరిణామగతిలో రూపొందవలసియున్నది.

పూర్ణయోగద్రష్ట, పూర్ణయోగయోగీశ్వరుడైన శ్రీ అరవిందులు జన్మించి 15-8-1972 నాటికి శతవర్షములు నిండును. శతజయంతి ఉత్సవములు ప్రపంచమంతటా వైభవముగా జరుగనున్నవి. ఈ శతజయంతి సందర్భముగా మానవాళి యావత్తూ అజ్ఞాన తిమిరమునుండి బయటపడి, శ్రీ మాతారవిందులు భూమికిగొనితెచ్చిన 'అతీతమానసచైతన్య ప్రభావితులమై విలసిల్లునట్లుగా అనుగ్రహింప శ్రీ మాతారవిందుల ప్రార్థిస్తూ, వారి పాదారవిందములకు నమోవాకములతో___

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

———

# దివ్య చరణములు

— వి. అంజిరెడ్డి

అరవింద ! నీ యంద యలరు నాడెంద
మరవిందము విధాన ననవరతమ్ము,
త్రికరణశుద్ధిగా తెఱచిన మదిని
ఇక నీదుమూర్తియే యినురీతి తోచు.

జగము నంతట కాంచితి నగపడితివి
మనము నంతట చూచితి కనపడితివి
ధ్యాన గానాల అరవింద తపసి కదలు
నాదు జన్మము ధన్యము నీదుపజ్జ,

జీవనార్ణవ మెల్లను చిలికి చిలికి
జ్ఞాన పీయూష మందించి నావు మాకు,
సర్వకష్టాలు సయిరించి చలువవెలుగు
బాటనొక్కటి జనులకు పరచినావు.

స్వార్థచింతన విడనాడి స్వామి ! నిన్ను
పుష్పగుచ్ఛాల ముంచెత్తి పూజచేసి
బ్రతుకు నంతయు నీరీతి పావనముగ
గడుపుదు జనన ఫల మింతకలుగునాశ.

వేదసారము మదమార విశదపఱచి
యతుల పథమున తొలగక జతగ నడచి
నవ్యజగతికి నిష్ఠ మౌదివ్యవాణి
పలికి పలికించి మము కావవెలిగినావు.

"అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"
'తథాస్తు' పలికిన శ్రీ అరవింద ! నమోస్తు.

# శ్రీ అరవిందాశ్రమము

— శ్రీమతి వి. సంయుక్తారెడ్డి

## ఆశ్రమము

శ్రీ అరవిందాశ్రమము ఒక ప్రకాశవంతమైన ఆదర్శవంతమైన పుణ్య స్థలము. ఈ మాదిరి ఆశ్రమము ఇంకెక్కడా లేదు. ఇక్కడ సాధకులు కాషాయవస్త్రాలు ధరించరు. సాధారణ దుస్తులు ధరించి మనవలె ఏదో ఒకపని చేస్తుంటారు. బాహ్యంగా ఈ ఆశ్రమము అన్ని సంస్థల వలెనే కన్పించును. ఇక్కడ అన్నిపనులు, వృత్తులున్నవి. కర్మాగారాలు, ముద్రణశాల, సినిమా, వ్యాయామశాల ఇత్యాది అన్ని విభాగాలు ఉన్నవి. కాని అంతరంగికంగా, ఆధ్యాత్మికంగా ఇక్కడి సాధకులు ఉన్నతస్థాయికి చెందినవారు. వీరిది ప్రపంచాన్ని విడిచిపెట్టే వేదాంతముకాదు. కాని ఇక్కడఉండి, మన సామాన్య ప్రపంచాన్ని మార్చే ప్రయత్నం చేస్తారు. శ్రీ మాత అంతరంగిక వైరాగ్యాన్ని పెంపొందించుకొనవలెనని ప్రోత్సహిస్తుంది బాహ్యావేషభాషలకు, అడంబరాలకు తావియ్యదు. ఇక్కడ సుమారు 1500 సాధకులు ఉంటారు. ఇందులో స్త్రీలు, పురుషులు ఉన్నారు.

## సమాధి—పుష్పముల గూడార్థము

ఆశ్రమ ప్రాంగణములో శ్రీ అరవిందసమాధి రకరకాల పుష్పములతో అలంకరింపబడి ఉంటుంది. ఇక్కడ పాతపద్ధతులు ఏమియులేవు. కొబ్బరికాయలు కొట్టరు. వాతావరణము ప్రశాంతంగా ఉంటుంది. సమాధిని పుష్పములతో అలంకరించేందుకు నలుగురైదుగురు సాధకులు ప్రాతఃకాలము 4–30 నుంచి ఇదేపని చేస్తారు 4–30 కి ఆశ్రమ ద్వారము తెరువబడుతుంది. అప్పటినుంచి సాధకులు సమాధివద్ద ధ్యానం కొరకు వస్తారు. సమాధికి చాలా ప్రాముఖ్యతున్నది. ఇక్కడ కొందరికి దివ్య అనుభూతులు కలుగుతాయి, ఎంతదుఃఖముతో పీడింపబడిన వాడైనా సమాధివద్ద కొన్ని నిమిషాలు కూర్చుంటే మనశ్శాంతి కలుగును. దీనిని "సమాధి అద్భుత" (Samadhi miracle) మనవచ్చు. ప్రపంచంలోని అన్ని దేశాలనుంచి యాత్రికులు ఇక్కడికివచ్చి సమాధి దర్శనం

చేసుకొంటారు. సమాధిలో శ్రీ అరవింద దివ్యశక్తి సజీవంగా ఉన్నదని అందరికి ప్రగాఢ విశ్వాసము.

దైవము – మనుష్యుల మధ్య పుష్పములపాత్ర అతి ముఖ్యము. మన ఆకాంక్షలన్నిటిని పుష్పములు దైవమునకందజేస్తవి. మళ్లా అవి తిరిగి దైవ కృపాకటాక్షాన్ని మనకు ప్రసాదిస్తవి. అందుకొరకే మనము శ్రీ మాత వద్దకు పోయేటప్పుడు పువ్వులను తీసుకపోయి వారికంద జేస్తాము. మళ్లీ తల్లిగారు మనకు పుష్పము ప్రసాదిస్తారు. శ్రీ మాత ఎన్నో పువ్వులకు పేర్లు పెట్టినారు. ప్రతిపువ్వ ధర్మం శ్రీ తల్లిగారికి తెలుసును. ఆశ్రమములో "పుష్పవిభాగం" (flower service) అనే ఒక విభాగమున్నది.

## కర్మ–దాని ఆవశ్యకత

ఇదివరకు ఎందరో మహనీయులు 'కర్మ' మీద వ్యాఖ్యానించినారు. Tolstoy, Gandhiji ప్రభృతులు కర్మను శ్లాఘించినారు. శ్రీ తల్లిగారు కర్మను పూజతో పోల్చినారు. "Work is worship" అని అన్నారు శ్రీ మాత. ప్రతిసాధకునికి కనీసం 5 గంటల కర్మ ఉండవలెను. కేవలం ధ్యానం, జపము తోనే సాధకుడు. ఆధ్యాత్మిక పథంలో త్వరగ పురోగమించడు. కర్మద్వారా సాధన తీవ్రగతిదాల్చుతుంది. ఇక్కడ ఒక కర్మకు ఇంకొక కర్మకు భేధం లేదు. ఏదైనను సాధనకు దోహదపడగలదు. రచనాకార్యక్రమము. వడ్రంగి పని, ముద్రణాలయంలో composing పని—అన్ని పనులుసమానంగా సాధకునికి దోహదపడుతవి.

## విద్యా కేంద్రము

ఆశ్రమములో ఒక విద్యాకేంద్రమున్నది. ఇది 1941లో స్థాపింపబడ్డది. దీనిపేరు 'శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాకేంద్రము.' సుమారు 1000 బాల బాలికలు ఈ విద్యాకేంద్రంలో చదువుతున్నారు. ఉపాధ్యాయులందరు సాధకులే. ఉచితంగా చదువుచెప్పుతారు. పరీక్షలనేవి ఉండవు. విషయంవారీగా పిల్ల వాడు చదువుతాడు. అనగా ఒక విద్యార్థి ఆంగ్లములో 7వ తరగతిలో చదువు కుంటూ లెక్కలలో 6వ తరగతిలో యుండవచ్చు. క్లాసువారీగా promotion ఇవ్వరు. విషయంవారీగా ఉంటుంది. ప్రతిసంవత్సరం పుస్తకాలు చదివి,

విద్యార్థి కొన్నివ్యాసాలు వ్రాస్తాడు. ఇక్కడ పట్టాలు లేక Certificatesఇవ్వరు. ఇక్కడిది "పొట్ట విద్యావిధానం" కాదు. మనిషి అంతరంగిక సంపదను పెంపొందించే కొరకు ఈ విద్యదోహదపడుతుంది.

వ్యాయామమునకు చాలా ప్రాముఖ్యతను ఇస్తారు. శరీరము ధృఢముగా యుండవలెను. ప్రతిరోజు కనీసం రెండు గంటలు వ్యాయామము, క్రీడాకార్య క్రమములలో ప్రతి విద్యార్థి తప్పక పాల్గొనవలెను. పలురకములైన క్రీడ లున్నవి. ఏదో ఒకదానిలో పాల్గొనవలెను.

## శ్రీ అరవింద దర్శన వైశిష్ట్యము

తత్త్వ ప్రపంచములో శ్రీ అరవిందుల దర్శనము ఒక విప్లవాత్మకమైన మార్పు తెచ్చింది. నవయుగానికి, ఇది ఒక నాంది. వేదోపనిషత్తుల తర్వాత ఇంత గొప్పమార్పు ఏ ఆచార్యుడు కూడా తేలేదు. ఆచార్యులు కేవలం ఉన్నదానిమీద వ్యాఖ్యానించినారు. కొత్త తత్త్వప్రణాళికను సృష్టించలేదు. శ్రీ అరవిందుల అతి మానసికతత్త్వము కనివిని ఎరుగని మార్పు తెచ్చింది. క్లుప్తంగా వీరి దర్శనమునుగురించి ఈలాగా చెప్పవచ్చు. సృష్టి పుట్టినప్పుడు కేవలం పదార్థం ఉండెను. దానితర్వాత కొన్నియుగాల అనంతరం ప్రాణికోటి పుట్టింది. మళ్ళీ కొన్నియుగాల తర్వాత మనుష్యుడు పుట్టినాడు. అనగా పరిణామ క్రమములో 3 మజిలీలు కనబడుతాయి_పదార్థం, ప్రాణికోటి, మనుష్యుడు. శ్రీ అరవిందుల ప్రకారం మనుష్యునితో పరిణామసరణి ఆగదు. అతి మానసిక మజిలీ ముందు రాబోతుంది. తత్ఫలితంగా అతిమానవుడు ఆవిర్భవించును. దేవజాతి మరొకటి ఈ భువియందు అవతరించును.

## సమగ్ర లేక రూపాంతర యోగము

ఇదివరకు కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం, రాజయోగం అని వినియున్నాము. ఇప్పుడు శ్రీ అరవిందులది సమగ్రయోగం. సమగ్రయోగ మంటే సమన్వయయోగంకాదు. 'కలగూరగంప' యోగమూ కాదు, ఆశ్రమములో సాధకులు ఒక నిర్దిష్టయోగాన్ని అవలంబించరు. ఏది నచ్చితే దాన్ని అవలం బించుతారు. మొత్తానికి చిత్తశుద్ధి ఏర్పడవలెను. ఇదివరకు ఉన్న ఆధ్యాత్మికతకు శ్రీ అరవిందుల ఆధ్యాత్మికతకు చాలా తేడాఉన్నది. దీనిని అతిమానసిక ఆధ్యా

త్మికత అనవచ్చు. గతంలోని ఆధ్యాత్మికత, రాబోయే అతి మానసిక ఆధ్యాత్మికతలో ఒక ప్రథమసోపానమే, ప్రథమ మజిలీయే. ఎక్కడైతే పాతయోగాలు అంతమౌతవో అక్కడనుంచి శ్రీ అరవిందులయోగం ప్రారంభమవుతుంది, ఈ యోగం రూపాంతరయోగం. ఈ యోగంలో మూడు మజిలీలు లేక ప్రక్రియలున్నవి. ప్రథమమజిలీ చైత్య పురుషీకరణ (Psychicisation), రెండవ మజిలీ విశ్వీకరణ (Universalisation) మూడవది అతిమానసీకరణ (Supramentalisation). పాతయోగాలు కేవలం ఆత్మకు ముక్తికి దారిచూపినవి. ఈ యోగం శరీరానికి ముక్తి కూర్చగలదు. ఈ యోగంయొక్క ధ్యేయం ముక్తి కాదు: దాని ధ్యేయం రూపాంతరము.

---

# శ్రీ అరవిందులు - పూర్ణయోగము

— దివాకర్ల వేంకటావధాని

శ్రీ అరవిందుల ప్రతిభ బహుముఖమైనది. వారు బహుభాషాపండితులు, మహాకవులు, దేశభక్తాగ్రగణ్యులు, పత్రికానిర్వహణ ధురంధరులు, అన్నిటికన్న మిన్నగా యోగిపుంగవులు. వారి విద్యాభ్యాసమంతయు నాంగ్లదేశమందే జరిగెను. ఆంగ్లముతోపాటితర పాశ్చాత్య భాషలను ప్రాచీనములైన గ్రీకులాటిను భాషలను గూడ వారభ్యసించి యందాశ్చర్యావహమైన పాండిత్యము సంపాదించిరి. కాని భారతదేశమున కరుదెంచిన తరువాత వారు మాతృభాషను సంస్కృతమును నభ్యసించి, భారతీయ విజ్ఞాన సంస్కృతి వైభవమును చూరలాడి, భరతమాత దివ్యస్వరూపమును సాక్షాత్కరింపఁజేసి కొనఁజాలిరి. ఈ సందర్భమునందే వారికి యోగాభ్యాసముకూడ కరతలామలకమయ్యెను. బుద్ధి అందుకొనలేని సత్యజ్ఞాన ప్రతిపత్తి యోగైక సాధ్యమని గ్రహించి, వారు యోగమార్గము నవలంబించి, యందు సమగ్రమైన సిద్ధిని పొందఁజాలిరి. అటు తరువాత వారికి స్వరాజ్యసిద్ధికంటె నాధ్యాత్మికతా పునరుజ్జీవనమే భారతదేశాభ్యుదయమున కెక్కువ ఆవశ్యకమని తోఁచెను. అందుచేతనే వారు రాజకీయమార్గమును నుజ్జగించి యాధ్యాత్మిక మార్గమున నడుగుపెట్టిరి.

అరవిందులు 1904 వ సంవత్సరమున గురువు లేకుండనే యోగాభ్యాసము నారంభించిరి. తరువాత నాలుగైదు సంవత్సరములకు వారొక మహారాష్ట్రి యోగిపుంగవునివలన యోగరహస్యముల నెఱింగిరి. వారి యోగసాధన కేవలము పుస్తకములమీదకాక వారికి కలుగుచుండిన యనుభూతులమీదనే యాధారపడియుండెను. ఏదైన క్లిష్టసమస్య యెదురైనప్పుడు భగవద్గీతయే వారికి తత్పరిష్కార మార్గమును చూపుచుండెను. వారు తొలుత వేదాంత తాంత్రికయోగముల నభ్యసించి చివరికి పూర్ణయోగమునకు గడంగిరి. అందు చేతచే వారి పూర్ణయోగమున యోగాంతరములన్నియు గర్భితములై యుండును. మనస్సు అవరప్రకృతికి సంబంధించి అజ్ఞానమయమై యుండును. దాని కతీత మైన పరాప్రకృతియందలి విజ్ఞానతత్త్వము పృథ్వి కవతరించునప్పుడే పృథ్వీపై అతీతమానవులు విలసిల్లుదురనియు, మానవులలో నట్టి దివ్యపరివర్తనమును

సాధింపఁగల యోగవిధానమునకు రూపుదిద్దుటయే తమ లక్ష్యమనియు శ్రీ అర విందులు వెల్లడిచేసి యుండిరి. 1930 వ సంవత్సరమున వారు తమ సోదరుఁడు వారీంద్రుని కొక లేఖ వ్రాయుచు యోగముయొక్క సంపూర్ణతత్త్వమున పది దశలున్నవనియు. తాము పది సంవత్సరములనుండి తదనుభూతి పొందుచు దానిని సమగ్రముఁగా పెంపొందింప యత్నించుచుండిరనియు దాని వికాసము సమగ్రమగుట కింకను రెండేండ్లు పట్టుననియు తెల్పియుండిరి.

పూర్వపుయోగములు మనోబుద్ధ్యాత్మలను మాత్ర మెఱింగియుండి మనో భూమికలోనుండు ననుభవముతోఁ దృప్తిపడియుండెను. మనస్సు సంపూర్ణ జ్ఞానమున కర్హతలేనిదై, పరమార్థమును పాక్షికముగా మాత్రము గ్రహింపఁ జాలియుండును. పూర్ణమును అనంతమునైన యా పరమార్థమును సమాధి మూలమున మాత్రమే పొందవచ్చును. వేదకాలమునుండియు మానవుఁడు మనస్సు నతిక్రమించుటకు తగినసాధనలు చేయుచునేయుండెను. అతఁడు మనస్సున కతీతములైన దివ్యభూమికలెన్నో కలవనియు, దుఃఖాత్మకమైన యీ సృష్టికి మూలమయ్యు సచ్చిదానంద మయమైన పరతత్త్వమొక్కటి యున్న దనియు, దానిని జేరుట కనేకమార్గములు కలవనియు గ్రహింపఁజాలినాఁడు. పూర్వమున్న ఆధ్యాత్మికసాధనలన్నియు దివ్యభూమికల కధిరోహించి దివ్యత్వము నందుకొనుటకే యత్నించెను గాని యైహికజీవితమును దివ్యముగాఁ జేయుటకు యత్నించియుండలేదు. వానియం దారోహణమే కాని యవరోహణము కానరాదు. వాని చరమలక్ష్యము జీవితపరిత్యాగమే యగుటచే జీవితోపకరణములైన దేహ ప్రాణ మనస్సుల పరివర్తనమునకై యవి యత్నించి యుండలేదు. ఆరోహణ ముతో తృప్తినందక అవరోహణముద్వారా జీవిత పూర్ణసాఫల్యమును సాధించుట శ్రీ అరవిందుల యోగమునకు లక్ష్యము. తత్సిద్ధికి మనస్సు, ప్రాణము, దేహము అనువాని దివ్యపరివర్తన మెంతో అవసరము. ఈ పరివర్తన మత్యంత సమగ్ర మైనది. దానికి సాధనమగుటచేతనే శ్రీ అరవిందులయోగము పూర్ణయోగమని పేరు పొందినది. ఇందహంకార పరిత్యాగ మత్యంతావశ్యకము. అది పూర్తిగా నిర్మూలనమైనప్పుడే దేహమనః ప్రాణము లీశ్వరేచ్ఛా విలాసనమున కనుకూల మయిన పవిత్రతను పొందఁజాలును.

పూర్వపరిచితములైన యోగములు జీవితమునకును ఆధ్యాత్మికత్వము నకును సమన్వయము చేకూర్పఁజాలకపోయినవి. అవి ప్రపంచమంతయు మాయ

యనియు నశాశ్వతమైన లీలయనియు తలంచినవి. దానికి ఫలితముగ జీవితము నందలి వీరత్వమును ప్రాణశక్తియు నశించినవి. శ్రీకృష్ణుడు భగవద్గీతలో తాను కర్మచేయనియెడల లోకమంతయు నశించునని చెప్పియుండెను. సాధకులు మొదట మానసిక భూమికయందు కలిగెడు ననుభవములనుపొంది, తరువాత మనస్సు నాధ్యాత్మిక జీవితమున కలవాటుపరచి, దాని నాత్మజ్యోతితో నున్నత మొనరింపవలయును. అనంతర మతీతమనస్సును జేరుట కవకాశము కలుగుటయు సృష్టిరహస్య మవగతమగుటయు సంభవించును. అప్పుడు జీవితమునకును ఆధ్యాత్మికతకును నడుమఁగల యంతరము తొలగిఁపోవును. అట్టిస్థితిలో ప్రపంచము మాయగాఁగాక భగవంతుని నిత్యలీలగా గోచరించును. అనంతరము మానవుఁడు పరిపూర్ణ జ్ఞానశోభితుఁడై భగవత్సాక్షాత్కారమున కర్హుఁడగును. భగవత్సాక్షాత్కారము శాశ్వతానందమునకు దారిచూపును.

"శ్రీ అరవిందులు దేహప్రాణమనస్సులను రెండుగా విడఁదీసి అంతర్వి భాగమైన సూక్ష్మదేహమునందే మూలాధారమునుండి సహస్రమువరకు ఆయా స్థానములం దన్నమయ ప్రాణమయ మనోమయ చేతనలు నెలకొని యున్న వనియు, మనస్సునకు పైనున్న విజ్ఞానమయచేతన శిరస్సున కూర్ధ్వభాగమున కలదనియు, మనోమయచేతనయందలి పైయంతస్తులో నున్నత ప్రదీప్త ప్రబుద్ధ మనస్సులు కలవనియు, మనో విజ్ఞానమయ చేతనలనడుమ అధిమనస్సు కల" దనియు వివరించియుండిరి. ఇవన్నియు వారు సాధనానుభవముచే కనుఁగొని చెప్పినవే కాని రిత్తయూహలు మాత్రము కావు.

శ్రీ అరవిందుల పూర్ణయోగ మితరయోగములను ఖండింపక ఆరోహణ ముతో పాటవరోహణమును కూడ సాధింపవలసియున్నదనియు, మనోతీతమైన విజ్ఞాన చేతనావరణ సృష్టివిధానమున గర్భితమైయున్నదనియు విశదీకరించు చున్నది. ఈయోగము భక్తి జ్ఞాన కర్మమార్గములు మూడింటి సమాహారము. అరిషడ్వర్గమును జయించి అహంకారమును విడనాడి భగవంతునికి సర్వ సమర్పణ మొనరించు సామర్థ్యము కలవారే దీని నవలంబించుట కర్హులగుదురు. వేద మంత్రోపదిష్టము, విశిష్టము, హీనమైన మర్త్యమున హీనమైన దివ్య ధామముగా నొనరింపఁజాలునది అగు నీ యోగము రహస్యము నెరింగి చిత్త శుద్ధితో దాని ననుసరించి మానవులు తరింతురు గాక!

———

# సంస్కృతి యొక్క అంతము

మూలం : రవీంద్ర                                        అనువాదం : నర్సిభాయి

వర్తమాన మనుష్యుడు అతని పూర్వ సంస్కృతి వినాశనము గూర్చి చర్చించునపుడు సత్యమైన సంస్కృతియొక్క ఉద్దేశ్యమును తెలుసుకొనుట ఎంతో అవసరము. మానవ యంత్రమును భాగవతకార్యార్థమై పృథ్విపై భగవంతుని అభివ్యక్తమునకు సిద్ధపరచుటయే సంస్కృతియొక్క ఉద్దేశ్యమై యున్నది. భిన్న భిన్న యుగములలో ఆయా సమయముల ననుసరించి భిన్న భిన్న రూపములలో ఇదియే జరుగుతూ వచ్చుచున్నది. నేడు వర్తమాన సంస్కృతియొక్క వినాశము సంభవించెనేని, మానవుడు తిరిగి చీకటిగుహలలో నివసించే కాలములోకి ప్రవేశించెనేని మనుష్యుని శరీర ప్రాణ మనస్సు ఇంత కాలము అభ్యసించినదంతయు మట్టిపాలగును. మనుష్యుని వ్యక్తిత్వము చాల కాలము వరకు కేవలము పశు స్వభావమునే వ్యక్తము చేయుచుండును. వర్తమాన సభ్యత్వము కనీసము అయిదువేల సంవత్సరముల పురాణకాలమునాటిది. ఈ కాలములో బుద్ధి వికాసముచెందెను. మనుష్యుడు ప్రకృతియొక్క అనేక గుప్త రహస్యములను శోధించి సాధించెను. అతడు సంఘటిత జీవితమును వికాసమొనరించెను. మరియు భౌతిక సామర్థ్యములలో చాలా ప్రగతి చెందెను. వీటకి విరుద్ధములైనవి కూడా చాల జరిగెను. కాని ఈ కారణంచే మనము గ్రుడ్డివాళ్ళమై ఈ నాటి ప్రాప్యములను, వాటికంటె అధికతరమైన సంభావనములను మరువలేము. ఒకవేళ నేటి సంస్కృతి నష్టమైన యెడల మనము తిరిగి క, ఖ, గ, ఘ ల నుండి ప్రారంభించవలసియుండును, యంత్రము యొక్క బలహీనతవల్ల అనేకసార్లు కరిగింపబడి, మర్దించబడవలసిన అవసరమేర్పడినప్పటికి భగవంతుని అభివ్యక్తము జరిగియే తీరును.

మనుష్యుడు ఎంత హతాశుడైనప్పటికి, దుర్బలుడైనప్పటికి మరణించడానికి ఇష్టపడడు. అతనిలో ఆశనిర్మితమై యుండును. అది ఏదో ఒక రూపమున నిలిచియుండును. దీనికి కారణమేమిటి ? ఒకవేళ జీవించుటయే జీవితోద్దేశ్యమైనచో వృద్ధాప్యము, జాడ్యము లేక దుర్ఘటనముల కారణముచే శరీరములో అసామర్థ్య మేర్పడగానే; మరణించవలయును. కాని విషయము

అలాకాదు. శరీరస్థ చేతనకు అనుభూతులు ప్రాప్తిచేయుకొరకు వాటి పరిణామములను ఆత్మ తోడ్పాటు చేయుటకు మరియు వాటి సత్తా యొక్క శక్తిగా ఏర్పడే యోగ్యరూపమును ఇవ్వడానికి సమయము పట్టును. తిరిగి పునరారంభముతో క్రొత్త జీవితముయొక్క సూత్రపాతము జరుగును. పూర్వజన్మలో ఎంతవరకు అనుభూతిచెందెనో అచటనుండి క్రొత్త జన్మలో కార్యారంభమగును. వీటి రెండింటిమధ్య చాలకాలము పట్టును. మరియు పాత అనుభూతులను పునరావృత్తమొనర్చుటకు చాలకాలము వ్యర్థమగును. ఎంతో సమయము గడచిన తదుపరి క్రొత్త జన్మయొక్క వాస్తవికకార్యము ప్రారంభమగును. ఇందుచే సాధారణముగ అత్మ శరీరమును విడువనొల్లదు. ఒక శరీరములో ఎన్ని అనుభవములు పొందగలుగునో, ఎంత ప్రయత్నము చేయగలుగునో అంతచేయును. యోగాభ్యాసముద్వారా అసామర్థ్యమును పారద్రోలుటకు ప్రయత్నము చేయబడును. ఎన్నియో జన్మముల కార్యసాధనమును ఒకే జన్మలో పూర్తిచేయబడును.

మానవజాతిపై కూడా ఇదే విధానము వర్తించును. మానవసభ్యత్వము ఇప్పుడు చేరుకున్న పరిధులను దాటి ముందుకేగటానికి వర్తమానచేతనకు సంభవముకాదు. మానవుడు మనస్సుయొక్క ఉన్నత శిఖరములను చేరుకొనియున్నాడు. ఇక ఇప్పుడు మనస్సునుదాటి ముందుకేగవలసియే యుండును.

భారతదేశము తాను భూమిపై ఈ భౌతిక జీవనములో దివ్య జీవనమును ప్రకటింపవలెననే తథ్యమును మరచెను. అది దివ్యముయొక్క ఉపాసన చేయుచునేయుండి, జీవితాన్ని ఉపేక్షించెను. పరిస్థితి మారెను. పశ్చిమదేశ సభ్యత తారసిల్లెను. అది జీవితమే సత్యమని భావించి, దివ్యత్వమును అవహేళన మొనరించెను. దాని అస్తిత్వమునే మరపించెను. ఇప్పుడు మన విలువల నన్నింటిని మార్చివేయడానికి సమయ మాసన్నమైనది. మూల భౌతికముతో పరమ దివ్యజ్యోతి మరియు ఉచ్చతమ శక్తి యొక్క ప్రతిష్ఠ చేయవలసియున్నది. నిజమైన అర్థమున శరీరమును భగవన్మందిరముగా సిద్ధము చేయవలసియున్నది. బహుశః మానవుని యెదుట నేటి వరకు ఇంత పెద్ద ఎన్నిక రాలేదేమో? దీనిలో రెండే మార్గాంతరములు కలవు. ఈ గట్టో! లేక ఆ గట్టో! ఒకవేళ మనుష్యుడు తనకుతాను పరివర్తన పొంద

గలిగితే, మేలిమి బంగారుగా రూపొందగలడు. లేనిచో పురాతన "డినోసోర్" మొదలగు వాటి మాదిరి, ఎక్కడో లోయలో పడిపోయి వాటి స్థానమున మరొక క్రొత్తజాతి ఆక్రమించుకొనును.

ప్రపంచములో ప్రతి విషయమునకు దేశకాలములు ఆవశ్యకములు. మన దేశకాలములకు భిన్నముగా ఏ విషయముగాని కల్పించలేము. భగవంతుడు దేశకాలాతీతుడని మనము ఒప్పుకొందుము. అంతేకాదు స్వతః దేశకాలములు అతనిలోనే యున్నవి. పార్థివ వస్తువులన్నియు ఎత్తు, పొడుగు వెడల్పు కలిగి యుండును. దేశముయొక్క మనకల్పన ఇవే మూడు కొలతలపై (ఆ యాశయములు) ఆధారపడియుండును. కాలముకూడ నాల్గవ కొలతయని ఐన్‌స్టీన్ సిద్ధాంతము. కొలతలు అన్ని వస్తువుల ఆకృతిని నిశ్చయించును. మన భౌతిక చేతన భౌతికకొలతల వినా, ఏ వస్తువునైనను ఉచితరీతిని గ్రహింపలేదు. వీని వినా భౌతికవస్తువుల కల్పనకూడా చేయజాలదు.

కాని జ్ఞానములో భౌతికచేతనయే అంతిమ శబ్దముకాదు. భౌతికచేతనము చేతనసోపానము యొక్క అన్నిటికంటె క్రింది సోపానమై యున్నది. దీనిలో మనదృష్టి ఈ నాలుగు కొలతలవరకే యుండును. ఇచట సిద్ధాంతరూపేణ రెండు వస్తువులు ఒకే సానములో ఇమిడియుండలేవని మనకు తెలుసు. రెండు ఘటనములు ఒకే సమయములో ఘటింపబడనేరవు. రెండింటి మధ్య యెంత సూక్ష్మమైనప్పటికి ఆవశ్యంగా అంతరముండును. మన చేతనలో దేశకాల వస్తువులలో భేదము చేయుదుము వాటిని ఒకదానినుండి ఒకటి వేరు చేయుదుము. ఆపై ప్రతిదానికి అహంకృతి కలిగించుదుము. కాని ఉచ్చతర చేతనములో ఈ స్థితి యుండదు. అచట ప్రతివస్తువు అనేక కొలతలు గలవై యుండవచ్చును. చేతన ఏ విధముగా పైకిగయునో, ఆ యా రీతుల కొలతలు కూడా పెరుగుచుండును. అచట ఇవి ఒకదాని నొకటి వేరు పరుచనివై యుండును. అచట ఘనీకృత జగత్తువలె వస్తువులయొక్క నిశ్చిత బంధాకృతి యుండదు. వస్తువులు వేరై యుండి నప్పటికి ఒకదానినొకటి కలియును. ఒకదానిలో నొకటి ప్రవేశించును. అన్ని యొకటై, యొకటైయుండి అనేకములు కాగలుగును. మన భౌతిక జగత్తులోని దూరము, సమీపము, భూతము, భవిష్యము మొదలగు పరిభాషలు అచట వ్యర్థమగును. చేతన ఏ రీతిగా పై

కెగయునో, లేక లోతునకు ప్రవేశించునో ఆ రీతినే బాహ్యములోని బాధ లన్నియు తగ్గిపోవుచుండును. మరియు తమ బలము హెచ్చగు చుండును. అచట కొలతలుకూడా పెరుగుచుండును. వస్తువులు మనుజులతో పరిచయము పెరుగుచుండును. ఒకే వస్తువును చూచే అనేకానేక దృష్టి కోణములు ముందుకు వచ్చును. ముందుకు వెళ్ళగా సమగ్రదృష్టి కూడా ప్రాప్తించును. అచట వస్తువులను ఈ ప్రక్కనుండి ఆ ప్రక్కనుండి అని కాక వాటిని సమగ్రముగా చూడనగును. మరియు అన్నిటికంటె అగ్రతర చేతన అనగా సచ్చిదానందమునకు చేరి ప్రతివస్తువునకు అనంత కోణములు ఏర్పడును. అటుపై ఈ అనంతములన్నియు కలిసి ఒకటిగా స్థిరమగును. అప్పుడు దృశ్యము, దృష్టి, దృష్ట ఒకటియై పోవును.

———

# 24 వ ఏప్రిల్ ప్రాముఖ్యము

మూలం : అనువాదం :

శ్రీ వేలూరి చిదానందం అం. గో. కృష్ణమూర్తి

శ్రీ అరవిందాశ్రమమునందు ఏప్రిల్ 24 తేదీకి గల ప్రాముఖ్యమును గురించి ఆ ప్రాముఖ్యమును సూచించు పరిస్థితులను గురించి క్లుప్తముగ, నా శక్తిననుసరించి ఇంచుక ప్రస్తావించుటకు కుద్దేశించితిని. అధ్యాత్మయోద్ధలైన శ్రీ మాతారవిందుల వీరగాథను, వారి సాహచర్య యోగసాధనములను, ఈ పృథ్వియొక్క చరిత్రలో కనివిని ఎరుగని, విజయవంతమైన వారి సంసిద్ధులను వర్ణించుటకు మరియొక బాదరాయణుడు దిగి రావలయును. అయినచు అట్టిపనిని పూనుకొనిన నా సాహసమును మీరు సానుభూతితో సహింతురని కోరుచున్నాను.

భూదేవి తన రక్షకుని మహోదయముకొరకు సుదీర్ఘకాలము నుండి నిరీక్షించుచున్నది. శ్రీ మాతృహృదయమునుండి పరాత్పరునికొరకై ప్రార్థన యొకటి ఉద్గతమైనందున తత్ఫలితముగ శ్రీ అరవిందులు ఈ భూమిమీదకు అవతరించినారు. భారతదేశము మరియు యావత్ప్రపంచము గాఢాంధకారమందు మగ్నమైన ఈ సమయమందు శ్రీవారి యవతారము సంభవించినది. భరతమాతను మేల్కొలిపి, యావత్ప్రపంచమునకు నాయకత్వమును వహించి ముందుకు నడిపించుటకు, అవతరించినారు.

శ్రీ అరవిందులు మానవసమాజముయొక్క భావనలను క్రియాప్రవాహములను మార్చివేసి మానవజాతియొక్క చరిత్రగతిని భాగధేయమును పూర్తిగా మార్చగలందులకు అవతరించినారు. విధిచే నిర్ణీతమైన గమ్యస్థానమును చేరుటకు, అనగా ఈ భూమిమీదనే దివ్యజీవనమును నెలకొల్పు మార్గమును చూపుటకు అవతరించినారు.

శ్రీవారి అవతారము అత్యాశ్చర్యకరము దివ్యము, పూర్ణము, పుష్కలము, అఖండము, అతిమానుషము. మార్గాన్వేషకులు మార్గదర్శకులైన మహర్షుల శాఖకు చెందినవారు; అధ్యాత్మవీరులు ; ధీరులు.

వీరు వేదమూర్తులు, ఉపనిషన్మూర్తులు, గీతామూర్తులు. ప్రస్థానత్రయములో వర్ణించిన యోగములన్నిటిని, మరియు తదితరమైన శిక్షలన్నింటిని సాధన చేసినారు. అఖండమేధావి. వీరు తమ సాధనయొక్క ప్రథమదశయందే సగుణబ్రహ్మాను, నిర్గుణబ్రహ్మాను ఈరెంటికి అతీతమైన పురుషోత్తమ స్థితిని, సాధించినారు. తరువాత చైతన్యముయొక్క విజ్ఞానస్థాయిని Supermind ఆనందస్థాయిని అధిరోహించి సాధించినారు. వీరి యోగము వీరికి పూర్ణదర్శనము, పూర్ణసిద్ధి, పూర్ణానుభూతిని ప్రసాదించినది.

వ్యక్తిగత సిద్ధియు మోక్షమును మాత్రమే తమ లక్ష్యము కాజాలదని వారు దర్శించిరి. ఏలన అట్టిదృష్టి ప్రపంచమును యథాస్థితిలోనే అజ్ఞానమందే ఉంచగలదనియు వారు దర్శించిరి. మానవప్రకృతిలోనే మార్పు రావలెను. మనస్సు అజ్ఞానోపేతము మానవప్రకృతిని మౌలికముగా మార్చుటకు అశక్తమైనట్టిది. మానవసంస్థలను మార్చుట నిరుపయోగములు. అతి మానసిక విజ్ఞానమే (Supermind) మానవప్రకృతియొక్క మూలమును మార్చగలదు. విజ్ఞానము శక్తివంతమైన దివ్యచైతన్యము. అది స్వయంజ్యోతి స్వప్రయుక్త శక్తిచాలనము. శ్రీ అరవిందుల ప్రత్యేకత విజ్ఞానభూమిక కధిరోహించి ఆ భూమికయందు సతతయోగముతో జీవించుదానిని క్రిందికి మానవకోటిలో ఒక క్రొత్తశక్తిగ అవతరింపజేయుట. ఎట్లు మనస్సు ప్రాణికోటియందు స్థావరమేర్పరచుకొని యుండెనో అదేవిధముగ అతిమానసము శాశ్వతముగ మానవమందు కుదురుకొనజేయుట. శ్రీ అరవిందుల లక్ష్యము స్వర్గప్రాప్తి కాదు. జననమరణముల చక్రమునుండి ముక్తియుకాదు. జీవితలక్ష్యము జీవనమునందే కాని, జీవిత నిష్క్రమణ మందేమియుకాదు. జీవితమే యోగమునకు క్షేత్రము. జీవితము, అందలి శ్రీకరమైన సంపదలు ఉపాదేయములు సన్యసింపనవసరము లేదు కాని సామాన్యప్రాణిక, సాహంకారికమైన జీవితము కాగూడదు.

మన ఆత్మ దేవునియందు జీవింపవలయును. మన జీవితములో దేవుని ఆవిష్కరింపవలెను. మన ఆదర్శము దివ్యజీవనము. ఇక్కడనే, ఇప్పుడే, ఈ పృథ్వియందే, మరెప్పుడో మరియొకచోటకాదు. అందుకొరకే అతిమానసము మనస్సును, ప్రాణమును, శరీరమునుకూడ దివ్యమొనర్చుటకు, క్రిందికి ఆకర్షింపబడవలెను. జీవితములోని ప్రతి స్వల్పకార్యము దివ్య మొనర్పబడవలయును.

అప్పుడే మానసమునందు దివ్యప్రసవము. అతి మానసావతరణము. శ్రీ అరవిందుల దివ్యదృష్టి అట్టి నూతనసృష్టిని దర్శించినది. నూతన చైతన్యము నావిష్కరించు మూర్తిమంతమైన నవమానవకోటిని దర్శించినది వ్యక్తియందు గాక సమాజమందు సమాజముచేతనే సామాజికోద్యమము ఇక్కడనే ఈ పృథ్వియందే సాధించవలెను. ఈ మార్పు సామాజిక జీవితమందే సాధింపనగును. శ్రీ అరవిందులు భూమికొరకు విజ్ఞానమును అవతరింపజేయుటయే తమ కర్తవ్యమని త్వరలో గుర్తించిరి. వారిట్లు వ్రాసియుండిరి. "మనస్సులోనున్న జగద్గురువు నా యోగమార్గముయొక్క పూర్తి వివరములను దర్శకత్వమును నాకు ప్రసాదించెను. ఆ యోగమును ఈ పదిసంవత్సరములు (1910–1920) పుదుచ్చేరియందు ఆతడు నా అనుభూతిని బలపరచుచుండెను.

శ్రీ అరవిందులు ఈవిధముగ తమ సాధనను పూర్ణమొనరించుచుండగా–అదేసమయమున ఆశ్చర్యకరమైన సంఘటన–ఫ్రాన్సుదేశమునందు "శ్రీ మీరా" (శ్రీమాత అక్కడ అప్పుడా పేరున పిలవబడుచుండెను)–సరిగా ఇదే సందేశమును దర్శించెను. ఒక వార్తాపత్రికలో ఆమె ఇట్లు ప్రచురించిరి, తాను ఈ సందేశముయొక్క స్మృతితో జన్మించితిననియు 11, 13 సంవత్సరముల వయస్సునందే కొన్ని అధ్యాత్మికానుభూతులు కలిగెననియు, తనకు భగవంతుని సాక్షాత్కారము లభించెననియు మానవుడు భగవంతునిచేరుట సాధ్యమనియు, అతడు తన కార్యకలాపముల యందును చైతన్యమందును దేవుని వ్యక్తీకరించి ఈ పృథ్వీమీద దివ్యజీవనమందు భగవంతుని ఆవిష్కరించుట సాధ్యమనియు ప్రచురించియుండిరి. వేలమైళ్ల దూరమునుండి ఆశ్చర్యజనకమైన ప్రతిధ్వని విశ్రుతమైనది।

తరువాత ఆమెకు పూర్ణసిద్ధి కలిగినపుడు ఒక దివ్యపురుషునితో ఆధ్యాత్మిక బాంధవ్యానుభూతి కలిగెను. అప్పుడు హిందూమతముకాని వేదాంతముకాని ఆమెకు బొత్తిగ తెలియదు. ఆ పురుషుని "కృష్ణ"డని ఆమె అనుకొనిరి. అప్పటినుండి ఎప్పుడో ఒకప్పుడు ఈ భూమియందే ఆ దివ్యపురుషుని దర్శనము కలగగలదని తాను చేయవలసిన కార్యము సఫలమగునని అనుభవించెను.

ఆమె, తన మాతృభూమియని తలపోయుచున్న భారతభూమిని 1914 సంవత్సరములో దర్శించినప్పుడు ఈ ఆనందము ఆమెకు ప్రసన్నమాయెను.

ఇంకను పుదుచ్చేరికి 10 మైళ్ల దూరము నందుండగనే ఒక దివ్యపురుషుని పరివేషజ్యోతిని చూడగలిగితిననియు, శ్రీ అరవిందుని చూడగనే తాను ఎవరిని కృష్ణునిగా భావించెనో ఆమూర్తిని చూడగలిగితిననియు వ్రాసియుండిరి— దైవ విలాసము ! ఆమె స్థానము కార్యము శ్రీ అరవిందులచెంతనే అని ధృవపరచుకొనిరి.

శ్రీ మాత రెండవపర్యాయము ఏప్రిలు 24 వ తేదీన భారతదేశమునకు వచ్చిరి. ఇక ఇక్కడనే ఉండిపోవుటకు నిశ్చయించిరి. అప్పటినుండి మానవ కోటికి ముఖ్యమైన దివ్యసాహచర్యము ప్రారంభమాయెను. ఏప్రిలు 24 యొక్క ప్రాముఖ్యమిది, మనకందరకు పవిత్రమైన దినము. యుగయుగాంతరముల నుండి వీరి దివ్యసాహచర్యము జరుగుచునే యుండెనని శ్రీ అరవిందులు వ్రాసియుండుట గూడ గమనింపదగినది. శ్రీ మాత 1920 ఏప్రిలు నుండి వారు నివసించు గృహనిర్వాహమును స్వీకరించిరి. తరువాత ఆశ్రమము రూపొందిన పిదప ఆశ్రమ నిర్వాహమును స్వీకరించిరి. శ్రీ అరవిందులు ఏకాంతమైన తపస్సులోనికి వెళ్లిపోయిరి. అట్లు చేయుటకు కొన్ని నెలలముందు శ్రీ మాతృ సాహచర్యమును గూర్చి మాతో ప్రస్తావించిరి, నా డైరీలో ఈ విధముగ వ్రాసికొంటిని.

"మన సాధనయందు ఒకప్పుడు మన అంతరతముడైన జగద్గురువు కొంతకాలము మనను ఉపేక్షించవచ్చును. నేను లేలేనుండి సహాయమును పొందకపూర్వము నేను అంతఃశాంతిని పొందితిని. కాని నేను పుదుచ్చేరి చేరిన తరువాత లోననుండి సహాయము దొరకకుండెను. బాహ్యమునుండి వెలుగుకై ఒక సంఘటనకై ఎదురు చూచుచుంటిని. అప్పుడు మీరా వచ్చెను. ఆమెయే రాకుండినచో ఇంకను త్రోవకొరకు వెదకుచుండెడివాడను" ఏమి ! ఈ మహాయోగియొక్క నిర్వ్యాజమైన ఆర్జవము, వినయము !

సంవత్సరములకొలది శ్రీ మాతారవిందుల తపః సాహచర్యము వలన విజ్ఞానభూమికకు ఆరోహణ, పిమ్మట భూ చైతన్యములోనికి విజ్ఞానమును అవరోహింపచేయుట, దీని ఫలితముగ మానవుడు అతిమానవత్వము అనే ఉత్తరోత్తర కార్యమును సాధించగల్గుట యగును. ఈ ఆరోహణావరోహణ క్రమ వివరములను వర్ణించుట నాబోటి వారలకసాధ్యము.

శ్రీ అరవిందులు తమయోగమును పృధ్వీచైతన్య యోగమని చెప్పిరి. పృధ్వియందలి సంఘర్షణకంతయు ఈ మార్గదర్శకుడైన మహర్షియొక్క శరీరమే క్షేత్రము. జీవనమును పరిశుద్ధము చేసి అందులోనికి మనస్సుయొక్క అవతరణను సాధించుటకు వేలకొలది సంవత్సరములు గడచెను. ఇక ఈ మహర్షి జడ ప్రాణ మనోభూమికలను శుభ్రపరచుట అనే బృహత్కార్యమును స్వీకరించవలెను. ఈ కార్యమంతయు తమ శరీరములోనే జరుగబడకున్న గత్యంతరము లేదని వారు దర్శించిరి. అందుకొరకే శ్రీవారు దేహమును విసర్జించిరి, అవి అందురు. సత్యముకొరకే దేహత్యాగము చేసిరి. వారి జీవితమంతయు బృహత్కర్మకాండ. వారి దేహత్యాగము మహాయజ్ఞము—పరాత్పరుని దివ్యశక్తి అజ్ఞానాంధకార మగ్నమైయున్న పృధ్వియందు ప్రవేశించి దానిని శక్తిమంతము కాంతిమంతము కావించుటకై పూనుకొనిన పరమపురుషుని బృహత్ యజ్ఞమునకు సరిపోలునట్టిది.

ఇప్పట్టున ఈ పృధ్వీచైతన్యములోనికి విజ్ఞానావతరణకు అనుపు కల్పించుటకు మాతారవిందులతో ముందు ఈ పృధ్వీక్షేత్రమునుండి ఎవరు వైదొలగవలెనను విషయమై ఈ ఉభయుల మధ్య ప్రవర్తించిన వాదమును గుర్తు చేయవలసియున్నది.

దైవనిర్ణయమును సఫల మొనర్చుటకుగాను, శ్రీ అరవిందుల నిర్ణయమునకు శ్రీ మాత తలయొగ్గక తప్పలేదని ఇపుడంతరకు విదితమే.

ఈ పరమవీరుని వీరగాధ రాబోవుతరముల మానవాళిని ఉత్తేజపరచగలదు. ఈ పృధ్వికి జ్యోతిఃప్రసాదకమైన ఈ మహామహుని ఆత్మ యజ్ఞమునకు, వీరు బహుశ్రమించి గమ్యస్థానమునకు బాట లేర్పరచినందుకు వారు ఎల్లప్పుడు కృతజ్ఞులై యుందురు.

శ్రీ మాత ఇట్లు చెప్పిరి. "ఈ పృధ్వీతత్త్వము పూర్తిగ పరివర్తన చెందువరకు మీరు (శ్రీ అరవిందులు) పృధ్వీ వాతావరణమును విడువకుండా పరిపూర్ణముగ ఇక్కడనే ఉండగలనని నిస్సంశయముగ ప్రతిజ్ఞ చేసియుంటిరి." మరియొకచోట ఇట్లు చెప్పిరి. "ఈ ప్రపంచ చరిత్రలో శ్రీ అరవిందుల కార్యమేమంటే—అది ఒకానొక బోధ, మతము కాదు—పరాత్పరుని నుండి సూటిగా ప్రసారమైన తిరుగులేని కర్మధార."

శ్రీ మాత అరవిందుల గురించి ఏమి చెప్పియుండిరో అది వారికిగూడ యథాతథముగ వర్తించును. ఏలనగా శ్రీ అరవిందు లిట్లు వ్రాసిరి. "నా ప్రజ్ఞ ఒకే ఒకటి. ద్విధాగా ప్రవర్తితమైన దివ్యప్రజ్ఞ. ఎందుకనగా దైవలీలకు ఈ ద్వైవిధ్యము అవసరము. ఆమె ఎరుక, శక్తి, ప్రజ్ఞల వినాగా ఏదియు జరుగ జాలదు ఎవనికైన ఆమె ప్రజ్ఞ అనుభూతమైన నేనుకూడ ఆ ప్రజ్ఞ వెనుక నున్నాననియు, నా ప్రజ్ఞ అనుభూతమైన దానివెనుక ఆమెకూడ కలదనియు ఎరుగదగును.

శ్రీ అరవిందులు ఆధ్యాత్మికశక్తి చాలకస్థానము. సహస్రముఖముల ద్వారా శక్తిప్రసారము.

పుదుచ్చేరిలోని బహుళార్థసాధక కార్యకలాపములతో కూడిన ఆశ్రమము, మనకు ఆ శక్తి ప్రసారముయొక్క దృశ్యమానమైన ఒకానొక చిహ్నము. అదృశ్యము, గుహ్యము అయినట్టి చిహ్నమేమనగా ఈ పృధ్వి ఎట్టి ప్రతిభావం తము దివ్యము అయిన సంఘటనలకై పయనించుచున్నదో ఆ సంఘటనలకు నాందీ వాచకము.

ఆశ్రమము పుదుచ్చేరిలోనే కాదు. అన్నిచోట్లను కలదు. ఇక్కడ కూడ కలదు. శ్రీ అరవిందుని కర్మధార ప్రపంచమందంతట ప్రవర్తించు చున్నది. మానవచైతన్యములోనే మార్పు వచ్చినది. ప్రపంచమందు అరోవిల్ యెడల ఉత్సాహము పెరుగుచున్నది. ఏలనగా అచట వ్యష్టి సమిష్టి జీవనము దేవునికై జీవింపబడుచున్నది. అందువలన దివ్యజీవనము యథార్థమగుచున్నది. ఈ దినమును శ్రీ అరవింద శత వార్షిక జయింతిని మనము శుభదినములుగ ఆనందించుటలో శ్రీ అరవిందుల కర్మధారను శక్తిధారను భారతదేశముయొక్క తద్వారా యావత్ప్రపంచము యొక్క నిర్దిష్టమైన భావి రూపకల్పనకై పూను కొందుము గాక! మనము ఈ శక్తికి కర్మధారకు తగినట్టి దివ్యోపకరిణము లగుదుముగాక. ఈ విధముగ శ్రీవారి సందేశము నందరకు అందజేసి భారత దేశముయొక్క ఈ అమరపుత్రునికి, ఈ ప్రపంచముయొక్క మహాజ్యోతికి, జోహారు లర్పింతుము గాక!

———

# శ్రీ అరవిందుల దర్శనం : దాని ప్రత్యేకత

రచన : వేలూరి చిదానందం

ఎందరో మహానుభావులు, ఋషిదర్శ్రిష్టలు, యోగులు, భక్తులు, మేధావులు ఈ భూమిపైన అవతరించినారు. వారి రాకచే భూమి పావనం అయింది. వారు ప్రపంచంలోనికి వెలుగు, శక్తి, ప్రేమ, మాధుర్యం, సౌందర్యం తీసికొని వచ్చినారు. వారందరికి మన వందనములు

వారందరిలో కృష్ణుడు, బుద్ధుడు, Jesus Chrirt, శంకరులు, రామకృష్ణ, వివేకానంద, శ్రీఅరవిందులు, హిమగిరి శిఖరాలవలె నిలిచివున్నారు. వారిలో ప్రతి ఒకరు, ఒక ఈశ్వర నిర్దిష్టకార్యాన్ని నెరవేర్చడానికి వచ్చినారని తోస్తుంది.

వారిలో కొందరు తాము ఏకార్యాన్ని సాధించటానికని వచ్చినారో అందులోనే అనన్యమైన ఏకాగ్రతతో నిమగ్నులైనారు. అందుచేత వారు జీవితంలో ప్రపంచంలో మనను సతతం కలవరపెట్టే చిక్కుసమస్యలను గూర్చి సంపూర్ణంగా మనసుకు పట్టించుకోలేదు. ఈ సృష్టిలో, మనిషిలో, మానవకోటిలో భగవంతుని ఉద్దేశం ఏమిటి? ప్రపంచాకానికి, జీవితానికి అర్థం ఏమిటి? భూమి మీద మనుష్యుడు చేయవలసిన పనియేమి? మనిషియొక్క, సమాజంయొక్క సంపూర్ణమైన వికాసం సాధించటం ఎలా? ఈ గడ్డు ప్రశ్నలలో కొన్నిటికి వారు తమతమ సమాధానాలను చెప్పినారు. కాని ఈ రోజుల్లో మనలో చాలమందికి వారి జవాబులు, వారి లక్ష్యములు, వారు చూపిన మార్గములు అంతగా తృప్తికరంగా వుండవు. కారణాలు: అవి అసమగ్రంగా వుండటం, కాలంలో మార్పు. దానినిబట్టి మన దృష్టిలో మార్పు, కాని అందువల్ల వారి గొప్పతనం ఎంతమాత్రం తగ్గదు.

వేదాలు, ఉపనిషత్తులు, మనకు చూపిన లక్ష్యములు, జ్ఞానములు, సాధనలు కాలక్రమంలో మరుగుపడిపోయినవి. అధ్యాత్మికశక్తి క్షీణించినది. సమగ్రమైన అధ్యాత్మికదృష్టి లోపించినది. మనిషి తనలోని విభిన్న శక్తులను సామరస్యం చేసుకోవటం మరచినాడు. సాధారణంగా మనిషి తనలోని రక్తం, ప్రాణం,

బుద్ధి, ప్రేమ, నమ్మిక వీటిలో ఏది బలిష్ఠమో దానితో ప్రవర్తిస్తాడు. అది సత్యంలో ఒక అంశము మాత్రమే చూస్తుంది, ఇతర సత్యాంశాలను కాదంటుంది. తను చూచిన ఖండసత్యాన్నే బుద్ధి సాయమున ఒక మతంగా నిలబెడుతుంది. బుద్ధి పూర్ణసత్యాన్ని చూడలేదు. ఇలా బుద్ధి చేసే భేదాలేకావు. మనిషి ఒక ప్రత్యేక అనుభవాన్నే ఒక ఖండానుభవాన్నే నమ్ముకొని, దానినే పరమసత్యంగా, ఒక మతంగా స్థాపిస్తాడు. ఈ కారణాలచేత విభిన్నమతాలు శాఖోపశాఖలై ఒక దాని నుండి ఒకటి వేరై చీలిపోయినయ్.... సమగ్రమైన ఆధ్యాత్మికదృష్టి లోపించి నందువల్ల ఒక ఫలితం ఇది: జీవితాన్ని దుఃఖమంతంగా భావించటంచేత జీవితంలో ఉత్సాహం పోయింది. దానితో జవసత్వాలు ఉడిగిపోయినాయ్. జాతి నిర్వీర్యమై పతనమైంది....

మనదేశంలో ఒక దృష్టి జనసామాన్యంలో నిలిచిపోయింది. అదేమంటే: భగవంతుడు సత్యం, భగవంతుని చేరాలి. జగత్తు మిథ్య. అంతా మాయ, అజ్ఞానం లేక కర్మ. సంసారం దుఃఖం. జీవితానికి లక్ష్యం మోక్షం. ఇలాంటి భావాలు శతాబ్దాల తరబడి జాతిమనస్సులో గాఢంగా నాటుకొని ఉన్నాయి. ఈ మోక్షం అంటే ఎవరికి తోచిన అర్థం వారు చెప్పుకుంటారు. మొత్తంమీద ఎక్కువమందికి మోక్షం అంటే వ్యక్తిగతమైన మోక్షం. జీవనం నుంచి, ప్రపంచంనుంచి, సంసారంనుంచి, పునర్జన్మనుంచి, సమాజం, జగత్తు ఏమయినా సరే, అది వట్టిమాయేగదా! దానినుండి ఏ స్వర్గానికో లప్పించుకొని బైటపడటమే మార్గం.

శ్రీ అరవిందులు సమగ్రమైన దృష్టిని తిరిగి మనకు ప్రసాదించటానికి అవతరించినారు. జీవితాన్ని, ప్రపంచాన్ని సిరిసించి, దిరస్కరించే త్రోవను శాశ్వతంగా అరికట్టినారు. ఈ భూమిమీద జీవితంయొక్క పరమార్థమును చూపి జీవితమునే పరమసాధనగా చేయవలెనని బోధించినారు. ఈ లక్ష్యమును ఇక్కడనే, ఇప్పుడే సాధించే చక్కని రాజమార్గం నిర్మించటానికి శ్రీ అరవిందులు బ్రహ్మాండమైన తపస్సు చేసినారు.

జగత్తు మిథ్య అని చెప్పేవారు 'సర్వంబ్రహ్మ' అనే మూలసత్యాన్ని మరుస్తున్నారు. శ్రీ అరవిందులు తమ దర్శనమును గూర్చి ఇలా చెప్పినారు.

"సర్వత్ర సర్వములో, సర్వసంఘటనలలో బ్రహ్మమునే చూస్తున్నాను. మనుష్యునందు, భక్తియందు, లోహమందు, మట్టియందు వాసుదేవుడే. సామాన్య

వస్తువులు అచేతనంగా కనుపించలేదు. అవి సర్వవ్యాపకమైన చైతన్యంతో నుండి సజీవములుగా కనిపించాయి.

ఈ జగత్తు కల్లకాదు. భగవంతుని లీల. జీవితంగూడా దైవికమే. జీవనను నిరసించటం భగవానుని నిరసించటమే. మనస్సు, ప్రాణం, శరీరమే కాదు మనుష్యుడు. అతడీ భూమిమీద దివ్యసాఫల్యం అభిలషించే ఆత్మ. ఎక్కడో స్వర్గంలోకాదు, భూమిపై ఆత్మయొక్క రాక ఇక్కడ తన దివ్యకర్మను నెరవేర్చటానికి. అందుకు కానిచో తాను ఆ స్వర్గమును వీడిరావలసిన అవసరం లేదు. ఏకాంతమైన నిశ్చల నీరవతతో నివసించటం ఆత్మసంపూర్తికాదు. సంపూర్ణ జీవనవికాసం పైననే అఖండ ఆత్మస్థితి ఆధారపడిపుంటుంది. జీవితాన్ని రద్దుచేసుకోటంగాని మనోమయంగాని, ఆత్మ నిర్వాణంగాని లక్ష్యంకాదు. ఆత్మ తన సత్యంచేత మనుష్యుల జీవన సర్వస్వమును వికసింపజేసి, మనఃప్రాణ శరీరాలను దివ్యం చేయటమే ఆత్మసంపూర్తి. ఈ జీవితంయొక్క దివ్యత్వము భౌతికుల ఆత్మయొక్క వెలుగును, శక్తిని, ప్రేమను, ఆనందాన్ని, సకల ఐశ్వర్యాన్ని విరియజేయటమే ఐహిక జీవితంయొక్క సార్థకత, దివ్యసంపూర్తి. ఆత్మ స్వారాజ్య సామ్రాజ్యాలను వ్యక్తిలోను సమాజంలోను సాధించటం మానవజాతి యొక్క సంపూర్ణసిద్ధి, సృష్టియొక్క తాత్పర్యం.

శ్రీ అరవిందుల దర్శనం యోగలబ్ధం. వారి యోగమును దర్శనమును ఒకచో వారిట్లనిరి : నేను అనుదినం యోగాభ్యాసం చేసేటప్పుడు, చూచినది అనుభవించినది అంతా బుద్ధిగ్రాహ్యంగా వ్రాయటం అయింది. నేను వేదాంతిని కాదు. నాకు వేదాంతం అంతగా తెలియదు. నేను వ్రాసిన దివ్యజీవనము (The Life Divine) వేదాంతంకాదు. అది బుద్ధియొక్క చూపుకాదు· బుద్ధి చేసే తత్త్వవిచారణకాదు. బుద్ధిని మించిన అనుభవం, అతీతమానసం అంటే విజ్ఞానం (Super mind) యొక్క అనుభవం ఈ విజ్ఞానం Science) లేక విజ్ఞానశాస్త్రం అనేపదం వాడుతున్నామే అదికాదు. ఈ ప్రసంగంలో విజ్ఞానం మనస్సుకు పైది. దివ్యజ్ఞానం, దివ్యజీవనం (The Life Divine) ఒక వాస్తవం, యథార్థం, ఆత్మానుభవం. శ్రీ అరవిందుల ఆధ్యాత్మిక దర్శనం (Vision) ఋషి–ద్రష్టయొక్క అంతర్దృష్టి. దర్శనం అనేపదాన్ని నేను అంతర్దృష్టి అనే అర్థంలో వాడుతున్నాను. తత్త్వశాస్త్ర (Philosophy) అనే

అర్థంలో కాదు. శ్రీ అరవిందులు విజ్ఞానజ్యోతిని దర్శించి ఆ దర్శనమును గూర్చి మనకు తెలిపినారు.

తొలుత మనిషి తనలో వున్న అన్ని శక్తులను, శరీరం, ప్రాణం, ఇచ్ఛ, బుద్ధి, హృదయం సర్వం ఆత్మయొక్క సారథ్యంలో సమ్మేళనం చేయవలె. తరువాత వీటన్నిటినీ విజ్ఞానంచేత పూర్తిగా దివ్యంగా మార్చివేయవలె. అప్పుడే సంపూర్ణానుభవం సంపూర్ణసత్యం లభించగలవు అని శ్రీ అరవిందుల దర్శనం.

శ్రీ అరవిందుల పూర్ణయోగం అనే గ్రంథంలో, సావిత్రి అనే మహా కావ్యంలో వారి దర్శనం ఉపలబ్ధి మహోత్కృష్టం. చైతన్యం సృష్టించిన సమస్త లోకాలలో, అనేక అంతస్తులలో వారి పయనం అన్వేషణ, సూక్ష్మమైన పరిశోధన, సాధన, తపస్సు వీటన్నిటి వర్ణన మహాద్భుతం. మనస్సులోని లోతులు, ఎత్తులు, ఆంతరాలు, పొగలు, తెరలు, అరలు, మనస్సు క్రింద అధః శ్చైతన్యం నిశ్చేతనం. మనస్సుపైన విజ్ఞానం. మనస్సుకు విజ్ఞానానికి మధ్యవున్న మండలాలు విజ్ఞానానికి పైనవున్న ఉర్ధ్వలోకాలు—శ్రీ అరవిందులు వీటన్నిటి యందు తపస్సుచేసి, విశదంగా విపులంగా మనకు తెలిపిన రీతి నిరుపమానం. ఇది మరొక విశ్వరూప సందర్శనం! శ్రీ అరవిందుల రచనలన్నిటిలో వారిదైన ప్రత్యేక లక్ష్యం ఒక్కటే: ఇంతవరకు సిద్ధించని దానిని, ఇంతవరకు గోచరము కానిదానిని సాధించటం. అదేమంటే: జీవితాన్ని పూర్తిగా మార్చివేయడం మానవప్రకృతిని మనస్సు పూర్తిగా మార్చలేదు. విజ్ఞానం మాత్రమే అలా పూర్తిగా మార్చగలదు. ఆ మార్పే ముఖ్యం. విలక్షణం. పూర్వుల దృష్టిలో మనస్సుపైకి ఆరోహణ ముఖ్యం. శ్రీ అరవిందుల దర్శనంలో ఆరోహణ మొదటిమెట్టు మాత్రమే, తరువాత ఆరోహణవలన లభించిన విజ్ఞానశక్తియొక్క అవరోహణ ఆవశ్యకం. ఈ అవతరణ మానవుని జీవితాన్ని దివ్యజీవనంగా మార్చివేయటం, విశిష్టలక్షణం.

ఇది ప్రకృతి చేస్తున్న పరిణామానికి ముందడుగు మాత్రమే. అద్భుతమేమి కాదు. తొలుత ఆత్మ జడపదార్థంగా ఆవిర్భవించింది. తరువాత పదార్థంలో ప్రాణం పుట్టింది. ప్రాణంలో మనస్సు, మనస్సు వచ్చింతరువాత ప్రాణాన్ని, జడపదార్థాన్ని మార్చివేసినట్లుగా విజ్ఞానం అవతరించి ఇప్పటి జీవితాన్ని పూర్తిగా మార్చివేస్తుంది. మానవుడు అతీతమానవుడవుతాడు. మానవజాతి

దివ్య మానవజాతి అవుతుంది. శ్రీ అరవిందుల పరమలక్ష్యం ఇది:— విజ్ఞానమును తమలోనికి ఆహ్వానించటం, దానిని భూమిమీద ప్రతిష్ఠించటం— ఇప్పుడు భూమిపైన మనస్సు స్థిరంగా పాదుకొనిలేదు. అలాంటి అవిజ్ఞానం చేత అజ్ఞానమును, నిశ్చేతనను, బాధను, జరామరణములను, జయించటం, శరీరాన్నిగూడా అమృతంగా చేయడం. అప్పుడు విజానశక్తి భూలోకమును స్వర్గలోకముగను జీవనమును దివ్యజీవనముగను, మానవసమాజమును ఆధ్యాత్మిక సమాజముగను పూర్తిగా మార్చివేస్తుంది. శ్రీ అరవిందుల దర్శనంలో ఇదే మోక్షం, దేవత్వం, అమృతత్వం.

శ్రీ అరవిందుల దర్శనం మహోన్నతం, సకలలోక విశాలం, పరిపూర్ణం. పరిపూర్ణత వీరి అనుభవంలో, దర్శనములో ప్రత్యేకమైన లక్షణం. ఈ పరిపూర్ణత కారణంగా మనకు పైకి పరస్పరవిరోధంగా కనిపించే భిన్నదృష్టులను, మతాలను సమన్వయం చేసే శక్తి. బుద్ధికి ఇటువంటి సమన్వయశక్తి లేదు. విజ్ఞానములోనే విభిన్నదృష్టుల సమన్వయం. ఉదాహరణకు: అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైత—వీటి సమన్వయం బుద్ధికి అందదు. బుద్ధి వీటికి భేదం కల్పిస్తుంది. శ్రీ అరవిందులు తమ యోగానుభవంలో, విజ్ఞానంలో ఈ మూడు అనుభూతులు సత్యమైనవిగా, అవశ్యకమైనవిగా, పరస్పరపూరకములుగా చూపినారు. వీటిలో ఏ వొకటి మాత్రమే సంపూర్ణానుభవంకాదు. సత్యం అనంతం. అన్ని దర్శనాలు అనంతసత్యం యొక్క అనేక ముఖాలు

సమన్వయం శ్రీ అరవిందుల యోగజీవనమునకును, బోధకును మూల సూత్రం. శ్రీ అరవిందులు ప్రాచ్య పాశ్చాత్యములను, సనాతన అధునాతనములను సమన్వయించి ఇవి పరస్పరం ఎలా పూరించుకోవాలో చూపినారు. అలానే జడపదార్థమును చైతన్యమును, భౌతికవాదమును ఆధ్యాత్మికవాదమును. శరీరమును ఆత్మను, హేతుబుద్ధిని నమ్మికను, బాహ్యాభ్యంతరాలను, యోగమును, భౌతికశాస్త్రమును, వివిధ యోగసాధనలను సమన్వయించినారు.

శ్రీ అరవిందుల దర్శనంలో నేటి ప్రపంచ సమస్యలకు సమంజసమైన సమాధానాలు కనిపిస్తయ్. కొందరు భౌతికవాదులు, ప్రపంచనాయకులు భౌతిక శాస్త్రాన్ని ఎలా దుర్వినియోగం చేస్తున్నారో. ఇది ప్రపంచ వినాశానికి అనేక విధాల ఎలా దారితీస్తున్నదో మనం చూస్తున్నాం. ఆధ్యాత్మికదృష్టిచే, ఆధ్యాత్మిక

జీవనచే భౌతికశాస్త్రాన్ని సక్రమైనరీతిన ఉపయోగించుకోవాలి. లేకపోతే సర్వ నాశనం తథ్యం.

శ్రీ అరవిందుల దృష్టి ఏ క్షేత్రంలో ప్రసరించినా పరిపూర్ణం. వారి దర్శనములో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక వికాసములు సర్వమును భగవానుని ఆవిష్కారమే. కాబట్టి వీటన్నిటికి ఆధారం, మూలకారణం ఆధ్యాత్మికసత్యమే గాని వేరు కాదు. అధ్యాత్మిక అనుభవానికి, రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవనానికి సంబంధం లేదనటం పొరపాటు. శ్రీ అరవిందులు వీటి నన్నిటిని ఆధ్యాత్మికదృష్టితో, ఈ ఏకైక సత్యమునకు సమన్వయం చేసి వీటి అన్యోన్యసంబంధమును పరమార్థమును నిరూపించినారు.

ఆధాత్మిక జీవనవిధానం నిత్యజీవితంలో కనపడవలె. బాహ్యాభ్యాంతరాలు వేరు కావు. మనిషి, సమాజం, నిత్యజీవితంలో ఆత్మసత్యమును ఆవరించవలె ఈ సత్యమును ఈ మార్గమును వ్యక్తియొక్క ఆత్మాభ్యుదయమునకే కాక సమాజాభివృద్ధికి ఏవిధంగా ఆవశక్యమో "సమాజవికాసతత్వం" అనే తమ గ్రంథంలో శ్రీ అరవిందులు సూచించినారు. వారి "మానవైక్యతాదర్శం"లో మానవజాతియొక్క ప్రస్తుత పరిస్థితులు ఏ తీరున నిజమైన ఐక్యమునకు దారి తీయగలవో చూపినారు. అందలి శుభసూచనాలను విశదపరచి, యదార్థమైన ఆధ్యాత్మిక ఐక్యమునకు చేరుటకు గల అంతరాయములను నిరూపించినారు. ఇప్పుడున్న ఐక్యరాజ్యసమితిలో నిజమైన ఐక్యం లేదు. ఈ కూటమిలో ప్రతి జాతి తన స్వార్థంకోసం పెనగులాడటం చూస్తున్నాం. సంఘైక్యత, సామాజిక జీవనం ఆత్మసత్యంపై ఆధారపడిననాడే నవోదయం శుభోదయం.

ఇప్పుడున్న అంధకారంవల్ల మనం నిరాశచెందుతాం. కాని ఋషిద్రష్టలు రేపటి ప్రపంచం చూడగలుగుతారు. శ్రీ అరవిందుల దృష్టిలో భావిప్రపంచం మరోప్రపంచం దివ్యప్రపంచం కాగలదు. మానవజాతియొక్క సంపూర్ణవికాసం దివ్యపరిణామం అనివార్యం. ఈ దివ్యపరిణామం విజ్ఞానశక్తిద్వారా మాత్రమే సాధ్యం. దీనిని సాధించటమే నేటి ప్రపంచంలోని క్లిష్టసమస్యలన్నిటికీ, ఏకైక పరిష్కారమార్గం. ఇది దైవ నిర్దిష్టం అని శ్రీ అరవిందుల దర్శనసారం.

---

# ఆధ్యాత్మిక విప్లవము

— జితేందర్

భారత దేశములో ఎన్నియో ఆశ్రమాలున్నాయి; మరియు మఠాయిన్నాయి. అందులో శ్రీ అరవిందాశ్రమము ఒకటని భావించుతారు సామాన్యంగా. ఆశ్రమమంటనే సన్యాసమని భయపడే భావన చాలా మందికుంది అయితే. అన్ని ఆశ్రమాలకు, శ్రీ ఆరవిందాశ్రమానికి గల భేదమేమిటి? ఇంతకు పూర్వము ఎందరో మహాత్ములు, యోగులు, అవతారులు చెప్పినదే శ్రీ అరవిందుల వారు చెప్పినారా? అందరు చెప్పినదే చెప్పితే మరి వారి విశేషమేమిటి? ఆశ్రమమును దర్శించినపుడు కన్పించెడి అనుభూతులెలాంటివో తెల్సుకోవాల్సియుంటుంది. శ్రీ అరవిందాశ్రమము 1910లో ప్రారంభమైనది కొలది భక్తులతో—శ్రీతల్లిగారు వచ్చిన తరువాత ఆశ్రమము పెద్ద ఎత్తున పెరిగినది. ప్రస్తుతము దాదాపు రెండు వేల సాధకులు (పెద్దలు—పిల్లలు) ఆశ్రమంలో వుంటున్నారు. ఆశ్రమాన్ని సరిగ్గా అర్థము చేసుకోవాలంటే, ఆధునికులకు చాలా కష్టముగావుంది. వాండ్లకు Laboratory అంటే బాగా అర్థమవుతుంది. Scientists Laboratory (శాస్త్రజ్ఞులు ప్రయోగశాల)లో Research (ప్రయోగాలు) చేస్తారు. యోగులు ఆశ్రమాలను Laboratory (ప్రయోగశాలలుగా) వాడుకుపటారు. ప్రయోగ శాల) లో మానవ అవసరాల గురించి, వస్తు, గుణ రహస్యాలను తెలుసుకొని క్రొత్త క్రొత్త పదార్థాలను తయారు చేస్తారు. అవి మంచికి, చెడుకు ఉపయోగ పడుచున్నవి. అవుతే వాటిని ఉపయోగించేవాడు అజ్ఞానముతో కూడిన మానవుడు. ప్రస్తుత ప్రపంచములో శాస్త్రజ్ఞు (Scientist)ల పరిశోధనలు యింత గొప్ప Civilasation [సంస్కృతిని]ను, సంపదను, విజ్ఞానాన్ని భయంకర బాంబుల మధ్య నిలుపలేని స్థితికి తెచ్చారు వారు తయారు చేయడమేగాని, వాటి పరిణామముతో వారికి పనిలేదు.

పూర్వము నుండి గూడా ఆశ్రమాలు మానవాభ్యుదయము కొరకే, మానవోన్నతి కొరకే కృషి సల్పినావి. అవుతే పూర్వ ఆశ్రమాలు భౌతిక జీవితానికి

విలువ నివ్వక ఆత్మోన్నతికి మాత్రమే [మోక్ష సాధనకై] ప్రయత్నించినారు. అందువల్ల ఎక్కువ శాతము ప్రజలు ఆధ్యాత్మికతను అసహ్యించుకోసాగి నారు. ఆధ్యాత్మికమంటే అడవికిపోవుట, మరియు సన్యసించుట యనే వంటి భయము ప్రజల్లో ఏర్పడినది. పూర్వపు ఆశ్రమాలు పట్టణాలకు దూరంగా వుండేవి. సాధనచేసే వాండ్లందరు ఏకాంత గుహల్లో, అడవుల్లో నివసించే వారు. దైవమంటే అందరివాడుకాడు, గుహల్లో కొండల్లోవుండె వాండ్లకే లభిస్తాడని తలంచడము సామాన్యమై పోయింది ప్రజలకు.

శ్రీ అరవిందుల వారి ఆశ్రమాన్ని దర్శించిన మనకు పూర్తిగా పాత భావాలకు వ్యతిరేకముగా కన్పించుతుంది. ఆశ్రమము ఒక ప్రత్యేక పరిధిలో వేర్పాటుగా లేక పట్టణమును పూర్తిగా ఆక్రమించుకుంది. శ్రీ అర విందుల సమాధి–శ్రీతల్లి గారు నివసించి స్థలము ప్రతి యొక్కరికి ప్రతినిత్యము దర్శించే కేంద్రము. మరి మిగతా భవనాలు, గృహాలు, పట్టణపు అన్ని భాగల్లో వున్నవి. అంటే పట్టణములో నివసించుతూ ఆశ్రమ జీవితము [సాధనా జీవితము] గడుపుచున్నారు. నూతన భవనాలలో (ఫ్లాట్లల్లోనూ) మరియు అద్దె యిండ్లలో కూడా, అన్ని ఆధునిక సౌకర్యాలతో గడుపుచున్నారు. బాహ్య ప్రపంచములో డబ్బు, కార్లు, ఆభరణాలు, మరి యితర భౌతిక వస్తువుల వల్లే జీవితమని తలంచుతారు. కాని యిక్కడ దైవము ముఖ్యము. దైవము లేనిది ఏది లేదని అంతరములో భావించుతూ బాహ్య వస్తువులను ఆయన నిమిత్తము వాడుకుంటారు. కాని అవియే వారి జీవితానికి ముఖ్యము కావు. అవుతే యిక్కడ భౌతిక జీవితము నిర్లక్షించబడడములేదు. కాని జీవితము దివ్యమయంగా చేసుకొనుటకు సాధన చేస్తున్నారు. జీవితము తిరస్కరించబడక కుండా ఆనందింపబడాలనే ధ్యేయము. కాని ప్రపంచములో అశాంతి ఎక్కువ మైంది. ఎందువల్లనంటే, మనిషిలో స్వార్థము, అజ్ఞాన అహంకారాలు, సంకుచిత, స్వార్థాలున్నందువల్ల. వీటిని తొలగించుటకే పూర్వము నుండి కృషి సల్పుచున్నారు. ఎందరెందరో ఎన్నో మార్గాలు చూపించారు. అవి ప్రతి మార్గము ఒక మతంగానో, ఒక శాఖగానో, మిగిలిపోయి విడిపోయినవి. తర్వాత ఒక దానితో ఒకటి పోటీ పడటము ఎక్కువైపోయింది. ఒకరికంటె ఒకరు గొప్పనిపించుకోవాలనే తాపత్రయము. మేము ఆచరించే మతమే లోకాన్ని ఉద్ధరించుతుందని, మాదే గొప్పదని, మా గురువే గొప్పవాడని

యిలా ఎవరికి వారు పరిధులను ఏర్పరుచుకొని, యితరులను చిన్న చూపు చూస్తూ, ఘర్షణలు పడుతూ, వాతావరణమంతా కలుషితము చేసినారు. చెప్పిన మహానుభావులు సత్యమే చెప్పినారు కాని, అదేపూర్ణ సత్యమని భక్తులు తలంచి, యితరమంతా చెడు అని, యితరులది తప్పని నిరూపించడములోనే కాలం గడుపుతున్నారు. ఎందులో ఏ సత్యముందో ఆ సత్యాన్ని పొందుదాము, మనకు కావల్సింది సత్యము అనే విశాల భావము లోపించింది. అందువల్లనే మత కల్లోలాలు, యుద్ధాలు, ఘర్షణలు, పోరాటాలను అనాది నుండి చరిత్రలో చూస్తాము. మరియిప్పుడు గూడా ప్రపంచ స-ఘటనలలో, ప్రజలల్లో చూస్తూనే వున్నాము. కులాలని, వర్గాలని, చిన్నా, పెద్దా అని ఎన్నో తారతమ్యాలు మానవ జీవితాన్ని దుర్భరంగా చేస్తున్నాయి. వీటిలో మానవుడు యిరుక్కొని అవస్థపడుతున్నాడు. ఇవి కాక, ఆర్థిక, తదితర పరిస్థితులు కూడా చాలా వైషమ్యాలకు దారి తీసినవి. మరియు మనిషితో సహజంగావుండే దుర్లభాలు, కామ, క్రోధ, లోభములు, స్వార్థ సంకుచితాలు_అన్నీకల్సి మానవ జీవితానికి ఒక విషమ పరిస్థితి నేర్పరచినవి. వీటితో మానవుడు నైతికంగా దిగజారి పోవుచున్నాడు. దీనికి తోడు రాజకీయ వాతావరణం మరింత సంకుచితంగా తయారైంది. ప్రతి మనిషికి రాజకీయము కేంద్రము అయింది. రాజకీయంగా సంబంధము లేనట్లవుతే వారికి జీవితము లేదనుకుంటారు. అవుతే మనిషికి దైవము ముఖ్యమని తర్వాతనే అన్నీ అనే స్థితికి మానవ స్వభావము మరల వల్సియుంది.

ఈ అన్ని సమస్యలకు, పరిష్కారము శ్రీ అరవిందాశ్రమములో లభించుతుంది అక్కడ ఎన్నో మతాలవాండ్లున్నారు. ఎన్నో ప్రాంతాల వాండ్లు మరియు ఎన్నో దేశాలవాండ్లు అక్కడ సాధన చేయుచున్నారు. అక్కడ కుల, మత, వర్గప్రాతి పదకలేదు. అక్కడంతా ఒకే తల్లిబిడ్డలు. అంతా ఒకే కుటుంబము. భోజనాలు గూడా అంతా ఒకే భోజనశాల (Dining hall)లో చేస్తారు. అక్కడ భోజనశాలలో తింటూవుంటే ప్రపంచ మానవులంతా ఒక్క దగ్గరనే కూర్చొని తింటూవున్నట్లనిపిస్తుంది. ఎంతో ఆనందం కల్గుతుంది. ఎవరు గూడాకాషాయ వస్త్రాలు లేక సన్యాసిలా కన్పించరు. కట్టు, బొట్టులో ఎలాంటి నిషేధములేదు. ఎవరికి నచ్చిన బట్టలు వాండ్లువేసుకుంటారు. తమను తాము వికారంగా వ్యక్తీకరించకుండా సౌందర్య తపస్సు చేస్తారు. భగవంతుడు

ప్రతిదాంట్లో సౌందర్యము, వెలుగు, వికాసాన్ని నింపినాడు మరి మనిషి ఎందుకు సౌందర్యోపాసన-చేయకూడదు, వికాసంగా వెలుగుతో ఎందుకు వుండకూడదనేదే అక్కడిసాధన. ప్రతి ఒక్కరు చిన్నాపెద్దయు—ఒక తోటలోని వివిధ పుష్పాలు ఎలా కళకళలాడుతూ ఆనందంగా ఎలాకనిపిస్తాయో ఆలాగే అక్కడ అందరూ సౌందర్యంగా, ఆనందోత్సాహాలతో కళకళలాడుతూ వుంటారు. ప్రతి ఒక్కరి ముఖములో ఏదో ఒకవింత తేజస్సు కన్పిస్తుంది.

శరీరారోగ్యానికి వలసినన్ని జాగ్రతలు తీసుకుంటారు. ఆయుర్వేద వైద్యము, హోమియోపతి,-యునాని మరియు అలోపతి(-నర్సింగ్ హోమ్ గూడా) చికిత్స సౌకర్యాలున్నవి. తినే ఆహారముగూడా మనిషిని బలిష్ఠంగా ఆరోగ్యంగా చేయుదృష్టితోవుంటుంది.రుచికొరకుకాదక్కడ భుజించేది; ఆరోగ్యానికనిభావము. శరీరపటిష్ఠం పెంచేటందుకు వలసినన్ని వ్యాయామ పరికరాలున్నవి (నూతన పరి కరాలుగూడ Weight Lifting వగైరాలు). మరియు పుట్ బాల్ హాకీ (Hockey ), వాలీబాల్ (Volley Ball), బాస్కెట్ బాల్ (Basket Ball), టెన్నిస్‌గ్రౌండ్సు (Tennis grounds) వున్నాయి మరియు ఎన్నో Indoor games వున్నవి. మరియు Boxing (బాక్సింగ్), Wrestling (రెసిలింగ్) వగైరాలు గూడా నేర్పుతారు. Swimming pool (స్విమ్మింగ్ పూల్)గూడా వుంది. ఈత నేర్పుతారు. అప్పుడప్పుడు పోటీలు గూడా వుంచుతారు. ప్రతి నిత్యము పిల్లలు పెద్దలూ వ్యాయామాల్లో ఆటల్లో పాల్గొంటాను. పిల్లలకు తప్పనిసరి-పెద్దల యిష్టముపై వుంటుంది.

ఆశ్రమములో శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాకేంద్రమున్నది. అక్కడ విద్యార్థులు పొందే విద్యపొట్ట కూటికి గాక విజ్ఞాన సముపార్జనకు, నూతన చైతన్య ప్రగతికి సహకరించేదిగా వుంటుంది. ఉపాధ్యాయులు విద్యా ర్థులకు సహాయకారులుగా మాత్రముంటారు. ఉపాధ్యాయులకు వేతనము లుండవు. ఉపాధ్యాయులు విద్యార్థులకు చెప్పడమే వారిసాధన. వారుచేసే ప్రతిపని దైవానికర్పించుకుంటారు. ఉపాధ్యాయులు, విద్యార్థులు కల్సి దివ్య సత్యాన్వేషణలో పాల్గొంటారు. ఉపాధ్యాయులకు సర్వం తెలుసుననే భావంతో విద్యచెప్పరు. విద్యార్థులకు సహాయకారులుగా వుంటూ, వారూ నేర్చు కుంటారు. ఆశ్రమ గ్రంథాలయము చాలాపెద్దది. వేలాది గ్రంథములున్నవి.

సాధకులు, విద్యార్థులు వేదాంత పుస్తకాలేకాక, వారివారి అభిరుచినిబట్టి యితర గ్రంథాలను గూడా చదువుతారు. ఎన్నో (Magazines) పత్రికలు, దేశ విదేశాలనుండి గూడావస్తాయి.

ఆశ్రమములో వ్యవసాయము, తోటలు, ప్రింటింగ్‌ప్రెస్, బేకరి, పేపరు మిల్లు, కట్టెపనిశాఖ, గృహ అవసరముల ఇంజనీరింగ్‌శాఖ, మోటార్‌వర్క్‌షాప్ మరియు యితర అనేకశాఖలున్నవి. వీటిలో సాధకులు అవసరకార్యాలను చేస్తారు. ప్రతి ఒక్కరు దైవ కార్యమనిభావించి, దైవాని కర్పించుతారు వారి కృషిని. శరీరముతో చేసేపని (దైవార్పితము) శారీరక ప్రార్థనంటారు శ్రీ తల్లిగారు. మనః, ప్రాణ, శరీరాల ప్రార్థన జరగాలంటారు. మనలోని ఆకాంక్ష మనః, ప్రాణ శరీరాలనే రూపాంతరము గావించబడాలనే ఉద్దేశముతో వుండాలంటారు, శ్రీ అరవిందులు మాలిన్యము మనః, ప్రాణ, శరీరాలలో యున్నది. అవుతే దానిని తొలగించడము, మానవ ప్రయత్నము శ్రమవల్ల నెరవేరదంటారు. మరియు మనః, ప్రాణ, శరీరాలలో సామరస్యము లేదంటారు. వీటిని రూపాంతరించి ఆనందామృతమును భరించుటకు శ్రీ అరవిందులవారు, "మాతృశ్రీ" (The Mother) గ్రంథములో తెలిపినారు. (1) నిరంతరము దైవాన్ని కాంక్షించుట, (2) చెడునంతా విసర్జించుట, (3) సంపూర్ణంగా దైవార్పణగావించుకొనుట,-అనునవి తెల్పినారు. ఈ భావనతోనే అక్కడ సాధకులు దైవార్పణగావించుకొని వారి కర్మల నాచరించుచున్నారు. సంపూర్ణార్పణ జరిగినంతవరకు సాధనచేయవల్సిందే. ఈ లోకమంతా జగన్మాత సృష్టిమయమే. ఆమెయే ఈ అజ్ఞానలోకాన్ని ఉద్ధరించి దివ్యమయము, జ్యోతిర్మయము చేయుటకు అవతరించినారు ; ఆమెయే యిప్పుడు ఆశ్రమములోవున్న "మాతృశ్రీ" అని మరియు ఆమెయేపృథ్వి ఉద్ధరణకు సాధనచేయుచున్నారని, సర్వులు "మాతృశ్రీ"కే సర్వార్పణ చేసుకోవాలని శ్రీ అరవిందులవారు తెల్పినారు.

శ్రీ మాతారవిందులు ఈ భువిపై నవతరించునుద్దేశము "సావిత్రి" గ్రంథములో—

To raise the world to God in deathless light,
To bring God down to the world on earth we came,
To change the earthly life to life Divine.

(SAVITRI-Book XI; Canto I)

ఉదాహరణకు వర్షాకాలము బాగా వర్షాలు పడితే ఎక్కువనీరు కాలువలై ప్రవహించి, నదులై, మహా నదులలోకి ప్రవహించి, సముద్రములో కలుస్తుంది. ఆ నీటికి సముద్రములో కలవడమే ఆనందము. అలాగే మోక్షసాధకులకు ఈ పృథ్వీజీవిత బాగోగుల నిమిత్తము లేకనే వారు అపరమానందమునే లక్ష్యంగా చేసుకొని పృథ్వీజీవితాన్ని లక్షించరు.

అవుతే ఈ పృథ్వి ఉన్నంతవరకు జీవితముండవల్సిందే కదా! మరి ఈ జీవితము శుష్కించి, బాధపడి నిరర్థకంగా గడవాల్సిందేనా! మనస్పర్థలు, ఈర్ష్యాద్వేషాలు, పోరాటాలు, యుద్ధాలతోనే ఈ జీవితము గడపవల్సిందేనా! అయితే, ఈ జీవితమెంత భయంకరమైనదో గదా!

వృధాగా సముద్రములోనికి ప్రవహించే నీటికి మహా ఆనకట్టలు వేసి ఈ పృథ్విలోని నిస్సారప్రాంతాలన్నిటిని సారవంతముచేసి పంటలు పండించి ఆనందించాలన్నట్లు, మరి విద్యుత్ వెలుగును ప్రతి గ్రామానికి ప్రతి ఇంటికి తీసుకు వెళ్ళాలన్నట్లునూ, అంటే దివ్యజ్యోతి ప్రతిహృదిలో మెలగాలనీ, అపుడే నిజ దీపావళి. విజ్ఞానానందవెలుగులకు, శక్తిసామర్థ్యాలకు, సౌందర్య సంపదలకు మనము ఆనకట్టలు కావాలని శ్రీ అరవిందుల ఆశయము. అప్పుడే ఈ జీవనము దివ్యజీవనముగా మారుతోందంటారు. అయితే, అది ఏ కొందరిలోనోకాక అందరిలో ఆ పరివర్తన రావాలంటారు. వ్యక్తిలో మార్పుగాదు శ్రీ అరవిందులు ఆశించినది. వ్యక్తిలోను, మరి సమష్టిలోను ఆపరివర్తన రావాలంటారు. ఆ మార్పు ఆధ్యాత్మికవిప్లవంవల్ల జరుగుతుందంటారు. అటువంటి ఆధ్యాత్మిక విప్లవానికి మూలస్థానమే శ్రీ అరవిందాశ్రమము. కుల, మత, వర్గ ప్రాతిపదికలు లేకుండా మానవులంతా ఒకే కుటుంబమని, అజ్ఞానహంకారాలవల్ల విడిపోయినారని, తిరిగి విజ్ఞానం పొంది, మానవులంతా ఐక్యమై ఆనంద కుటుంబముగా జీవించాలనేదే వారి ఆశయము.

ఆశ్రమములో ఎన్నో ప్రాంతాలవారు, మరి ఎన్నోప్రదేశాలవారు, ఎన్నో కులాలవారు, మరి ఎన్నోమతాలవారు ఒకదగ్గిర కలసిమెలిసి జీవించుతున్నారు. ఇందరిని కలిపి జీవింపచేస్తున్నది శ్రీ మాతారవిందుల శక్తే, వారి వెలుగే, వారు ప్రసాదించిన విజ్ఞానమే.

"అసత్యమునుండి సత్యమునకు,
అజ్ఞానమునుండి విజ్ఞానమునకు,
చీకటినుండి వెలుగునకు,
సంకుచితమునుండి విశాలమునకు,
స్వార్థమునుండి నిస్వార్థమునకు,
మృత్యువునుండి అమరత్వమునకు."—

మన ప్రయాణ ముండాలంటారు. మన ఆశయముండాలంటారు. మన గమ్యమదే నంటారు శ్రీ అరవిందులవారు మనకు కావాల్సింది మతము కాదంటారు. కావల్సింది, న్యాయము, ధర్మము, సత్యమంటారు— శ్రీ అరవిందులు. ఇంతటి విశాల దృక్పథముండబట్టే కుల, మత, వర్గ ప్రాతిపదిక లేకుండా దేశ విదేశాల నుండి వచ్చి ఆ దివ్యకార్యములో పాల్గొంటున్నారు, నూతన చైతన్యాన్ని పొందుతున్నారు. ప్రపంచములోనే ఒక నూతనమార్పు, చైతన్యాన్ని, విప్లవాన్ని తీసుకువచ్చినారు శ్రీ మాతారవిందులు. ఆ మార్పుకు నిదర్శనమే శ్రీ అరవిందాశ్రమము.

శ్రీ అరవిందుల స్థానాన్ని మనం అర్థం చేసుకోవాలంటే శ్రీ తల్లిగారు తెలిపిన ఒక కథవల్ల అర్థమవుతుంది.

ఒక తండ్రి, నలుగురు పుత్రులు ఒకేవృక్షాన్ని నాలుగు వివిధ కాలాలలో చూచినారట. ఒకడు ఆకులులేని బోడివృక్షంగా చూచినాడు. ఇంకొకడు అదే వృక్షాన్ని ఆకులతో చూచినాడు. మరి మూడవవాడు పువ్వులతోను, నాలుగవ వాడు కాయలు, పండ్లతో చూచినాడట. ఒకసారి వాళ్ళలో ఆ వృక్షాన్నిగురించి ప్రసక్తి వచ్చిందట. అప్పుడు అందరూ చూచినామన్నారట. ఎవరు చూచిన ఆకారము వాండ్లు తెలిపినారట. ఏ ఒక్కరూ యితరులతో ఏకీభవించకుండా నాదే సత్యమని, ఆ చెట్టు బోడిగా వుంటుందని ఒకరూ, ఆకులుంటాయని ఒకరూ, ఆకులేగాదు పువ్వులుంటాయని, పువ్వులేగాదు కాయలూ పండ్లుంటాయని ఘర్షణ పడ్డారట. అయితే, ఆ నలుగురు వారి తండ్రిదగ్గరకు వెళ్ళి ఎవరిది సత్యమో తీర్మానించమన్నారట. అయితే, తండ్రి మీరందరూ సత్యమనీ, ఎవరు చెప్పిందీ అసత్యంకాదని, అయితే ఒకేవృక్షాన్ని వివిధకాలాలలో చూచినందున అది కాలధర్మాన్ని బట్టి, ఆకులు లేక, ఆకులతో, పూలతో, పండ్లతో

వుంటుంది. అది తన కాలధర్మాన్ని చూపించుతుంది. కనుక ఎవరిదీ తప్పు కాదు. కాని మీకు పూర్ణసత్యము తెలియక పోటీలు పడినారు. మీది ( Partial Truth) ఆంశికసత్యం మాత్రమని చెప్పినాడట వారి తండ్రి.

ప్రస్తుత ప్రపంచ పరిస్థితి అలాగేవుంది. అందరూ ఒకరితో ఒకరికి పోటీ. మాదే సత్యమంటే, మాదే సత్యమని ఘర్షణలు పడుతున్నారు. మా యోగమార్గమే గొప్పదంటే మాదే గొప్పదంటున్నారు మా దేవుడే గొప్పవాడనీ. మా అవతారుడే గొప్పవాడనీ, మా గ్రంథమే గొప్పదనీ ఒకరితో ఒకరు పోటీపడుతున్నారు—ఒకరు రాజయోగము గొప్పదంటె. ఒకరు తాంత్రిక మంటే, యింకొకరు హఠయోగమనీ, మరియొకరు భక్తి గొప్పదంటే, ఒకరు కర్మ గొప్పదంటె. మరి ఇంకొకరు జ్ఞానం గొప్పదని — యిలా ఎన్నెన్నో విభేదాలతో సతమవుతున్నారు. ఒకరితో ఒకరు ఒకదిక్కు సైన్సు, మరియొక దిక్కు నాస్తికత్వము మరియు Communism, Capitalism మరియు Socilism, యిలా ఎన్నెన్నో మనుష్యులపై ప్రభావం వేస్తున్నవి. అయితే, వీటన్నిటితో సతమత (confuse) మవుతున్నాడు మానవుడు. కులాలనీ. మతాలనీ, వర్గాలనీ, రాష్ట్రాలనీ. దేశాలనీ. కొన్ని దేశముల కూటములనీ, యిలా ఒకరితో ఒకరు విడిపోతున్నారు. అయితే, ఈ భిన్నత్వంలో ఏకత్వ మెలా సాధ్యమవుతుంది. అందరిలో అన్యోన్యత ఎలా కుదురుతుంది? సామరస్యము ఎలా కుదురుతుంది? నలుగురు కొడుకులకు తండ్రి ఎలా సమాధానము చెప్పినాడో అలాగే, శ్రీ అరవిందులవారు ప్రతియోగము, సత్యముయొక్క విశేషములను తెలుపుతు యోగ సమన్వయము గావించినారు. ఆధ్యాత్మికంగా (Evolution) ను స్పష్టంగా విశదీకరించి ఆధ్యాత్మికమును Scientific గా నిదర్శనము చూపినారు. Darwin Evolution చదివినవాండ్లకు శ్రీ అరవిందులు తెలిపిన Evolution వల్ల వాళ్ళ అనుమానాలు, మరియు అటు భౌతికంగా, ఆధ్యాత్మికంగా కూడా సామరస్యము కుదురుతుంది. కుల, మతములేని నూతనమానవుని Platform తయారుచేసినారు శ్రీ అరవిందులు. అక్కడ మానవత్వమునుండి మాధవత్వమునకు, మానవుని మనలోనికి ఆహ్వానించడము.

Capitalismలో ధనవంతులకు పేదలకు సామరస్యము లేదు. Society లో ఆనందంలేదు. Communism లో వ్యక్తిస్వేచ్ఛ లేదు. ఆనందములేదు.

పశువువలె తిండి, గుడ్డ, వసతి, ఆరోగ్య సమస్యలతో [illegible] యుంటుంది. మరి Socialism అనేది బయటికి దానికే [illegible]. కాని, దాని ఆచరణ ఎలా సాధ్యం? అది బహిర్గతజీవనాన్ని మాత్రమే [illegible] కాని, బహిర్గతజీవనాన్ని గూడా ఎంతవరకు సమానపరుస్తుంది. [illegible] ఏలన, మానవనైజములోనే, ప్రవర్తనలోనే, పరివర్తన జరిగితే తప్ప [illegible] ఆశించలేము. అందుకే శ్రీ తల్లిగారు "What else can we expect from them unless their Consciousness changes"— అని అంటారు. Consciousness మారనిది ఏమీ లాభము లేదంటారు. Consciousness మారాలంటే సాధన చేయాలి, దైవార్పణ గావించుకోవాలని. [illegible] దైవానికర్పించుకోవాలని. చెరునంతా [illegible] భగవంతుడుని ఆకాంక్షించాలంటారు శ్రీ అరవిందులవారు [illegible] ప్రయత్నము వల్లగాక, భగవత్ కృపవల్లనే [illegible] అరవిందులు. అయితే ఆ భగవత్ కృపను (The power that mediates between the sanction and the call is the Presence and Power of the Divine Mother- "The Mother") పొందుటకు జగన్మాత కృప బడయుట ముఖ్యమంటారు; సర్వము జగన్మాతకే సమర్పించుకోవాలంటారు దైవకృపను అందించునది ఆమెయేయని. మన ఆకాంక్షకు మరియు దైవ కృపకు మధ్యలో వున్నదామేనని. ఆమెయే [illegible] (Sanction) [illegible] చేదని శ్రీ అరవిందులు తెలుపుతారు. సృష్టి [illegible] ఆ జగన్మాతకే [illegible] సమర్పించాలని, మరియు ఆ జగన్మాతయే శ్రీ అరవిందాశ్రమమాత [illegible] మాత్రశ్రీ అని, సర్వమామెకే సమర్పించాలి శ్రీ అరవిందులు [illegible] శ్రీ అరవిందాశ్రమములో విభిన్న వర్గ, కుల, [illegible] బిడ్డలుగా జీవించుతున్నారు. అక్కడ మనం [illegible] దర్శించుతాము. ఏపనిచేసినా భగవత్ సమర్పణతో [illegible] పెద్దపని యను భేదము లేక చేసే పనిని ఆనందముతో [illegible] నంతే భక్తితో చేస్తారు. Capitalism, Communism, Socialism [illegible] Spiritualism లో వున్న [illegible] లేని సామరస్య ఆనందము [illegible] ల్సింది దైవ సామ్రాజ్యము. దైవసామ్రాజ్య [illegible] విందులవతరించినారు.

ఈ నూతనానందము, చైతన్యము ఆశ్రమములో [illegible] భక్తులకేనని తలంచుటకాదు. యావత్ ప్రపంచము [illegible]

ప్రపంచమంతా దివ్యమయము కావలసియున్నది. ప్రపంచమంతా ఏకత్వాన్ననుభవించవల్సియున్నది. 1910లో శ్రీ అరవిందుల వారి వెంబడి వచ్చిన 4, 5 గురు భక్తులతో ప్రారంభమై, యిప్పుడు దాదాపు రెండు వేల భక్తులు ఆశ్రమములో సాధన చేయుచున్నారు. మరియు బయట ఎందరో భక్తులున్నారు, దేశ విదేశాలలో. ఈ 60 సంవత్సరములనుండి ఎందరినో శ్రీ మాతారవిందుల వెలుగు నాకర్షించింది. వారి వెలుగు, సత్యము; బీజప్రాయము నుండి ఒక మహావృక్షమైనది. ఆ అమర ఫలాలను లోకమంతా నాటుట మొదలుపెట్టారు శ్రీతల్లి గారు.

ఫిబ్రవరి 28, 1968 న దైవ సామ్రాజ్యానికి పునాది వేసినారు శ్రీ తల్లి గారు [అరోవిల్ నగర శంఖుస్థాపన దినము]. ప్రపంచ రాజ్యాల నుండి మరియు భారత వివిధ రాష్ట్రముల నుండి మట్టిని తెచ్చి అంతా ఒక దగ్గర కలిపినారు, సమాధి Soil మరియు అరవిల్లు Soilలతో సహా Foundation bud లో కల్పినారు. భౌతికంగా అన్ని దేశాలకు ప్రపంచైక్యతకు పునాది వేసినారు శ్రీతల్లిగారు. శ్రీఅరవిందుల "మానవైక్యతా దర్శము"నకు యిది పునాది మరియు శ్రీతల్లి గారి "ఒక స్వప్నం" వాస్తవంలోకి వచ్చిన సుదినం. ప్రపంచ ప్రజలు, ప్రపంచ దేశాలన్నీ ఆనందముతో పరవశించిన పర్వదినము. శ్రీతల్లి గారు అంటారు.

"At last there is a place where one can think only of progressing and transcending oneself

At last there is a place where one can live in peace with no conflict and rivalry among the nations and Religions and ambitions.

At last there is a place where nothing will have the right to impose itself as the exclusive truth".

చివరికి మనమభివృద్ధి జెందుటకు మరియు మన నధిగమించుటకు మాత్రమే ఆలోచించే ఒక స్థలము ఏర్పడినది మరియు దేశాల మధ్య, మతాల మధ్య, కోరికల మధ్య పోట్లాటలు లేకుండా శాంతియుతంగా కలిసి జీవించే

స్థలము ఏర్పడినది. మరియు ఇదే సత్యము యితరముదికాదని చెప్పేటటు వంటి పరిస్థితి లేకుండావుండే స్థలము చివరికి ఏర్పడింది అని అంటారు శ్రీతల్లి గారు. [సత్యము బహుముఖమైనదని భావము]

ఇప్పుడు ప్రపంచమంతా ఆరోవిల్లు దిక్కు మరలినది. దేశదేశాల నుండి ఈ పుణ్య భూమిని దర్శించుటకు వస్తున్నారు. భౌతికంగా సౌభాగ్యంగావున్న దేశాలలో గూడా వారికి ఆనందం కరువైంది. ఎంత సంపదలున్నప్పటికి వారికి ఆనందం దూరమైనది. వారి భౌతిక అభిరుచులతో విసుగుచెందినారు. ఆత్మానందము కావాలనే ఆకాంక్షతోవున్నారు. మా సంస్కృతి ఎంతో గొప్ప దని తలంచేవారికి యిప్పుడు మానసిక జబ్బులతో బాధపడుచున్నారు. వారి దృష్టి భౌతికం నుండి ఆధ్యాత్మికమునకు మరలుచున్నది. అయినా ఎక్కడ చూచినా రాజకీయాలు. కుల, మత, ప్రాతిపదికలతో బాధపడుచున్నారు. భౌతి కంగా అభివృద్ధి లేని దేశాలలో భౌతిక అభివృద్ధి కొరకు ఆకాంక్షించుచున్నారు. భౌతిక జీవితము బాగుపడుటకు ఆధ్యాత్మికము ముఖ్యమంటారు. ఆధ్యాత్మికపు వెలుగులో జీవితాన్నుద్ధరించుకోవాలంటారు శ్రీ అరవిందులు. భౌతికాధ్యాత్మిక సామరస్యము, భౌతికాధ్యాత్మిక ఆనందముల దర్శనమే అరొవిల్.

ఏ దేశపు సంస్కృతి గూడా పూర్ణమని, గొప్పని గాక అన్ని సంస్కృతు లలో మంచి చెడులున్నవి. కాబట్టి అన్ని సంస్కృతుల సమ్మేళనము నుండి ఇంకొక నూతన సంస్కృతి ఏర్పడవలసియున్నదని, అప్పుడు ఈ గొప్పలుండ వని శ్రీ అరవిందుల వారంటారు. అరోవిల్‌లో అన్ని దేశాల **(Cultural Pavilians)** సాంస్కృతిక భవనాలు వుంటాయి. ఒకే స్థలములో ప్రపంచ సంస్కృతులన్నిటిని దర్శించే మందిరము అరోవిల్. దాదాపు 50 వేలమందికి వసతి కల్పించబడుతుంది. ప్రపంచపు ఏ మూలనుండైనావచ్చి ఆ పట్టణములో నివసించవచ్చును. నూతనాభ్యుభయ కాంక్షవున్నట్లయితే అక్కడ అంతర బాహ్యాలోకాలను దర్శించుటకు బయటి ప్రపంచపు చిక్కులుండవు. వారి సాధనకు వలయు సహకారములుంటాయి. కుల, మత, వర్గ ప్రాతిపదిక; పక్షలు, పోటీలు, మోసాలు; లేని నూతన స్థలమును యే ఆత్మ వికాసం కోరే వాడైనా కాంక్షించుతాడు, ఎవరికైనా కావల్సింది ఆనందం, కుల, మత, వర్గాలలో ఆనందం లభించదుగదా. అందుకే వీటన్నిటిని అధిగమించమంటారు శ్రీమాతారవిందులు.

శ్రీఅరవిందాశ్రమము 2 వేల భక్తులతో సామరస్యంగా జీవించుతూ వుంటే. అరొవిల్లులో 50 వేల మంది సామరస్యంగా జీవించడములో ఆశ్చర్యము లేదు. శ్రీమాతారవిందుల వెలుగు యావత్ ప్రపంచములోనే సామరస్యాన్ని తీసుకవస్తుంది. వారి వెలుగుతో యావత్ ప్రపంచములోని అంధకారము తొలగిపోతుంది.

అరొవిల్లు శంఖుస్థాపన తర్వాత యావత్ప్రపంచ సంఘటనలోనే మార్పు వచ్చినది. అంతకు పూర్వము ప్రత్యేకంగా భారతదేశ స్థితి చాలా క్లిష్టంగా వుండినది. దేశనాయకత్వముపైన విశ్వాసములేదు ప్రజలకు. కేంద్రము, రాష్ట్రనాయకులపైన ఆధారపడి నడవవల్సియుండెను. ప్రతి రాష్ట్రములో స్వయం ప్రతిపత్తికి అలజడులు బెంగాలులో నక్సలైట్ల గొడవ, యింకా ఎన్నో గొడవలతో సతమతమగుచుండెను. ఈ 3 సంవత్సరములలోనే భారత దేశము ప్రపంచములో ఒక నూతన అధ్యాయాన్ని మొదలుపెట్టింది. కేంద్రము పటిష్టమైనది. దేశైక్యతకు గట్టితనమేర్పడినది. దేశనాయకత్వము పైన విశ్వాసమేర్పడినది, మరియు బాంగ్లాదేశావతరణము మరియు పాకిస్తాను నిస్సాయతతో అనివార్య స్నేహ సంబంధము, అంతా భారతదేశపు పటిష్టము మరియు అభివృద్ధికి పునాదులు మరియు అంతర్జాతీయంగా చూస్తే ఎన్నో సంవత్సరాలుగా ప్రయత్నించినా U N O. లో స్థానము చైనాకు లభించలేదు. కాని అనివార్య పరిస్థితిలో చైనాకు (U N O) ఐక్య రాజ్య సమితిలో స్థానము లభించినది. మరియు అమెరికాకు, చైనాకు సిద్ధాంత రీత్యా మరియు రాజకీయంగా గూడా ఎప్పుడూ విరోధమే అయినా ఒకరితో ఒకరికి కలిసే పరిస్థితి ఏర్పడినది. దానితో రష్యాకు యిండియాతో తప్పనిసరి స్నేహ సంబంధము చేసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడినది. నిన్నటి ఇండియా, పాకిస్తాను లను రాజీ పరిచిన రష్యానే యిప్పుడు భారత దేశానికి సంపూర్ణ సహకారాన్నివ్వ డానికి కారణము దైవికమైనదే. అమెరికా చైనాను ప్రోత్సహించి రష్యాను బలహీనపరుస్తుందనే భయంతోనే రష్యా భారత దేశానితో సంధినంగీకరించింది. దైవికంగా అన్ని పరిస్థితుల మధ్య భారత దేశము ఉన్నత స్థానము నలంకరించు చున్నది. ప్రపంచ దేశాలు భారత ఔన్నత్యమును, నిజాయితీని హర్షించినవి.

శ్రీ తల్లిగారు భారతదేశము ప్రపంచానికి గురువవుతుందని, మార్గదర్శ మవుతుందని (The true Destiny of India is to become the Guru of

the World) తెలిపిసారు. కవిపించే సంఘటనలన్నింటిని చూస్తె గురు స్థాన మాక్రమించుటకు ముందుకు సాగుతున్నదనిపిస్తుంది. శ్రీమాతారవిందుల ప్రభావము ఆశ్రమములో, అరొవిల్లులోనేకాక, ప్రపంచ సంఘటనలపై గూడా పడుచున్నదని, మార్పుతెస్తున్నదని స్పష్టముగా కల్పించుచున్నది.

భారతాత్మ ఏకము. అవిభాజ్యమని శ్రీఅరవిందులు తెల్పినట్లుగా తిరిగి సామరస్యము దేశపు అన్నిభాగములలో వచ్చుచున్నది. ఇదంతా ప్రశాంతంగా తిలకిస్తె అరొవిల్లులో ప్రపంచ దేశాల నుండి మట్టిని తెచ్చి అంతా ఒకచో కల్పినది ఒక భావనగాక, యదార్థము, సత్యమని తేటతెల్లమవుతోంది.

శ్రీమాతారవిందుల కృపతో ప్రపంచ సంఘటనల మార్పులతో తప్పని సరిగా సామరస్యంగావుండే పరిస్థితి ఏర్పడుతోంది. శ్రీఅరవిందులు చూపిన మానవైక్యతాదర్శము నిజస్వరూపము దాల్చుతుంది.

శరీరపు అన్నిభాగాలు బాగుంటేనే ఆరోగ్యంగా వుంటుంది. లేనట్లవుతే చికాకు. అలాగే దేశములోని ప్రతిగ్రామము ఆరోగ్యంగా వుండాలంటారు శ్రీఅరవిందులు గ్రామాలు ఆరోగ్యంగా వుంటేనే దేశము ఆరోగ్యమంటారు. కాని, ప్రతిగ్రామములో రాజకీయాలు, ఈర్ష్యాద్వేషాలు, పోటీలు, వీటితో గ్రామ జీవితము చాలాదుస్థితికి వచ్చినది. విద్యాలోపముగూడా. సరియైన విద్యావిధానము లేకకూడా. మరియు రాజకీయప్రభావము, ఆర్థికదురవస్థ, వీటితో మానవాభ్యుదయము కుంటుపడినది ఎలక్ట్రిసిటీతో, రోడ్లతో, స్కూళ్ళతో, ఎలక్షన్‌లతో, పంచాయితీలతో అభివృద్ధి అని తలంచుచున్నారు. కాని, మానవవికాసాన్ని ఇవి ఏమాత్రము మార్చలేకపోయినవి. ఎన్ని సహకారసంఘాలను సృష్టించినా మనుషులలో సహకారము కుదరడమే లేదు. ఈ ప్రయత్నాలన్నీ బాహ్య ప్రయత్నాలే. అంతరమున మారనిది బాహ్యములో మార్పురాదు. అంతరములో మార్పు వస్తేనే సంఘీభావము. దానికి ఆచరణముతో కూడిన మార్గదర్శకులు కావాలి. దైవముపై విశ్వాసముండాలి. ఆధ్యాత్మికచింతనుండాలి. దైవార్పణ కార్యక్రమాలుండాలి. దీనికే ఆధ్యాత్మికవిప్లవము అవసరము.

అరవిందపురము (గడ్డిపల్లె)లో మనము నవసమాజనిర్మాణాన్ని దర్శించుతాము. 7 గ్రామాలవారు కలిసి 6000 ఎకరాల సమిష్టిసహకార వ్యవసాయము

చేయుచున్నారు. ఇక్కడ వ్యక్తిస్వేచ్ఛా మరియు సమిష్టిజీవితముగూడా వున్నది. **Capitalism**లో బీద, ధనిక ఘర్షణ వున్నది. **Communism** లో వ్యక్తి స్వాతంత్ర్యములేదు. Socialism బాహ్యప్రయత్నము మాత్రము చేస్తుంది. కాని అంతర్ బాహ్యపరివర్తన, సంఘీభావాన్ని తీసుకరాలేదు. కావున ఆధ్యాత్మిక విప్లవంలో వీటి భేదాలన్నిటిని భర్తీచేస్తుంది.

శ్రీ మాతారవిందులు నిజసామరస్యమంటే యేమిటి? సంఘీభావమంటే ఏమిటి ? మరి నవసమాజము కలిసికట్టుగా పురోభివృద్ధి ఎలా కాగలదో మనము అరవిందపురమును దర్శించిన తెలియగలదు.

అరోవిల్ నగరము పట్టణాలు ఎలా వ్యవస్థీకరించి సమిష్టి జీవితము ఎలా గడపాలో చూపుతుంది. మరియు అరవిందపురము (గడ్డిపల్లె) గ్రామజీవితానికి ఆదర్శంగా వుంది.

Capitalist, Communist, మరియు Socialist ప్రచారకులకు ఆధ్యాత్మికసత్యము తెలుసుకొని వారి లోటుపాటులను సర్దుకోవాల్సిన దినము తప్పక వస్తుంది.

ఆగష్టు 15_1972 శ్రీ అరవిందుల శతజయంతి యుత్సవము. ఆయన జన్మదినముననే ఆగష్టు 15_1947 న భారతస్వాతంత్ర్యము లభించినది. ఆగష్టు 15 నాటికి భారతదేశ స్వాతంత్ర్యము 25 సంవత్సరములవుతుంది 25 సంవత్సరములనుండి తెలియకుండానే ఆయన జన్మదినమున ఉత్సవాలను చేసుకుంటున్నాము. ఎవరికి తెలిసినా, తెలియకున్నా దేశమంతా, ఆయన జన్మదిన సందర్భమున కుల, మత, ప్రాతిపదికలేకుండా ఉత్సవములు చేసుకొనక తప్పదు. అది దైవికము. వారి శతజయింతి వరకు భారతదేశము ఒక మహోన్నతస్థానాన్ని ఆక్రమించినది ప్రపంచదేశాలలో.

శ్రీ తల్లిగారు చెప్పినట్లు
O, India
land of light and Spiritual Knowledge.
Wake up to your true self in the World
Show the way to Union and Harmony."

భారతదేశము ప్రపంచానికి వెలుగు. ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని మరియు సామరస్య సంఘీభావములను చూపే నిజతత్వానికి మేల్కొనాలని చెప్పారు. శ్రీ మాతారవిందుల కృపవల్ల భారతదేశము ప్రపంచదేశాలలో గొప్ప పాత్ర వహించగలదని మరియు మానవహృదయాలలో పరివర్తన రాగలదని సంపూర్ణ విశ్వాసము.

శ్రీ మాతారవిందుల కృపవల్ల బంధవిముక్తులై, సామాన్యమానవులు ఆధ్యాత్మికమానవులుగా మారుతారని, మరియు నిద్రాణలో వున్న దివ్యత్వం మేల్కొంటుందని "సావిత్రి" గ్రంథములో

"Mortalitys bond-slaves shall unloose their bonds
Mere Men into Spiritual beings grow
And see awake the dumb divinity."

SAVITRI B-XI. C-I

శ్రీ మాతారవిందుల ఆధ్యాత్మికవిప్లవం లోకమంతా ప్రాకి, ఈ పృధ్వీ జీవితాన్ని దివ్యజీవనముగా మార్చుతుంది. వారి కృపతో త్వరితంగా ఈ పృధ్వీ జీవితము రూపాంతరంచెంది దివ్యజీవనముగా మారాలని మన మందరమూ హృదయపూర్వకంగా శతజయంత్యుత్సవ శుభ సందర్భమున ప్రార్థిద్దాము.

---

# శ్రీ అరవిందుల దివ్యసందేశము

రచన : సంజీవరావు

భారతదేశం ఆధ్యాత్మికాభ్యున్నతికై అనన్య సాధన జరిపిన మహా తపస్వుల జన్మభూమి; మహర్షుల తపోభూమి. అనంత శక్తిమంతమైన సర్వ వ్యాపకమైన దైవత్వంతో ఐక్యమై సకల చరాచర సృష్టిలోని సచ్చిదానంద వైవిధ్య మాధుర్యాన్ని గ్రోలుతూ దివ్యభోగులై జీవించడమే వారి తపఃఫలం. ఈ తపోభూమియందు జననమందిన శ్రీఅరవిందులు దివ్యయుగకర్తలు.

ఆగస్టు 15—శ్రీఅరవిందుల జన్మ దినమేగా. భారతదేశం పరతంత్రం నుంచి విముక్తి చెందిన దినం; మానవ జాతికి దివ్యోదయం అయిన పవిత్ర దినం అని చెప్పవచ్చు. మానవావళి శ్రేయస్సు కొరకు, సనాతన ధర్మాచరణ ప్రబోధం కొరకు శ్రీ అరవిందులకు ఆలిపూరు జైలులో శ్రీవాసుదేవుడు సాక్షాత్కరించి యిచ్చిన ఆదేశము యొక్క సారాంశం యీ క్రింద పొందు పరచుచున్నాము:

"నేనొక కార్యమును నీకిచ్చియున్నాను, అదే యీ జాత్యుద్ధరణకు సాయ పడుటయే నా సనాతన ధర్మ సందేశమును, వ్యాపింప జేయుటకే నేనీ భారత జాతిని సముద్ధరించుచున్నాను. నీవిక బయటికి వెళ్లినపుడీ సందేశమును నీ జాతికి చాటింపుము. సనాతన ధర్మమునకైయే వార భ్యుదయము గాంచవలెను .. ... ఋషులు, సాధుసత్తములు, అవతార మూర్తులు—వీరి మూలమున నేను అభివృద్ధిచేసి పరిపూర్ణ స్థితినందించిన సనాతన ధర్మము నానా జాతులలో నా కార్యమొనర్చుటకు ప్రస్తుతము ప్రారంభించుచున్నది. భారతీయుల అభ్యుదయము కేవలము వారి కొరకేకాదు; సర్వప్రపంచ సంసేవనమునకై వారికి స్వాతంత్ర్య ప్రధాన మొనర్చుచున్నాను. అందువలన భారతదేశమభ్యున్నతి నందినదనిన సనాతన ధర్మమే సమృద్ధమగునని,.... ప్రపంచము నందంతటను ప్రశస్త మైన వ్యాప్తిగాంచునని భావము. ఈ ధర్మము కొరకే, ఈ ధర్మాధారము ననే భారత దేశము జీవించియున్నది... ...."

శ్రీ అరవిందులు ఈశ్వరాదేశానుసారమే తమ జీవితమును గడిపిరి. పాశ్చాత్య నాగరికత ప్రబలి అధ్యాత్మిక జీవితమునకు దూరమైపోతున్న భార తీయులను హెచ్చరిస్తూ కర్మయోగియను పత్రికయందు వ్రాసిన వ్యాసములలోని దివ్య సందేశ వాక్యాలను భారతీయులు సర్వదా సంస్మరించుకొనుట అత్యా వశ్యకమని భావించి కొన్నిటిని యీ క్రింద ఉదహరించుచున్నాము :

"పాశ్చాత్య సంపర్కము వలన జాతీయ స్వధర్మములు నశించినవి..... మన జాతీయత మత విజ్ఞానైశ్వర్యము నానా రూపముల విలసిల్లినది. అన్ని మతముల, మతోద్ధారకుల ధర్మానుష్ఠానముల సమన్వయమొనర్చి జీవరహస్యము గుర్తించి యుత్తేజమునందవలసి యున్నది.

"సత్యయుగమునకు బునాది బ్రహ్మతేజస్సు, బ్రహ్మతేజస్సే అన్నిటి కంటె ముఖ్యము, నావశ్యకము.........యూరోపియనులు భావించు మతము మాత్రము బ్రహ్మతేజస్సు కాజాలదు. బ్రహ్మతేజస్సు ఆధ్యాత్మి కము, శక్తిస్వరూపము, సారవంతము. ఈశ్వరేచ్ఛాను గుణముగానే కార్యమునకే దానిని వినియోగించనగును.........."

భారత దేశంలో బుద్ధుడు, శంకరులు తరువాత, ప్రజలలో ఆధ్యాత్మిక జీవితం ఐహిక జీవితాన్ని పరిత్యజించిననే సాధ్యమగును అనే అభిప్రాయం ప్రబలిపోయినది. మానవ జీవితం దుఃఖ కర్కశమై శోక కశ్మలమైనదిగా తోచి ఐహిక జీవితము నుండి తరించుటయే ముక్తిమార్గమని అందుకు భక్తి, జ్ఞాన, కర్మ, యోగములు సాధన మార్గములని నమ్మినారు. కాని మహర్షులు తమ తపస్సులో కనుగొనిన మానవుని అంతర సత్యము: "ఈ విశ్వమున సర్వ కారణమైయున్నట్టిది అమృతము, అఖండము, అనంతశక్తిమయము, ఆనంద రూపము అగు చైతన్యము." ఆ సత్యమునకున్నూ దుఃఖ కర్కశమై శోక కశ్మ లమైతోచు యీ జగత్తుకున్నూ సంపూర్ణ సమన్వయము చూపినవారు శ్రీఅరవిం దులు. మానవజాతికి ఈ సమన్వయం దొరకక పోవుట చేతనే ఐహిక జీవనం ఆముష్మిక జీవనం పరస్పర విరుద్ధములుగా భావించిరి. వేదమునందు "సత్యం, ఋతం, బృహత్" అని నిర్దేశింపబడిన విజ్ఞాన భూమికకు ఆరోహించి అక్కడ యీ సృష్టికి మూలమైన విశ్వజననీ క్రియాశక్తితో ఐక్యమై ఈ భూమిపై ఆత్మ

తత్త్వము యొక్క సకల వైభవములతో జీవించ గలుగుటయే శ్రీఅరవిందుల దివ్య జీవన సందేశం. ఈ సందర్భంలో శ్రీఅరవిందులు తమ 'ఆర్య' పత్రికలో హెచ్చరిస్తూ ప్రకటించిన విషయములు తెలుసుకొనుట యుక్తమని కొన్నిటిని ఈ క్రింద ఉదహరించుచున్నాము :

"తన్నుదా తెలిసికొనిననే మానవుడు ముక్తుడగును. ప్రపంచము నంతయు జయించి యాత్మనుబోగొట్టు కొనినచో—తన్నుదా గోల్పోయి నచో—లాభమేమి? అను సత్యసందేశమే ప్రాగ్దేశము ప్రతీచి కొసగు సందేశము.... .. ఆత్మ సత్యమే నిశ్చయము యధార్థమనగు సత్యమును. దృఢ ప్రతిజ్ఞయు, "ఆత్మ సత్యమును"బడయుట కధాత్మ జీవనమే మార్గ' మను నమ్మకమును, ఉత్తమ దృష్టితో దాని ధర్మముల గ్రహించి యాచరింపవలయు నను స్థిర బుద్ధియు, విశ్వాసమును ఈ మహోద్య మమునకు దగిన సాధనములుగ మానవ బాహ్యా జీవనమును, సంఘ నడవడులను నిర్మింప యత్నించ వలయునను తీర్మానము ఆశియాను ప్రకాశవంతము చేసినట్టి భావము......కాని ఆచరణయందు ముఖ్యముగా ఇండియాలో ఆత్మకును తదుపకరణములకును, భేదము కల్పించి దూరీకృతము గావించుటచేత జాతి యొక్క మనోబాహ్యా జీవనలు సంకుచితములయినవి. ఏలన, సంపూర్ణ జీవనోపకరణ వికాసము పైననే ఈ సుస్థిరా ఖండాత్మ స్థితి యాధారపడియున్నది. ప్రాగ్దేశీయ పూర్వులీ జ్ఞానమును బడసి యనుభవములోనుంచిరి. వారి సంతతుల యందీ జ్ఞానము సన్నగిలి ఆచరణిలో క్షీణించినది....ప్రాగ్దేశమునకు ప్రతీచియొసంగు సందేశము నిజమైనదియే. మానవుడును భగవంతుడే మానవత్వమున వృద్ధిచెందు కొలది దేవత్వమునకు సమీపింపనగు; జీవితమునూ దైవికమే, ప్రవర్తమానమగు దాని వికాసమే బ్రహ్మము యొక్క ఆత్మ వికాసము; జీవనను నిరసించుట అంతర్వర్తియగు భగవానుని నిరసించినట్లగును. ప్రాచీన జ్ఞానమిది కావున ప్రస్తుత మాలో చింపవలసినది—సరియైన-భావమును సరియైన సమన్వయ మార్గమును కనుగొనుట; మనశ్శరీర జీవనల నాక్రమించి పూరించి యధిష్ఠించునటుల పురాతనము సనాతనమునగు అధ్యాత్మ తత్త్వమును పునర్నిర్వచనము చేయుట; అత్యుచ్చబలైశ్వర్యములతో, మానవ మనోచైత్య జీవనను,

అధ్యాత్మ జీవనను వ్యక్తము చేయునోపునట్టి ఆధ్యాత్మిక శిక్షణలను యోగవిధానమును వృద్ధిపరచుట; బాహ్యజీవనము సంఘము, నడవడులు ఇవి ఆత్మ సత్యముపై నాధారపడి క్రమముగ పునర్నిర్మితములై మానవుని స్వేచ్ఛకును సంఘైక్యతకును సంపూర్ణ సమరత్వమును సమకూర్చజాలు సాధన సంపత్తులని కనుగొనుట........"

విశ్వ మానవశాంతి కొరకు నేడు రాజకీయముగా జరుగుచున్న కృషి యంతయూ జీవిత ఐక్య–సత్యముపై ఆధార పడగలిగినపుడే అది స్థిర పడును. మానవ జాతియొక్క ఐక్యము అంతరంగిక–ఏకత్వము చేతనే గానీ కేవలము బాహ్య సంసర్గముల వలన గానేరదు. మానవుడు మనః ప్రాణ శరీరములను మించి యాత్మ పథంబు చెందవలయును. అంతట అధ్యాత్మబలము దేహమనంబుల బ్రవేశించి మానవుని దివ్య జీవనము ప్రారంభమగును. ఇది శ్రీఅరవిందుల పూర్ణయోగ సత్యము; దివ్య జీవన సందేశము.

నేడు మానవుని ఐక్యతాదర్శము విజ్ఞాన భూమికకు చెందినది, మానవ–ఐక్య–జ్ఞానము విజ్ఞానభూమిక యొక్క సహజ జ్ఞానము. మానవుడు మనో భూమికలోనే జీవిస్తున్నంతవరకు మానవాళి–ఐక్యత ఆదర్శవంతంగానే ఉండి పోతుంది. మనస్సునుండి విజ్ఞానభూమికలోకి పరిణతి చెందిననేగాని సహజ మైన ఐక్యశక్తి మానవునికి ప్రాప్తించదు మానవ సంఘ ఆదర్శములు ఎంత ఉన్నతమైన వైనప్పటికీ వాటియొక్క ఆచరణలో వ్యష్టిగా మానవుడు కృతార్థుడు కాలేకపోవుటకు కారణం–ఐక్య–శక్తిమంతుడు కానందువలననే. ఆదర్శమునకు తగిన శక్తినికూడ సంపాదించ వలసియున్నది.

భారతదేశ స్వాతంత్ర్య సమరంలో 'వందేమాతరం' ప్రబోధం, భారతీయులను పరతంత్ర విముక్తులను చేయుటలో ఎంతటి 'ఐక్య–శక్తి'ని ప్రసాదిం నదీ విశ్వమానవచరిత్రలో మరువజాలని ఘట్టం. అదియే ఆధ్యాత్మికశక్తి. సనాతన ధర్మావలంబన ద్వారా ప్రాప్తించే విశ్వజనని విజయశక్తి. "ఏ ఆద్య ప్రకృతి గగనమందు కోటానుకోట్ల సూర్యులను గిరగిర త్రిప్పుచున్నదో, అంగుళి స్పర్శ మాత్రముచే పృథివి నల్లల్లాడించి మానవ సృష్టమైన సౌభాగ్యమును సకలమును చిహ్నలేకుండ ధ్వంస మొనర్పగలదో, ఆ ఆద్యప్రకృతి విశుద్ధ

మైన ఆత్మకు అధీనము....జగమంతయు అ శక్తియొక్క సృష్టి....యూరోపు నేడీ ఆధ్యాత్మిక శక్తిని తెలిసికొన తడమాడుచున్నది. కాని భారతీయ శిక్ష, సభ్యత, గౌరవము, బలము, మహత్త్వము ఈ అన్నిటికిని మూలము అధ్యాధ్మిక శక్తి.... మహాపురుషుల తపస్య, స్వార్థత్యాగుల కష్టస్వీకారము, సాహస వంతుల ఆత్మవిసర్జనము, యోగుల యోగశక్తి, జ్ఞానుల జ్ఞానసంచారము, సాధువుల విశుద్ధి ఇవన్నియు అధ్యాత్మిక బలమునకు జన్మస్థానములు. ....భారతీయులు కొన్ని సంవత్సరముల పరపీడనము, దౌర్బల్యము, పరాజయము—లేనిఫలితముగా తమ అంతరమందే యీశక్తియొక్క ఉత్సమునన్వేషించుటకు నేర్చుకొనుచున్నారు.... ఆశక్తి మరల నెపుడు బహిర్ముఖమగునో ఇక నా ప్రవాహము వెనుకకు మరలదు. ఎవరును దాని నడ్డగింపజాలరు. త్రిలోక పావనియగు ఆ గంగ భారతమును ముంచివైచి, పృధివిని ముంచివైచి, తన అమృతస్పర్శచే జగతికి నూతన యౌవన వికాసమునుగై కొని రాగలదు." అని శ్రీ అరవిందులు తమ దివ్యవాక్కులను 'కర్మధార' పత్రికద్వారా ప్రకటించి యున్నారు. వారి దివ్య సంకల్పబలముతో భారతీయులు దివ్యశ్రేయోరాజ్య స్థాపనకు మార్గదర్శకులు కావసిన తరుణము ఆసన్నమైనది *

పాశ్చాత్యదేశీయులు ప్రకృతి విజ్ఞానాభివృద్ధిద్వారా మానవసంఘ సంక్షేమానికి, భౌతిక జీవితానికి సాధించిన ప్రగతినంతటినీ మానవాళి ఐక్యతయొక్క ఏకైకసత్యానికి సమన్వయించి సర్వభూతరతితో ప్రపంచమైత్రికి, విశ్వశాంతికి, దివ్యజీవనానికి మార్గదర్శకులగటయే భారతీయుల విద్యుక్త ధర్మం, సనాతన ధర్మం, ఆచరణద్వారా ప్రపంచానికి అందజేయవలసిన శ్రీ అరవిందుల దివ్య సందేశం.

# రచయితల పరిచయం

1. అక్కిరాజు రమాపతిరావు :

ఈయన తెలుగులో ఎం. ఏ. పి. హెచ్. డి, తెలుగు అకాడమిలో పరిశోధనాధికారిగా పనిచేస్తున్నారు.

2. చుండి జగన్నాథం :

మాజీ సమాజవాద నాయకుడు. అశోక మెహతా, జయప్రకాశ్ నారాయణ్‌లతో కలసి పనిచేశారు. గాంధేయుడు, ఆదర్శవాది.

3. రాజు :

ఆశ్రమములో 20 సంవత్సరాలుగా సాధన చేస్తున్నారు, శ్రీ అరవిందాశ్రమం నుంచి వెలువడే "అఖిభారత పత్రిక"కు సంపాదకుడు. 'ఎవరీమాత'? అనే గ్రంధాన్ని అనువదించారు. శ్రీమాతను గురించిన ఎన్నో కొత్త విషయాలు యీ గ్రంథములో చేకూర్చబడినాయి.

4. సుసీతి :

ఆశ్రమ వాసిని. శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాకేంద్రంలో తెలుగు ఉపాధ్యాయిని. శ్రీ అరవిందుల ఆంగ్లపద్యాలను అనువాదం చేస్తారు. తెలుగు విభాగంలో ఉత్సాహంగా పనిచేస్తారు.

5. మల్లవరపు విశ్వేశ్వరరావు :

1921-1925 వరకు శ్రీ గురుదేవ్ టాగూరు శాంతినికేతన్‌లో చదువుకున్నారు. ఇంగ్లీషుభాషలో మంచిపాండిత్యము సంపాదించినారు. తెలుగులో కవి. రేడియో నాటికలు ఎన్నో వ్రాసినారు. గ్రంథకర్త : 'కళ్యాణ కింకిణి' అనే కావ్యాన్ని రచించినారు. టాగూరు రచన 'చిత్రాంగద'కు వంగభాష నుండి తెనిగించినారు. "సావిత్రి" మహాకావ్యాన్ని తెలుగులో అనువదించే ప్రయత్నం చేస్తున్నారు.

6. కీ॥ శే॥ రూపనగుడి నారాయణరావు :

సాహితీ శిల్పి, మహాకవి. శ్రీ అరవిందుల గ్రంథాలను అనువదించినారు. ఇంకా కొన్ని అచ్చుకాలేదు.

7. వేణుగోపాలు :

చరిత్రలో, తెలుగుసాహిత్యంలో ఎం. ఎ. ప్రస్తుతం తాడిపత్రి కళాశాలలో చరిత్ర ఉపన్యాసకులు. మంచివక్త. శ్రీ అరవింద కర్మధారకు వ్యాసాలు, అనువాదాలు తరచుగా పంపుతారు.

8. వై. పాండురంగారావు :

ప్రస్తుతం హిందూపూరు (అనంతపురం జిల్లా) ఉన్నత పాఠశాలలో తెలుగు పండితుడు, శ్రీ అరవింద భక్తుడు.

9. కె. ఎస్. భాస్కరరావు :

ఆజన్మ బ్రహ్మచారి. శ్రీ మాతారవిందుల గ్రంథాలను చదువుతూ, సాధన చేస్తూ కాలాన్ని గడుపుతున్నారు. తెలుగులో, ఎన్నో శ్రీ అరవిందుల పద్యాలను అనువదించినారు. అనువాద శిరోమణి. ఈమధ్య శ్రీ అరవిందపురం (గడిపల్లె)లో ఉంటున్నారు ఇంగ్లీషులో మంచిపాండిత్యము ఉన్నది. నిజంగా మన ఆంధ్రప్రదేశ్‌లో శ్రీ మాతారవిందుల పనిని వృత్తిగా పెట్టుకొనే వాళ్ళలో ఈయన ఒకరు.

10. వెంపటి కృష్ణమూర్తి :

నర్సాపురం (పశ్చిమగోదావరి) కళాశాలలో తెలుగు ఉపన్యాసకుడు. ఆంగ్లభాషలోనే కాక సంస్కృతంలోకూడా పండితుడు. శ్రీ అరవిందుల 'The Life Divine' అనే గ్రంథాన్ని తెనిగించే ప్రయత్నం చేస్తున్నారు.

11. కమలాకర వేంకటరావు :

ఆంధ్రప్రభలో ఈయన అనువదించిన శ్రీ అరవిందసూక్తులు ప్రతిరోజూ మనమందరము ఆసక్తితో చదువుతాము. గ్రంథకర్త : 'యోగసమన్వయము'ను అనువదిస్తున్నారు. ప్రథమ సంపుటం అచ్చు అయినది.

12. బి. నరసింహయ్య :

ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడైనా శ్రీ అరవిందుల గురించి చెప్పుకోదగ్గ కార్యక్రమాన్ని ఏర్పాటుచేస్తే అక్కడ ఈయన హాజరు అనివార్యం. దుబాషి. శిరోమణి. Computor (ఒక గణకయంత్రం) లాగా ఆంగ్లంలోంచి తెలుగులో తర్జుమా చేస్తారు. ఈయన స్మృతిశక్తి అద్వితీయం. బుక్కరాయ సముద్రం ఉన్నతపాఠశాలలో తెలుగుపండితుడు.

13. డి. వీరయ్య :

తిరుపతి ప్రభుత్వ కళాశాలలో తెలుగు ఉపన్యాసకుడు. 'Life in Sri Aurobindo Ashram' (శ్రీ నారాయణ ప్రసాద్‌గారి ఆంగ్లరచన)ను తెలిగించినారు. ఇంకా అచ్చు కాలేదు.

14. ఇ. గంగన్న :

గుంతకల్లు వాస్తవ్యుడు "సావిత్రి" మహాకావ్యంమీద విమర్శనాత్మక వ్యాసాలు వ్రాసే సమర్థుడు, వక్త. నిర్వహణలో (Organisation) లో దక్షుడు. ఇటు సాహిత్యం, అటు నిర్వహణ (Organisation) —రెండురంగాలలో ఆసక్తిగలవాడు. ఈ మేళనం ఏ కొద్దిమందిలోనో వుండును. "శ్రీ అరవింద కర్మధార" సహాయ సంపాదకుడు.

15. వి. వి. యస్ రామదాసు :

ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఎ. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ విధానసభలో ప్రభుత్వ విలేఖరిగా పని చేస్తున్నారు. శ్రీ అరవిందుల సాహిత్యంలో యీయనకు ఎక్కువ అభిరుచి ఉంది.

16. ఆర్. ఇందిరాదేవి :

అనంతపురం నివాసిని. టి. కోదండ రామారావుగారి కుమార్తె. శ్రీమాతారవిందుల పనిని పూర్తికాల ( whole time ) వృత్తిగా అవలంబించుకున్నారు. 'శ్రీ అరవింద దివ్యజీవితము', 'శ్రీ మాత దివ్యజీవితము' యీమె రచనలు.

17. కె. బి. సీతారామయ్య :

ఈయన ప్రస్తుతము Nagercoil కళాశాలలో ఆంగ్ల ఆచార్యుడు ( Professor )గా పని చేస్తున్నారు. తెలుగు కవి.

18. వి. మన్ మోహన్ రెడ్డి :

శ్రీ అరవింద కర్మధార సంపాదకుడు. తత్త్వశాస్త్రంలో ఎం.ఎ. 1965_1970 వరకు 'శ్రీ అరవిందుని వేద వ్యాఖ్యానం' గురించి పరిశోధన గావించారు. పరిశోధనాగ్రంథాన్ని పిహెచ్.డి. కోసం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో దాఖలుచేశారు. 1964 లో శ్రీ మాత 'Institute of Human Study' అనే సంస్థను హైద్రాబాదు నగరంలో స్థాపించమని ప్రొ॥ వి. మధుసూదనరెడ్డికి ప్రసాదించారు. అప్పటి నుంచి యీయన పైసంస్థలో పూర్తి కాల (Whole time) కార్యకర్తగా పనిచేస్తున్నారు. శ్రీ అరవిందపురం (గడ్డిపల్లె)కు తరుచుగా పోయి అక్కడి శ్రీ మాతారవిందులకు సంబంధించిన పనులను చూచుకుంటారు. నిర్వహణ ( Organisation)లో ఆసక్తి కలవారు.

19. వేలూరి సహజానంద :

ఆకాశవాణి ( All India Radio), హైద్రాబాదు కేంద్రంలో పని చేస్తున్నారు. తెలుగులో, ఆంగ్లంలో మంచిపాండిత్యం గలవారు. హైద్రాబాదులో ఉండే సాంస్కృతిక ఆధ్యాత్మిక కేంద్రాలలో యీయన తరచుగా ఉపన్యసిస్తారు. గ్రంథకర్త. 'శ్రీ మద్భగవద్గీత' యీయన రచన.

20. ఎం. శ్రీరాములు

కొవ్వూరునివాసి,లాయరువృత్తి. ఆంగ్లంలో పాండిత్యం సంపాదించారు.

21. ఎస్. నరసింహం :

'అర్క' మాజీ సంపాదకుడు ప్రొద్దుటూరు నివాసి 5_12-72 నాడు శ్రీ అరవింద అవశేషాలను క్రొత్తగానిర్మింపబడిన మందిరంలో ప్రతిష్ఠాపించారు. 1956-1971 వరకు అర్కను త్రైమాస పత్రికగా ధారావాహికంగా నడిపినారు.

22. సి. నారాయణరెడ్డి :

1926 నుంచి ఆశ్రమంలో సాధకుడు. గ్రంథకర్త, శ్రీ మాతారవిందుల సుమారు 10 పుస్తకాలను ఆంధ్రీకరించి అచ్చువేశారు. 'సావిత్రి' మహాకావ్యాన్ని ఆరు నెలలలో ప్రతిరోజు 18 గంటలు చొప్పున అనువదించినారు. అనువాదక శిరోమణి.

23. అబ్దుల్ అజీజ్ :

కోడూరు(కడప జిల్లా)నివాసి, యువకుడు, హిందీ పండితుడు. "శ్రీమాతారవిందుల యోగం నా అన్ని సందేహాలకు సమాదానమిచ్చింది" అని యీయన విశ్వాసం. హిందీనుంచి తెలుగులో అనువాదం చేస్తారు. గేయకవి.

24. చక్కా సత్యనారాయణ :

ఆశ్రమవాసి. భారత స్వాంతత్ర్యోద్యమంలో పాల్గొనినారు. కర్మలో ఆసక్తిగలవారు. గ్రంథకర్త "శ్రీ మాతారవింద ప్రబోధగుచ్ఛము" రెండు భాగాలలో ప్రచురించినారు. ఈయన తరుచు తెలుగు పత్రికలకు, తమ వ్యాసాలను పంపుతారు.

25. కె. కూర్మారావు :

విజయవాడ నివాసి. తెలుగు, హిందీ పండితుడు, విజయవాడ ఉన్నత పాఠశాలలో హిందీ అధ్యాపకుడు.

26. రత్నాకర బాలరాజు :

అనంతపురం ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. సంస్కృతంలో పాండిత్యం గలదు. ప్రఖ్యాత గ్రంథకర్త. 'శ్రీ రామానందలహరి', 'బౌద్ధయుగము', 'బుద్ధదర్శనము', 'శంకర మందారము'. 'కల్యాణ కైవల్యము' రచించినారు. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ 'బ్రహ్మసూత్రము'ను అనువదించినారు. ఇంకా యితర రచనలు చేశారు.

27. ఎ. జి. కేశవరెడ్డి :

తాడిపత్రికలో (అనంతపురం) ఉద్యోగి. చిన్నతనంనుంచే ఆధ్యాత్మికతలో రుచి ఉంది. తాడిపత్రి శ్రీఅరవింద కేంద్ర నిర్మాతలలో ఒకరు, 'సావిత్రి' మహా కావ్యం నుంచి కొన్ని భాగాలు తెనిగించినారు. "సావిత్రిలో వెలుగులు" అనే గ్రంథం ఈయన రచన,

28. ప్రొ. వి. మధుసూదనరెడ్డి :

ఈయనను గురించి చెప్పనక్కరలేదు. అందరికీ చిరపరిచితుడు. ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడైనా చెప్పుకోతగ్గ శ్రీమాతారవిందుల గురించిన కార్య

క్రమం ఏర్పాటు చేస్తే అక్కడ ఈయన హాజరు అనివార్యం. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తత్వ శాస్త్ర విభాగానికి అధ్యక్షుడు. 1961లో పాశ్చాత్య దేశాలకుపోయి 9 మాసముల పర్యంతం ప్రఖ్యాతిచెందిన విద్యా కేంద్రాలలో శ్రీమాతారవిందుల గురించి ఉపన్యసించినారు. మళ్ళీ 1969 లో వెళ్ళి భారత దేశం గురించి ఉపన్యసించినారు. 13_12_1964 నాడు శ్రీ మాత 'Institute of Human Study' అనే ఒక సంస్థను హైద్రాబాదులో స్థాపించమని ఈయనను ఆశీర్వదించారు. ఈ సంస్థకు కార్యదర్శిగా ఉన్నారు. ప్రఖ్యాత ఆంగ్ల గ్రంథకర్త: 'Sri Aurobindo's Philosophy of Evolution', 'Sapphires of Solitude', 'The Flame of Truth' 'Towards Eternity', 'Values and Value Theories in the Light of Sri Aurobindo' వీరి కొన్ని రచనలు. 'New Race' అనే త్రైమాస పత్రిక సంపాదకుడు 'Mankind on the March' అనే బృహత్ శీర్షిక ఈయనకు శ్రీమాత ప్రసాదించి, మొత్తం ప్రపంచ నాగరికతను క్షుణ్ణంగా చదివి 16 సంపుటములలో శ్రీ మాతారవిందుల దృష్ట్యా వ్రాయమని ఆశీర్వదించినారు. ప్రస్తుతము'Sri Aurobindo Darshan-An University of Tomorrow' అనే విద్యా కేంద్రాన్ని నెలకొల్పేందుకు ప్రయత్నిస్తున్నారు.

29. అరవింద ఆనంద హరిజన్ :

ఈయన కొన్ని సంవత్సరాలు ఆశ్రమములో ఉండినారు. శ్రీఅరవిందుల ఒక పుస్తకాన్ని అనువాదంచేసి ప్రచురించినారు.

30. వేలూరు సదానంద్ :

ప్రతి దర్శనమునకు మద్రాసు నుంచి ఆశ్రమముకు వస్తారు. శ్రీవేలూరు చంద్రశేఖరం అన్నకొడుకు. శేఖరం గారి అచ్చుకాని పుస్తకాలను అచ్చువేసి మనందరికి ఎంతో లాభం చేశారు.

31. కలిదిండి నారాయణ రాజు :

పెదపుల్లేరు [పశ్చిమ గోదావరి] నివాసి. చిత్రకారుడు. వ్యాస రచయిత. శ్రీఅరవిందుల భక్తుడు.

32. రాయప్రోలు సుబ్బారావు :

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పనిచేసినారు. ప్రఖ్యాత కవి. వంగ భాషలో పండితుడు.

33. టి. కోదండ రామారావు :

అనంతపురం నివాసి. 'At the Feet of the Master' అనే గ్రంథాన్ని రచించి మనందరికి ఎంతో సేవచేశారు. ఈ పుస్తకములో వీరు 1921 లో ఆశ్రమములో ఉన్నప్పటి సంగతులు వ్రాసినారు. గ్రంధకర్త। "విజ్ఞానారవిందము" వీరి రచన.

34. ఉదార్ పింటో :

**'Sri Aurobindo's Action'** అనే సంస్థకు కార్యదర్శి. శ్రీమాత వద్దకు ప్రతిరోజు వెళ్లుతారు.

35. ఆరోవిల్ నివాసి :

ఈమె అరొవిల్‌లో ఉంటారు. చక్కగా వ్యాసాలు వ్రాస్తారు,

36. కొత్త శ్రీనివాస్ బాబు :

సంగంజాగర్లముడి నివాసి. తెనాలి. శ్రీఅరవింద కేంద్ర సంస్థాపకులలో ఒకరు. "Whom God Protects" [ప్రమోధ్ కుమార్ చటర్జీ వంగ కృతి] అనే గ్రంథాన్ని తెనిగించి 1971 లో ప్రచురించారు. ఆశ్రమానికి తరుచుగా వస్తారు.

37. కాకునూని తారానాథ్ :

కొవ్వూరులో మేజిస్ట్రేటు. ఈయన తెలుగులో శ్రీఅరవింద జీవితం వ్రాశారు. లేఖకుడు. శ్రీఅరవింద భక్తుడు.

38. దేశిరాజు వేంకట కృష్ణ శర్మ :

"దివ్య జీవనము"ను అనువదిస్తున్నారు. హైద్రాబాదు నివాసి. కవి.

39. జి. సత్యనారాయణ :

తెనాలి నివాసి. శ్రీఅరవింద కేంద్ర సంస్థాపకులలో ఒకరు. శ్రీఅరవింద భక్తుడు. తెనాలి కేంద్రము నుంచి చిన్న చిన్న పుస్తకములు తెలుగులో అచ్చు వేయిస్తున్నారు.

40. వి. అంజిరెడ్డి :

తెనాలి నివాసి. కవి. గ్రంథకర్త: "జీవన జ్వాల" [ఖండికల సంపుటి] ఈయన రచన. ప్రస్తుతం వి. యస్. ఆర్. కళాశాలలో తెలుగు ఉపన్యాసకుడు.

41. శ్రీమతి వి. సంయుక్తారెడ్డి :

1961 నుండి ఆశ్రమంలో ఉంటున్నారు. శ్రీఅరవింద అంతర్జాతీయ విద్యా కేంద్రంలో తెలుగు ఉపాధ్యాయిని.

42. దివాకర్ల వేంకటావధాని :

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడు, తెలుగు శాఖాధ్యక్షుడు. బహు గ్రంథకర్త.

43. నర్సిభాయి :

సాధకుడు, ఆరోవిల్ పౌరుడు. హిందీ నుండి తెలుగులోనికి అనువాదాలు చేస్తూంటారు. హిందీ నుండి ఉర్దూలోకి అనువదించటం ఈయన చేస్తున్న పనుల్లో ఒకటి.

44. ఎ. జి. కృష్ణమూర్తి :

వేలూరు చంద్రశేఖరం గారి బావమరది. బావగారి వద్ద శ్రీఅరవింద తత్వాన్ని బాగా అధ్యయనం చేశారు.

45. వేలూరు చిదానందం :

శ్రీఅరవిందుల ప్రఖ్యాత శిష్యుడు కీ॥ శే॥ వేలూరు చంద్రశేఖరం గారి తమ్ముడు 1920లో ఆశ్రమంలో ఉండినారు. ఈయన రచనలు తరచుగా "మదర్ ఇండియా" [ఆశ్రమ ఆంగ్ల మాస పత్రికలో వస్తూంటాయి.]

46. జితేందర్ :

కార్యదర్శి, శ్రీ అరవింద కేంద్రము; మహమ్మదాబాదు.

47. సంజీవరావు :

ఆంధ్ర ప్రదేశ శాసన సభలో విలేఖరి. శ్రీమాతారవింద సాహిత్యం క్షుణ్ణంగా చదివినారు.

---